# తర తరాల భారత చరిత్ర

మూలం

రొమిల్లా థాపర్

తెలుగు

సహవాసి

## ప్రాచీన మధ్య యుగాలు



హైదరాబాద్ బుక్ ట్రస్ట్

వెల : 15-00

ట్రస్ట్ సంపాదకుడు : చేకూరి రామారావు
ప్రథమ ముద్రణ . జూన్, 1983
రెండవ ముద్రణ : నవంబరు, 1984

ముఖ చిత్రం : స్వప్నంలో త్రిసాలకు గొప్ప వాడైన కుమారుడు తీర్థంకరుడు జన్మిస్తున్నట్టుగా కనిపించే ఈ దృశ్యాన్ని ఇంతకు ముందున్న చిత్రం ఆధారంగా సూరిబాబు చిత్రీకరించారు.

వివరాలకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్
వీధి నెం. 11
3-6-697
హైదరాబాద్-500 029

---

ముద్రితము : హైదరాబాద్ ప్రింటర్స్, హబ్సీగుడ, హైదరాబాద్
ముఖచిత్ర ముద్రితము : నాట్యకళ ప్రెస్, ఖైరతాబాద్, హైదరాబాద్.

# మా మాట

భారతదేశ చరిత్ర మీద బోలెడు పుస్తకాలుండగా వేరే ఇంకొక పుస్తకాన్ని వెలికి తేవాల్సిన అవసరం ఏమిటి, HBT ఏ పరమార్థం సాధించ దల్చింది అని చాలా మంది మిత్రులు, అభిమానులు అడగ వచ్చు అందుకే ఈ "మామాట".

భారతదేశ చరిత్ర గ్రంథాల జాబితా బహు సుదీర్ఘమైందే; కాని ఆ జాబితాకి అదనంగా ఇంకొక దాన్ని చేర్చటం మాఎంతు కర్తవ్యంగా భావించి దీన్ని వెలుపరించటంలేదు.

భారత చారిత్రక రచనకి సంబంధించి భావంలో, విషయ వివరణలో, వ్యాఖ్యానంలో, వ్యాఖ్యా నానికి అనుకూలంగా ఎద్దుకొనే వాస్తవాలలో చాలా మార్పు వచ్చింది. నూతన ధోరణులు చోటు చేసు కున్నాయి. డి.డి. కోశాంబి, సుశోభన్ సర్కార్, ఇర్ఫాన్ హబీబ్, రొమిల్లా థాపర్, బిపిన్‌చంద్ర వంటి కొత్త చరిత్రకారులు రంగంలోకి వచ్చారు. గతాన్ని స్వాధీనం చేసుకుని వర్తమానాన్ని అర్థం చేసుకోటానికి అది కీలకమని తెలుసుకున్న ఈ కొత్త చరిత్రకారులు చారిత్రక రచనా ప్రక్రియలో కొత్త విలువలు ప్రవేశపెట్టారు.

వలసవాదులు, జాతీయోద్యమం చేత ప్రభావితులైన వాళ్ళు చెరొక కొసకిపోయి పరస్పరం ఏ మాత్రం పొంతనలేని, మనగతం తాలూకు దృశ్యాన్ని ప్రదర్శించారు. భారతదేశ సంస్కృతిని నిలవనీరుగా ఒక వర్గం చిత్రించుకుంటే, బ్రిటీషు వాళ్ళు రావటానికి శతాబ్దాల ముందే భారతదేశంలో స్వర్ణయుగం వర్ధిల్లిం దనీ, భారతదేశ ప్రాచీన గతం భారత చరిత్రలో ప్రత్యేకంగా ఒక వైభవోజ్వల కాలం అనీ రెండవ వర్గం నివాప ఎర్పించింది. ఈ శతాబ్దం మొదట్లో భారత ప్రజల జాతీయ వాంఛలకి అనుగుణంగా ఇటువంటి దృక్పథం కలగటం సహజమే; అనివార్యమూ కూడా.

అట్లాగే, కొన్ని నిర్దిష్ట స్థాయిలలో భారతదేశంలో మూడువేల ఏళ్ళ మేరకి అవిచ్ఛిన్నంగా సాగిన ఒక సంస్కృతీ సంప్రదాయం ఉన్నమాట యదార్థమే. అయితే ఈ అవిచ్ఛిన్నతని కదలబారని నిలవ నీరులా భావించడం పొరబాటు.

యూరప్ చరిత్రలో పరిణామ వికాస ధోరణులకు ప్రాధాన్యం ఇస్తూ జరిపిన అధ్యయనం మన చారిత్రక రచనలో కనిపించదు. అందులో మత సంస్కరణోద్యమం, సంస్కరణ వ్యతిరేకోద్యమం, సాం స్కృతిక పునరుజ్జీవనం, పారిశ్రామిక విప్లవం, వలస విజృంభణ, విప్లవాలు, విప్లవ ప్రతీఘాతుకత వగైరా మానవ అభివృద్ధి క్రమం వేసిన కొమ్మలు రెమ్మలు కనిపిస్తాయి. కాని ఆసియా చరిత్రలో ఆ ఎప్రోచ్ కనిపించదు. కాలం అనే కడలిలో వేర్వేరు ద్వీపాల పరంపరగా భారతదేశ చరిత్ర చిత్రం మన మనస్సుల్లో ముద్రించారు. E.H. కార్ తన "చరిత్ర అంటే యేమిటి?" అన్న పుస్తకంలో చెప్పినట్లు "మన మనస్సుల్లో ఉన్న ఈ చిత్రం మనం చిత్రించుకున్నదికాదు యాదృచ్ఛికంగా ఏర్పడిందీకాదు. తెలిసో, తెలియకో కొం దరు తమ దృక్కోణానికి సరిపోయినవే నిజమైన వాస్తవాలని భావించి వాటిని మాత్రమే భద్రపరచటం వల్ల ఏర్పడ్డ చిత్రం."

ఈ ద్వీప పరంపరలో ఒక్కొక్క దానికి ఒక్కొక్క పాలక వంశం పేరు పెట్టారు. పాలక వంశాల మీద ఉన్చిన ప్రాధాన్యాన్ని బట్టి భారత చరిత్రని ప్రాచీన, మధ్య, ఆధునిక యుగాలుగా విభజిం

బారు ఇక్కడితో ఆగిపోయివుంటే ఫరవాలేదు. అది తప్పని సరి పరికల్పన అని సరిపెట్టుకోవచ్చు. "అది మన చారిత్రక వ్యాఖ్యానానికి లోబడి ఉన్నంతకాలం, లేదా మన ఆలోచనని ముందుకు తీసుకుపోయినంత వరకు దాన్ని కొనసాగించవచ్చు." కాని మన చారిత్రక రచనలో అలా జరగలేదు. ప్రాచీన యుగానికి హిందూ మహాయుగమనీ, మధ్య యుగాలకు మహమ్మదీయ మహాయుగమనీ, ఆధునిక యుగానికి బ్రిటిష్ మహాయుగమనీ పేర్లు పెట్టారు. భారతదేశ చరిత్రలో ఈ యుగ విభజన తప్పుదారి పట్టించేదే కాకుండా నిల దీసి కడిగేయాల్సిన అభిప్రాయం కూడా. భారత చరిత్రలో మతమన్నది మార్పుని ప్రేరేపించిన ఒక ముఖ్యమైన శక్తి కావచ్చుగాని దాన్నే ఏకైక చోదక శక్తిగా పరిగణించి యుగాలకు, మతాలకు మధ్య అభేదాన్ని చూపడం ఘోరమైన అపరాధం భారతదేశంలో మార్పుని చిలికిన అనేక శక్తుల్లో అదికూడా ఒకటి.

అట్లా, ఏకపక్షంగా నిర్ణయించిన పరిణామాలకు భిన్నమైనటువంటి వాటి ప్రాతిపదికమీద భారత దేశ చరిత్రలో ప్రధాన దశల్ని పునర్ నిర్వచించే ప్రయత్నం ఇటీవలి కాలంలో జరిగింది. ఈ సందర్భంలో రొమిల్లా థాపర్ పేరుని ప్రత్యేకంగా ప్రస్తావించాలి. శతాబ్దాల తరబడి భారత ప్రజలు ఫలానా భావాల్ని ఎందుకు ఆమోదించారు, ఎందుకు నిరాకరించారు లేదా ఎందుకు సవరించారు అనేది గ్రహించటం తప్పనిసరి అని భావించి ప్రొఫెసర్ రోమిల్లాథాపర్ కొన్ని పుస్తకాలు రాశారు. వాటిలో "Ancient India", "Medieval India," "A History of India" Vol I ప్రధానమైనవి వీటి ఆధారంగా తెలుగులో ఈ పుస్తకం తయారయింది.

"ఒక తరం తాను సంపాదించిన కౌశలాన్ని, నేర్పుని ముందు తరానికి అందివ్వటం వల్ల వచ్చే ప్రగతే చరిత్ర" అనే E.H. కార్ మాటల్ని మనస్సులో పెట్టుకుని "మనం ముందుకు సాగిని కొద్దీ గతాన్ని గురించిన మన వ్యాఖ్యానం, మన లక్ష్యశుద్ధి మారుతూ, పరిణామం చెందుతూ ఉంటా"యన్న నమ్మకంతో ఈ పుస్తకాన్ని మీ ముందు ఉంచుతున్నాం. ఇందలి బాగోగులు నిర్ణయించవలసింది మీరు.

దీని మీద మీ అభిప్రాయాలు తెలిపే పాటి శ్రమ తీసుకుంటే అంతకన్నా మేం కోర తగిందిలేదు

ప్రధానంగా ఇదే మార్గాన్ని అనుసరిస్తూ కంభంపాటి సత్యనారాయణ (సీనియర్ 1909-1983) గారు రచించిన ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర అనే గ్రంథం రెండు భాగాలను ఇంతకు ముందే ప్రచురించాం. సత్యనారాయణ గారు స్వాతంత్ర్యోద్యమంలో పనిచేశారు. కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతల్లో ఒకరు తాను నమ్మిన ఆదర్శం కోసమే జీవితమంతా కృషి చేశారు. మరీ ముఖ్యంగా చివరి రెండు మూడు సంవత్సరాల్లో మాకు ఎంతో సన్నిహితులయ్యారు. మా కృషిని మనసారా మెచ్చుకున్నారు. అడగక్కర్లేకుండానే సలహాలతో పాటు సహాయ సహకారాల్నందించారు. వారి స్మృతికి ఈ పుస్తకం అంకితమియ్యటం ఉచితమైన పనిగా భావిస్తున్నాం.

మీ

హైదరాబాదు బుక్ ట్రస్ట్

# విషయ సూచిక

## మొదటి భాగం-ప్రాచీన యుగం

పరిచయం



## రెండవ భాగం-మధ్యయుగం

"అజ్ఞానపు టంధ యుగంలో
ఆకలిలో ఆవేశంలో
ఏ తీవ్ర శక్తులో నడిపిస్తే
నడిచి మనుష్యులు........"

—శ్రీ శ్రీ



ప్రాచీన భారత దేశం
గాంధార
తక్షశిల
కుషాణ
హరప్పా
కురు
కాళీ బంగన్
స్థానేశ్వర్
ఆలంగిర్‌పూర్
శ్రావస్తి
మొహెంజొదారో
కోడిజి
ఢిల్లీ
కోసల
కపిలవస్తు
కనోజ్
సారనాథ
అవంతి
వైశాలి
నలంద
కౌశాంబి
ప్రయాగ
మగధ
రాజగృహం
అంగ
ఉజ్జయిని
సాంచి
లోథాల్
వల్లభి
శాతవాహన
తామ్రలిప్తి
నాసిక
అజంతా
ఎల్లోరా
కళింగ
అమరావతి
అరేబియా
సముద్రము
బంగాళాఖాతము
మహాబలిపురం
కాంచీపురం
అరికమేడు
తంజావూరు
మధురై
హిందూ మహాసముద్రము

# పరిచయం

చరిత్ర ఎందుకు చదువుతున్నాం అని మనకి మనం తప్పకుండా తరచు ప్రశ్న వేసుకుంటాం. చరిత్ర అధ్యయనం గతాన్ని గురించి తెలుసుకునే ఒక మార్గం. మన పూర్వులు ఒకనాడు ఎలా జీవించారు, అలా ఎందుకు జీవించారు, ఏ అవరోధాల్ని ఎదుర్కొన్నారు, ఆ అవరోధాల్ని ఎలా అధిగమించారు అనేది అవగాహన చేసుకోడానికి చేసే ఒక ప్రయత్నం, చరిత్ర. గత చరిత్రతో పరిచయం కలిగించుకోటం చాలా అవసరం. ఎంచేతనంటే-ఈ నాడు దేశంలో జరిగే పరిణామాల్ని ఇంకా మెరుగ్గా ఆకళించుకోటానికి అది దోహదపడుతుంది. అనేక వందల ఏళ్ళ కిందట ఆరంభమైన మనదేశ కథ తెలుస్తుంది; మన దేశాన్ని ఏలిన రాజులు, రాజనీతిజ్ఞుల్ని గురించి, దేశ చరిత్రని నిర్మించిన ప్రజల్ని గురించి తెలుస్తుంది. ఇంకా, మనం మాట్లాడే భాషని ఎందుకు మాట్లాడుతున్నామో కూడా తెలుస్తుంది.

ఇది గాక, గతం లోతుల్లోకి వెళ్ళటం ఉద్రేక భరితంగా ఉంటుంది. ఇది "నిధి అన్వేషణ" క్రీడ ఆడటం వంటిది. 'నిధి' ని కనుక్కోడానికి అవసరమైన ఆధారాలు అన్ని తావులా దాగివున్నాయి. ఒక్క ఆధారం కనుక్కున్నామంటే, అది మరొక ఆధారం వేపు మనల్ని లాక్కుపోతుంది. అట్లా ఒక్కొక్క ఆధారం పట్టుకుని నెమ్మదిగా ముందుకి సాగిపోతే 'నిధి' దాగిన తావు బైట పడుతుంది. ఇక్కడ 'నిధి' అంటే మనం పుట్టక పూర్వం అనేక వందల ఏళ్ళ కిందట ఈ ప్రపంచంలో, అందులో భాగమైన ఈ దేశంలో ఏం జరిగిందో ఆకళింపుకు వచ్చే చరిత్ర.

భారతదేశం యొక్క గతం చాలా సుదీర్ఘమైంది. దాని వేళ్ళు వేలాది సంవత్సరాల వెనక ఉన్నాయి. మన పూర్వులు వదలి వెళ్ళిన కొన్ని ఆధారాలు; అనవాళ్ళనిబట్టి ఆ సుదూర గతం మనకి బోధపడుతుంది. సమీప గతం గురించి తెలుసుకోటానికి మనకు లిఖిత, ముద్రిత పత్రాలు, పుస్తకాలు అందుబాటులో ఉన్నాయి. ముద్రణా సౌకర్యాలు తెలియని కాలాన్ని గురించి తెలుసుకోటానికి చేత్తో రాసిన కాగితపు కట్టలున్నాయి. కాగితం అంటే యేమిటో తెలీని ఇంకా వెనకటి కాలంలో తాటాకులమీద, కొండ రావిచెట్టు పట్టల మీద, రాగిరేకుల మీద రాసిపెట్టిన సమాచారం ఉంది. ఇంకా కొన్ని సందర్భాల్లో పెద్ద పెద్ద శిలలమీద, శిలా స్తంభాల మీద, రాతి గోడలమీద, ఇటుక పలకలమీద చెక్కిన శాసనాలు ఉన్నాయి. అసలు రాయటం అంటే ఏమిటో తెలియని మరీ పురాతన కాలం కూడా ఉంది. ఆ కాలంనాటి

ఈ అతి ప్రాచీన లిపి రాతప్రతుల్లో నిలిచిలేదు. ఎక్కువగా శాసనాల్లో అది జీవించి వుంది. శిలలమీద లోహ ఫలకాలమీద, ఇటుక పలకలమీద చెక్కిన సమాచారాన్ని శాసనాలంటాం. అటువంటి శాసనాలు దేశమంతటా వివిధ స్థలాల్లో, అనేక ప్రాచీన భాషల్లో దొరికాయి. గతాన్ని క్రోడీకరించి ఒక రూపంలో అతకటానికి ఇవన్నీ అవసరమైన ఆధారాలు. రాత ప్రతులు గ్రంథాలయాల్లో లభ్యమవుతాయి. శాసనాలు శిలలమీద, శిలా స్తంభాలమీద, ఇటుకలపైన, పురాతన భవనాల్లో, లోహఫలకాలమీద దర్శనమిస్తాయి.

ప్రాచీన భారత చరిత్రలో చాలా భాగాన్ని పురావస్తుశాఖ సమకూర్చిన ఆధారాల మీద నిర్మించుకున్నాం. పురావస్తు శాస్త్రం అంటే పురాతన కాలపు అవశేషాల అధ్యయనం అన్నమాట. అవశేషాలంటే ఆనాటి స్మారక చిహ్నాలు, భవనాలు, నాణాలు, మట్టిపాత్రలు, రాతిపనిముట్లు, లోహ పరికరాలు, బొమ్మలు, ప్రతిమలు, వేల యేళ్ళకిందట మానవులు తమ నిత్య జీవితంలో ఉపయోగించిన ఇతరేతర వస్తువులు అని అర్థం. ప్రాచీన నగరాలు, గ్రామాల్లో కొన్ని నాశనమైపోయాయి; మరికొన్నిటిని ప్రజలు పాడు పెట్టారు. ఆ భవనాలు భూమి అడుగున పూడిపోయాయి. తవ్వకాలు జరిపితే తప్ప అవి బైట పడవు. దేవాలయాలు వంటి కట్టడాలు మాత్రం నేటికీ నిలిచివున్నాయి. వాటిని తవ్వి వెలికి తీయాల్సిన పనిలేదు.

వేల ఏళ్ళ కిందట భారతదేశంలో నివసించిన స్త్రీ పురుషులు ఏ విధంగా జీవించారో తెలుసుకోడానికి పురావస్తు శాస్త్రం సమకూర్చిన ఆధారాలు మనకు తోడ్పడ్డాయి. ఆ తీరు బ్రతుకుని ఆటవికం అన్నారు. ఆనాటి మానవులు తమ జీవిక కోసం ఎక్కువగా ప్రకృతి మీదనే ఆధారపడ్డారు. వాళ్ళు ఆహారం వండుకోవటం ఎరగరు; బట్టలు కుట్టుకోవటం ఎరగరు. వాళ్ళకి ఇల్లూ, వాకిలీ లేదు. ఆ విధంగా జీవించిన మనుషుల్ని తిండి వెతుక్కునే దిమ్మర్లు అన్నారు. నెమ్మదిగా, వాళ్ళు తమ చుట్టూ వున్న మొక్కల్ని జంతు జాలాన్ని గురించి తెలుసుకున్నారు; తమ పనిముట్లని మెరుగుపర్చుకున్నారు; పరికరాల్ని తయారు చేసే పద్ధతుల్ని ఆకళించుకున్నారు. దాంతో సుఖవంతమైన జీవితం గడపటం ప్రారంభించారు. చిట్టచివరికి పంటలు పండించటం, జంతువుల్ని మచ్చిక చేసుకోవటం నేర్చుకున్నారు. ఈ దశలో మానవుణ్ని ఆహారం ఉత్పత్తిచేసు కునే వానిగా వర్ణించారు. ఆ దశనుంచి ఈ మనుషులు సుఖంగా జీవించటం మాత్రమే కాకుండా, ఆలోచించటానికి, ఆలోచల్ని నమోదుచేసుకోటానికి, తమ జీవన విధానాల్ని అభివృద్ధిపర్చుకోటానికి తీరిక సమయాన్ని వెచ్చించారు.

# 1

# గుహలో చీకటిలో కుటిలో.....

అతి పురాతన కాలం నాటి అనాగరిక మానవుడు నాగరికుడుగా మార్పు చెందటానికి అనేక వేల యేళ్ళు పట్టింది. ఆహార సేకరణం నుంచి ఆహారాన్ని ఉత్పత్తి చేసే దశకి చేరుకోవటానికి షుమారు మూడు లక్షల సంవత్సరాలు పట్టింది. మానవుడు తిండి గింజల్ని పండించటం నేర్చుకున్న తరువాత అతడిక వెనక్కి తిరిగి చూడలేదు. వేగంగా ముని ముందుకు పయనించాడు

మొట్టమొదట, మనుషులు దేశదిమ్మరులు. అంటే-ఆహారం కోసం, ఆశ్రయం కోసం మనుషులు జట్లు జట్లుగా ఒకచోటునుంచి వేరొక చోటికి సంచారం చేసేవాళ్ళు. ఆ జట్టులో కొంతమంది పురుషులు, స్త్రీలు, పిల్లలు కలసి మెలసి పెనవేసుకుని ఉండేవాళ్ళు. గుంపుగా కదిలి వెళ్ళేవాళ్ళు. ఒంటరిగా పొట్ట పట్టుకుని సంచారం చెయ్యటం కన్నా, ఒక జట్టులో భాగమై ఉండటం అతనికి క్షేమకరం. ఆ పురాతన కాలంలో జీవితం ఎంతో ప్రయాస-భరితం కాయలు పళ్ళు కనిపిస్తే కోసుకునే వాళ్ళు; అడవి మృగాల్ని వేటాడి చంపి తినే వాళ్లు. కూరగాయలు పండించటం ఎరగరు; తిండి గింజల మాట అసలే తెలీదు. ఒకచోట కాయలు, పళ్లుగానీ, వేటాడ్డానికి జంతువులు గానీ-అఖరయిపోతే పొట్ట చేత బట్టుకుని ఇంకొక దిక్కుకి కదిలి వెళ్లేవాళ్ళు. ఆహారం దొరికినన్నాళ్ళు అక్కడ మజిలీచేసి, తరవాత మళ్ళీ వేరే దిక్కుగా తరలిపోయేవాళ్ళు అదొక అంతం లేని సంచార జీవితం.

ఎక్కడ గుహలు కనబడితే అక్కడ తలదాచుకునే వాళ్ళు. గుహలు-లేని చోట్ల పెద్ద పెద్ద చెట్లమీద గుబురు కొమ్మల మధ్య గూడు కట్టుకునేవాళ్ళు. ఎంచేతనంటే-వాళ్ళు రెంటికి భయపడిపోయారు ఒకటి-వాతావరణం; రెండు-క్రూరజంతువులు. ఎప్పుడు ఉరుము ఉరుముతుందో, మెరుపు మెరుస్తుందో వాళ్లకి తెలీదు. తెలీదు కాబట్టే ఉరిమినా, మెరిసినా తల్లడిల్లిపోయే వాళ్ళు. పులులు, సింహాలు, చిరుతలు, ఏనుగులు, ఖడ్గమృగాలు మొదలైన క్రూర జంతువులు విచ్చల విడిగా అడవుల్లో తిరిగేవి. ఆనాడు దేశమంతా అడవుల మయం. ఆ క్రూరమృగాలతో పోలిస్తే మనిషి బలహీనుడు. వాటి బారినుంచి రక్షించుకోటానికి గుహల్లో తల దాచుకున్నారు; చెట్లమీద కొమ్మల మధ్య గూళ్ళు కట్టుకున్నారు. తమకి తెలిసిన మొరటు రాతి ఆయుధాలతో వాటిని వేటాడి చంపారు.




*ఆహార సేకరణ దశలో మానవుడు ఉపయోగించిన పనిముట్లు, పరికరాలు*

అనేక వందల యేళ్ళ మానవుని తొలి చరిత్రకి సంబంధించి మనకు లిఖితాధారాలు లేవు. మానవుడు వేట కోసం, వేరే పనుల కోసం స్వయంగా రూపకల్పన చేసి, ఉపయోగించిన మోటు రాతి పనిముట్లు మాత్రమే ఈ "చరిత్ర పూర్వయుగ"పు ఆనవాళ్ళు. పురాతన మానవుడు జంతువుల వేట కోసం సంచరించిన ఎత్తయిన నదీ ప్రాంతాల్లోను, అతడు తల దాచుకున్న గుహల్లోను రాతి మదుగుల్లోను ఈ పనిముట్లు ఎక్కువగా దొరికాయి. ఏ పనికైనా మనిషికి రాయి ఏకైక పదార్థంగా ఉపయోగపడ్డ ఈ దశని రాతియుగం అంటాం. ఈ యుగంలో చాలా దీర్ఘకాలం దాకా మానవుడు తిండి వెతుక్కునే దిమ్మరిగా బ్రతికాడు. అతడు తన ఆహారం కోసం పూర్తిగా ప్రకృతి మీద ఆధారపడ్డాడు. అతడు తయారు చేసుకున్న మొట్టమొదటి పనిముట్లు చచ్చిన జంతువుల చర్మాలు

జంతువుల [illegible]

రాత్రివేళ గుంపులోని యావన్మంది గుహలోపలికి చేరాక గుహ మొదట్లో నిప్పు రగిల్చి పెట్టే వాళ్ళు. క్రూరమృగాలకు నిప్పంటే భయం. గజ గజ వణికించే చలిరాత్రుల్లో, మోత పెడుతూ తుఫాను వీచే భయంకర నిశీథాల్లో నిప్పు వాళ్ళ నేస్తం.

నిప్పు కనిపెట్టటం చాలా విచిత్రంగా జరిగింది. రెండు చెకుముకి రాళ్ళను రాపాడించగా నిప్పురవ్వ పుట్టింది. ఎండుటాకుల్ని, సన్నని రెమ్మల్ని కొమ్మల్ని తాకిస్తే భగ్గున మంట మండింది. పురాతన మానవుని ఆశ్చర్యానిక అంతులేదు. అతడు నెమ్మదిగా నిప్పుని అనేక రకాలుగా ఉపయోగించటం నేర్చుకున్నాడు. నిప్పు ఆదిమ మానవుని బ్రతుకులో అపూర్వమైన మార్పు తెచ్చింది. అతని జీవిత విధానంలో అమోఘమైన అభివృద్ధి మొదలయింది. మానవుని ప్రగతి సోపాన పథంలో నిప్పు తొట్టతొలి మెట్టు.

పనిముట్లు, ఆయుధాలు : నిప్పు చెయ్యటానికి మాత్రమే కాకుండా చెకుముకి రాయి ఇంకా చాలా విధాలుగా ఉపయోగపడింది. అది అతి కఠినంగా ఉన్నా, చెక్కటం చాలా తేలిక. అందుచేత, చెకుముకి రాయిని అనేక రూపాలలోకి మలుచుకున్నారు. పనిముట్లు, ఆయుధాల తయారీకి ఇతర రాళ్ళతో పాటు ఇదీ ఉపయోగపడింది. ఆ పాతరాతి యుగానికి చెందిన చెకుముకిరాతి పనిముట్లు, ఆయుధాలు పంజాబులో (పశ్చిమ పాకిస్థాన్) సోహాన్ నదీ ప్రాంతంలో దొరికాయి. కాశ్మీరు లోయవంటి కొన్ని తదితర ప్రాంతాలలో జంతువుల ఎముకలతో తయారుచేసిన పనిముట్లు బైట పడ్డాయి పిడికిలికి అమరే పెద్దరాళ్ళతో సుత్తులు

---

తియ్యటానికి, వాటి మాంసం కొయ్యటానికి, ఎముకలు పగల గొట్టటానికి, ఇంకా తదితర పనులకు ఉపయోగపడ్డాయి. రాతిని నేర్పుగా చెక్కటం, నిర్దిష్ట అవసరాల కోసం పనికి వచ్చే పని ముట్లని తయారు చేసుకోవటం అతడు నెమ్మదిగా అనుభవం మీద నేర్చుకున్నాడు. కాలక్రమంలో మానవుడు అభివృద్ధి చెందిన మూడు వేర్వేరు దశల్ని సూచించే స్పష్టమైన మూడు రకాల పనిముట్లు లభ్యమైనాయి.

1—3 ఆద్యశిలా యుగపు పనిముట్లు : (పాత రాతియుగపు పనిముట్లు)

1. గులక రాతితో తయారు చెసిన నరుకుడు పనిముట్టు. రాయిని పెచ్చులూడగొట్టి అడుగున కొనదేరిన అంచుగలది. 2. పట్టిచేత్తో ఉపయోగించే గొడ్డలి. పైకి కొనదేలిన పనిముట్టు. 3. వెడల్పాటి ఉలి అంచు కలిగిన నరుకుడు పనిముట్టు.

4—7 మధ్యమశిలా యుగపు పనిముట్లు :

బొక్కలు పొడిచేది, బాణం ములుకు, పెచ్చులూడగొట్టే పనిముట్లు వగైరాలు.

8-12 మొన, నెలవంక ఆకారపు పదునైన అంచు, రాతి పెచ్చు మొదలైనవి. వేగంగా పారిపోయే జంతువుల్ని చంపటానికి ఈ పరికరాలలో కొన్నింటిని ఉపయోగించాడు. ఇది మానవుని నైపుణ్యం అభివృద్ధి చెందిన దశ. ఆహార సేకరణంలో ఒక ప్రత్యేకత సాధించినటువంటి, పూర్వం కన్నా సమర్థవంతమైనటువంటి పద్ధతుల ప్రవేశాన్ని ఈ దశ సూచిస్తుంది; వ్యవసాయారంభానికి త్రోవ తీసిన దశ.




*ఆహారం ఉత్పత్తి చెయ్యటం నేర్చిన దశలో*
*మానవుడు వాడిన వస్తువులు, పనిముట్లు*

కొత్త రాతియుగం : మానవుడు తన జీవన విధానాన్ని సంపూర్ణంగా మార్చుకున్న ఆహార ఉత్పత్తిదశ. దీనికి పూర్వం మనిషి జంతువుల్ని వేటాడి, కాయాకసరూ తిని ప్రాణం నిలుపుకున్నాడు. కొత్త జీవన విధానంలో మనిషి జంతువుల్ని మచ్చిక చేసుకోవటం, మొక్కల్ని పెంచటం నేర్చుకున్నాడు. మాలిమి అయిన మొట్ట మొదటి జంతువులు కుక్క, మేక, గొర్రెలు కావచ్చు. గోధుమ, బార్లీ మొట్ట మొదట పండించిన తిండి గింజలు. ఈ కార్యకలాపాలకోసం మనిషి తను ఎంపిక చేసుకున్న కొన్ని నిర్దిష్ట ప్రదేశాలలో స్థిరపడవలసి వచ్చింది. స్థిరనివాసం జనవాసాల పుట్టుకకి, వ్యవసాయం మీద ఆధారపడిన తెగల పెరుగుదలకి దారితీసింది. చెట్టూ కంపా కొట్టి నేలని తెరిపి చెయ్యడానికి, నేలని సాగుకు అనుకూలంగా చెయ్యడానికి అతనికి కొన్ని

కత్తులు, గొడ్డళ్ళు తయారయ్యాయి. మొట్టమొదటి రోజుల్లో చెట్లకొమ్మల్ని నరకటానికి, తదితర పనులకి పిడిలేని గొడ్డళ్ళు ఉపయోగింపబడ్డాయి. తరువాత, కర్రని జొనిపి గొడ్డలిని ఉపయోగించటం నేర్చుకున్నారు. ఈ పనిముట్లు, ఆయుధాలు వారి జీవితాల్ని మెరుగు పర్చాయి. చెట్లు కొట్టటానికి, జంతువుల్ని చంపటానికి, నేలని తవ్వటానికి, రాయిని దారువుని రకరకాల రూపాలలోకి తీర్చిదిద్దటానికి ఇవి ఉపయోగపడ్డాయి.

చిన్న చిన్న రాళ్ళని-అంటే పెద్దరాళ్ళని చెక్కినప్పుడు ఊడిన పెచ్చులు, చెక్కుల అంచుల్ని నునుపుగా, పదునుగా చేసి చాకులుగా ఉపయోగించారు. రాతి మొనని పదునుగా చెక్కి విల్లమ్ములు, ఈటెలకి గుచ్చారు. పురాతన మానవుడు ఎక్కువగా నదీ తీరానికో, సెలయేటి గట్టుకో దగ్గరగా జీవించి తన నీటి అవసరాన్ని తీర్చుకున్నాడు. హిమాలయ పర్వత పాదంలోగాని, నర్మదా నదీ లోయలో గాని నదీ ప్రవాహం వెంట నడుస్తూ కింద నేల వేపు శ్రద్ధగా చూస్తూ పోతే అప్పుడప్పుడు ఈ పనిముట్లు కనిపిస్తాయి.

*దుస్తులు .* దుస్తులకు సంబంధించి ఆనాటి మానవుడు ఇబ్బంది ఎరగడు. వాతావరణం వెచ్చగా ఉన్నప్పుడు దుస్తుల్తో పని లేదు. వానకాలంలో, చలికాలంలో తాము వేటాడిన జంతువుల చర్మాల్ని, చెట్టు పట్టని, విశాల మైన ఆకుల్ని ఒంటికి చుట్టుకున్నారు. దుప్పి చర్మం కప్పుకుంటే చలి తెలిసేది కాదు.

*సంచార స్థితి నుంచి స్థిర నివాస దశకి .. :* క్రమేణా, మనిషికి తన పరిసరాల్ని గురించి జ్ఞానం పెరగటంతో కొంత సుఖంగా బ్రతకాలనే కోరిక కలిగింది. కొత్త కొత్తవి అనేకం కనిపెట్టబడ్డంతో జీవన విధానంలో అపూర్వమైన మార్పులు సంభవించాయి. మొక్కల్ని పెంచి ధాన్యం పండించటం నేర్చుకున్నాడు. నేలలో విత్తులు చల్లి నీళ్ళు పెడితే మొక్కలు పెరుగుతాయని గ్రహించాడు. ఇది వ్యవసాయానికి ఆరంభం. ఆదిమ మానవుడు ఆహారం కోసం అడవులు, కొండలు, గుట్టలు పట్టుకుని తిరిగే పాట్లు తప్పిపోయాయి. ఇప్పుడతను తిండిగింజలు తనే స్వయంగా పండించుకోగలడు. వెంటనే సంచార జీవితానికి

పనిముట్లు, పరికరాలు కావలసి వచ్చాయి. మిగులు ధాన్యాన్ని నిలవచేసి వుంచుకోటానికి, నీళ్లూ, పాలు, నూనె వగైరా ద్రవ పదార్థాల్ని పోసుకోవటానికి పాత్రలు అవసరమయ్యాయి. ఈ అవసరమే మనిషి మట్టి కుండలు తయారు చెయ్యటానికి ప్రేరణ ఇచ్చింది. మొట్టమొదట, బుట్టల చుట్టూ తడిమట్టి పూసి కుండలు తయారుచేశాడు. తరువాత బుట్టల్ని ఉపయోగించకుండా పూర్తిగా మట్టితోనే తయారు చెయ్యటం మొదలుపెట్టాడు.

మానవుడు ఆహారం ఉత్పత్తి చేసిన దశలో ఉపయోగించిన పనిముట్లు పాత్రలు ఎడం పక్క పేజీలో చూపబడ్డాయి. ఇవి మనదేశంలో వివిధ స్థలాల్లో దొరికాయి.

1. బరువు కట్టిన రాతి తవ్వుకోల
2. కోతకి ఉపయోగించిన రాతి కొడవలి
3. కొయ్యకి బిగించిన రాతి గొడ్డలి
4. ధాన్యం నలచటానికి, పిండి చెయ్యటానికి ఉపయోగించిన రాయి, ఫొత్రం

5-8. వివిధ రకాల మట్టి పాత్రలు.

స్వస్తిచెప్పి స్థిర జీవితాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. మానవుని జీవన సరళిలోని ఈ మార్పులు భారత దేశంలో పలుచోట్ల పలు సమయాల్లో సంభవించాయి. మనదేశంలో అనేక చోట్ల ఈ మార్పులు 4-6 వేల యేళ్ళ కిందట చోటు చేసుకున్నాయి.

*జంతువుల మచ్చిక.* జంతువుల్ని మచ్చిక చేసుకుని, వాటిని స్వంతపనులకు, స్వీయప్రయోజనాలకు ఉపయోగించగలగవచ్చుననే గ్రహింపు ఆదిమ మానవుణ్ని గొప్పగా ఉత్తేజపర్చింది. ఉదాహరణకి- అడవి మేకల్ని వేటాడి చంపి తినటమే తెలిసిన మనిషికి వాటిని మచ్చికచేస్తే నిత్యం పాలు సమృద్ధిగా దొరకటమే కాకుండా వాటి సంతతిని వృద్ధిచేసి మందని పెంచుకోవచ్చునన్న జ్ఞానం కలిగింది. మందలో కొన్నిటిని మాంసం కోసం ఉపయోగించుకోవటంవల్ల వేటకి వెళ్ళాల్సిన అవసరం తప్పిపోయింది అలాగే, కుక్కని మచ్చిక చేసుకున్నందువల్ల మనిషికి గొప్ప మేలు జరిగింది. అరక దున్నటానికి, బండి లాగించటానికి జంతువుల్ని ఉపయోగించుకోగల్గడం ద్వారా ఆనాటి మానవుడు మరొక ముందడుగు వేశాడు.

*లోహాల ఎరుక, వాడకం :* ఆదిమ మానవుడు సంచార జీవనం మాని స్థిరనివాసం ఏర్పరచుకొని తన ఆహారాన్ని తాను స్వయంగా పండించుకోవటం ప్రారంభించినప్పుడు చెట్లు కొట్టివేసి, దుబ్బులు తవ్వి నేలని వ్యవసాయ యోగ్యంగా చేసుకోవలసి వచ్చింది. అంతకుముందే కనిపెట్టబడ్డ రాతి పనిముట్లు, నిప్పు వ్యవసాయాభివృద్ధికి గొప్పగా దోహదపడ్డాయి. రాతి గొడ్డళ్ళతో చెట్లు కొట్టాడు, దుబ్బులు తవ్వాడు. మిగిలిన కాడల దుబ్బుకి నిప్పంటించి తగలబెట్టాడు. కాని రాతి గొడ్డలితో చెట్లు నరకటం విపరీతమైన ప్రయాసతో కూడుకున్న పని. ఆ పరిస్థితుల్లో లోహాల్ని కనిపెట్టటం సంభవించింది. మొట్ట మొదట కనిపెట్టబడ్డ లోహం - రాగి ఇది లోహయుగ ప్రాథమిక దశ. క్రమేణా, రాగితో తగరం, తుత్తునాగం వంటి ఇతర లోహాల్ని కలిపి కంచు తయారు చెయ్యటం నేర్చుకున్నాడు. ఈ లోహాల ఎరుక, తయారీ ఎలా తెలుసుకున్నాడన్నది మనకి తెలీదు. ఒక ఖనిజపు ముద్దని కరిగించి లోహాన్ని ఎలా రూపొందించుకున్నదీ ఇప్పటికింకా అంతు పట్టకుండా వున్న విషయం.

లోహంతో తయారు చేసిన చాకులు, గొడ్డళ్ళు మొదలైనవి రాతితో చేసిన వాటి కన్నా చాలా పదునైనవి; ఎక్కువ సమర్థవంతంగా ఉపయోగపడ్డాయి. మానవుడు కేవలం రాతి పనిముట్లను మాత్రమే ఉపయోగించిన కాలాన్ని రాతి యుగం (పాత రాతి యుగం, కొత్త రాతి యుగం) అంటారు. స్వల్పమైన రాతి పనిముట్లతో బాటు లోహాన్ని ఉపయోగించిన కాలాన్ని లోహ యుగం (లేదా తామ్ర-శిలా యుగం) అంటారు. మనదేశంలో ఆనాటి లోహ పరికరాలు బయల్పడిన ప్రదేశాలు చాలా ఉన్నాయి. మైసూరుకు సమీపంలోని బ్రహ్మగిరి, నర్మదా నదివద్ద నవదతొలి ప్రధానమైనవి.

*చక్రం :* చక్రం కనిపెట్టటం అత్యద్భుతమైన అంశం. ఎవరు, ఎప్పుడు, ఎక్కడ దీన్ని కనిపెట్టారన్నది తెలీదు. కాని ఇది మానవ జీవన విధానంలో ఒక మహత్తర అభివృద్ధికి బాటలు పరిచింది. ఈనాటికీ దీని ఉపయోగం అనన్యం. రిస్టువాచీ లోపల సూక్ష్మచక్రం మొదలుకొని రైలింజను చక్రం దాకా ఆనాడు కనిపెట్టబడ్డ పరికరం యొక్క అభివృద్ధి రూపాలే. ఈ చక్రాన్ని కనిపెట్టటంతో జీవితం వెయ్యి విధాల సుఖవంతమైంది. దీనికి పూర్వం ఒకచోటునుంచి వేరే చోటికి పోవాలంటే కాల్నడక లేదా జంతువుల మీద స్వారీ మాత్రమే శరణ్యం. చక్రం వాడుకలోకి వచ్చాక బండ్లు తయారయ్యాయి. వెనక

ఒక చోటు నుంచి మరొక చోటుకి కదిలించటానికి సాధ్యపడని భారీ వస్తువుల్ని, సామగ్రిని రవాణా చెయ్యటం సులభమైంది. అంతేకాకుండా, కుండల తయారీని ఈ చక్రం మేలురకంగా తీర్చిదిద్దింది.

*జనపదాలు :* కొత్త రాతియుగం నాటికి మానవులు మెరుగైన నాగరిక జీవనానికి తయారై వున్నారు. సంచార స్థితిలో ఉన్న గుంపులు ఒకచోట కుదురుకుని గుడిసెలు వేసుకుని బార్లీ, వరి, గోధుమ పండించే దశకి చేరుకున్నారు. మేకలు తదితర జంతువుల్ని మచ్చిక చేసుకున్నారు. వాళ్ళు గుడిసెలు నిర్మించుకొని స్థిరపడ్డ చోటు జనపదమైంది. ఇవే తొట్ట తొలి పల్లెలు లేదా పల్లీయ సమాజాలు. దేశమంతటా ఇటువంటి పల్లెలు వెలిశాయి. ముఖ్యంగా నదీలోయల్లో, సమతల మైదాన ప్రాంతాల్లో ఇవి విశేషంగా కానవచ్చాయి. ఎంచేతనంటే, అక్కడ నేల సారవంతంగా ఉండి, పంటలు పండించటానికి అనుకూలంగా వుంది పురావస్తు పరిశోధకులు జరిపిన త్రవ్వకాలలో ఈ పురాతన జనపదాల అవశేషాలు బయల్పడ్డాయి. ఇవి చరిత్ర పూర్వయుగ పరిస్థితులకు విశ్వసనీయమైన ఆధారాలు. ఆ కాలంలో పురాతన మానవులు ఎలా జీవించిందీ ఈ అవశేషాలు అద్దం పట్టి చూపిస్తాయి.

ఆ పల్లెలు చాలా చిన్నవి. గుడిసెలు ఒకదానికొకటి అతి దగ్గరగా ఉండేవి. పల్లెలో ప్రజలు ఒకరికొకరు సన్నిహితంగా నివసించడం వల్ల క్రూరమృగాల బారినుండి పల్లెను రక్షించుకోవటం సులభమైంది. బహుశా గుడిసెలు వేసుకున్న స్థలం చుట్టూ మట్టిగోడగానీ, ముళ్ళకంచెగాని పెట్టుకున్నట్టు తెలుస్తుంది. పొలాలు కంచెకి ఆవల ఉండేవి. సాధారణంగా ఆ పల్లెలు పొలాల నేలమట్టంకన్నా కొంచెం మెరకగా వుండే ఎత్తయిన ప్రదేశంలో నిర్మించబడ్డాయి ఇళ్ళు గడ్డి, పూరి, రెల్లు వగైరాలతో నేసిన పూరి గుడిసెలు. లోపల ఒకే ఒక గది. గుంజలు పాతి ఒక చట్రం తయారుచేసి దానిమీద కొమ్మలు, గడ్డి, పూరి వగైరాలు వేసి గుడిసె తయారు చేసేవాళ్ళు. గుడిసె లోపల పొయ్యి వెలిగించి వంట వండుకునేవాళ్ళు; రాత్రివేళ దాని చుట్టూ పండుకొని నిద్రించేవాళ్ళ.

పూర్వం లాగా పచ్చిమాంసం, పచ్చికూరలు, ఆకులు తినడం మానివేసి, ఉడికించిన ఆహారాన్ని భుజించటం ప్రారంభమైన దశ ప్రవేశించింది. మాంసం నిప్పులమీద కాల్చటం నేర్చారు. రెండు రాళ్ళ మధ్య ధాన్యం పోసి నలిపి పిండి చెయ్యటం నేర్చారు. పిండితో రొట్టె చెయ్యటం కూడా తెలుసుకున్నారు. మిగులు ధాన్యాన్ని పెద్ద పెద్ద జాడీల్లో నిలవజేసుకున్నారు. వంట అనగానే వండుకునే పాత్రలు కావాలి. అంతకన్నా ముందు కాలంలో మట్టిపాత్రలు చెయ్యడం తెలుసు. క్రమేణా లోహపాత్రలు వాడుకలోకి వచ్చాయి. మొట్ట మొదట్లో స్త్రీలు మట్టిని గుండ్రని కుండలు, జాడీలు, పళ్ళాలు వగైరా వేర్వేరు ఆకారాల్లోకి చేత్తో మలిచి ఎండలో ఆరబెట్టేవాళ్ళు. తరువాత, ఎండిన మట్టి పాత్రల్ని ఆములో కాల్చడం నేర్చుకున్నారు. ఇంకా రాను రాను, చక్రం ఉపయోగంలోకి వచ్చాక దాన్ని గిర గిరా తిప్పుతూ చక చకా పాత్రలు తయారు చేసే నైపుణ్యం అబ్బింది. ఈ నాడు మనం గ్రామాల్లో చూసే కుండల తయారీలాగే ఆనాడూ అచ్చు ఇలానే ఉండేది రాయి-రాగి రెంటితో పనిముట్లు తయారు చెయ్యటం జరిగిన తామ్ర శిలాయుగంలో కుమ్మరి కుండల మీద అందమైన నగిషీలు దిద్దడంలో ఆరితేరాడు.

*దుస్తులు-ఆభరణాలు :* తామ్ర శిలాయుగ మానవునికి అలంకరణ అన్నా, ఆభరణాలన్నా మోజు. ప్రకృతి వైపరీత్యాలతో, క్రూర మృగాలతో భయంకర సమరం సాగించిన కఠోర జీవితం

కాదిప్పుడు. ఆనందించటానికి, అనుభవించటానికి వ్యవధి దొరకింది. తనకోసం, తన స్త్రీ జనం కోసం ఆభరణాలు తయారుచేసుకున్నాడు. స్త్రీలు గుల్లల్తో, ఎముకల్తో తయారైన ఆభరణాలు అలంకరించుకున్నారు. సుందరంగా తయారైన దువ్వెనని సిగలో సింగారించుకున్నారు. ఒంటికి చుట్టుకోడానికి జంతువుల చర్మాలు, చెట్టు పట్ట, ఆకులు మాత్రమే శరణ్యం కాదు. పత్తి మొక్క కాయలు పగిలి స్వరున బైటికి దూసుకువచ్చే మెత్తటి దూది నుంచి నూలు తీసి, వడికి, బట్టలు నేసే నైపుణ్యం అలవడింది. సరదాలకు, వినోదాలకు విరామ సమయం దొరికింది.

సమాజం: మనిషి దిమ్మరిబతుకు మాని పల్లెలో కుదురుగా జీవించటం మొదలు పెట్టాక ప్రవర్తన నియమావళిని రూపొందించుకోవలసిన అవసరం ఏర్పడింది. ఇతర కుటుంబాలతో, ఇతర జట్లతో కలిసి జీవించేటప్పుడు గ్రామంలో అదుపు, కట్టుబాటు అవసరమయ్యాయి. శ్రమ విభజన అవసరమైంది. కొందరు పొలాల్లో కష్టం చేశారు; మరి కొందరు జంతువుల ఆలనపాలనా చూశారు. ఇంకా కొందరు గుడిసెలు కట్టారు; పనిముట్లు, ఆయుధాలు తయారు చేశారు. స్త్రీలు నూలువడికారు; బట్టలు నేశారు; కుండలు చేశారు; వండి వార్చారు; పిల్లల్ని పోషణచేశారు. ఎవరు ఏ ఏ పనులు చెయ్యాలన్నది గ్రామంలో అందరూ కలిసి నిర్ణయించారు. అయినప్పటికీ, గ్రామానికి ఒక పెద్ద అంటూ ఉండాలి; ఆదేశాలిచ్చి అమలు జరిపే నాథుడు ఉండాలి. సాధారణంగా, వయస్సులో వివేకంలో పెద్దవాడైన దొడ్డ మనిషి నాయకుడుగా వ్యవహరించాడు. కొన్ని సందర్భాల్లో బలంలో, ధైర్యంలో దిట్టరి అయిన వ్యక్తి నాయకుడుగా వ్యవహరించాడు.

మతం: జీవితంలో మనిషిని చికాకుపెట్టిన అంశాలు కొన్ని ఉన్నాయి. ప్రతి ఉదయం ఎందుకు పొద్దు పొడుస్తుంది? ప్రతి సాయంత్రం ఎందుకు పొద్దు గుంకుతుంది? నిద్ర, నిద్రతో కలలు, పుట్టుక, పెరుగుదల, చావు-ఇవన్నీ అర్థమవక అయోమయంలో ముంచెత్తాయి. అంతేనా! ఏళ్ళు గొర్లిపోతున్నా అవే రుతువులే ఎటొటా మాటి మాటికీ వచ్చిపోతున్నాయి. ఏంచేత? మరణించాక మనిషి యేమవుతాడు? మరణమంటే వెరపు; ఉరుములంటే, మెరుపులంటే వెరపు, భూకంపాలంటే వెరపు. భూకంపాలు ఎందుకు కలుగుతాయో వానికి తెలీదు. కొందరు మనుషులు ఇతర్లకన్నా వీటినిగురించి తీవ్రంగా ఆలోచించారు. ఈ ప్రశ్నలకి జవాబులు సూచించారు. ఆకాశ దేవత ఒకడున్నాడు, అతడు ప్రతిరోజూ సూర్యుణ్ని ఆకాశంలో సంచరించనిస్తాడు. అల్లాగే నేల తల్లిలాంటిది. తన మొక్కల్తో, పంటల్తో బిడ్డల్ని కాపాడే తల్లి ఆవిడ ప్రతి ఉదయం పొద్దు పొడవాలంటే, ప్రతి ఏడూ పంట పండాలంటే ఆకాశ దేవతని, భూమాతని మంత్రాలతో, బలుల్తో పూజించాలి. భూమాత మట్టి ప్రతిమలు చేసి ఆరాధించారు. పురుషుల్లో కొందరు "మంత్రగాళ్ళు"గా తయారయ్యారు. మంత్ర మహిమతో ప్రకృతిని అదుపుచెయ్యగలం అన్నారు; రోగాల్ని కుదురుస్తాం అన్నారు. మనుషులకి ప్రమాదాలు జరక్కుండా నిరోధిస్తాం అన్నారు. వీళ్ళ తరువాత పురోహిత వర్గం పుట్టింది. మొత్తం గ్రామం తరపున వీళ్ళు మంత్రాలు చదివారు; బలులు వగైరా నిర్వహించారు.

మరణ మన్నది మరో లోకంలోకి ప్రస్థానం. మళ్ళీ తిరిగి రాలేని మరో ప్రపంచం అది. కాబట్టి ఒక స్త్రీ గాని, పురుషుడు గాని మరణిస్తే ఆమెని గాని అతణ్ని గాని గోతిలో సమాధి చెయ్యాలి. చిన్నబిడ్డ చనిపోతే ఓ పెద్ద కుండలో పెట్టి పూడ్చిపెట్టాలి కుండల్ని, పూసల దండల్ని, ఇంకా చనిపోయిన మనిషికి అవసరమైనవని గ్రామం భావించే ఇతర వస్తువుల్ని శవంతోపాటు గోతిలో పూడ్చిపెట్టాలి. ఇవన్నీ ఆనాటి

మానవుని భావనలు.

మానవుని సంస్కృతి, లేదా జీవన సరళి లేదా ప్రవర్తన తీరు ఆహార సేకరణం నాటి మనిషి అనాగరికదశ దాటి ఎంతో పురోగమించింది. ఇప్పుడతనికి నిలకడగా నిలిచే తావుంది; బ్రతుక్కి భద్రత ఉంది. తన జీవిత విధానాన్ని మెరుగు పర్చుకుంటున్నాడు; కొత్త కొత్త పని పద్ధతుల్ని కనిపెడుతున్నాడు; జీవితాన్ని సునాయాసం, సుఖవంతం చేసే మార్గాల్ని ఏర్పరచుకొంటున్నాడు. కాని ఒక్క లోపం మాత్రం అతణ్ని వెన్నంటి ఉంది. ఆ లోపమే అతణ్ని వేగం పురోగమింప నివ్వకుండా నిరోధిస్తున్నది. అదేమిటి? అతనికి లిపి లేదు; అంచేత రాయటం రాదు. పంటలెలా పండించాలో, పశువుల్ని ఎలా చూసుకోవాలో, కుండల్ని ఎలా తయారు చెయ్యాలో అతడు తన బిడ్డలకి నేర్పగలడు. కాని తను ఈ విజ్ఞానాన్ని రాసి పెట్టుకోలేడు. లిపి జ్ఞానం నగరాలు నిర్మాణమైన తరువాతి దశలోగాని కలగదు.

# 2

# సింధునదీ నాగరికతలో మానవ జీవన వికాసం

అయిదు వేల యేళ్ళ నాటి సింధునదీ నాగరికత అరవై యేళ్ళ క్రితం దాకా "ఇతిహాసపు చీకటి కోణం అట్టడుగునపడి కాన్పించని కథ." 1921–'22లో సింధు మైదానంలో జరిపిన త్రవ్వకాల్లో రెండు పురాతన మహా నగరాల శిథిలాలు బయల్పడ్డాయి. ఒకటి - మొహెంజొదారో; (ఇప్పుడది సింధు రాష్ట్రం లర్ఖానా జిల్లాలో ఉంది) రెండు – హరప్పా, (పంజాబ్‌లో మాంట్ గోమరీ జిల్లాలో ఉంది).

భూమి అడుగున పూడిపోయిన ఈ పురాతన మొహెంజొదారో–హరప్పా నాగరికతా సంస్కృతులు వెలుగులోకి రావటానికి మూల కారకులు కనింగ్ హాం, సర్ జాన్ మార్షల్, ఆర్. డి. బెనర్జీ ప్రభృతులు. ఈ ముగ్గురూ పురావస్తు పరిశోధకులే.

హరప్పా సంస్కృతిలో తడిసిన నేల చాలా విశాలమైంది: 12 లక్షల 99 వేల 600 చదరపు కిలోమీటర్లు. క్రీ.పూ. రెండవ, మూడవ సహస్రాబ్దంలో ప్రపంచం మొత్తంలో హరప్పా అంతటి విస్తృత సంస్కృతీ సీమ మరెక్కడా లేదు. ఇక చదవండి ... . .. .

*జనవాసాల నుంచి నగర జీవనంలోకి . . :* కాలక్రమేణా చిన్న చిన్న జనవాసాలు పెరిగి పెద్దవయ్యాయి. అక్కడ నివసించే జనం కూడా వృద్ధి అయ్యారు. కొత్త అవసరాలు పెరిగాయి. కొత్త వృత్తులు అవతరించాయి. ఈ పెద్ద గ్రామాల్లో నివసించే ప్రజలు తమ అవసరాలకు మించి ఆహారం పండించటం వల్ల తిండికి కొరత లేకుండా సుఖంగా ఉన్నారు. మిగులు ధాన్యాన్ని మార్పిడి చేసి బట్టలు, మట్టి పాత్రలు, ఆభరణాలు వగైరా తెచ్చుకుంటున్నారు. ప్రతి కుటుంబం పొలం పనికే అంకితం కావలసిన అవసరం ఇకలేదు. బట్టలు నేసేవాళ్ళు, కుండలు చేసేవాళ్ళు, వడ్రంగులు మొదలైన వృత్తి పనులవాళ్ళు వ్యవసాయ కుటుంబాల వారికి తాము వస్తువులు తయారు చేసిపెట్టి వారి నుంచి ధాన్యాన్ని తీసుకొంటున్నారు. ఈ వస్తు మార్పిడితో వ్యాపార దశ మొదలై క్రమేణా పుంజుకొంది. దాంతో రకరకాల వృత్తిపనులవాళ్ళు ఒక చోట పోగుబడ్డారు. అటువంటి గ్రామాలే రాను రాను పట్టణాలుగా వృద్ధి చెందాయి.

నగర జీవితం ప్రారంభం కావటంతో సాంకేతిక ప్రగతి జరిగింది. అంటే పనిముట్ల తయారీలో, వస్తూత్పత్తిలో కొత్త ప్రక్రియలు, పద్ధతులు ప్రవేశించాయి. పూర్వం కంటే మెరుగైన నాగరికత పెరిగింది. మనిషి కేవలం తన భౌతికావసరాలు తీరడంతో సంతృప్తి పడకుండా అంతకు మించిన అవసరాల్ని తీర్చు కోటం కోసం అన్వేషించే దశని నాగరికత అనవచ్చు. ఈ దశలో మనిషికి చాలినంత తిండి ఉంది. తను ఉత్పత్తి చేసిన వస్తువుల్ని ఇతర వస్తువులకి మార్పిడి చేసుకుంటున్నాడు. వ్యవసాయానికే అంటి పెట్టుకొని పల్లెల్లోనే ఉండనవసరం లేకుండా పట్టణాల్లో వేరే వృత్తుల్లో కుదురుకుని జీవిస్తున్నాడు మెదడుకు మేత వేసే తీరిక దొరికింది జీవితానికి సంబంధించి తికమక పెట్టే అనేక ప్రశ్నలకి సమాధానాలు వెతుక్కునే వ్యవధి దొరికింది. రాయటం తెలుసు కాబట్టి తన ఆలోచనలని రాసి పెట్టుకోగలడు తను జీవించే సమాజం చట్టం కట్టుబాట్లలో ఉంది. మనిషి తన బుద్ధికి సంబంధించిన అవసరాల్ని సంతృప్తిపర్చుకోడానికి ప్రయత్నించి నప్పుడు నాగరికుడవుతాడు.

పట్టణాల్లో ఇటుకలతో ఇళ్ళు కట్టారు. తీర్చిదిద్దినట్టు రోడ్లు నిర్మించారు. మురుగు పారుదల సౌక ర్యాలు ఏర్పరచుకుని నగర పారిశుద్ధ్యాన్ని మెరుగుపర్చుకున్నారు. రాకపోకల సౌకర్యాలు పెరిగి వ్యాపారం పెంపొందింది. సాంఘిక జీవనం మునుపటంత అలకంగా లేదు. అనేక రకాల నియమ నిబంధనలు అవసర మయ్యాయి. పరిపాలన నిర్వహించటానికి ఒక ప్రభుత్వం అవసరమైంది. ఈ దశలో సాధించిన అసమాన ప్రగతి-లిపి కనిపెట్టటం. మొట్టమొదట, వ్యాపారస్థులు తమ బేరసారాల వివరాలను పొందు పర్చుకోడానికి లిపిని వాడారు.

భారత దేశంలో పురావస్తు పరిశోధకుల త్రవ్వకాలలో బయల్పడ్డ తొట్ట తొలి పట్టణం, మొహెం జొదారో. ఇది సింధునది ఒడ్డున ఉంది. (ఇప్పుడిది పాకిస్థాన్‌లో సింధు రాష్ట్రం లర్కానా జిల్లాలో ఉంది) దీనికి ఎగువన పంజాబులో మరొక పురాతన నగరం కూడా బైటపడింది. అది హరప్పా; ప్రస్తుతం పంజాబులో మాంట్ గోమరీ జిల్లాలో ఉంది. పురావస్తు పరిశోధకులు ఈ రెండు పురాతన నగరాల నాగరి కతని సింధు నాగరికత అని వ్యవహరించారు. ఎంచేతనంటే - ఈ రెండు నగరాల్లోనే కాకుండా సింధునదీ లోయలోని ఇంకా కొన్ని స్థలాల్లో కూడా ఇదే మోస్తరు నాగరికత బయల్పడ్డం చేత సింధునదీ నాగరికత అన్నారు. గత ఇరవయ్యేళ్ళుగా పురాతత్వ శాస్త్రజ్ఞులు భారతదేశంలో ఉత్తర, పశ్చిమ ప్రాంతాల్లో విస్తృ తంగా త్రవ్వకాలు జరిపి, సింధు నాగరికతని పోలిన మరికొన్ని నగరాల్ని కూడా కనుక్కున్నారు. ఈ అన్ని పట్టణాల్లో జీవన సరళి, సంస్కృతి హరప్పా నాగరికతని పోలి వుండటం చేత సింధు నాగరికతని హరప్పా నాగరికత అని కూడా ఇప్పుడు వ్యవహరిస్తున్నారు. మొహెంజొదారో, హరప్పాలు కాక త్రవ్వకాలలో ఇంకా వెలుగులోకి వచ్చిన నగరాలు. చండీఘర్‌కి దగ్గర్లోని రూపార్; గుజరాత్‌లోని లోథాల్; రాజస్థాన్‌లోని కాళీ బంగన్; సింధు రాష్ట్రంలోని కోట్‌దీజి.

హరప్పా నాగరికత సింధురాష్ట్రం, బలూచిస్థాన్, అవిభక్త పంజాబ్, ఉత్తర రాజస్థాన్, కథియవాడ్, గుజరాత్‌లని కలుపుకొని ఒక సువిశాల భూభాగమంతటా విస్తరిల్లింది దీన్ని నాగరికత అని ఎందుకంటున్నామంటే అంతకు ముందున్న ఆగిమ యుగంలోని మానవులకన్నా సింధునదీ లోయలో నివసించిన ప్రజలు ఎంతో నాగరిక జీవితం గడిపారు గనుక.

ఈ పట్టణాలు ప్రణాళికా బద్ధంగా కట్టబడ్డాయి వీటిని పరిశుభ్రంగా ఉంచేందుకు అనేక జాగ్రత్తలు తీసుకోబడ్డాయి. ప్రజలు సుఖంగా జీవించారు. వినోదానికి, మనోవికాసానికి అవసరమైన తీరిక ఉంది, హరప్పా ప్రజలకు రాయటం తెలుసు. -వారు వాడిన లిపి-చిత్ర లిపి లేదా బొమ్మల లిపి. మొదట బొమ్మల రూపాల్లో ఉండి క్రమంగా ఇవి గుర్తులుగా స్థిరపడ్డాయి. ఈ లిపిని చదివి అర్థం చేసుకోటానికి కీలకం యింకా చరిత్రకారుల చేతికందలేదు.

ఆసియా, ఆఫ్రికా ఖండాలలో ఇతరేతర ప్రాంతాల్లో-ముఖ్యంగా నైల్, యూఫ్రటీస్, టైగ్రిస్ హువాంగ్-హో నదీలోయల్లో వేరే నాగరికతలు వర్ధిల్లిన కాలంలోనే హరప్పా సంస్కృతి భారతదేశంలో వికసించింది. హరప్పా సంస్కృతి షుమారు 4,500 ఏళ్ళ నాటిది. అంటే, క్రీ. పూ. 2500 సంవత్సర ప్రాంతం. ఆ కాలంలోనే ఈజిప్టులో ఫారో నాగరికత విలసిల్లింది. ఆ కాలంలోనే ఈజిప్టు చక్రవర్తులు పిరమిడ్లు నిర్మించారు. ఇప్పుడు మనం ఇరాక్ అని పిలిచే ప్రాంతంలో ఆనాడు సుమేరియన్ నాగరికత వర్ధిల్లింది. సుమేర్ ప్రజలతో హరప్పా ప్రజలకి వాణిజ్య సంబంధాలుండేవి వేలాది సంవత్సరాల కిందట కూడా భారతదేశానికి ప్రపంచంలోని ఇతరదేశాలతో వర్తక, వాణిజ్య సంబంధాలుండేవి!

*పరిసరాలు*. ఆనాడు, ఉత్తర వాయువ్య భారతదేశం యావత్తు (నేటి పాకిస్తాన్‌తో సహా) అడవుల మయం. వాతావరణం తేమగా ఉండేది. ఇప్పటిలాగా సింధు, రాజస్థాన్‌లు అప్పుడు ఎడారి సీమలు కావు ఆనాడు ఆ ప్రజలెరిగిన జంతువులు అడవి మృగాలే - పులులు, ఏనుగులు, ఖడ్గమృగాలు, నీటి గుర్రాలు. అడవుల్లో దొరికే కలపని ఇటుకబట్టీలకు ఉపయోగించి ఇటుకలు కాల్చారు. ఆ ఇటుకల్తో పట్టణాలు కట్టారు. పడవల తయారీకి కూడా కలపని ఉపయోగించుకున్నారు.

నదీ తీరాల వెంబడి పొలాలు బారులు తీరి ఉండేవి. నది వరదల ద్వారా కొట్టుకువచ్చే ఒండ్రు మట్టి వున్న భూములు కాబట్టి సాగు సులభమైంది. వరదలకి ముందు భూమిలో విత్తనాలు చల్లేవాళ్ళు. వరద రాగానే చేలకి నీరందేది. వరదనీటికి ఆనకట్టలు కట్టి సాగుచేసేవాళ్ళు. ఇది వరద నీటి సాగు. కాలువలు తవ్వి నీటిపారుదల చేసుకునే క్లిష్టమైన పద్ధతుల అవసరం ఆనాడు వారికిలేదు గ్రామావసరాలకు మించి వాళ్ళు ధాన్యం పండించారు. మిగులు ధాన్యాన్ని పట్టణాలకి సరఫరా చేశారు. ఈ అదనపు ధాన్యాన్ని నిల్వ చెయ్యటానికి పట్టణాల్లో గరిసెలు, గిడ్డంగులు ఉండేవి.

పట్టణ వాసులు వ్యవసాయం జోలికి పోలేదు. వాళ్ళల్లో ఎక్కువమంది వృత్తిపనివాళ్ళు, వర్తకులు. చేతి పని వారు పూసలు దండలు తయారుచేసేవాళ్ళు; బట్టలు నేసేవాళ్ళు; ఆభరణాలు తయారుచేసేవాళ్ళు. వీటిని పట్టణ ప్రజల అవసరాలకు పోను మిగిలిన వాటిని ఇరాక్‌లోని సుమేర్ మొదలైన సుదూర ప్రాంతాలకు ఎగుమతిచేసేవాళ్ళు.

*నగరాలు, భవనాలు :* మొహెంజొదారో, హరప్పా నగరాలు రెండు ప్రధాన భాగాలుగా విభజింపబడి వుండేవి. మెరక ప్రాంతంలో కోట, పల్లపు ప్రాంతంలో పౌర నివాసాలు. ప్రభుత్వ కార్యాలయాలు, ధాన్యపు గిడ్డంగులు, ముఖ్య కర్మాగారాలు, ప్రార్థనా మందిరాలు వగైరా ప్రధాన కట్టడాలన్నీ కోట ఆవరణలోనే ఉండేవి. పౌర నివాసాలున్న ప్రాంతం విశాలమైంది. వీధులకు రెండువైపులా ఇళ్ళు, దుకాణాలు ఉండేవి. నగరం మీద శత్రు దాడి జరిగినా, వరదలు వచ్చినా పల్లపు ప్రాంతాల్లో నివసించే

ప్రజలంతా కోటలో తలదాచుకుని వుండవచ్చు.

హరప్పా కోటలో ధాన్యాగారాలు కన్నుల నిండుగా కనిపించే భవనాలు. అవి దీర్ఘ చతురస్రాకారపు కట్టడాలు. నదికి దగ్గరగా ఉండేవి. ధాన్యం పడవల ద్వారా నగరం చేరేది. వెంటనే ఒడ్డుకి దగ్గరగా వున్న గిడ్డంగులకి ధాన్యాన్ని తరలించేవాళ్ళు. ఇది చాలా శ్రేష్ఠమైన ధాన్య రవాణా పద్ధతిగా కనిపిస్తుంది. ఎంచేతనంటే-రవాణా ఖర్చు స్వల్పం; శ్రమ తక్కువ. పట్టణ వాసుల బ్రతుకు ఈ ధాన్యాగారాలమీద ఆధారపడి వుంది కాబట్టి ఇవి హరప్పా నాగరిక జీవనంలో అతి ముఖ్యమైనవి. గిడ్డంగులకు దగ్గర్లో లోహకారుల కొలిములుండేవి. ఇక్కడే రాగి, కంచు, సీసం, తగరంతో వివిధ రకాల పనిముట్లు తయారయ్యేవి. కుండలు చేసేవాళ్ళు కూడా ఈ విభాగంలోనే కుమ్మరి చక్రం పెట్టుకునేవాళ్ళు. కర్మాగారాల్లో పనిచేసే కూలీలు దగ్గర్లో కట్టిన చిన్న చిన్న ఇళ్ళలో కాపురముండేవాళ్ళు.

మొహెంజొదారోలో కోట చుట్టూ ఒక పెద్ద ప్రాకారం ఉండేది. ప్రాకారం లోపల ఒక పెద్ద శిథిల భవనం కనిపించింది బహుశా ఇందులో అప్పటి ప్రభుత్వాధినేత ఉండి ఉండవచ్చు. హరప్పా ప్రజలకి ఒక రాజంటూ వుండేవాడో, లేదా పౌరసంఘం ఏదేనా పరిపాలన నిర్వహించేదో మనకంతగా తెలీదు. ఆనాడు అమల్లో ఉన్న రాజ్యాంగ యంత్రం లేదా ప్రభుత్వ స్వరూపం గురించి ఖచ్చితంగా చెప్పలేం. మొహెంజొదారో కోటలో ఆ ప్రజల నిర్మాణ దక్షతకి ప్రతీకగా కనిపించేది- బ్రహ్మాండమైన స్నానవాటిక ఇది ఈనాటి పెద్ద ఈత కొలనుని పోలి వుంది. దీని ప్రయోజనమేమిటో మనకింకా ఇదమిద్ధంగా తెలీదు.

ఇళ్లు . మొహెంజొదారోలో ఇళ్ళు కట్టకముందే పౌర నగర ప్రాంతాన్ని ఒక ప్లాను ప్రకారం నిర్మాణానికి అనువుగా తీర్చిదిద్దినట్లు కనిపిస్తుంది. ప్రధాన వీధులు ఉత్తర దక్షిణాలుగా ఉప వీధులు తూర్పు పడమరలుగా బారులు తీరినట్లు ఉంటాయి. విశాలమైన వీధులు — రాజవీధి దాదాపు పది మీటర్ల వెడల్పుంది. ఆధునిక నగరాలలోని ఏ విశాలమైన వీధితోనైనా ఇది పోటీ చేస్తుంది. ఇళ్ళు వీధికిరువైపులా నిర్మించబడ్డాయి.

అవి ఇటుకలతో కట్టిన ఇండ్లు - గోడలు మందంగా ఉన్నాయి. గోడలకు గిలాబా, రంగులు వగైరా హంగులన్నీ ఉన్నాయి. పైకప్పు చదునుగా ఉంది. కిటికీలు తక్కువ. చెక్కతో చేసిన తలుపులు చాలా ఉన్నాయి. వంట గదిలో పొయ్యి, ధాన్యం, నూనె పోసిపెట్టుకునే పెద్ద మట్టి జాడీలు ఉన్నాయి. వంట గదిని అనుకుని కుళ్ళు నీళ్ళు పోయే మట్టి గొట్టాలు ఉన్నాయి ఇంట్లో ఒక పక్కన పడక గదులు నిర్మించబడ్డాయి. ఇండ్ల నుంచి మురుగు నీరు మట్టిగొట్టాల ద్వారా వీధికి మధ్య భూగర్భంలో ఇటుకలతో కట్టిన మురుగు నీటి కాల్వలలోకి ప్రవహించే ఏర్పాటు ఉంది. ఈ కాల్వలను శుభ్రం చెయ్యటానికి అక్కడక్కడా మనిషి దూరే కన్నాలున్నాయి. కొన్ని మురుగు కాల్వల మీద రాతి పలకలు కప్పబడ్డాయి.

ప్రతి ఇంటికి పెరడు, పెరట్లో రొట్టెలు కాల్చుకోటానికి పొయ్యి ఉన్నాయి. వంటకాలలోకి కావలసిన మసాలా నూరుకునే రోలు, బండ ఉన్నాయి. బహుశా కుక్క, మేక వంటి పెంపుడు జంతువుల్ని దొడ్లోనే కట్టేసి ఉంచేవారు చిన్న ఇంటికి కూడా నుయ్యి ఉంది. అంటే ఏ ఇంటికీ నీళ్ళ కొరత లేదని స్పష్టమవుతూంది.

పౌరులందరూ అటువంటి సకల సౌకర్యాలుండే లోగిళ్ళలో నివసించలేదు. ధాన్యపు గిడ్డంగుల్లో,

బట్టీలలో పనిచేసే కూలీలు ఒంటి గది ఇళ్ళలోనే కాలక్షేపం చేశారు. బహుశా వాళ్ళు బీద స్థితిలో ఉండి వుండవచ్చు.

ప్రజల జీవితం : ప్రజల ప్రధాన ఆహారం బార్లీ, గోధుమలు. వాటిని పిండి దంచి రొట్టెలు కాల్చుకుని తినేవాళ్ళు. దానిమ్మ, అరటి పండ్లు అంటె వాళ్ళకి చాలా ఇష్టం. చేపలు, మాంసం కూడా భుజించే వాళ్ళు, లోథాల్‌లో మాత్రం క్రీ. పూ 1800లో ప్రజలు వరి బియ్యం వాడిన దాఖలాలు కన్పించాయి. పత్తి పండించిన తొట్ట తొలి ప్రజలు సింధు వాసులే. మొట్టమొదట ఇక్కడ పత్తి పండటం కారణంగా గ్రీకులు దీన్ని సిందన్ అనేవాళ్ళు. అంటే సింధునదీ ప్రాంతంలో పండింది కాబట్టి సిందన్ అని వాళ్ళు వ్యవహరించారు.

పత్తి నుంచీ నూలు వడకటం బట్టలు నేయటం సింధు ప్రజలకు తెలుసు. అనేక చోట్ల మట్టి కదుళ్ళు దొరికాయి కాబట్టి స్త్రీలు ఇళ్ళల్లో నూలు వడికి ఉండాలి. స్త్రీలు పొట్టి పరికిణీలు ధరించే వాళ్ళు. బొందుతో నడుముకు బిగించి కట్టుకునే వాళ్ళు. పురుషులు ధోవతిని లుంగీ మాదిరి చుట్టుకునే వాళ్ళు. దుస్తులకు ఉన్ని కూడా వాడారు. స్త్రీలకు కేశాలంకరణ తెలుసు. రక రకాలుగా సిగలు చుట్టుకుని, కొప్పులో దువ్వెన ముడుచుకునే వారు. స్త్రీలు, పురుషులు అనే తేడా లేకుండా ఉభయులకు ఆభరణాలంటే మోజు. పురుషులు శిరో పట్టాలను, స్త్రీలు కంకణాలు, కడియాలు, నెక్లెసుల్ని ధరించారు. భాగ్యవంతులు బంగారం. వెండితో చేసిన ఆభరణాల్ని పేదలు పూసలు, గుల్లల్తో తయారు చేసిస వాటిని అలంకరించుకునే వాళ్ళు.

హరప్పా ప్రజల వినోద వ్యాసంగాలకు సంబంధించిన చంద్ర శిలలు, బంతులు, చదరంగపు పాచికలు, ఆట వస్తువులు వగైరాలు తవ్వకాలలో దొరికాయి. పిల్లలు ఆడుకునే మట్టితో చేసిన బొమ్మ బళ్ళు దొరికాయి. అవి ఆనాడు ప్రజలు తమ ప్రయాణాలకు వాడిన ఎద్దు బళ్ళకు నమూనాలు. అనేక భంగిమల్లో దారం కట్టి ఆడించే మృగాల బొమ్మలు కూడా దొరికాయి. కరకర చప్పుడు చేసే గిలకలు, పక్షుల ఆకారంలో ఈలలు కూడా దొరికాయి. ఆడపిల్లలకు వేరుగా బొమ్మలు, ఆట వస్తువులు ఉండేవి పెద్దవాళ్ళు జూదం, నృత్యం, వేట, కోడి పందేలలో పొద్దు బుచ్చేవాళ్ళు.

ఉన్ని, నూలు దారం వడకటం, బట్టలు నేయటంలో ప్రజలు తీరిక లేకుండా వుండే వాళ్ళు, అక్కడ తయారైన వస్త్రాలు పర్షియన్ సింధుశాఖ తీర పట్టణాలకి, సుమేరుకి రవాణా అయ్యేవి. కుండలు తయారుచేసే వాళ్ళకి ఊపిరాడని పని. మట్టి పాత్రలు రమణీయంగా తీర్చిదిద్దారు. కుండలు, పాత్రల తయారీకి ఎర్రమట్టి వాడారు. ఎర్రటి పాత్రలపైన నల్లటి రంగుతో రేఖలు, చుక్కలు, రేఖాచిత్రాలు, చెట్లు, ఆకులు, జంతువుల బొమ్మలు గీశారు.

పూసలు, రక్షరేకులు ఆ ప్రజలకు చాలా ఇష్టం. తవ్వకాలలో ఇవి చాలా విస్తారంగా దొరికాయి. పూసల్ని మట్టితో, శిలతో, గుజ్జుతో, గుల్లల్తో, దంతంతో తయారు చేశారు. కమ్మర్లు ఈటెలు, చాకులు, బాణపు మొనలు, గొడ్డళ్ళు, చేపల గాలాలు, క్షురికలు మొదలైన పనిముట్లని ఆయుధాలని రాగితో, కంచుతో తయారు చేశారు. ఇళ్ళలో వాడుకునే పాత్రల్ని పల్చటి లోహపు రేకుతో తయారు చేశారు. అవి మట్టి పాత్రల నమూనాలో ఉన్నాయి. ఖరీదుని బట్టి, బహుశా సంపన్నుల ఇళ్ళకే అవి పరిమితమై వుండవచ్చు

హరప్పా, మొహెంజొదారో శిథిలాలలో విశేషంగా దొరికిన మరొక వస్తువు - ముద్రికలు. ఇవి మట్టితోను, రాతితోను చేయబడ్డ దీర్ఘ చతురస్రాకార ముద్రికలు. ఈ ముద్రికలకు ఒక వైపున ఎద్దు, చెట్టు బొమ్మగానీ, ఏదో ఒక దృశ్య చిత్రణగానీ కనిపించాయి బొమ్మపైన హరప్పా ప్రజలు వాడిన లిపికి సంబంధించిన చిత్ర సంజ్ఞలు కనిపించాయి. వర్తకులు తమ సరుకుల మీద ముద్ర వేయటానికి వీటిని ఉపయోగించి వుండవచ్చు.



హరప్పా ప్రజలుపయోగించిన వృషభ ముద్రిక- దీనిపైనున్న లిపిని కనుగొనలేకపోయారు.

*వర్తక వాణిజ్యాలు:* ఈ నాగరికతా కాలంలో హరప్పాకు సుమేరియాతో, పర్షియన్ సింధుశాఖ తీరపట్టణాలతో సంబంధాలుండేవి. ఆ ప్రజలు పరస్పరం వ్యాపార సంబంధాలు నెలకొల్పుకున్నారు మొహెంజొదారాలో తయారైన ముద్రికలు, చేతి పనులు బాబిలోనియాలో దొరికాయి. సింధునగరాల్లో తయారైన వస్తువులు లోథాల్ రేవు ద్వారా సముద్ర మార్గాన ఆ దేశాలకు నౌకల్లో రవాణా అయ్యేవి. (లోథాల్‌లో జరిపిన తవ్వకాల్లో ఓడరేవు బైటపడింది). అట్లాగే విదేశాలనుంచి దిగుమతయిన సరుకు లోథాల్ రేవులో దించుకునే వాళ్ళు. వ్యాపార వాణిజ్యాలలో కొలతలు, తూనికలు చాలా ముఖ్యమైన పాత్ర నిర్వహించినట్లు అక్కడ దొరికిన త్రాసులు, తూకపు రాళ్ళవల్ల స్పష్టమవుతుంది. అవి చాలా నిర్దుష్టంగా ఉన్నాయి.



మొహెంజొదారాలో దొరికిన మూడు తలలుగల పశుపతి దేవుని ముద్రిక.

*మతం.* ఈజిప్టు, సుమేరియా ప్రజల మాదిరిగా హరప్పా ప్రజలు తమ ప్రభుత్వ వ్యవస్థని, సంఘనిర్మాణాన్ని, మత విశ్వాసాల్ని వెల్లడించే శాసనాలు మొదలైన ఆధారాలను మిగిల్చిపోలేదు. వాళ్ళది ఫలానా మతమై ఉండవచ్చని మనం ఊహాగానం మాత్రమే చెయ్య



తొట్టతొలిగా మొహెంజొదారాలో దొరికిన గడ్డపు మనిషి ప్రతిమ- బహుశా ఇది ఆ నాటి మత గురువుదై వుండవచ్చునని అంచనా.

గలం. 'అమ్మతల్లి' బొమ్మలు దొరటాన్ని బట్టి ఆ ప్రజలు దేవీ ప్రతిమని కొలిచి వుండవచ్చు. ఒక పురుష దేవ పద్మాసనం వేసుకుని కూర్చున్నట్టు, చిత్రితమైన ఒక రాతి ముద్రిక కూడ దొరకింది. రావిచెట్టులాంటి కొన్ని చెట్లని వాళ్ళు పవిత్రమైనవిగా భావించినట్లి కనబడుతుంది. ఎంచేతనంటే అనేక ముద్రికలమీద రావిచెట్టు బొమ్మ కనిపించింది. నందిని వాళ్ళు పవిత్రంగా భావించినట్లు తోస్తుంది హరప్పా ప్రజల్లో కొందరు తమ మృతుల్ని భూస్థాపితం (పాతిపెట్టటం) చేశారు. కొందరు చనిపోయిన వారి అస్థికల్ని మాత్రమే పూడ్చిపెట్టారు. సమాధులలో దొరికిన గృహోపకరణాలు, ఆభరణాలు, అద్దాలు వగైరాల్ని బట్టి హరప్పా ప్రజలు పరలోక జీవితం ఉంటుందని విశ్వసించి ఉండాలి. చనిపోయిన మనిషితో పాటు పూడ్చిపెట్టబడ్డ వస్తువులన్నీ బ్రతికివున్నప్పుడు అతనివే అయి వుండవచ్చు బహుశా పరలోకంలో ఆ వస్తువుల్తో అతనికి అవసరం ఉండివుంటుందని వాళ్ళు భావించి వుంటారు

హరప్పా విధ్వంసం : హరప్పా సంస్కృతి షుమారు వెయ్యేళ్ళు వర్ధిల్లింది. క్రీ. పూ. 1500 ప్రాంతంలో ఆర్యులు భారతదేశంలో అడుగు పెట్టటం ప్రారంభమైన కాలంలో హరప్పా సంస్కృతి విధ్వంసమై పోయింది. ఆనవాయితీగా వచ్చే సింధునది వరదల్లో కొట్టుకపోయి వుండవచ్చు, లేదా భయంకరమైన అంటువ్యాధులు ప్రబలి జనం నశించిపోయి వుండవచ్చు; పైగా వాతావరణం సమూలంగా మారిపోవటం కూడా మొదలైంది. పచ్చపచ్చగా కళకళలాడిన భూమి నిష్పచ్చరమైన ఎడారి పర్రగా మారిపోయింది. ఇవేవీ కాక, సింధు నగరాలన్నీ శత్రువుల దండయాత్రలకి గురై స్వీయ రక్షణ చేసుకోలేక నశించిపోయి వుండవచ్చు.

ఏది ఏమైనా, హరప్పా సంస్కృతీ విధ్వంసం భారతదేశ చరిత్రలో ఒక విషాదకర సంఘటన. హరప్పా నాగరికత తరువాత వచ్చిన ఆర్యులకు పట్టణ జీవితమంటే యేమిటో బొత్తిగా తెలీదు. అంచేతనే భారతదేశం తన సుందర నగరాల్ని గురించి మళ్ళీ ఘనంగా చెప్పుకోటానికి ఆర్యుల రాక తరువాత మరో వెయ్యేళ్ళు పట్టింది.

# 3
# వైదిక యుగంలో గణ జీవితం

## ఆర్యుల స్థావరాలు

మొహెంజొదారో-హరప్పా శిథిలాలు బయల్పడేవరకు ఆర్యుల రాకతోటే భారతదేశ చరిత్ర ప్రారంభమైంది అనే దురభిప్రాయం ఉండేది. వైదిక యుగం కన్నా సింధునాగరికత చాలా ప్రాచీనమైనదని తరువాత తెలుసుకున్నాం. ఆర్యులు భారతదేశం బయటనుంచి వచ్చారు. బహుశా ఈశాన్య ఇరాన్ ప్రాంతం నుంచి, కాస్పియన్ సముద్రానికి చుట్టూ వున్న ప్రాంతాలనుంచి (ప్రస్తుతం సోవియట్ రష్యాలోని ఆసియా రిపబ్లిక్కులు) వచ్చి వుంటారు. ఆర్యులు భారత దేశానికి, పశ్చిమాసియాలో పలు ప్రాంతాలకు, ఐరోపాకు వలస వెళ్ళారు భారతదేశానికి వలస వచ్చిన ఆర్యుల్ని భారతీయ ఆర్యులు అంటున్నాం.

ఆర్యులు మొట్టమొదట పంజాబులో స్థిరపడ్డారు. తరువాత క్రమేణా ఈశాన్యదిక్కుగా కదిలి ఢిల్లీకి ఉత్తరంగా ఉన్న ప్రాంతానికి పాకిపోయారు ఆనాడు సరస్వతి అనే నది ప్రవహిస్తూ ఉండేది.* ఆ నదికి ఇరువైపులా ఆర్యులు అల్లుకు పోయి చాలాయేళ్ళు నివాసం చేశారు. ఆ కాలంలోనే ఋగ్వేద** రచన సాగింది. అదే ప్రాంతంలో కురుక్షేత్ర మైదానం ఉన్నది. ఈ కురుక్షేత్ర మైదానంలోనే కౌరవ-పాండవులకు మహా సంగ్రామం జరిగిందని చెబుతారు. కొద్దికాలం తరువాత ఆర్యులు ఇంకా తూర్పుగా కదలి గంగాతీర మైదానాలకు పాకారు. ఆనాడే వాళ్ళు ఇనుప గొడ్డళ్ళను కొత్తగా కనిపెట్టారు. కొత్తగా కనిపెట్టిన, ఆ ఇనుప గొడ్డళ్ళతో అడ్డం వచ్చిన దట్టమైన అడవుల్ని ఛేదించి వేశారు. ఇనుముతో రక రకాల సాధనాలు ఆయుధాలు తయారు చేసుకున్న కాలం అది. ఆ ఇనుప పనిముట్లు అడవుల్ని కొట్టివేసి అపారమైన సాగు భూమిని వృద్ధిచేసుకోటానికి ఉపయోగపడ్డాయి.

ఆర్యులు పశువుల్ని మేపుకొనేందుకు పచ్చికబయళ్ళు వెతుక్కుంటూ వలస వచ్చారు. వాళ్ళు దిమ్మరులు. వాళ్ళ ఆస్తి అలమందలు. పశు పెంపకం వాళ్ళ బ్రతుకు తెరువు. క్రమంగా సంచార జీవితాన్ని

---

* సరస్వతి అనే నది ఇప్పుడు లేదు. అలహాబాద్ త్రివేణి సంగమంలో సరస్వతి అంతర్వాహిని అనే ఒక కథ. సింధు నదినే సరస్వతి అని ఆర్యులు వర్ణించినట్లు కొందరి చరిత్రకారుల భావన.

** దైవ స్తుతి కొరకు పఠించిన మంత్రాల సంకలనం ఋగ్వేదం.

వదలివేసి, ఆర్యులు జనపదాలు కట్టుకొని స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. వ్యవసాయాన్ని చేపట్టారు. ఇంతకు పూర్వం ఆర్యులు దేశ దిమ్మరులు కావటంచేత వాళ్ళకి నగర జీవితం అంటే యేమిటో తెలీదు. అంచేత వాళ్ళు నగర నిర్మాణానికి పూనుకొనేటప్పటికి కొన్ని శతాబ్దాల కాలం గడిచిపోయింది. కాబట్టి ఆర్యుల తొలి స్థావరాలు జనపదాలు

సింధు ప్రజల జీవన విధానాన్ని తెలుసుకోడానికి శిధిలాల త్రవ్వకాల మీద ఆధారపడ్డట్టుగా ఆర్యుల జీవన విధానం తెలుసుకోడానికి త్రవ్వకాల మీద ఆధారపడనక్కర్లేదు. ఆర్యులు కూర్చిన వేద మంత్రాల ద్వారా, కథలు-కావ్యాలు ద్వారా వాళ్ళని గురించి తెలుసుకోవచ్చు. ఆ వేద మంత్రాలు, కథలు, కావ్యాలు నోటి ద్వారా ఒక తరం నుంచి మరొక తరానికి ప్రసారమయ్యాయి. ఆ తరువాత చాలా కాలానికి గాని అవి గ్రంథస్థం కాలేదు. వీటినే మనం "వాఙ్మయాధారాలు" అంటున్నాం. ఆర్యుల చరిత్రకు ఇవి ఆధారాలు ఇటీవలి కాలంలో హస్తినాపురం, అత్రంజిఖేర (ఉత్తరప్రదేశ్ పడమటి ప్రాంతం) మొదలైన ప్రదేశాలలో జరిపిన త్రవ్వకాల్లో బయల్పడ్డ అవశేషాలు కొన్ని ఆర్యుల సంస్కృతికి సంబంధించి ఇంకా కొంత సమాచారాన్ని అందించాయి

ఆర్యులు ఆరాధించిన దేవతల్ని కీర్తిస్తూ మంత్రాలు పఠించబడ్డాయి. వాళ్ళ క్రతువుల్ని గురించి కర్మకాండ గురించి, పనిపాటుగురించి నియమనిర్మాణం జరిగింది. ఇవన్నీ రుగ్వేద, యజుర్వేద; సామవేద, అథర్వవేదాలతో సంకలితం అయ్యాయి. అంతేకాకుండా, వాళ్లు తమ రాజుల్ని గురించి, వీరుల్ని గురించి, వాళ్ళు చేసిన యుద్ధాలు గురించి, ఆ యుద్ధాల్లో వాళ్ళు ప్రదర్శించిన సాహసం గురించి, కవితలల్లారు. భారత పురాణ ఇతిహాసంలో ఈ ప్రసిద్ధ వీరగాథలే రామాయణ, మహా భారతాలుగా రూపొందాయి.

రాజు - రాజాధికార్లు. ఆర్యులు అనేక గణాలుగా చీలిపోయి ఉండేవాళ్ళు. ఒక్కొక్కగణం ఒక్కో నిర్దిష్ట ప్రాంతాన్ని ఆక్రమించుకుని ఉండేది. ఈ గణాలు తరచు పరస్పరం సంఘర్షించుకునేవి. వీటినే గణ యుద్ధాలు అంటారు. అపరిమితంగా ఉండే ఆవులు, ఎద్దులు, మేకలు వగైరా జంతువుల పోషణకి పచ్చిక బీళ్ళు కావాలి. ఈ పచ్చిక బీళ్ళ కోసం గణ యుద్ధాలు జరిగాయి. ప్రతిగణం ఒక నాయకుణ్ని ఎన్నుకునేది. ఆ నాయకుణ్ని "రాజన్" అనే వాళ్ళు. ఆ తరువాత గణ నాయకత్వం పారంపర్య రాజరికం అయింది. అంటే గణ నాయకుడుగా ఎన్నుకోబడ్డవాడు రాజయ్యాడు. రాజు కొడుకు రాజు పోయాక రాజయ్యాడు. రాజరికం వంశ పారంపర్యం అయింది. రాజు ముఖ్య ధర్మం తన గణ రక్షణ. ఈ రక్షణ బాధ్యతలో సహాయపడటానికి సాయుధ బలగం ఉండేది.

రాజు తన గణంలోని ప్రజల అభీష్టానికి అనుగుణంగా పరిపాలించేవాడు. సైనిక బలగాన్ని అదుపు చేసే "సేనాని", దైవ కార్యాల నిర్వహణలోను, మంత్రాంగంలోను రాజుకు సహాయపడే "పురోహితుడు" అనాడు ముఖ్య రాజోద్యోగులు. చుట్టు పక్కల గ్రామాల్లో నివసించే తన గణ సభ్యుల్తో సంప్రదింపులు నిర్వహించటానికి రాజు దూతల్ని నియమించుకున్నాడు. గ్రామణి అనబడే ఆయా గ్రామాల పెద్దల్ని రాజు సంప్రదించటం కద్దు. అత్యంత ప్రధానమైన విషయమేదైనా చర్చించవలసి వచ్చినప్పుడు రాజు తన సకల గణ సభ్యుల అభిప్రాయాన్ని స్వీకరించేవాడు. గణతంత్ర రాజ్యాల్లో ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబించే ఈ సంస్థల్ని సభ, సమితి అని వ్యవహరించే వాళ్ళు సభ కన్నా సమితి విస్తృతమైంది.

సమితిలో ఏ గణ సభ్యుడైనా స్వేచ్ఛగా తన అభిప్రాయాన్ని ప్రకటించే హక్కుండేది సభలో కొద్దిమంది ఎన్నుకోబడ్డ ప్రముఖులకు మాత్రమే ప్రాతినిధ్యం ఉండేది.

గ్రామం ఆర్య గణం చిన్న చిన్న విభాగాలుగా విడిపోయి నివసించే జనపదాలే గ్రామాలు. ఒక్కొక్క గ్రామంలో అనేక కుటుంబాలు నివాసం ఉండేవి. ఆదిమార్యులు సంచార జీవనాన్ని విరమించి వ్యవసాయాన్ని చేపట్టి ఒక చోట కుదురుకున్నాక గ్రామాలు పెరిగి పెద్దవయ్యాయి. గణంలోని జనంలో ఎక్కువ మంది ఒక్కొక్క గ్రామంలో స్థిరపడ్డారు. ఒక్కొక్క గ్రామ సముదాయాన్ని "విషన్" అని వ్యవహరించేవాళ్ళు గణంలోని సభ్యుల్ని జనం అన్నారు.

గ్రామం కొన్ని కుటుంబాల కూడలి. ఒక్కొక్క కుటుంబంలోని మనుషులందరూ సమిష్టిగా జీవించేవాళ్ళు. ఆర్య కుటుంబం పైతృక వ్యవస్థ మీద ఏర్పడింది. కుటుంబానికి తండ్రి పెద్ద. ఇంకా విపులంగా చెప్పాలంటే-కుటుంబంలో అందరి కన్నా వృద్ధుడైన పురుషుడు కుటుంబ పెద్ద. మనుమలు పుట్టాక సాధారణంగా కుటుంబంలో తాత (తండ్రి తండ్రి) పెద్దవాడై వుంటాడు. కాబట్టి తాత బ్రతికున్నంత వరకి ఆయనే కుటుంబ పెద్ద. ఇంట్లో పెత్తనం యావత్తు ఆయనది. కుటుంబంలో అందరికీ ఆయన మాట శిరోధార్యం. కొడుకులు పెళ్ళిళ్ళు చేసుకుని భార్యల్ని తెచ్చుకుని ఒకే ఉమ్మడి కుటుంబంలో ఉండిపోయేవారు గృహ యజమానురాలుగా స్త్రీకి మర్యాద, మన్నన ఉండేది. కొంత మంది ఆడపిల్లలకి మగపిల్లలతోపాటే విద్యా బుద్ధులు చెప్పించేవాళ్ళు.

ఆర్యులు జనపదాలలో స్థిరపడ్డ తరువాత గ్రామ జీవితంలోకి పొలాలు సాగు చేసేవాళ్ళే కాకుండా చేతివృత్తులు చేసేవాళ్లు కూడా కొత్తగా వచ్చి చేరిపోయారు కొన్ని కొన్ని గ్రామాలు కొన్ని కొన్ని నిర్దిష్ట వృత్తుల్లో ప్రత్యేకత సంతరించుకోడం ప్రారంభమైంది; ఉదాహరణకి - కుండలు తయారు చేయటానికి శ్రేష్టమైన మన్ను దొరికిన గ్రామాల్లో కుమ్మరులు విశేషంగా ఉండేవాళ్ళు. ఆ గ్రామ అవసరాలు పోను అదనంగా మిగిలిన మట్టి పాత్రల్ని పరిసర గ్రామాలకు సరఫరా చేసేవాళ్ళు. ఒక గ్రామం నుంచి మరొక గ్రామానికి అదనపు వస్తువుల్ని రవాణా చేయడం ద్వారా సరుకుల మారకంతో ప్రాథమిక వ్యాపార దశ మొదలయింది

ఇదంతా చాలా చిన్న ఎత్తున సాగిన జీవన సరళి. పల్లె పట్టుల్లో పూరి గుడిసెలు - పల్లెచుట్టూ కంచె - కంచెకి ఆవల సాగు భూములు. నేలని దున్ని బాగు చెయ్యటం, బావులు నుంచో, పిల్లకాలవల నుంచో నీరు పెట్టటం వాళ్ళకి తెలుసు. హరప్పా ప్రజల సేద్యపు పద్ధతికి ఇది భిన్నమైంది. బార్లీ విశేషంగా పండేది. రాను రాను గోధుమ, వరి సాగు ప్రారంభమైంది. వేట ఆర్యులకి ప్రాణం. ఏనుగుల్ని, ఎనుముల్ని, లేళ్లని, మగ పందుల్ని వేటాడేవాళ్ళు. ఎద్దుల్ని వ్యవసాయానికి ఉపయోగించేవాళ్ళు. జంతువుల్లో గోవుది అగ్రస్థానం. వాళ్ళకి పాలు, మాంసం ప్రసాదించేది ఆవు కాబట్టి దానికి పెద్ద పీట వేశారు. ప్రత్యేకమైన అతిథులు వచ్చిన సందర్భాల్లో ఆవు మాంసం వడ్డించటం గొప్ప సత్కారంగా భావించేవాళ్ళు. (ఆ తరువాత బ్రాహ్మణులకి గోమాంసం నిషేధమైంది).

మనిషి జీవితం విలువ వంద ఆవులకి సమానం. ఒక మనిషి వేరొక మనిషిని చంపినట్లయితే, చంపిన మనిషి హతుని కుటుంబానికి నూరు ఆవులు పరిహారంగా ఇచ్చుకోవాలి

ఆర్యులు - ఆర్యులగుర్రాలు . ఆర్యులకి గుర్రాలంటే ఎక్కడలేని ప్రీతి ఇరాన్ నుంచి భారతదేశానికి వలస వచ్చినప్పుడు గుర్రాలతో సహా ఇక్కడ దిగారు. రథాల్ని లాగటానికి గుర్రాల్ని ఉపయోగించేవాళ్ళు. రథాల పందెం ఆర్యుల అభిమాన వినోదం. రథాన్ని నిర్మించేవాడు సమాజంలో గౌరవనీయుడైన వ్యక్తి. వేద మంత్రాలలో రథ వర్ణన విశేషంగా కన్పిస్తుంది. రథమంటే ఈనాడు దేవుణ్ణి కూర్చోబెట్టి వందలాది భక్తులు మోకుల్తో లాగే భారీ శకటం కాదు. అదొక రెండు చక్రాల తేలిక బండి. పందేనికీ రథమే కావాలి. సమరాంగణంలో సమర్థవంతమైన శకటం

## ప్రజా జీవనం

ఆర్యులు - దస్యులు ఆర్యులు రాకకి పూర్వం నుంచి భారతదేశంలో నివసించిన ప్రజల్ని ఋగ్వేదం దాసులు లేదా దస్యులు అని వర్ణించింది. ఆర్యులు మొట్టమొదట ఈ దేశంలో ప్రవేశించినప్పుడు భూమి కోసం ఈ దస్యులతో పోరాడవలసి వచ్చింది. వీళ్ళు నల్లనివాళ్ళనీ, వీళ్ళవి పొట్టి ముక్కులనీ ఆర్యులు వర్ణించారు. ఆర్యులు ఆరాధించిన దేవతల్ని దస్యులు ఆరాధించలేదు. పైగా, దస్యులు మాట్లాడే భాష ఆర్యులకు అర్థం కాలేదు. ఆర్యులు సంస్కృతం మాట్లాడేవాళ్ళు. దస్యుల్ని ఓడించిన ఆర్యులు ఓడిపోయిన దస్యుల్ని దాసదాసీలుగా మార్చివేసి వాళ్ళ చేత అధ్వమైన ఊడిగం చేయించుకున్నారు. ఆర్యుడైన వాడెవడూ దస్యుల్ని పెళ్ళాడకూడదని కట్టడి చేశారు.

సమాజం ఒకే జనపదంలో ఆర్యులు, దస్యులు వేర్వేరు వాడల్లో విడివిడిగా నివసించే వాళ్ళు. మొట్టమొదట్లో పరస్పరం కలిసిమెలసి కూడా తిరగనివ్వలేదు. అయితే ఆర్యులు కూడా మూడు తరగతులుగా చీలిపోయారు. రాజు, అతని యోధ పరివారం అత్యంత శక్తివంతమైన వర్గం. వీరినే క్షత్రియులన్నారు. క్షత్రియులతోపాటు సమాన ప్రాధాన్యత కలిగిన పురోహిత వర్గం బ్రాహ్మలు. వారి దిగువున వృత్తిపనులు, వ్యవసాయం చేసే వైశ్యులు. ఈ మూడు తరగతులు కాక నాలుగో తరగతి ఒకటి అదనంగా చేరింది. వీళ్ళు శూద్రులు. శూద్రులంటే దస్యులు, దస్యులతో పెళ్ళిళ్ళు, ఇతర సంబంధాలు చేసుకున్న ఆర్యులు. ఆర్యులు శూద్రుల్ని హీనంగా చూశారు. ఈ విధంగా ఆర్యసమాజం క్షత్రియ, బ్రాహ్మణ, వైశ్య, శూద్ర వర్గాలుగా చీలిపోయింది. సమాజంలో ఒక్కొక్క వర్గానికి వేర్వేరు వృత్తులు, వ్యాపకాలు ఏర్పడ్డాయి. మొట్టమొదట్లో ఎవరికిష్టమైన వృత్తిని వాళ్ళు ఎన్నుకునే స్వేచ్ఛ ఉండేది. రాను రాను, తండ్రుల అడుగుజాడల్లోనే కొడుకులు నడవటం ఆచారమైంది. మొదట్లో క్షత్రియులతోపాటు సమాన హోదా అనుభవించిన బ్రాహ్మణులు నెమ్మదిగా సమాజ శిఖరాగ్రంమీద తిష్టవేసి అందరిమీదా అగ్రవర్ణులయ్యారు. మతానికి అత్యధిక ప్రాముఖ్యాన్ని కట్టబెట్టటం ద్వారా బ్రాహ్మణులు ప్రథమస్థానాన్ని గుంజుకున్నారు.

**వృత్తులు :** గ్రామాల్లో వ్యవసాయం ఒక్కటే కాకుండా పశుగణాభివృద్ధి, చేపల పెంపకం, కమ్మరి పని, వడ్రంగం, తోళ్ళు శుద్ధిచెయ్యటం సర్వసాధారణ వృత్తులు. కమ్మరి పనివాళ్ళు కొత్తగా కనిపెట్టబడ్డ ఇనుముతో పనిముట్లు తయారుచేయాల్సి వచ్చింది. ఇనుము వాడకం ఆర్యుల జీవితాన్ని సునాయాసపర్చింది. ఇనుము చాలా కఠినమైన గట్టిలోహం కావటాన పనిముట్లు, ఆయుధాల తయారీకి రాగికన్నా, కంచుకన్నా ఎక్కువ అనుకూలంగా ఉంది. నూలుతో బట్టలు నేయటాన్ని ఎక్కువగా స్త్రీలే నిర్వహించారు. పురోహితులు మతపరమైన క్రతువులూ కర్మకాండలకి అంకితమైపోయారు. ప్రత్యేకంగా, యావత్తు సమాజం

పాల్గొంటూ అనేక దినాల పాటు సాగే సుదీర్ఘ యజ్ఞయాగాదుల్లో బ్రాహ్మణులు మునిగిపోయారు పురోహితులు గురువులు కూడా శిష్యులు గురువుల్తో పాటే ఉండేవాళ్ళు; గురువులు తమ శిష్యులకు మంత్రోచ్చారణ, వేదాధ్యయనం నేర్పేవాళ్ళు శిష్యుల వేదాధ్యయనం గురించి ఒక శ్లోకంలో చిత్రమైన వర్ణన ఉంది. గురువు గారు పాఠం చెప్పాక, శిష్యులు దాన్ని పదే పదే వల్లెవేయటం వింటే వర్షం రావటానికి ముందు కప్పలు బెక బెకలాడుతున్నట్టుగా వినిపిస్తుందట! ఈ పురోహితులు గురువులే కాదు భిషగ్వరులు (వైద్యులు) కూడా. మూలికలు, ఓషధులు గురించి వాళ్ళకి తెలుసు. ఎవరికైనా రోగం సంప్రాప్తిస్తే, రోగికి ఔషధసేవ చెయ్యటానికి పురోహితుణ్ని రావించేవారు.

దుస్తులు : వస్త్రధారణలో హరప్పా ప్రజలకు ఆర్యులకు మధ్య అట్టే తేడా లేదు. పైన ఉత్తరీయం కప్పుకునేవాళ్ళు కింద ధోవతి (అంతరీయం) ధరించేవాళ్ళు. చీలమండల దాకా జీరాడే పంచె, తలకి పాగా ధరించడం కూడా వాడుకలో ఉండేది. ఆర్యులకు ఆభరణాలంటే ప్రీతి బంగారంతోగానీ, తదితర లోహాలతో గాని తయారైన ఆభరణాలు అలంకరించుకునే వాళ్ళు. స్త్రీలు రక రకాల పూసల దండలు ధరించడానికి ఆసక్తి చూపారు సంపన్నులు బంగారు జరీ అంచు వసనాలు ధరించేవాళ్ళు.

వినోదాలు : రథాల పందెం ఆర్యుల అభిమాన క్రీడా వినోదం. నృత్య సంగీతాలతో వినోదించారు. సంగీతంలో గాత్ర, వాద్య సంగీతాలు రెండూ ఉండేవి. వేణువు, వీణ, మద్దెల వారి ముఖ్యవాద్యాలు. జూదం ఆర్యుల అభిమాన వినోద కాలక్షేపంగా దాఖలా కనుపిస్తుంది.

ఆహారం . ఆర్యుల ఆహారంలో పాలు, వెన్న, నెయ్యి ముఖ్యమైనవి. పళ్ళు, కూరగాయలు, పప్పులు, మాంసం పుష్టిగా భుజించేవాళ్ళు. మధువు తాగేవాళ్ళు; మత్తు కలిగించే సుర గ్రోలే వాళ్ళు; సుర యవధాన్యం నుంచి తయారైన మద్యం యజ్ఞాలు వగైరా నిర్వహించిన సందర్భాల్లో స్త్రీ, పురుష విచక్షణ లేకుండా అందరూ సోమ పానం (భంగు) చేసేవాళ్ళు. పుష్టిగా తిని, మస్తుగ తాగి శ్రమించి సుఖించిన జాతి ఆర్యులు. జీవితం మీద రక్తి, అనురక్తి ఉండడం చేత హుషారుగా ఉల్లాసంగా జీవించారు.

మతం : ఆర్యులు అనేక దేవతల్ని ఆరాధించారు. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, నేల, గాలి, నింగి, నదులు, తరువులు, పర్వతాలు ఇత్యాది ప్రకృతి శక్తులన్నీ ఆర్యుల ఆరాధ్య దేవతలు. జూపిటర్‌కు సమానమైన "ద్యౌస్" అనే ఆకాశ దేవుణ్ని కొలిచారు. ఈ ఆకాశదేవుని దేవేరి పృథ్వీ దేవత అగ్ని దేవుణ్ని, ఉషాదేవతని ఆరాధించారు ఇంద్రుడు, సూర్యుడు, వరుణుడు, యముడు ప్రధాన దైవాలలో కొందరు. ఇంద్రుడు ఆర్యులకు సమరాధి దేవత ఈ దేవుళ్ళు, దేవతలు మానవాకారం కలిగిన వాళ్లే అయినా వాళ్ళని ఆర్యులు మానవాతీతులుగా భావించి భయభక్తులు ప్రదర్శించారు. ఈ దైవతాల్ని వారు కరుణా మూర్తులుగా భావించారు కాని దేవతలకి ఆగ్రహం కలిగితే ప్రళయం సంభవిస్తుందని నమ్మేవారు. యజ్ఞం అనే బలిసమర్పణతో దేవతల్ని సంతృప్తిపరచేవాళ్ళు. ఇంద్రుడు ఆర్యుల అభిమానదేవుడు. ఎందుచేతనంటే ఇంద్రుడు రాక్షసుల్ని, ఆర్యుల శత్రువుల్ని సంహారం చేసే మహాశక్తి శాలి

పురోహితులు నిర్వహించే యజ్ఞాలతో దేవతలు అనుగ్రహిస్తారని ఆర్యుల విశ్వాసం. యజ్ఞాలలో గణమంతా పాల్గొనేది. యజ్ఞానికి గొప్ప హంగామా చేసేవాళ్ళు. సువిశాలమైన యజ్ఞశాలలు నిర్మించేవాళ్ళు, దానిమీద దేవతా మూర్తుల్ని రంగులలో చిత్రించేవాళ్ళు; పురోహితుల మంత్ర ధ్వానాల మధ్య జంతు బలులు

సాగేవి. యజ్ఞంలో పాలు, ధాన్యాలు, నెయ్యి, మాంసం, సోమరసం దేవతలకు నైవేద్యంగా నివేదన చేసే వాళ్ళు. పురోహితులకు ధాన్యం, గోవులు, బట్టలు దక్షిణగా ముట్టేవి. తరువాత సోమరస పానం చేసేవాళ్ళు. గణంలోని జనం ప్రార్థనల్ని పురోహితుడు దేవతలకు నివేదిస్తాడని, పురోహితుని నోటినుంచి వెలువడ్డ గణ విన్నపాల్ని దేవతలు ఆలకించి, తీరుస్తారని ఆర్యప్రజల విశ్వాసం. పురోహితుడు దేవతలకు-మనుషులకు మధ్య దూతగా, దేవుని ప్రతినిధిగా రూపొందాడు. అందుచేతనే పురోహిత వర్గం సహజంగా శక్తిసంపన్నమైంది.

యజ్ఞమే ప్రధానంగా తయారైన మతంతో సకలజనం సంతుష్టి చెందలేదు. జిజ్ఞాసువుల మనస్సుల్లో ఇతర ప్రశ్నలనేకం తలెత్తాయి. ఈ ప్రపంచం ఎలా సృష్టి అయ్యింది? దేవుళ్ళు ఎవరు? మనిషిని ఎవరు సృష్టించారు? వగైరా అనేక ప్రశ్నలు రేకెత్తాయి. వీరిలో కొందరు ప్రపంచాన్ని రోసి విరక్తితో అడవులకు పోయారు; తమలో తాము చర్చా సంవాదాలు జరుపుకుంటూ ఈ ప్రశ్నలకు సమాధానాల కోసం అన్వేషించారు. ఆ అధ్యాత్మిక చింతనని వారి శిష్యులు కంఠోపాఠం చేశారు రాయటానికి సౌకర్యాలు ఏర్పడ్డాక, వాటిని లిఖిత రూపంలో భద్రపర్చారు. సృష్టి సమస్యల్ని గురించి, జీవిత సమస్యల్ని గురించి, సాకల్యంగా చర్చించి ఆత్మ సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన ఉపనిషత్తులు ఆ కాలం నాటివే. వైదిక సాహిత్యంలో ఉపనిషత్తులు ఒక భాగం. వాటిల్లో కనిపించే ఆధ్యాత్మిక చింతనకు కారకులైన జ్ఞానుల్ని 'ఋషు' లంటున్నాం.

# 4
# గణరాజ్యాలు, రాజరికాలు

## క్రీ. పూ. 600 - 321

క్రీ. పూ. ఆరవ శతాబ్దం నాటికి నదీ మైదానాల్లో, హిమాలయ పర్వత పాద సీమలకు దిగువన అడవుల కొట్టివేతతో విశాలమైన సాగు భూములు విస్తరిల్లాయి ఒక్కొక్క ప్రత్యేక ప్రదేశంలో ఒక తెగ గానీ, కొన్ని తెగల సమూహం గానీ శాశ్వతంగా స్థిర నివాసం ఏర్పరచుకున్నాయి. తద్వారా వాళ్ళకి తాము ఫలానా ప్రాంతం వాళ్ళం లేదా తమది ఫలానా ప్రదేశం అనే వ్యక్తిత్వం ఏర్పడింది ఆ వ్యక్తిత్వ భావన ఆ ప్రదేశాన్ని లేదా ప్రాంతాన్ని అధీనం చేసుకోవటం అనే ఒక యదార్థ రూపం ధరించింది. ఆ విధంగా తెగలకు హక్కుభుక్తమైన ఆ ప్రదేశాలకు ఆయా తెగల పేర్లు స్థిరపడ్డాయి. తమకు అధీనమైన ఆ భూభాగాల్ని నిలుపుకొని, కాపాడుకొనటానికి వారికి ఒక రాజకీయ వ్యవస్థ అవసరమైంది. ఆ వ్యవస్థ గణ రాజ్యంగా, రాజరికంగా పరిణతి చెందింది.

రాజరిక ప్రభుత్వాలు ఎక్కువగా గంగా మైదానంలో కేంద్రీకృతమయ్యాయి. గణరాజ్యాలు వాటికి ఉత్తర దిశన చుట్టూ గీత గీసినట్టు బారు తీరాయి. ఉత్తర పరిధి అంటే - హిమాలయ పర్వత పాదసీమల్లో, వాటికి దక్షిణంగా ఉండే ప్రదేశాల్లో, వాయువ్య భారతదేశంలో, ఇంకా ఈనాడు పంజాబు అని మనం వ్యవహరించే ప్రాంతంలో గణతంత్ర రాజ్యాలు వర్ధిల్లాయి.

గణ రాజ్యాలు వైదికార్యుల తెగల నుంచి ఉద్భవించాయి. చాలా మట్టుకి తెగ సంప్రదాయాలు తరిగిపోకుండా మిగుల్చుకున్న తెగలివి. గణ రాజ్యాలలో శాక్యులు, కొలియనులు, మల్లులు వగైరా ఒకే గణవంశీయులైన వాళ్ళు ఉన్నారు. అనేక తెగలు గణ సమాఖ్యగా కలిసిన వజ్జీయనులు, యాదవులు మొదలైన వాళ్ళు ఉన్నారు. రాజులు ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించే రాజ్యాలలో కన్నా గణతంత్ర రాజ్యాలలోనే గణ సంప్రదాయాలు కొంత మేరకైనా చెక్కుచెదరకుండా నిలిచాయి. తెగ నుంచి గణ సంఘానికి మారిన పరివర్తన దశలో వారు తెగకి సారభూతమైన ప్రజాస్వామిక ఆదర్శాన్ని కోల్పోయారు. అయినా, తెగకి ప్రాతినిధ్యం వహించే గణసభ ద్వారా గణ వ్యవహారాలు నిర్వహించుకునే ప్రభుత్వ ఆదర్శాన్ని మాత్రం నిలుపుకున్నారు గణతంత్ర రాజ్యం అంటే గణసభ చేతగాని (గణ రాజ్యాలలో కుటుంబ పెద్దలతో కూడిన సభ), గణసభ ఎన్నుకున్న నాయకత్వం చేతగాని, లేదా సభ ఎన్నుకున్న అధినేత చేత

గాని పరిపాలింపబడ్డ ప్రభుత్వ వ్యవస్థ.

రాజులు ఏలిన రాజ్యాలలో గణ విధేయత బలహీనపడి వర్ణ విధేయత (కులం పట్ల విధేయత) అంకురించింది. విశాల భూభాగాల మీద రాజ్యాల రాజకీయాధికారం విస్తరణ చెందటం వల్ల గణాల సర్వ సభ్య సమితులు బలహీనపడ్డాయి. దూరాభారాలు ఎక్కువై తరచుగా సమావేశాలు కావటం తగ్గిపోయింది. తెగ వ్యవస్థ పరిమితమైన భౌగోళిక భూభాగం మీద ఆధారపడి వుండటం చేత, గణస్వామ్య ప్రభుత్వం సమర్థవంతంగా నడిచింది. వజ్జియ గణ సమాఖ్యలో లిచ్ఛవులు, విదేహులు, ఇక్ష్వాకులు, కౌరవులు మొదలైన ఏడెనిమిది గణ సంఘాలుండేవి. సమాన హోదా కలిగిన ఆ స్వతంత్ర గణ సంఘాలు ఒక గణ సమాఖ్యగా అవతరించినప్పటికీ, వాళ్ళ వ్యక్తిత్వం మాత్రం రూపుమాసి పోలేదు. కాని రాజరిక ప్రభుత్వ వ్యవస్థలో దైవాంశ సంభూతుడైన రాజు, శక్తివంతమైన పురోహిత వర్గం, వేద కర్మకాండ పెచ్చు మీరటంతో ఆ మ ఆర్య కాలం నాటి గణ సమాజ సర్వసభ్య సమావేశాల ప్రతిపత్తి నశించిపోయింది.

గణంలోని సభ్యులంతా ఐక్యంగా ఉండి, ఐక్యంగా వ్యవహారాలు చక్కదిద్దుకునే ఒక ప్రభుత్వ దృక్పథం ఈ గణతంత్ర రాజ్యాలకు ప్రధానమైన బలం. గణతంత్ర ప్రభుత్వ నిర్వహణకు ఒక పరిషత్తు ఉండేది గణ ప్రతినిధులు లేదా కుటుంబ పెద్దలు రాజధాని నగరంలోని సభా భవనంలో సమావేశమయ్యే వారు. పరిషత్తుకు ఎన్నికైన నాయకునికి "రాజు" బిరుదు ఒచ్చేవారు "రాజు" అని వ్యవహరించబడే ఆ నాయకుడు పరిషత్తుకు అధ్యక్షత వహించేవాడు. అయితే, ఈ పదవి వంశపారంపర్యమైనది కాదు. ఇతణ్ని రాజుగా కాకుండా నాయకునిగానే ప్రజలు పరిగణించేవాళ్ళు. చర్చనీయాంశాన్ని పరిషత్తు ముందు ఉంచేవాళ్లు ఏకగ్రీవ ఆమోదం పొందని సందర్భాల్లో, ఆ విషయంపైన సమ్మతి (ఓటింగు) తీసుకునే వాళ్ళు. ప్రభుత్వ నిర్వహణ ఉపనాయకుడు, భాండాగారికుడు (Treasurer), సేనాపతుల చేతుల్లో ఉండేది. నేరము-శిక్షకి సంబంధించిన వ్యవహారం మాత్రం కొంత క్లిష్టంగా ఉండేది. నేరస్థుడుగా అనుమానింపబడ్డవాడు ఏడుగురు అధికారుల చుట్టూ తిరగవలసి వచ్చేది. (మొట్ట మొదట "వినిశ్చయ మహామాత్ర" అనే అధికారి వద్దకు పంపబడేవాడు. ఒకడు నేరస్థుడు అవునో కాదో నిర్ణయించే అధికారి అతడు. నేరం చేసినట్లు ఋజువైతే నేరస్థుణ్ని వ్యావహారికుని వద్దకి, సూత్రధారుని వద్దకి, తరువాత అష్టకులిక, సేనాపతి, ఉపరాజులవద్దకి, చిట్ట చివరకి "రాజు" వద్దకి పంపించే వాళ్ళు. "రాజు" శిక్ష వేసేవాడు).

సామాజిక, రాజకీయాధికారం "రాజు"లు, పరిషత్తు ప్రతినిధుల చేతుల్లో ఉండేది. సాధారణంగా రాజులుగాని, పరిషత్తు ప్రతినిధులుగానీ క్షత్రియులై వుండేవాళ్ళు భూమి ఉమ్మడిగానో, తెగ నాయ కునిదిగానో ఉండేది. తెగ నాయకుడు కూలీల్ని పెట్టి భూమిని సాగుచేయించేవాడు నాయకులకి రాబడి ఆ భూమి నుంచే వచ్చే దనటంలో సందేహంలేదు

అయితే, భూమి ఒక్కటే ఆదాయాన్ని ఇచ్చే ఏకైక వనరుకాదు. ఆనాడు, ఉత్తర భారతదేశ ఆర్థిక జీవనంలో ఒక నూతన పరిస్థితి తలెత్తింది వర్తక, వాణిజ్య కేంద్రాలుగా పట్టణాలు పెరిగాయి. శ్రావస్తి, చంప, రాజగృహం, అయోధ్య, కౌశాంబి, కాశి మొదలైనవి గంగా మైదాన ఆర్థిక అభివృద్ధికి గణ నీయమైన కేంద్రాలు. వైశాలి, ఉజ్జయిని, తక్షశిల, బరుకచ్ఛం మొదలైన నగరాలు ఇంకా విస్తృతమైన ఆర్థిక ప్రభావం కలిగినవి. ఒకప్పుడు గ్రామాలుగా ఉన్న వాటి చుట్టూ పెరిగి పెద్దవైనవే ఈ నగరాలు.

కుమ్మరి, కమ్మరి పనుల్లోను, బట్టల నేతలోను ప్రత్యేక నైపుణ్యం సంపాదించి వ్యాపార కేంద్రాలుగా గ్రామాలు వికసించి పట్టణాలయ్యాయి.

గణతంత్ర రాజ్యాలు గురించి అందుబాటైన వర్ణనల్ని బట్టి ఈ పట్టణ కేంద్రాలు ఆనాటి ప్రజా జీవితంలో ప్రముఖ పాత్ర నిర్వహించాయి. భూస్వాములైన క్షత్రియులు పట్టణాల్లో జీవించారు. బహుశా చేతి వృత్తుల వారి నైపుణ్యాన్ని కార్యకలాపాల్ని వీళ్ళు ప్రోత్సహించి వుండవచ్చు. ఒక వృత్తిలో శిక్షణ కోసం వైశాలి నుంచి తక్షశిల దాకా కాలినడకన వెళ్ళి వచ్చిన ఒక యువకుని కథ ఆనాటి వ్రాతల్లో కని పిస్తుంది. ఎక్కడ వైశాలి! ఎక్కడ తక్షశిల! ఎంత సుదీర్ఘ, కష్టతర ప్రయాణం! చేతి వృత్తులకు ఎంతో ఆదరణ, ప్రోత్సాహం వుంటేనే తప్ప ఆ యువకుడు అన్ని కష్టాలు పడి వైశాలి నుంచి తక్షశిల దాకా నడిచిపోయి, తర్ఫీదు పొంది తిరిగి నడిచి వచ్చివుండడు! వడ్రంగి, కమ్మరి, కుమ్మరి మొదలైన వృత్తి పని వాళ్ళు శ్రేణులుగా సంఘటితమయ్యారు.

రాజరిక ప్రభుత్వాల కన్నా గణతంత్ర రాజ్యాలు వ్యక్తిగతమైన (వైయక్తిక) స్వతంత్రాభి ప్రాయాల పట్ల కొంత సహనం చూపేవి. సాంప్రదాయ విరుద్ధమైన దృక్పథాన్ని రాజరికాల మోస్తరుగా ఈ గణరాజ్యాలు అట్టే ప్రతిఘటించేవి కావు. వైదిక మతానికి వ్యతిరేకమైన జైన, బౌద్ధ మతాల్ని స్థాపిం చిన వర్ధమాన మహావీరుడు, గౌతమ బుద్ధుడు ఈ గణతంత్ర రాజ్యాలలో ఆవిర్భవించిన వాళ్లే. బుద్ధుడు శాక్య వంశస్థుడు; మహావీరుడు వైశాలికి చెందిన జ్ఞాత్రికుడు.

గణ రాజ్యాలు వర్ధిల్లిన భూభాగం గంగా మైదానమంత సాంప్రదాయక మూఢత్వంలో కూరుకు పోలేదు. పదే పదే దాడులకు గురవుతూ కూడా చెదురు మదురుగా వున్న గణతంత్ర రాజ్యాలు క్రీ. శ. 4వ శతాబ్దం దాకా బ్రతికి బట్టకట్టాయి ఈ రాజ్యాలలోనే బౌద్ధ ధర్మానికి విశేష ఆదరణ లభించింది. ఈ సీమలే విదేశాల నుంచి దండెత్తి వచ్చిన గ్రీకులు, శకులు, కుషాన్లు, హూణుల్ని అంతర్లీనం చేసుకున్నాయి.

ఈ రెండు వ్యవస్థలు పరస్పరం గిరిగీసుకుని కూర్చోలేదు. ఒక వ్యవస్థ మరొక వ్యవస్థలోకి గెంతిన సందర్భాలు లేకపోలేదు. ఉదాహరణకి కాంభోజ రాజ్యం రాజరిక వ్యవస్థనుంచి గణతంత్ర రాజ్యంగా మారిపోయింది. కాని, ఇటువంటి ఉదాహరణలు గంగా మైదానంలో అరుదు. ఎంచేతనంటే, అక్కడ రాజరిక వ్యవస్థ తిరుగులేని ఆదర్శం. వ్యావసాయిక ఆర్థిక వ్యవస్థ మీద ఇతోధికంగా ఆధారపడ్డంతో పాటుగా గణ సంస్కృతి క్షీణించి పోవటం ప్రభు సత్తాక రాజ్యాల పెంపుదలకి దోహదపడింది.

ఆనాటి సాహిత్యంలో అనేక రాజ్యాలు ప్రస్తావించబడ్డాయి. వాటిల్లో మొట్టమొదట కాశీ రాజ్యానికి గొప్ప ప్రాముఖ్యత ఉండేది. కాని, ఆ ఔన్నత్యం అట్టే కాలం నిలవలేదు. తరువాత కోసల, ఆ తరువాత మగధ గంగా మైదానం మీద ఆధిపత్యం కోసం పోటా పోటీలు పడ్డాయి. ఆ ఆధిపత్యం సాధిస్తే యుద్ధ తంత్రమైన ప్రయోజనాలే కాకుండా ఆర్థికపరమైన ప్రయోజనాలు కూడా కలుగుతాయి. గంగా నదీ లోయ వాణిజ్యంలో మూడొంతులు గంగా నది, దాని ఉపనదుల ద్వారానే జరిగేది. ఆ నదుల రేవు పట్టణాలు వాణిజ్య కూడలులుగా ఉండేవి. అంచేత నదుల మీద ఆధిపత్యం కోసం ఆ రాజ్యాల మధ్య పరస్పరం నిరంతర యుద్ధాలు జరిగాయి. చిట్ట చివరకి ఆ పోటీలో నాలుగు రాజ్యాలు మిగిలాయి: కాశీ, కోసల, మగధ, వజ్జియ గణ సమాఖ్య.

ఈ నాలుగు రాజ్యాల మధ్య దాదాపు నూరేళ్ళు యుద్ధం ప్రజ్వరిల్లింది. చిట్టచివరకి, మగధ విజయం సాధించి ఉత్తర భారతదేశానికి రాజకీయాధికార కేంద్రం అయింది. ఈ ప్రతిపత్తిని మగధ కొన్ని శతాబ్దాల పాటు నిలుపుకుంది.

## మగధ రాజులు - రాజ్యవిస్తరణ

*బింబిసారుడు :* బింబిసారుడు షుమారు క్రీ. పూ. 542 ప్రాంతంలో మగధ రాజయ్యాడు. మగధ ఔన్నత్యానికి పునాదులు వేసిన మొట్టమొదటి రాజు ఇతడు. మగధ రాజ్యాన్ని విస్తరింప జెయ్యాలనే దృఢసంకల్పం. రాజకీయ దూరదృష్టి కలిగిన బింబిసారుడు కోసల, వైశాలి, మద్ర, విదేహ రాజకన్యల్ని వివాహం చేసుకుని ప్రముఖరాజ్యాలతో వియ్యం, నెయ్యం పెంపొందించుకున్నాడు. కోసల రాకుమారి సాలీనా లక్ష సువర్ణాలు రాబడిగల కాశీ జనపదాన్ని కట్నంగా తెచ్చింది. మద్ర రాకుమారితో వివాహం మగధ రాజ్యం పశ్చిమంగా, ఉత్తరంగా విస్తరించటానికి తోడ్పడింది. తరువాత అంగరాజ్యాన్ని జయించాడు. అంగ రాజ్యంతో పాటు, గంగా-చంపా నదుల కూడలిలో ఉన్న చంపానగరం కైవసమైంది. నాటి భారత దేశంలోని ఆరు ప్రధాన నగరాలలో చంప ఒకటి గొప్ప వర్తక కేంద్రం. దక్షిణ భారతదేశం నుంచి సుగంధద్రవ్యాలు, వజ్ర వైఢూర్యాలు వేసుకుని వచ్చే నౌకలు మగధని సంపన్నం చేశాయి.

మగధ రాజ్యంలోని ఇనపరాయి నిక్షేపాలు కూడా ఆ రాజ్యం శక్తిసంపదలకి దోహదపడ్డాయి. (ప్రస్తుత ఛోటా నాగపూర్ ప్రాంతం) పనిముట్లు, ఆయుధాల తయారీకి ఇనుము అతి విలువైన లోహం. ఇనుముకుగల గిరాకీని బట్టి మగధ ప్రాధాన్యం ఇనుమడించింది.

బింబిసారుడు మగధ రాజ్యాన్ని సుమారు 52 సంవత్సరాలు సమర్థవంతంగా పరిపాలించాడు. సమర్థవంతమైన పరిపాలనా నిర్వహణని గుర్తించిన మొట్టమొదటి రాజు ఇతడు. రాజ్య కార్య నిర్వహణకి దక్షత కలిగిన అమాత్యుల్ని స్వయంగా ఎంపిక చేశాడు. వాళ్ళ సలహాని ఎన్నడూ త్రోసి పుచ్చేవాడు కాదు. కార్యనిర్వహణని బట్టి రాజోద్యోగుల్ని వివిధ తరగతులుగా విభజించాడు. రాజ్య కార్య నిర్వాహక వర్గానికి బింబిసారుని కాలంలోనే పునాదులు పడ్డాయి. గ్రామ పెద్దలకు రాజుతో స్వయంగా సమస్యలు మనవి చేసుకునే స్వేచ్ఛ ఉండేది తన ప్రజలు యేం కోరుతున్నారో తెలుసుకోవటానికి ఆయన గ్రామ పెద్దలకి ఆ స్వేచ్ఛ ప్రసాదించాడు అసమర్ధులుగా రుజువైన తన ఉద్యోగుల్ని ఆయన శిక్షించాడు. గ్రామాల్ని పట్టణాలతో కలుపుతూ రహదార్లు నిర్మింపజేశాడు నదులకు వంతెనలు కట్టించాడు. తన రాజ్యంలోని పరిస్థితుల్ని ప్రత్యక్షంగా పర్యవేక్షించేందుకు ఆయన స్వయంగా రాజ్యమంతటా పర్యటించాడు

సాధారణంగా సామాజిక, ఆర్థిక వ్యవస్థకి గ్రామం తొలిమెట్టు. గ్రామంలో సాగు భూమిని కొలవటానికి, పంటని అంచనా కట్టటానికి ఉద్యోగులు బింబిసారుని కాలంలో నియమించబడ్డారు. ప్రతి గ్రామం గ్రామ పెద్ద ఆధ్వర్యంలో ఉండేది. పన్నులు వసూలు చేసే బాధ్యత గ్రామ పెద్దది.

చుట్టూ కంచె కట్టిన గ్రామాల చుట్టూ పొలాలు, పచ్చిక బీళ్ళు . . వాటికి ఆవల నిరుపయోగమైన భూమి, అడవులు. అడవులు కొట్టివేసి, భూమిని సాగులోకి తేవాలంటే రాజు అనుమతి కావాలి. సూత్ర ప్రాయంగా రాజ్యంలో భూమి యావత్తు రాజుదే కాబట్టి, సాధారణంగా పండిన పంటలో ఆరవ వంతు రాజుకి పన్ను కింద చెల్లించ బడేది. భూమిని శూద్రులు సేద్యం చేసేవాళ్ళు. స్వంత కమతాలలో మాత్రం కూలీలు

పనిచేసే వాళ్ళు. అయితే, స్వంత ఆస్తి అప్పటికింకా విస్తృతి కాలేదు. రాజుకి, రాజ్యానికి మధ్య ఆనాడు తేడా స్పష్టంగా లేదు కాబట్టి రాజ్యంలోని యావత్తు భూమి పైన రాజు హక్కుని సవాలు చేసే వాళ్ళులేరు.

వ్యావసాయిక అభివృద్ధి హెచ్చుగా శూద్ర రైతుల మీద ఆధారపడి వుంది. అడవుల్ని నరికి భూమిని సాగులోకి తెచ్చిన వాళ్ళు శూద్రులే. అయితే వాళ్ళంతా భూమిలేని వ్యవసాయ కూలీలే కావటం చేత వాళ్ళకి హోదా ఉండేది కాదు. బింబిసారుని కాలంలోనే శూద్రులకన్నా హీనమైన వర్గం ఇంకొకటి గుర్తింపు కొచ్చింది. వాళ్ళు అంటరాని వాళ్ళు. వాళ్ళు ఆర్యుల అదుపులో వున్న ప్రాంతపు సరిహద్దులలోకి నెట్టివేయబడ్డ ఆదిమ తెగలవారు కావచ్చు. వాళ్ళింకా అప్పటికి దొరికిన కాయాకసరు తింటూ, వేట మీద బ్రతికే దశలోనే ఉన్నారు. వాళ్ళు మాట్లాడే భాష కూడా ఆర్యులు మాట్లాడే భాషకు భిన్నంగా ఉండేది. చాపలల్లటం, వేట ఆనాడు చాలా నీచవృత్తులుగా పరిగణింపబడ్డాయి.

అజాత శత్రువు : అజాత శత్రువు తన తండ్రి బిందుసారుణ్ణి చంపి సింహాసనం ఆక్రమించాడు. ఇతని పాలనలో మగధ రాజ్యం పూర్వం కన్నా ఇంకా ఎక్కువ విస్తరించింది. ఉత్తర భారతదేశంలో పర రాజులు తేరి పార చూడలేని అత్యంత శక్తివంతమైన రాజ్యంగా మగధ విజృంభించింది. అజాత శత్రువు క్రీ. పూ. 461 లో మరణించాడు.

అతని తరువాత వరసగా నలుగురు రాజులు మగధని పరిపాలించారు. బౌద్ధ సారస్వత ఆధారాల్ని బట్టి ఈ నలుగురూ తమ తండ్రుల్ని చంపి రాజ్యానికి వచ్చిన వాళ్ళే. ఈ నలుగురు రాజుల పరిపాలనతో విసిగి వేసారిపోయిన ప్రజలు తిరగబడి రాజ ప్రతినిధి అయిన శిశు నాగుణ్ని రాజుగా ప్రకటించారు. బింబిసారునితో ప్రారంభమైన హర్యంక వంశం అప్రతిష్ఠాకరంగా అంతం చెందింది.

రాజత్వం . రాజరికం వంశ పారంపర్యం అయింది. ఎక్కువగా క్షత్రియులే రాజులయ్యారు. రాజు దైవాంశ సంభూతుడనే సిద్ధాంతం నిలదొక్కుకుంది. దానికి ఎత్తాసుగా యజ్ఞయాగాలు, సుదీర్ఘ కర్మకాండ ప్రబలి పోయాయి. పట్టాభిషేక మహోత్సవం తరవాత అంటే రాజుకి రాజ్యాధికార ప్రదానం చట్టబద్ధంగా జరిగాక అతడు రాజ సూయ యాగం చేసేవాడు. పురోహిత వర్గం తమ మహిమతో దేవతల నుంచి దైవత్వం తెచ్చి రాజుకి ప్రసాదించే వాళ్ళు! పురోహితులు ఒక మహాశక్తివంతమైన వర్గంగా రూపొందారు. పురోహితులు లేకుండా రాజుకు ఒక్క రోజు గడవని పరిస్థితి యేర్పడింది రాజ్య కార్య నిర్వహణకి సలహాలివ్వటానికి పురోహితులు కావలసి వచ్చారు; యజ్ఞ యాగాదులు నిర్వహించటానికి వాళ్ళే కావలసి వచ్చారు.

అశ్వమేధ యాగం ఆనాడు విఖ్యాతి చెందింది. బలవంతుడైన రాజు ఒక ప్రత్యేకమైన ఉత్తమాశ్వాన్ని దేశం మీదికి వదిలేవాడు. ఆ గుర్రం తిరిగి వచ్చిన మేర భూభాగమంతా ఆ రాజుదే. ఈ యాగం చాలా పెద్ద ఎత్తున జరిగేది. వందలాది బ్రాహ్మణ పురోహితులు పాల్గొనేవారు. వందల పశువుల మందలు తోలుకు రాబడేవి. ఆ యజ్ఞంలో ఉపయోగించే వస్తువులు ఇన్ని అని చెప్పనలవికాదు.

ప్రజలు తరతరాలుగా ఆ సంబరం గురించి చెప్పుకునే వాళ్ళు. ఈ ఆర్భాటమంతా పరిశీలనా దృష్టి కలిగిన మనుషుల్ని పక్కదోవ పట్టించటానికి మాత్రమే కాకుండా రాజుని దైవత్వం పంచుకున్న

కాదు. పురోహితుడు భూసురుడయ్యాడు. ఆ విధంగా రాజులు, పురోహితులు చేయీ చేయి కలిపి రాజ్య చక్రం నడిపించారు.

షట్టాల్ని నిర్మించిన వాళ్ళు ఉన్నత వర్గాల వారి జీవితానికి కొన్ని మార్గదర్శక నియమాలు సృష్టించారు. ఈ నియమావళి ప్రకారం జీవితాన్ని నాలుగు దశలుగా లేదా ఆశ్రమాలుగా విభజించారు: 1. బ్రహ్మచర్యం - విద్యాభ్యాసానికి అంకితమైన దశ; 2. గృహస్థాశ్రమం - పెళ్ళి చేసుకుని, గృహస్థుడై సంతానాన్ని కని పెంచి పోషించే దశ; 3. వానప్రస్థం - అడవులకు పోయి ధ్యాన నిమగ్నుడుగా గడిపే కాలం; 4. సన్యాసం - ఐహిక బంధాలన్నీ తెంపుకుని విరాగియై బోధచేసే చివరిదశ. అయితే ఈ ఆదర్శాన్ని ఎందరు పాటించారో తెలీదు.

## కొత్త మతాలు

జైనం, బౌద్ధం : మారుతున్న సామాజిక, ఆర్థిక జీవనంలో నగరాల పెరుగుదల, వృత్తి పనివారి విస్తరణ, వ్యాపార వాణిజ్యాల త్వరిత వికాసంలాంటి మార్పులు, పరిణామాలు వేరొక రంగంలోని మార్పులతో సన్నిహితంగా పెనవేసుకుని ఉన్నాయి. అదే మత, తాత్విక రంగం. పాతుకుపోయిన సంప్రదాయవాదానికి - పట్టణాల్లో కొత్తగా తలెత్తిన వర్గాల ఆకాంక్షలకి మధ్య పుట్టిన వైరుధ్యం మత, తాత్విక రంగంలో పరిణామ క్రమాన్ని త్వరితం చేసింది. రాబోయే శతాబ్దాలు కూడా అధిగమించలేనంతటి మహత్తర భావ వికాసం క్రీ. పూ ఆరవ శతాబ్దంలో ప్రారంభమైంది.

అజీవకులు, చార్వాకులు మొదలైన అనేక నాస్తిక జిజ్ఞాసువులు బయలుదేరారు. చార్వాకులు పూర్తి భౌతికవాదులు. మట్టిలోంచి పుట్టిన మనిషి తిరిగి మట్టిలోనే పూడిపోతాడు. ప్రాణం, పంచభూతాలు నశించటంతో పాటు చైతన్యం కూడా నశిస్తుంది అని వీరు వాదించారు. అర్థం లేని కర్మకాండనంతా వీళ్ళు నిరసించారు. పురోహితులు తమ బ్రతుకు తెరువు కోసం ఈ కర్మ కాండని కాపాడుకొస్తున్నారని వీళ్ళు చాటారు.

చివరకి అజీవకులు, చార్వాకులు ఎవ్వరూ నిలవలేదు. జైన, బౌద్ధ మతాలే ప్రజల ఆదరణ పొందాయి.

జైనమతం : జైన మతం క్రీ. పూ. ఏడవ శతాబ్దంలోనే ప్రచారంలో ఉంది. జైనమత సిద్ధాంతాల్ని క్రోడీకరించి వాటికి నిర్దుష్టమైన రూపం ఇచ్చినవాడు వర్ధమాన మహావీరుడు. ఇతడు వైశాలిలో జన్మించాడు. 30 ఏళ్ళు నిండకుండానే ఇల్లు విడిచి వర్ధమానుడు దిగంబరుడై 12 సంవత్సరాలు కఠోరమైన తపస్సు చేసి జినత్వం పొందాడు. జినత్వం అంటే జ్ఞానోదయం,

మహావీరుని బోధలు : వైదిక కర్మల్ని చెయ్యటం వల్ల, దేవుణ్ని వేడుకోవటం వల్ల మనిషికి ఉపయోగం లేదు. చెడు చెయ్యకుండా మంచి జీవితాన్ని గడపటమే మోక్షమార్గం అన్నాడు మహావీరుడు.

జైన మతం ప్రకారం ఆత్మ ప్రాణులకే కాదు, జీవకోటిలోని ప్రతివస్తువులోనూ ఉంది జైన సిద్ధాంతానికి దేవునితో నిమిత్తం లేదు సమ్యక్ దర్శనము, సమ్యక్ జ్ఞానము, సమ్యక్ చరిత్ర మోక్ష మార్గాలు. వీటి ద్వారానే జీవి మోక్షం పొందుతాడు. మోక్షమంటే దుఃఖం అనేదిలేని అనంత సౌఖ్యం. అచేతనాలు కూడా జీవాలనే విశ్వాసం వల్ల జైనులు అహింసని చాలా కఠినంగా పాటించాలి ఉత్తమ జీవితా

గడిపిన మానవుని ఆత్మ కర్మ నుంచి బైట పడి పునర్జన్మ పొందదు.

ఈ జైన మత ధర్మం సామాన్య ప్రజలు మాట్లాడే భాషలో బోధించబడింది. ఇది వ్యాపారవర్గాలలో విశేషంగా వ్యాప్తిచెందింది. కఠోరమైన అహింసా దీక్ష కారణంగా వ్యవసాయ కుటుంబాల్లో ఈ మతం చోటు చేసుకోలేకపోయింది. పంటలకు పురుగు పడితే వ్యవసాయం చేసేవాళ్ళు అహింసా ధర్మం పాటించలేరు కాబట్టి నేలని నమ్ముకున్న వాళ్ళు జైనం జోలికి పోలేదు అట్లాగే వృత్తి పనుల వాళ్ళు కూడా జైనానికి దూరంగా ఉండి పోయారు. జైన మతంలో పొదుపుకు గల ప్రోత్సాహం వల్ల అయితేనేం, స్వంత ఆస్తి మీద పరిమితి అనేది స్థిరాస్థి అయిన భూమికి మాత్రమే పరిమితం కావడం చేతనైతేనేం జైనం వ్యాపార వర్గాల్ని ఆకర్షించింది. పశ్చిమ తీరంలో నౌకా వాణిజ్యం చేసి దండిగా గడించిన జైనులు వడ్డీ వ్యాపారస్థులుగా కూడా తయారయ్యారు. (వస్తు మార్పిడి విధానం అంతరించి సరుకుల మారకపు విలువగా డబ్బు అవతరించింది)

బౌద్ధం · సమకాలీనులైన మహావీరుడు, గౌతమ బుద్ధుల్లో బుద్ధుడే ఎక్కువ ప్రసిద్ధుడయ్యాడు. ఆయన స్థాపించిన బౌద్ధ మతం ఆసియా ఖండమంతటా పాకింది.



ఒరిస్సాలో దొరికిన మొట్టమొదటి చిట్టచివరి జైన తీర్థంకరులు - వృషభనాధుడు, మహావీరుడు.

గౌతమ బుద్ధుడు శాక్య రాజవంశంలో షుమారు క్రీ. పూ 566 ప్రాంతంలో జన్మించాడు. రాజకుమారులందరిలాగే క్షత్రియోచితమైన విద్యలు నేర్చుకున్నాడు. యుక్త వయస్సులో పెళ్ళి చేసుకుని కొద్ది కాలం సంసార సౌఖ్యం అనుభవించాడు. కాని సంపద, సంసార సౌఖ్యం ఆయనకి సంతృప్తి ఇవ్వలేక పోయాయి. ప్రపంచంలో కనిపించే దుఃఖం ఆయన మనస్సుని కలవరపెట్టింది ఈ దుఃఖానికి కారణం, పరిష్కారం వెతకటానికి ఆయన భార్యని, బిడ్డని, రాజ్యాన్ని విడిచిపెట్టి సన్యసించాడు. కొన్నాళ్ళ పాటు సాంఖ్య దర్శనాలు అభ్యసించాడు. మరి కొన్నాళ్ళు యోగాభ్యాసం చేశాడు. చివరకి గయలో ఒకచోట రావి

చెట్టు కింద కూర్చుని నలభై తొమ్మిది రోజులు ధ్యానంలో నిమగ్నుడయ్యాడు. 49వ రోజున సిద్ధార్థునికి జ్ఞానోదయం అయింది. ప్రపంచంలో దుఃఖానికి కారణం కనుక్కున్నాడు. వెంటనే సారనాథలో మొట్ట మొదటి సారిగా అయిదుగురు శిష్యులకు బౌద్ధ ధర్మం బోధించాడు.

బుద్ధుడు బోధించిన జ్ఞానాన్ని "ధర్మచక్ర ప్రవర్తనం" అంటారు. "ఈ ప్రపంచం దుఃఖమయం; ఈ దుఃఖానికి కారణం ఉంది; ఆ కారణానికి పరిష్కారం ఉంది; ఆ పరిష్కారం అష్టాంగ మార్గం (ఎనిమిది నీతి సూత్రాలు)"—దీనినే చత్వారి లేదా నాలుగు ఆర్య సత్యాలు అంటారు.

బుద్ధుడు ప్రవచించిన సూత్రం కార్యకారణ వాదం. ప్రపంచంలోని ప్రతి సంఘటన ఏదో కారణం వల్ల జరుగుతుంది. అంటే కారణం లేకుండా ఏదీ జరగదు. కారణం కార్యాన్ని సృష్టిస్తుంది. ఈ కార్యం తిరిగి కారణమై మరొక కార్యాన్ని సృష్టిస్తుంది. కాబట్టి కార్యకారణ సంబంధం మీద ఆధారపడి ఈ ప్రపంచం నడుస్తుంది. దుఃఖంతో నిండిన ఈ ప్రపంచంలో తృష్ణ (కోరిక) దుఃఖానికి కారణం; పునర్జన్మకి కారణం. మనిషి కర్మఫలం అనుభవించాలి. మంచి పనుల ద్వారా అంటే ఎనిమిది నీతి సూత్రాల్ని పాటించటం ద్వారా జ్ఞానాన్ని పొందాలి. అప్పుడు పునర్జన్మకు కారణమైన అవిద్య నశిస్తుంది మనిషికి నిర్వాణం లభిస్తుంది. నిర్వాణం అంటే మరల పుట్టుకలేని అనంతము, అమృతము అయిన మానసిక ప్రశాంత స్థితి.

ఈ ఉపదేశం ప్రజలకి తేలికగా బోధపడింది. ఇది ఆచరణ సాధ్యంగా కనపడింది. సామాన్య ప్రజలు నిత్య జీవితంలో మాట్లాడే మగధి భాషలో బుద్ధుడు తన ధర్మాన్ని బోధించాడు. పైగా, ఆయన వర్ణ విభజనని నిరాకరించాడు. వైదిక మతంలోని ఆస్తికతని నిరాకరించాడు. యజ్ఞ యాగాదుల్లో జరిగే జంతు బలుల్ని నిరసించాడు. ఆత్మ సంస్కారానికి ఆచరణ సాధ్యమైన అష్టాంగ మార్గాన్ని (సమ్యక్ వాక్కు, సమ్యక్ క్రియ, సమ్యక్ జీవనం, సమ్యక్ శ్రమ, సమ్యక్ ఆలోచన, సమ్యక్ ధ్యానం, సమ్యక్ నిశ్చయం, సమ్యక్ దృష్టి - సమ్యక్ అంటే మంచి) బోధించాడు

అంచేత బౌద్ధం సమాజంలోని దిగువ వర్గాల్ని బాగా ఆకర్షించింది. చేతి వృత్తుల వారు, వ్యాపారస్థులు, రైతులు, అంటరానివారు బౌద్ధాన్ని ఆదరించారు. సామాన్యులే కాకుండా రాజులు, మహారాజులు కూడా బౌద్ధాన్ని ఆదరించారు. రథసారథి చెన్నుడు, మంగలి ఉపాలి వంటి కింది తరగతుల వారే కాకుండా బింబిసార, ప్రసేన జిత్తులవంటి రాజులు, మహారాజులు; కోటికి పడగెత్తిన అనాథ పిండకుని వంటి ధనిక వైశ్యులు, పశ్చాత్తాపం పొందిన వేశ్యలు, గజదొంగలు కూడా బౌద్ధ మతం స్వీకరించారు.

బౌద్ధ మతం భారతీయ జీవనంలో ప్రతిద్వక్పధాన్ని ప్రభావితం చేసింది. బౌద్ధ విహారాలు ప్రముఖ విద్యాకేంద్రాలుగా రూపొందాయి బౌద్ధులు భారతీయ సంస్కృతిని మధ్యాసియా, టిబెట్, చైనా, ఆగ్నేయ ఆసియా మొదలైన ఇతర దేశాలకు, ప్రాంతాలకు తీసుకుపోయారు.

అశోక చక్రవర్తి కాలంలో బౌద్ధమతం పతాక స్థాయి చేరింది

*విదేశ దండయాత్రలు :* షుమారు క్రీ. పూ. 530 ప్రాంతంలో పర్షియన్ చక్రవర్తి సైరస్ హిందూకుష్ పర్వతాన్ని దాటి వాయువ్య భారతదేశంలో ప్రవేశించాడు. కాంభోజ, గాంధార మొదలైన రాజ్యాలు సైరస్‌కి కప్పం చెల్లించాయి. ఆ తరువాత అతని మనుమడు డైరస్ వాయువ్య భారతదేశంలో చాలా నగరాల్ని వశపర్చుకున్నాడు.



అఫ్ఘనిస్థాన్‌లో తఖ్త్-ఇ-బాహి అనే ప్రదేశంలో దొరికిన గౌతమ బుద్ధుని అపురూప ప్రతిమ. గాంధారంలోని భారతీయ శిల్పులు గ్రీకు శిల్పకళా సంప్రదాయంచేత ప్రభావితులయ్యారు. ఆ గాంధార శిల్పానికిది ప్రతీక.

ఈ దండయాత్రలవల్ల పర్షియన్ భావధోరణుల ప్రభావం భారతీయ జీవనంలో అనేకరంగాలమీద పడింది. పర్షియన్ నాణేలని భారతదేశం అనుకరించింది. పర్షియన్ లిపితో దగ్గర సంబంధం కలిగిన ఖరోష్టి లిపి వాయువ్య భారతదేశంలో వ్యాప్తి చెందింది. డైరస్ కాలంలో పర్షియాలోని శిలాశాసనాల సంప్రదాయమే అశోకుడు శిలాశాసనాలు వేయించటానికి ప్రేరణ కావచ్చు.

*గ్రీకు దండయాత్ర :* గ్రీసు దేశంలో మాసిడోనియా రాజు అలెగ్జాండరు పర్షియన్లని ఓడించి క్రీ. పూ. 327 లో వాయువ్య భారతదేశంలోకి చొచ్చుకు వచ్చారు. మొట్టమొదట తక్షశిలా రాజ్యం కైవసమైంది. తరువాత జీలం నది దాటి పురుషోత్తముని ఓడించారు. అంతా కలిసి అలెగ్జాండర్ దండయాత్ర రెండేళ్ళ పాటు సాగింది. అలెగ్జాండర్ తన ప్రతినిధుల్ని వాయువ్య భారతదేశంలో నియమించి తను స్వదేశం తిరిగి బయల్దేరాడు. మార్గంలో బాబిలోన్ పట్టణంలో మరణించాడు.

అలెగ్జాండర్ దండయాత్రలు భారతదేశంలో రాజకీయంగా గాని, సైనికంగా గాని పెద్దప్రభావమేమీ చూపలేదు. కాని, ఆయనతో పాటు వచ్చిన గ్రీకు పండితులు నాటి భారతదేశం గురించి విపుల సమాచారం మనకు అందించి పోయారు. భారతీయ విద్యావేత్తలు కొందరు అలెగ్జాండర్‌తోపాటు గ్రీసుదేశం వెళ్లారు. గ్రీకు-భారతీయ సంస్కృతుల మధ్య పొత్తు పెరిగింది. భారత-గ్రీకుదేశాల మధ్య రాకపోకలకు అనేక కొత్త మార్గాలు పడ్డాయి. అలెగ్జాండర్ వాయువ్య భారతంలో అనేక చిన్న చిన్న రాజ్యాల్ని కూలదోయడం వల్ల, అతని నిష్క్రమణతో ఆ ప్రాంతంలో ఒక రాజకీయ శూన్యం ఏర్పడింది.

# 5
# సామ్రాజ్య అవతరణ

## క్రీ. పూ. 321 - క్రీ. పూ. 185

*మౌర్యవంశం*. బింబిసారునితో ప్రారంభమైన హర్యంక వంశం క్రీ. పూ. 413 లో అంతరించింది. తరువాతి వచ్చిన శిశునాగవంశం షుమారు 50 ఏళ్ళు మాత్రమే మగధని పాలించి అంతఃపుర కుట్రల్లో ఆర్థంతరంగా అంతమైంది. మగధ సింహాసనాన్ని మహాపద్మనందుడు ఆక్రమించాడు మగధని పాలించిన మొట్టమొదటి క్షత్రియేతరులు నందరాజులు. క్రీ. పూ. 4 వ శతాబ్దం నుంచి మళ్ళీ వెయ్యేళ్ళు దాకా క్షత్రియులకు రాజ్యాధికారం ప్రాప్తించ లేదు. క్రీ.పూ. 321లో నందవంశం నాశనమైపోయింది. నంద వంశాన్ని నిర్మూలించి రాజ్యానికి వచ్చినవాడు చంద్రగుప్త మౌర్యుడు చరిత్ర రంగస్థలం మీద పాత్రలు విచిత్రంగా తారుమారయ్యాయి. క్షత్రియులు మత సంస్కర్తల పాత్ర ధరించారు. బ్రాహ్మణులు కొంధరు రాజు పాత్ర నిర్వహించారు.

*చంద్రగుప్తుడు*. చంద్రగుప్తుడు క్రీ. పూ 321 లో మగధ సింహాసన మెక్కాడు. అప్పు డతని వయస్సు 25 సంవత్సరాలు. అతడు రాజ్యానికి గావటానికి, సామ్రాజ్యాన్ని స్థాపించటానికి, సామ్రాజ్య సుస్థిరత కాపాడుకోటానికి వెయ్యి విధాల సహాయపడ్డ బ్రాహ్మణ గురువు చాణక్యుడు. ఆయనకే కౌటిల్యుడనే మరో పేరు.

చంద్రగుప్తుడు రాజ్యానికి రాగానే, యావత్తు పంజాబుని జయించాడు. అలెగ్జాండర్ నిలిపివెళ్ళిన గ్రీకు సేనాని సెల్యూకస్ నికటర్ ఆధీనంలో ఉన్న వాయువ్య భారత ప్రాంతన్ని క్రీ.పూ. 305 లో జయించాడు. ఈనాడు అఫ్ఘనిస్థాన్ అని మనం వ్యవహరించే వాయువ్య ప్రాంతం ఆనాడు మౌర్య సామ్రాజ్యంలో ఒక భాగం. చంద్రగుప్తుడు ఒక గ్రీకు కన్యని వివాహం చేసుకున్నట్లు ఆధారాలున్నప్పటికీ ఆ సంబంధం తాలూకు వివరాలు తెలీదు. తరువాత చంద్రగుప్తుడు నర్మదా నదికి ఉత్తరాన ఉన్న మధ్య భారత ప్రాంతాన్ని జయించాడు. అతని హయాములో మొత్తం ఉత్తర భారతదేశం ఏకచ్ఛత్రం కిందికి వచ్చింది.

చంద్రగుప్తుని రాజధాని పాటలీపుత్రం. సెల్యూకస్ రాయబారి మెగస్తనీసు పాటలీపుత్రంలో చాలా యేళ్ళు నివసించాడు. భారతదేశంలో విస్తృతంగా పర్యటించాడు. చంద్రగుప్తుడు తన అవసాన

దశలో జైన సన్యాసిగా మారిపోయి, దక్షిణా పథం తరలివెళ్ళి, సాంప్రదాయిక జైన పద్ధతిలో ఉపవాసాలతో శరీర త్యాగం చేశాడని జైన అనుశ్రుతి

బిందుసారుడు: చంద్రగుప్తుని కుమారుడు బిందుసారుడు క్రీ. పూ. 297 లో మౌర్య సామ్రాజ్యానికి వారసుడయ్యాడు. బిందుసారుని కాలంలో మౌర్య సామ్రాజ్యం మైసూరు దాకా వ్యాపించింది. ఒక్క కళింగ తప్ప దాదాపు యావద్భారతం మౌర్యచక్రవర్తి అధికార ఛత్రం కిందికి వచ్చేసింది. మౌర్యుల రథాలు తమిళ రాజ్యం గుండా తుఫాను ఘోషతో దూసుకుపోతోంటే, మౌర్యపరాకం సూర్యకాంతిలో ధగ ధగ లాడిందని తమిళ ఆది కవులు వర్ణించారు బిందుసారుడు క్రీ. పూ. 273 లో మరణించాడు

అశోకుడు: బిందుసారుని కుమారుడు అశోకుడు భారతదేశాన్ని పరిపాలించిన మహోత్తమ చక్రవర్తుల్లో అగ్రగణ్యుడు అతడు దేవానాం ప్రియుడు (దేవతలకు ప్రియమైన వాడు), ప్రియదర్శి (ఇంపైన రూపం కలవాడు)

తాత చంద్రగుప్తునికి, తండ్రి బిందుసారునికి అలవి కాకుండా స్వతంత్రంగా ఉన్న కళింగ రాజ్యాన్ని మౌర్యసామ్రాజ్యంలో కలుపుకోటానికి అశోకుడు క్రీ. పూ. 260 లో యుద్ధం చేశాడు. ఆ యుద్ధ విధ్వంసాన్ని అశోకుని మాటల్లోనే చెప్పాలంటే "లక్షా యాభై వేల మంది యుద్ధ ఖైదీలుగా పట్టుబడ్డారు; లక్షమంది హతులయ్యారు; దానికి అనేక రెట్లు యుద్ధ జ్వాలల్లో బుగ్గయిపోయారు." ఆ మారణ హోమం అశోకుని మనస్సు కలచివేసింది పశ్చాత్తాప పడిపోయి, తాను ఇక ముందెన్నడూ యుద్ధం చెయ్యనని దీక్ష పూనాడు. తరువాత అతడు పాలించిన 30 సంవత్సరాలలో యుద్ధ ధ్వానం మరి వినిపించలేదు.

అశోకుడు పట్టాభిషిక్తుడైన పన్నెండేళ్ళ తరువాత తన శాసనాలు చెక్కించటం ప్రారంభించాడు కొండ గుహల్లోను, శిలలపైన, శిలా స్తంభాల పైన చెక్కించిన ఆ శాసనాల్లో మతం, ప్రభుత్వం, పరస్పర సంబంధాలలో ప్రజల నడవడిక మొదలైన అనేక విషయాలపైన అశోకుని ఆలోచనలు, భావాలు కళ్ళకు కడతాయి ఆ శిలా శాసనాల్ని దేశంలోని అన్ని ప్రాంతాలకు పంపించి జన సమ్మర్దం ఎక్కువగా ఉండే తీర్థాలలో, క్షేత్రాలలో, మార్గాలలో నాటించాడు అతని ప్రజలకు తమ చక్రవర్తి ఆలోచనలు, ఆదర్శాలు యేమిటో తెలుసుకునే అవకాశం కలిగింది.

అశోకుని రుమ్మిండై శాసనము క్రీ. పూ. 3వ శతాబ్దము

1. దేవానపియేన పియదసిన లాజిన వీసతి వసాభిసితెన
2. అతన ఆగాచ మహీయితే హిద బుధే జాతె సక్యముని తి
3. సిలావిగడభీ కాలాపిత సిలాథభే చ ఉసపాపితే

రుమిందై శిలా శాసనంలో ఇలా ఉంది: శాక్య మౌని బుద్ధుడు జన్మించిన స్థలాన్ని దేవానం ప్రియుడు, ప్రియదర్శి అయిన చక్రవర్తి స్వయంగా సందర్శించి తన భక్తి ప్రపత్తులు ప్రకటించుకున్నాడు: ఒక శిలా ప్రాకారం నిర్మించి, శిలా స్తంభం నాటించాడు. బుద్ధ భగవానుడు లుంబిని గ్రామంలో పుట్టాడు గనుక, ఆ గ్రామాన్ని పన్ను నుండి మినహాయించాడు; పండిన పంటలో ఎనిమిదవ వంతు మాత్రమే చెల్లించేటట్లు నిర్ణయించాడు.

అశోక ధమ్మం: ధర్మానికి ప్రాకృత రూపం ధమ్మం. అశోకుడు ప్రజల కోసం శిలలపైన చెక్కించిన శాసనాల్లో అశోకుని ధమ్మ స్వరూపం గోచరిస్తుంది. ఆ శాసనాలు ప్రాకృత భాషలో పురాతన బ్రాహ్మి లిపిలో ఉన్నాయి. ఆనాడు ప్రాకృతం ప్రజల భాష; సంస్కృతం విద్యాధికుల భాష. అశోకుడు తన ఆలోచనల్ని, ఆదర్శాల్ని సామాన్య ప్రజలకు తెలియజెయ్యాలని కోరాడు కాబట్టి తన శాసనాలను ప్రజల భాష ప్రాకృతంలో చెక్కించాడు.

మత విశ్వాసాల వెలుగులో మంచి కర్మలు చేయడం ద్వారా కలిగే ధర్మనిష్ఠగా అశోకుడు ధమ్మాన్ని భావించ లేదు. ధమ్మం ఆయన దృష్టిలో ఒక సామాజిక బాధ్యతా దృక్పథం. గతంలో కొందరు చరిత్రకారులు ధమ్మాన్ని బౌద్ధ ధర్మానికి పర్యాయ పదంగా వ్యాఖ్యానించారు. ఆయన ఉద్దేశ్యం దానికి భిన్నంగా కనిపిస్తుంది. సామాజిక బాధ్యత, ఒక మనిషి వేరొక మనిషిపట్ల ప్రవర్తించవలసిన తీరు వికసించే ఒక మానసిక దృక్పథాన్ని సృష్టించడానికి ధమ్మం ఉద్దేశించబడింది. మానవుని హుందాతనాన్ని, సామాజిక కార్యకలాపాల్లో మానవతా దృక్పథాన్ని గుర్తింపజేయడానికి చేసిన విజ్ఞప్తి ధమ్మం.

ఈ 'ధమ్మ' వ్యాప్తికి ప్రేరేపించిన కారణాలేమిటి? అశోకుని అంతఃకరణలో పాలుపోసుకున్న వైఖరి కొంత, ఆనాడు తలెత్తిన సమస్యలకి పరిష్కార మార్గంగా మరికొంత ధమ్మ ప్రచారానికి కారణాలు మౌర్యులు వైదిక మతం మీద ప్రత్యక్షంగా దాడి చెయ్యకపోయినప్పటికీ, వైదిక సంప్రదాయ విరుద్ధమైన మతాల్ని సమాదరించారు. ఈ విభిన్న మతాలు, అసమ్మతి వాదం తాలూకు ప్రభావం సమాజం మీద పడింది; సమాజంలోని వివిధ వర్గాల మధ్య సంఘర్షణకు దారితీసింది. దీనికి తోడు, వేరే అనేక స్పర్థల్ని, ఉద్రేకాల్ని ప్రేరేపించిన సాంఘిక పరిస్థితులు కూడా ఉన్నాయి. వాణిజ్య వర్గాల అంతస్తు, పట్టణాల్లో వృత్తి పనివారి సంఘ బలం, విపరీతంగా కేంద్రీకృతమైన రాజకీయ వ్యవస్థ. సామ్రాజ్యం యొక్క అపరిమిత పరిమాణం మొదలైనవి సమాజ నిర్మాణంలో ఉద్రిక్తతలు సృష్టించాయి. మౌర్య సామ్రాజ్య విశాల ప్రజానీకానికి ఈ విభిన్న శక్తుల్ని ఎదుర్కొనే ఒక కేంద్ర బిందువు, ఒక ఉమ్మడి సంబంధం అవసరమైంది. విభిన్న విశ్వాసాలు కలిగిన ప్రజల్ని ఒక తాటి మీదికి తెచ్చి, వాళ్ళలో ఒక ఐక్యతా భావాన్ని కలిగించేదేదో కావలసి వచ్చింది. ఆ నాటి దేశ కాల పరిస్థితుల్లో అది చక్రవర్తి నుంచి రావాలి. ప్రజలందర్నీ ఒక తాటి మీదికి తెచ్చే సమైక్యతా సూత్రాల్ని పరిశీలించేప్పుడు అశోకుడు ప్రతి సమస్యకు సంబంధించిన మౌలిక అంశాల మీద దృష్టి కేంద్రీకరించాడు. ఈ అనుశీలన ఫలితంగా ధమ్మం వెలువడింది.

ధమ్మ సూత్రాలు ఏ మతానికి చెందిన మనిషికైనా అంగీకార యోగ్యమైనవి. నియమ నిబంధనల కట్టుతాళ్ళలో ఆయన ధమ్మాన్ని బిగించలేదు. ఆయన నొక్కి చెప్పిన ప్రాథమిక సూత్రం - సహనం ఆయన దృష్టిలో సహనం రెండు రకాలు: ప్రజలు పరస్పరం సహన భావంతో ప్రవర్తించటం, విభిన్న

ఖావాల్ని, విశ్వాసాల్ని పరస్పరం గౌరవించుకోవటం.

"బానిసలు, సేవకుల పట్ల శ్రద్ధ; తల్లి దండ్రుల పట్ల విధేయత; స్నేహితులు, పరిచయస్థులు, బంధువుల పట్ల ఔదార్యం; పురోహితులు భిక్షువుల పట్ల ఆదరణ" ఆయన కాంక్షించాడు.

"అనవసర, అప్రస్తుత సందర్భాల్లో ఎవరైనా తమ మతాన్ని ఆకాశానికి ఎత్తివేయకుండా ఇతర్ల మతాన్ని చులకన చెయ్యకుండా నాలుకని అదుపులో పెట్టుకోవటం అన్నిటి కన్నా అతి ముఖ్యమైంది. ప్రతి సందర్భంలోను అవతలి మనిషి మతాన్ని గౌరవించు అలా గౌరవించడం ద్వారా నీ మతం పలుకుబడిని పెంచుకోవచ్చు; అవతలి మనిషి మతానికి లాభిస్తుంది కాబట్టి, సామరస్యం ఉండాలి. అప్పుడు మనుషులు ఒకరి అభిప్రాయాల్ని ఒకరు ఆలకించవచ్చు "

వివిధ ప్రజల మధ్య, వర్గాల మధ్య, మతాల మధ్య సామరస్య సాధన కోసం ఆయన చేసిన విజ్ఞప్తి – ధమ్మం.

కాని, అశోక ధమ్మం విజయవంతం కాలేదు. అది ఏ సమస్యలకు పరిష్కార మార్గంగా రూపొందించబడిందో, ఆ సమస్యలకి పరిష్కారం చూపడంలో అది విఫలమైంది సామాజిక ఉద్రిక్తతలు సడలిపోలేదు. భిన్న మతాలు, సంప్రదాయాల మధ్య సంఘర్షణలు కొనసాగాయి. ఒక విధంగా, అశోకుని ధమ్మం చాలా అస్పష్టమైన పరిష్కార మార్గం. ఎందుకంటే, ధమ్మం పరిష్కరించ పూనుకున్న సమస్యలు వ్యవస్థ తల్లి వేళ్ళలోనే ఉన్నాయి. ఏమైనప్పటికీ, ఆనాటి పరిస్థితుల్లో ఒక మార్గదర్శక సూత్రం యొక్క అవసరాన్ని గుర్తించి, దాన్ని ప్రసాదించినందుకు అశోక చక్రవర్తికి నివాళులర్పించాలి.

అశోకుడు 37 సంవత్సరాలు పరిపాలించి క్రీ. పూ. 232లో మరణించాడు.

ధమ్మంలో మరొక ప్రాథమిక సూత్రం - అహింస. అహింస అంటే యుద్ధం, బల ప్రయోగం విడనాడటమే కాకుండా జీవహింస చెయ్యకుండా ఉండటం కూడా. ఆయన స్వయంగా యుద్ధాన్ని పరిత్యజించాడు. తన వంటశాలలో భోజనం కోసం జంతువుల వధ మాన్పించాడు. మత కర్మల కోసం జరిగే జంతు బలుల్ని నిషేధించాడు.

ఈనాడు సంక్షేమ కార్యక్రమాలుగా మనం పేర్కొంటున్నవన్నీ అశోక ధమ్మంలో భాగంగా ఉన్నాయి. అశోకుడు స్వయంగా ఇలా చెప్పాడు.

"మనుషులకి, జంతువులకి చల్లని నీడ కోసం రహదార్ల ప్రక్కన మర్రిచెట్లు, మామిడి చెట్లు నాటించాను. జంతువులు, మనుష్యులు దప్పిక తీర్చుకోటానికి జలాశయాలు నిర్మించాను, బావులు తవ్వించాను. ప్రతి తొమ్మిది మైళ్ళకి ఒక ధర్మశాల కట్టించాను. ఈ సౌకర్యం చాలా ముఖ్యమైంది. నాకు ముందు పరిపాలించిన రాజుల నుంచి, నా నుంచి ఈ ప్రపంచం అనేక విధాల వసతులు పొందింది. కాని, నేను ఇవన్నీ ఎందుకు చేశానంటే - నా ప్రజలు ధమ్మానికి కట్టుబడి వుంటారని."

కళలు : అశోక శాసనాలు గండ శిలలపైన, ఇసుక రాతి స్తంభాలపైన చెక్కబడ్డాయి. నునుపుదేరి సూర్యకాంతిలో నిగనిగలాడే ఆ శిలా స్తంభాలు బంగారంతో చేసినవా అన్న భ్రమ కలిగిస్తాయి. ఆ స్తంభాలపైన సింహం లేదా ఏనుగు లేదా వృషభ శిల్పాలు చెక్కబడి కిరీటంలా ఉంటాయి.. సారనాథలో నాటిన శిలా స్తంభ ఫలకం పైన నాలుగు సింహాల కిరీట శిల్పం చెక్కబడింది. భారతదేశం 1947లో

స్వతంత్రమైనప్పుడు, ఆ సింహ ముద్ర భారత ప్రభుత్వ అధికార లాంఛనమైంది.

పరిపాలనా పద్ధతి . మౌర్య ప్రభుత్వ వ్యవస్థకి శిఖరం రాజు. అతడే సర్వాధికారి అది పితృస్వామ్య నిరంకుశ రాజరికం. అశోకుడు తరచు తన శాసనాలలో "మానవులంతా నా బిడ్డలు" అని చెక్కించాడు. రాజు తండ్రి; ప్రజలు బిడ్డలు. శాసన నిర్మాణంలో రాజు చెప్పిందే వేదం రాజుకి సలహాలివ్వటానికి ఒక మంత్రి మండలి ఉండేది. కాని ఆ మంత్రులకి శాసనబద్ధమైన రాజకీయ హోదా అంటూ యేమీ లేదు. మంత్రి మండలి అధికారం రాజు వ్యక్తిత్వం మీద ఆధారపడి ఉంది. అశోకుడు తరచు తన మంత్రి మండలిని సంప్రదించాడు. ఆయన ఏర్పరచిన నియమ నిబంధనలకి మంత్రి మండలి సవరణలు సూచించేది. అంతిమ నిర్ణయం చక్రవర్తిదే.

కేంద్ర ప్రభుత్వ ప్రత్యక్ష పరిపాలన కింద ఉన్న రాజధాని నగరం మినహాయించి, మిగతా సామ్రాజ్యం యావత్తు నాలుగు విశాల రాష్ట్రాలుగా విభజింపబడింది. రాష్ట్ర పరిపాలనా బాధ్యత వైస్రాయి (రాజ ప్రతినిధి)లకు అప్పగించబడింది. రాష్ట్రాలు తిరిగి జిల్లాలు, జనపదాలుగా విభజించబడ్డాయి రాష్ట్ర పరిపాలకులుగా నియమించబడ్డ వైస్రాయిలు సాధారణంగా రాకుమారులు గానీ రాజకుటుంబంలోనివారు గానీ అయివుండే వారు. జిల్లాలకు, జనపదాలకు స్థానిక ప్రజల నుంచి దక్షత కలిగిన వాళ్ళని అధికార్లుగా నియమించారు. రాష్ట్ర మంత్రులు శక్తివంతంగా ఉండి వైస్రాయిలకు కళ్లెం లాగా వ్యవహరించారు. సామ్రాజ్యంలో జరిగే మంచి చెడ్డలు పరిశీలించి రావటానికి ఐదేండ్లకొకసారి దేశమంతటా పర్యటించి వచ్చే అధికారులుండేవారు. రాష్ట్రాల ఆదాయ, వ్యయాలను తనిఖీ చేసే అధికారులుండేవారు. భూమి శిస్తు వసూలు చెయ్యడానికి, సుంకాలు నిర్ణయించి వసూలు చెయ్యటానికి, లెక్కలు సేకరించడానికి, న్యాయ విచారణ చెయ్యటానికి, జనన మరణాల వివరాలు సేకరించటానికి, ఇంకా ఇతరేతర ప్రభుత్వ కార్యకలాపాలు నిర్వహించటానికి అనేకానేక అధికార్లు మౌర్య ప్రభుత్వ యంత్రాంగానికి మరలుగా వ్యవహరించారు.

అధికార్ల వేతనాలుగానీ, పబ్లిక్ వర్క్సుకోసం అయ్యే ఖర్చుగానీ కలిసి రాజ్య ఆదాయంలో నాల్గవ వంతుని మింగేసేవి. ఉన్నతాధికార్లకు కళ్ళు తిరిగిపోయే వేతనాలు. ముఖ్యమంత్రికి, సేనానికి 48,000 పణాలు; కోశాధికారికి 24,000 పణాలు; గణకులకు, గుమాస్తాలకు 500 పణాలు; మంత్రుల కొక్కరికి 12,000 పణాలు, వృత్తి పనిచేసే వారికి 120 పణాలు. పణం అంటే ఎంతో తెలీదు. ఈ వేతనాలు నెలకో, సంవత్సరానికో తెలీదు. కాని కింది తరగతి ఉద్యోగులకు, ఉన్నతాధికార్లకు మధ్య వేతన వ్యత్యాస నిష్పత్తి షుమారు 1:96.

ప్రభుత్వ కార్యకలాపాలు సజావుగా నిర్వహింపబడటానికి పరిపాలనా యంత్రాంగం అనేక శాఖలుగా విభజించబడింది. ప్రతిశాఖకు ప్రధానాధికారి రాజధాని పాటలీ పుత్రంలో ఉండేవాడు. వాళ్ళ ద్వారా సామ్రాజ్యంలో ఏ మూల ఏం జరుగుతుందో తెలుసుకోడానికి చక్రవర్తికి వీలయింది. అశోకుని కాలంలో ధర్మ మహామాత్రులనే ప్రత్యేక అధికార్లు ఉండేవాళ్ళు. వీళ్ళు దేశం మొత్తం పర్యటించి, రాష్ట్రాలలో, జిల్లాలలో, జనపదాలలో, ప్రదేశాలలో జరిగే ప్రభుత్వ కృషిని సమీక్షించి, స్థానిక ప్రజల అభియోగాల్ని ఆలకించి రాజధానికి తిరిగివచ్చేవాళ్ళు. ప్రజల నైతిక జీవనాన్ని సరియైన మార్గంలో పెట్టటానికి కృషి చెయ్యటం కూడా వీరి బాధ్యత. నగరపాలనని నగరపాలక సభ నిర్వహించేది. వివిధ శాఖల వ్యవ

హారాలు చూడటానికి ఆరు ఉపసంఘాలుండేవి.

**ఆర్థిక వ్యవస్థ** క్రీ. పూ. 3వ శతాబ్దం నాటికి ఉత్తర భారతదేశంలో ఆర్థిక వ్యవస్థ ప్రధానంగా వ్యవసాయం మీద ఆధారపడిఉంది. ప్రభుత్వ ఆదాయానికి భూమిశిస్తు మూలాధారం. భూమి మీద, పలసాయం మీద పన్నుల రూపంలో నిక్కచ్చిగా ఎంత ఆదాయం వస్తుందో తెలుసు కాబట్టి ప్రభుత్వ ఆదాయానికి భద్రత ఏర్పడింది. వ్యవసాయం ఒక్కటే కాకుండా తదితర ఆర్థిక ఉత్పత్తి కార్యకలాపాలు కూడా లేకపోలేదు గ్రామాల్లో పశువులు, మేకలు మొదలైన జంతువుల మందల మీద కూడా పన్నులు విధించారు.

జనాభాలో అత్యధికశాతం వ్యవసాయం మీద జీవించే ప్రజలు. వాళ్ళు గ్రామాల్లో జీవించారు. అడవుల్ని కొట్టించి కొత్త నివాస ప్రాంతాల్ని ఏర్పాటు చేయటం ప్రభుత్వ ఆధ్వర్యంలో జరిగేది. ఈ పని కోసం జన సమ్మర్దం కలిగిన ప్రాంతాల నుంచి శూద్ర తండాల్ని తరలించే వాళ్ళు. కళింగ యుద్ధంలో పట్టుబడ్డ లక్షా యాభై వేల మందినీ అడవుల్ని, బీళ్ళని సాగుభూములుగా మార్చి, నూతన జనవాసాల నిర్మాణానికే నియోగించారు. ఆ పనివాళ్ళ దగ్గర ఎటువంటి ఆయుధం ఉండే వీలులేదు. భూమి సాగుచెయ్యటం ఒక్కటే వాళ్ళ ఏకైక కార్యక్రమం. ఆహారోత్పత్తికోసం భారీ ఎత్తున బానిస వ్యవస్థని రూపొందించే అవసరం లేకుండా శూద్రులు ప్రభుత్వ కూలీలయ్యారు. శూద్రుడు చట్టరీత్యా బానిస కాకున్నా, శూద్రునికి-బానిసకి మధ్య అంతస్థులో తేడా యేమీ లేదు.

గ్రీకు రాయబారి మెగస్తనీసు ఆనాడు భారతదేశంలో బానిసలు లేరని రాశాడు. భారతీయ చారిత్రకాధారాలు మెగస్తనీసు రాసింది సరికాదంటున్నాయి. సంపన్నుల ఇళ్ళల్లో ఇంటి పనులకి, గృహ బానిసలుండటం వాడుకగా ఉంది. గనుల్లో బానిస కూలీలు పనిచేశారు. ఒక మనిషి పుట్టుక చేతగానీ, స్వచ్ఛందంగా అమ్ముడుపోయిగానీ, యుద్ధ ఖైదీగా పట్టుబడిగానీ, న్యాయస్థానాలు వేసిన శిక్ష ద్వారాగానీ బానిస అవుతాడని అర్థశాస్త్రంలో ఉంది. బానిసత్వం ప్రభుత్వం గుర్తించిన వ్యవస్థ. యజమానికి-బానిసకి మధ్య చట్టరీత్యాగల సంబంధం స్పష్టంగా నిర్వచించబడింది. ఉదాహరణకి, ఒక బానిసస్త్రీ తన యజమాని ద్వారా కొడుకుని కంటే ఆమెకి దాస్య విముక్తి కలగటమే కాకుండా, ఆమెకి పుట్టిన బిడ్డకి యజమాని బిడ్డగా చట్ట సమ్మతమైన హోదా ఉండేది. సాంకేతికపరంగా, ఉత్పత్తి కోసంగాను భారీ ఎత్తున బానిస విధానం అమల్లో లేదు. గ్రీకు బానిసకి, హిందూ బానిసకి ఒక తేడా ఉంది. ఈ దేశంలో బానిస తన స్వేచ్ఛని తిరిగి కొనుక్కోవచ్చు లేదా యజమాని స్వచ్ఛందంగా తన బానిసని విడుదల చెయ్యవచ్చు. ఆ బానిస గనక ఆర్యజాతి వాడయితే, అతనికి తిరిగి తన ఆర్యజాతి హోదా కలుగుతుంది. గ్రీసు మొదలైన ఇతర దేశాల్లో ఇటువంటి పద్ధతి లేదు. భారతీయ సమాజంలో ఎన్నటికీ మారనిది స్వేచ్ఛాకాదు, బానిసత్వమూ కాదు-కులం.

*ఇరుగు పొరుగుదేశాలతో సంబంధాలు* అశోకుడు ఇరుగు పొరుగు రాజ్యాలతో సత్సంబంధాలు అభిలషించాడు. ఈనాడు మన రాయబారులు, దౌత్య ప్రతినిధులకు యీడయిన అనేక ప్రతినిధి వర్గాల్ని అశోకుడు పశ్చిమాసియాలోని చాలా రాజస్థానాలకి పంపించాడు. ఆయన ఒక శాసనంలో పేర్కొన్న దాన్ని బట్టి ఆ పశ్చిమాసియా పాలకులు గ్రీకు రాజులు. తన కన్న కొడుకు మహేంద్రని

సింహళానికి పంపాడు మహేంద్రుడు. సింహళంలో బౌద్ధమతప్రచారం చేశాడు. సింహళరాజు బౌద్ధం స్వీకరించాడు.

కౌటిల్యుడు, మెగస్తనీసు : మౌర్యుల కాలాన్ని గురించి విపులంగా తెలియజేసే రెండు వాఙ్మయాధారాలు ఉన్నాయి. ఒకటి-కౌటిల్యుడు రాసిన అర్థశాస్త్రం. కౌటిల్యుడు చంద్రగుప్తుని ప్రధానమంత్రి. రెండు-మెగస్తనీసు రాసిన "ఇండికా". ఆయన గ్రీకు సేనాని సెల్యూకస్ నికెటర్ రాయబారి; చంద్రగుప్తుడు పరిపాలించిన కాలంలో ఆయన కొంతకాలం భారతదేశంలో ఉన్నాడు. ఆయన రాసింది పూర్తిగా మనకిప్పుడు లేదు. కొద్ది అసంపూర్ణ భాగాలు మాత్రమే దొరికాయి. తను ఆనాడు భారతదేశంలో ప్రత్యక్షంగా చూసిందంతా వర్ణించాడు.

కౌటిల్యుని అర్థశాస్త్రం రాజధర్మాన్ని విపులంగా వివరించిన రాజనీతి గ్రంథం. చంద్రగుప్త మౌర్యుని కాలం నాటి సాంఘిక, రాజకీయ వ్యవస్థని అర్థం చేసుకోడానికి అర్థశాస్త్రం చాలా విలువైన పుస్తకం.

మెగస్తనీసు తన 'ఇండికా' లో పాటలీపుత్రాన్ని చుట్టూ బలమైన ప్రాకారాలు కలిగిన విశాల సుందర నగరంగా వర్ణించాడు. పౌరుల ఇళ్ళు చెక్కతో, రాజ ప్రాసాదం రాతితో కట్టబడ్డాయి. చక్రవర్తి వైభవోపేత జీవితం ఆ విదేశ రాయబారిని ముగ్ధుణ్ణి చేసింది. విన్నపాలు, అభియోగాలు చేయవచ్చే ప్రజల కోసం రాజ ప్రాసాద ద్వారాలు ఎల్లప్పుడూ తెరిచి వుండేవని ఆయన రాశాడు. చంద్రగుప్తుడు చాలా యుద్ధాలు చేయవలసి వచ్చింది కాబట్టి అపారమైన సైన్యాన్ని పోషించాడు. అధికార్లు వసూలు చేసిన పన్నుల్లో ఎక్కువ భాగం సైన్య పోషణకే ఖర్చయి పోయేది.

సమాజం : ప్రజల్లో అత్యధిక సంఖ్యాకులు వ్యవసాయం మీద ఆధారపడి గ్రామాల్లో జీవించే వారని మెగస్తనీసు రాశాడు. పశుపాలకులు, గొర్రెల కాపర్లు కూడా పల్లెల్లోనే జీవించారు. సాలీలు, వడ్రంగులు, కమ్మర్లు, కుమ్మర్లు మొదలైన వృత్తి పనివాళ్ళు పట్టణాల్లో జీవించారు. వృత్తిపనివాళ్ళ అంతస్థుల్లో తారతమ్యాలుండేవి. బట్టలు నేసేవాళ్ళకన్నా, కుండలు చేసేవాళ్ళకన్నా లోహకారులకి సమాజంలో పెద్ద హోదా ఉండేది. సంపన్నులంతా అగ్రవర్ణాల వాళ్ళు; వాళ్ళకి సేవ చేసే వాళ్ళు శూద్రులు. బ్రాహ్మణులు, బౌద్ధ బిక్షువులు, ఇంకా ఇతర మతాలకు చెందిన పురోహితులు మొదలైన వాళ్ళకి పన్నులు కట్టవలసిన పనిలేదు.

వైదిక సిద్ధాంత కర్తలు తలచిన రీతిగా వర్ణవ్యవస్థ పని చెయ్యలేదు. ద్విజులు (రెండు పుట్టుకలు కలవాళ్ళు—అంటే మొదట పుట్టినప్పుడు తరువాత ఉపనయనం అయ్యాక) అనబడే మొదటి మూడు కులాలు-బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు శూద్రుల కన్నా, వర్ణబహిష్కృతుల కన్నా అధికులు. కాని వైశ్యులు సాంకేతిక పరంగా ద్విజులే అయినప్పటికీ బ్రాహ్మణ, క్షత్రియులు సాంఘికంగా వీళ్ళని విడిలించికొట్టారు. అయితే, వర్తక వాణిజ్యాలలో వైశ్యులు బాగా ఆర్జించివున్నారు. కాబట్టి వైశ్యులకి, మొదటి రెండు అగ్ర వర్ణాలకీ మధ్య సంఘర్షణ తప్పనిసరయింది. సమాజంలో సామరస్య సాధనకోసం అశోకుడు చేసిన విజ్ఞప్తి ఈ సామాజిక ఉద్రిక్తతల్ని సూచిస్తుంది.

మౌర్యసామ్రాజ్య పతనం : మౌర్యసామ్రాజ్యం సుమారు వంద యేళ్ళకి పైగా వర్ధిల్లి క్రీ. పూ. 180 నాటికి విచ్ఛిన్నమైంది. సామ్రాజ్య పతనం అశోకుని మరణంతో ప్రారంభమైంది. పతనానికి కారణాలు అనేకం. ఒకటి - అశోకుని వారసులంతా బలహీనులే, సామ్రాజ్యాన్ని నిలుపుకోగల సమర్థత

లోపించిన వాళ్ళు. రెండు - సామ్రాజ్యం సువిశాలం కావటాన వివిధ దూరప్రాంతాలకు కేంద్రంతో సంబంధం తెగిపోయింది. మూడు-అశోకుని తరువాత వచ్చిన చక్రవర్తులు అపార సైన్యాన్ని, పరిపాలనా యంత్రాంగాన్ని పోషించగలిగేటట్లుగా పన్నులు వసూలు చేసుకోలేక పోయారు. సామంతులనేక మంది స్వతంత్రం ప్రకటించారు.

ఈ అనైక్యత ఫలితంగా, చంద్రగుప్తుడు గ్రీకుల్ని ఓడించిన నూరేళ్ళ తరువాత బాక్ట్రియాని పాలించిన గ్రీకురాజు (యవనులు) భారత వాయువ్య ప్రాంతంలో ఒకరాజుపై దండెత్తి వచ్చినప్పుడు అతనికి అండదండలిచ్చిన హిందూ రాజు ఒక్కడు లేడు. ఆ తరువాత ఇరవయ్యేళ్ళకి మౌర్యసేనాధిపతి పుష్యమిత్రుడు కట్టకడపటి మౌర్యచక్రవర్తి బృహద్రధుని కూలదోసి మగధ సింహాసనం ఆక్రమించాడు. అతనితో శుంగ వంశ పరిపాలన ఆరంభమైంది.

# 6

# సామ్రాజ్య విచ్ఛిత్తి - స్వతంత్రరాజ్యాలు

## దక్కను సీమ

వింధ్య పర్వతాలకు, నర్మదానదికి దక్షిణంగా ఉన్న భూభాగాన్ని పూర్వం దక్షిణాపథం అని వ్యవహరించే వాళ్ళు. దాన్నే ఇప్పుడు దక్కను పీఠభూమి అంటున్నాం. దక్కను సీమకి దక్షిణంగా ఉన్న భూభాగం ద్రావిడదేశం లేదా తమిళకం (తమిళనాడు). ప్రాచీన కాలం నుంచి ఈ ప్రాంతం ఆర్యేతర జాతులకు పుట్టినిల్లు. ఈ ప్రాంతాన్ని, ఈ ప్రాంతంలోని రాజ్యాల్ని మౌర్యులు తమ సామ్రాజ్యంలో కలిపివేసుకున్నారు. మౌర్యసామ్రాజ్యం తునాతునకలు కావటంతో ఈ ప్రాంతాలు తిరిగి స్వతంత్రం ప్రకటించాయి. వీటిని పాలించిన రాజుల్లో ఎక్కువమంది మౌర్యచక్రవర్తుల కింద పనిచేసిన ప్రభుత్వాధికార్ల కుటుంబాలకు చెందినవాళ్ళు.

శాతవాహనులు : మౌర్య సామ్రాజ్యం పతనం కాగానే స్వతంత్రం ప్రకటించిన సామంతుల్లో శాతవాహనులు సుప్రసిద్ధులు. వీరికే ఆంధ్ర శాతవాహనులని పేరు. మొట్టమొదటి శాతవాహన రాజుల్లో శాతకర్ణి మహా ప్రసిద్ధుడు. విశాల భూభాగాన్ని జయించి, తన రాజ్యాన్ని నల్దిక్కులకు విస్తరింపజేశాడు కాబట్టి అతనికి విస్తృతతమైన గుర్తింపు కలిగింది. కళింగరాజు ఖారవేలుని దండయాత్రల్ని తిప్పికొట్టాడు. "దక్షిణాపథపతి" నని సగర్వంగా చాటుకున్నాడు. నర్మదా నదిని దాటి, తూర్పు మాళవరాజ్యాన్ని జయించి సాంచీదాకా జైత్రయాత్ర సాగించాడు. సాంచీలో దొరికిన ఒక శాసనంలో ఇతడు రాజన్యశ్రీ శాతకర్ణి అని వర్ణించబడ్డాడు. ఇతని రాజధాని ప్రతిష్టానపురం. ఇతడు వైదిక మతాన్ని అభిమానించాడు; అశ్వమేధయాగం చేశాడు. ఇతని పరిపాలన కాలం క్రీ. పూ. మొదటి శతాబ్దం అయి వుండవచ్చు.

పశ్చిమ దక్కను ప్రాంతాన్ని శాతవాహనులు ఎక్కువ కాలం నిలబెట్టుకోలేక పోయారు. శాతకర్ణి తరువాత రాజ్యానికి వచ్చినవాళ్ళు క్షహరాతులు మొదలైన శత్రువుల చేతుల్లో దెబ్బతిని తూర్పుకోస్తాకు పారిపోయారు. ఆంధ్రప్రాంతంలో బలపడి, తిరిగి సైన్యాన్ని కూడగట్టి శాతవాహనులు పశ్చిమ దక్కను ప్రాంతాన్ని మరల వశపర్చుకున్నారు. ఇది గౌతమీ పుత్ర శాతకర్ణి కాలంలో జరిగింది.

గౌతమీ పుత్ర శాతకర్ణి, అతని కుమారుడు వశిష్టీ పుత్ర పులోమావి క్రీ. శ. రెండవ శతాబ్ది

ఉత్తర - దక్షిణ భారతదేశాల మధ్య దక్కను వారధిగా పనిచేసింది. రాజకీయాలలో మాత్రమే కాకుండా వ్యాపార విచారాలలో దేశంలోని ఉభయ భాగాల్ని కలిపే లింకుగా దక్కను తన పాత్రనిర్వహించింది. గౌతమీ పుత్ర శాతకర్ణి శకుల్ని* తరిమికొట్టి, క్షత్రియుల అహంకారాన్ని అణచివేశాడని వశిష్టీ పుత్రుని కథనం ఇంకా, వర్ణసాంకర్యాన్ని నిలిపివేసి ద్విజుల ప్రయోజనాల్ని కాపాడాడని వినికిడి. గౌతమీ పుత్ర శాతకర్ణి ఒక శాసనంలో తన కుమారుడు "శక, యవన, పహ్లవు" ల్ని ఏరివేశాడని పేర్కొంది.

శాత వాహనులకు - శకులకు మధ్య ఆరకుండా ప్రజ్వరిల్లిన యుద్ధజ్వాలని ఆర్పివెయ్యటానికి శకరాజయిన రుద్రదమనుని కుమార్తెను ఒక శాతవాహన రాజు వివాహం చేసుకున్నాడు. వర్ణ సాంకర్యాన్ని నిలిపివేసినట్టు గొప్పలు చెప్పుకున్న శాతవాహనులు శకులతో వివాహ సంబంధం పెట్టుకున్నారంటే వర్ణ వ్యవస్థ సిద్ధాంత-ఆచరణలకి మధ్యగల లొసుగు బైట పడుతుంది. ఆ వివాహ సంబంధంవల్ల శకులకు - శాతవాహనులకు మధ్య వైరుధ్యం సమసిపోలేదు. శాతవాహన రాజుని రెండు తూర్లు యుద్ధంలో ఓడగొట్టి కూడా, శాతవాహనులతో గల సన్నిహిత సంబంధ బాంధవ్యాన్ని బట్టి అతణ్ని తుదముట్టించకుండా ఆగిపోయానని రుద్ర దమనుడు చెప్పుకున్నాడు.

రుద్ర దమనుని మరణం తరువాత, శకులు బలహీన పడిపోయారు. శాతవాహనులు విజృంభించారు. శాతవాహనరాజ్యం ఉత్తరాన కథియవాడు వరకు దక్షిణాన కృష్ణా డెల్టా వరకు విస్తరించింది. క్రీ.శ. మూడవ శతాబ్దంలో శాతవాహన రాజ్యం క్షీణించింది. స్థానిక సామంత ప్రభువులు స్వతంత్ర రాజకీయాధికారం చేజిక్కించుకున్నారు.

శాతవాహన రాజ్యం సుసంపన్నంగా ఉంది. ఉత్తర దక్కను ప్రాంతమంతటా కృష్ణా గోదావరి నదీ లోయల్లో రాకపోకల కోసం రహదార్లు పడ్డాయి. అడవుల కొట్టివేతతో అనేక కొత్త గ్రామాలు వెలిశాయి. నాసిక్ ప్రాంతంలోను, గోదావరి డెల్టా ప్రాంతంలోనూ వ్యాపార వాణిజ్యాల వికాసం వల్ల పట్టణాలు వెలిగాయి. పడమటి తీరంలో భరుకచ్ఛం రేవులో పర్షియా, ఇరాక్, అరేబియా దేశాల నుంచి వచ్చే నౌకలు ఆగేవి. తూర్పు కోస్తా వెంబడి గంగా డెల్టా నుంచి దక్షిణ దేశం దాకా గోదావరి డెల్టాలోని రేవు పటణాల ద్వారా విదేశ వ్యాపారం సాగింది ఈ రేవు పట్టణాల నుండి మన నౌకలు బర్మా, మలయాలకు సముద్ర గమనం సాగించాయి

శాతవాహనులు సమర్థవంతంగా పరిపాలించారు. రాజ్యం చిన్న చిన్న రాష్ట్రాలుగా (ఆహారలు అనేవారు) విభజింపబడింది. ఒక అమాత్యుడు (Civil Governer), ఒక సేనాపతి (Military Governer) కలిసి రాష్ట్రాన్ని పాలించే వాళ్ళు గ్రామ పరిపాలనని గ్రామణి (గ్రామాధికారిని గుమిక అనేవారు) చక్కబెట్టేవాడు భూమిశిస్తుని, పన్నుని వసూలు చేసే బాధ్యత గ్రామణిది.

---

* వాయువ్య భారతంలో ఇండోగ్రీకు రాజ్యాలు క్షీణించిన సమయంలో మధ్యాసియా నుంచి శిథియన్లు అనే సంచార తెగ బాక్ట్రియాను ఆక్రమించింది. క్రీ. పూ. 88 లో ఈ తెగ బోలన్ కనుమగుండా సింధు లోయలో ప్రవేశించి పశ్చిమోత్తర భారతదేశంలో స్థిరపడింది. వీరినే శకులు అనికూడా అంటాం.

బౌద్ధ కట్టడాలు పట్టణాల్లో వణిజులు (వ్యాపారుల్ని వణిజులనే వారు), వృత్తిశ్రేణుల నాయకులు (వృత్తి పనుల వారి సంఘాలను శ్రేణులనేవారు) ఆర్థికంగా బాగా గడించారు. విరాళాలు ఇవ్వటానికి సరిపడ్డ డబ్బు వాళ్ళ దగ్గర పోగుబడి వుంది. వ్యాపారుల్లో, వృత్తి పనివారిలో ఎక్కువ మంది బౌద్ధులు లేదా జైనులు. అంచేతవాళ్ళు బౌద్ధ స్థూపాలు, చైత్యాల నిర్మాణానికి ధారాళంగా విరాళాలు ఇచ్చారు. స్థూపం అన్నది గుండ్రని మట్టి దిబ్బ. దాన్లో బుద్ధునిదో, బౌద్ధ భిక్షువునిదో భౌతికావశేషం ఉంటుంది. స్థూపాలు బౌద్ధులకు పవిత్ర స్థలాలు. సాంచీ స్థూపం చుట్టూరా పిట్టగోడ, సింహద్వారం అటువంటి విరాళాలతో కట్టినవే. అమరావతి (ఆం. ప్ర) స్థూపానికి వర్తకులు, యువరాజులు డబ్బు సమకూర్చారు. స్థూపాల్ని అనుకుని బౌద్ధ భిక్షువులు నివసించే విహారాలుండేవి. చాలా బౌద్ధ విహారాలు పెద్ద పెద్ద నగరాలకు చేరువగా నిర్మించారు. ఉదాహరణకి- తక్షశిల, సారనాథ విహారాలను ఈ సందర్భంగా ప్రస్తావించవచ్చు. తద్వారా, బౌద్ధ భిక్షువులు ప్రతి ఉదయం నగరంలోకి వెళ్ళి భిక్ష అడిగి తెచ్చుకునే సావకాశం కలిగింది. కొందరు భిక్షువులు కొండల్ని తొలిచి నిర్మించిన గుహాలయాలలో ఉండేవారు. పూనాకి సమీపంగా పడమటి కనుమల్లో నిర్మించిన కార్లే, బేడ్సాలాంటి విహారాలకు శిల్పాలంకరణ చేశారు. ఆ కాలంలో మత సంబంధమైన కళ అంటే ప్రధానంగా బౌద్ధ కళ అనే చెప్పాలి. చెదురుమదురుగా జైన శిల్పాలు కూడా ఉన్నాయి.



క్రీ. పూ. 20-క్రీ.శ. 20 సంవత్సరాల మధ్య పూర్తయిన బృహత్తర సాంచీ స్థూపం



బుద్ధ ఎన్నినమునిపి అజాతశత్రుని రాసి, నాగార్జునకొం..

ముందు. ఆనాడు బౌద్ధ మతానికి ప్రజల్లో గొప్ప ఆదరణ వుండి విహారాల్లో మతానికి సంబంధించిన చర్చలు, గోష్ఠులు జరిగేవి భిక్షువులు ప్రజల్లోకి వెళ్ళి బౌద్ధ మతాన్ని ప్రచారం చేసేవాళ్ళు. అశ్వఘోషుడు, ఆచార్య నాగార్జునుడు తమ రచనల ద్వారా బౌద్ధ మత వ్యాప్తికి గొప్ప సేవ చేశారు ప్రాచీన వైదిక దేవతల్ని నమ్మిన వాళ్ళు క్రమంగా మారటం ప్రారంభమైంది కొత్త దేవుళ్ళ కొలుపు మొదలయింది వైష్ణవ, శైవ మతాలు ఆదరణ పొందుతున్నాయి. యాగాలు బలులు వెనకబడ్డాయి. యజ్ఞ యాగాలకు బదులు, ఆట్టే కర్మకాండ లేకుండా ప్రశాంతంగా భగవంతుణ్ని ప్రార్థన చేస్తే సరిపోతుందనే భావం ప్రజల మనస్సులో ఆకు దొడగడం ప్రారంభమైంది. వైదిక క్రతుకాండ కన్నా భగవద్భక్తి ప్రాధాన్యం సంతరించుకున్న కాలం అది భగవద్గీత ప్రజాదరణ పొందిన కాలం కూడా అదే.

ఉదయం లేపగానే భిక్షువులు నగరంలోకి పోయి భిక్ష తెచ్చుకుని దాని మీదే పూర్తిగా ఆధారపడి బతుకు వెళ్ళబుచ్చే రోజులు క్రమేణా చెల్లిపోయాయి. విహారాలిప్పుడు ధన ధాన్య సమృద్ధితో కలకలలాడు

---

సాంచీ స్థూప ఉత్తర ద్వారం—తొలి బౌద్ధంతో జతపడ్డ సామూహిక సంకేత రూప చిత్రణ ఈ ద్వార శిల్పాలలో దర్శనమిస్తుంది




కార్లే బౌద్ధ చైత్యం: నమూనా పటము (ప్లాను), ఎత్తు. పడమటి కనుమల్లో కార్లే వద్ద గుహలు తొలిచి నిర్మించిన బౌద్ధ చైత్యం సుప్రసిద్ధమైంది. ఇది చాలా సంశ్లిష్ట నిర్మాణం. దీర్ఘచతురస్రాకార ప్రవేశ ద్వారం గుండా పూజా మందిరంలోకి మార్గం తొలిచారు. ఒక చివర చిన్న ప్రమాణంలో స్థూపాన్ని నిర్మించారు. గుహకి ఇరువైపులా బౌద్ధ సన్యాసుల మరాలు ఉన్నాయి.

తున్నై. భిక్షువులు మఠంలోని భోజనశాలలో నిర్విచారంగా భుజిస్తున్నారు. వాళ్లు సామాన్య ప్రజలకు దూరం కావటం ప్రారంభమైంది. మఠాలలో సుఖం మరిగారు.

మౌలిక బౌద్ధ సిద్ధాంతం మీద మీమాంస మొదలయింది బౌద్ధం మహాయాన, హీనయాన శాఖలుగా చీలిపోయింది. ఈ చీలిక, సుఖ సమృద్ధులతో కూడిన జీవితానికి బౌద్ధ మతాచార్యుల సమర్థన బౌద్ధ క్షీణదశకి బీజాలు నాటాయి.

క్రీ. శ. మొదటి శతాబ్దంలో ఒక ఉత్తమమతం - అదే క్రైస్తవ మతం - పశ్చిమ దేశాల నుంచి వచ్చే వాణిజ్య నౌకల ద్వారా భారతదేశంలో ప్రవేశించింది. క్రైస్తవ మతం రాకడ సెయింట్ థామస్ అనే క్రైస్తవ సన్యాసి కథతో ముడిపడి వుంది. క్రీ. శ. 52 లో సెయింట్ థామస్ మలబారులో దిగినట్లు వినికిడి. మలబారు తీరం వెంబడి అనేక సిరియన్ క్రైస్తవ ఆలయాలను నెలకొల్పి, అటు తరువాత తూర్పుతీరానికి ప్రయాణం చేశాడు. ఆయన నూతన మత ప్రచారానికి తీవ్ర ప్రతిఘటన ఎదురయింది. మద్రాసుకు సమీపంలో మైలాపూరులో ఆయనని క్రీ. శ 68 లో శత్రువులు చంపివేశారు.

ఆ శతాబ్దంలో మధ్యధరా ప్రపంచానికి దక్షిణ భారతానికి మధ్య విశేషంగా జరిగిన రాకపోకల్ని బట్టి ఏసుక్రీస్తు శిష్యులలో ఒకరు క్రైస్తవ మత ప్రచారానికై భారతదేశం వచ్చాడనేది సత్యదూరం కాదు.



సాంచీలో దొరికిన బోధిసత్వుని శిథిల శిల్ప ప్రతిమ. తల, తదితర అవయవాలు లేని ప్రతిమ యొక్క మొండెం మాత్రమే అయినా భారతీయ శిల్పకళా చాతుర్యంలో దీన్ని ప్రసిద్ధ కళా ఖండంగా పేర్కొంటారు. బహుశా ఇది 7-9 శతాబ్దాల మధ్య గుప్తుల కాలం నాటిదై వుండవచ్చని చరిత్రకారులు భావిస్తున్నారు

## దక్షిణాది

క్రీస్తు పూర్వ శకం నుంచి క్రీస్తు శకంలోకి ప్రవేశించబోయే దశలో దక్షిణ భారత దేశం చరిత్ర పూర్వ యుగంలో నుంచి చారిత్రక యుగంలోకి అడుగు పెట్టింది. నాటి సమకాలీన సంఘటనల్ని ప్రతిబింబించే సారస్వతం అందుబాటులో ఉంది.

దక్కను పీఠభూమికి, శాతవాహన రాజ్యానికి దక్షిణాన మూడు రాజ్యాలు తలెత్తాయి. అవి చోళ (మద్రాసుకు దక్షిణంగా తంజావూరు ప్రాంతం), పాండ్య(పాండ్యుల రాజధానిమదురై ),

చేర (మలబారు తీరం- ప్రస్తుతం కేరళ) రాజ్యాలు. ఆగ్నేయ ప్రాంతం తమిళనాడు. ఈ చోళ, పాండ్య, చేర రాజ్యాల్ని గురించిన సమాచారం సంగం సాహిత్యంలో లభిస్తుంది.

*సంగం సాహిత్యం :* సంగం అనేది అనేక శతాబ్దాల కిందట తమిళ దేశంలో జరిగిన ప్రాచీన కవి పండిత పరిషత్తు ఈ పరిషత్తు సమావేశాలు మూడుసార్లు జరిగాయి. మూడవ సమావేశం మదురైలో జరిగింది. ఇందులో సభ్యులైన వందలాది కవి, పండిత, గాయకులు అల్లిన కవితలే సంగం సాహిత్యంగా ప్రసిద్ధి చెందింది. మొదటి పరిషత్తులో సృష్టి అయిన సాహిత్యం కాలగర్భంలో కలిసిపోయింది. తరువాతి రెండు పరిషత్తులలో రాయబడ్డ రెండు వేల పద్యాలు 8 సంపుటాల్లో కూర్చబడ్డాయి. ఈ తమిళ సాహిత్యాన్ని ఈనాటికీ చదువుకోవచ్చు. ఈ సాహిత్యాన్ని సృష్టించిన తమిళ కవులు ఊరూరా తిరుగుతూ తెగ నాయకుల కోసం కవిత అల్లారు. ఆ నాయకుల జీవితం, సామాన్య ప్రజల బ్రతుకులు సంగం సాహిత్యంలో ప్రతిఫలించాయి.

ఈ చోళ, చేర, పాండ్యుల మధ్య తరచు యుద్ధాలు జరిగాయి. ఆ యుద్ధాల్ని వర్ణిస్తూ అనేక పద్యాలు ఉన్నాయి.

చోళ రాజుల్లో కరికాల చోళుడు ప్రసిద్ధుడు. కాలుకాలి నల్లబడినందున కరికాల చోళుడుగా పేరు పడ్డాడని ఒక కథ. చేర, పాండ్య రాజ్య కూటమిని వెణ్ణి యుద్ధంలో (తంజావూరుకి 24 కి. మీ. దూరం) ఓడించి ఘన విజయం సాధించాడు. భారత ద్వీపకల్పం దక్షిణ కొస తూర్పు, పడమటి తీరాలు రెండూ చోళులకు స్వాధీనమయ్యాయి. అంతటితో ఆగకుండా చోళులు పెద్ద నౌకాబలం నిర్మించుకొని సింహళం మీద దాడి చేశారు. కొంత కాలంపాటు ఉత్తర సింహళాన్ని నిలబెట్టుకున్నారు గాని తరువాత సింహళరాజు చోళుల్ని తరిమివేశాడు.

గ్రీకు రాయబారి మెగస్తనీసు తన "ఇండికా" గ్రంథంలో పాండ్య రాజ్యాన్ని గురించి ప్రస్తావించాడు. పాండ్య రాజ్యాన్ని ఒక రాణి స్థాపించిందనీ, ఆమె ఒక మహా సైన్యాన్ని పోషించిందనీ ఆయన రాశాడు.

కేరళ రాజుల్లో నెడుంజేరన్ ఆండాన్ మహావీరుడుగా పరిగణింపబడ్డాడు. అతని నాయకత్వంలోనే చేర వంశస్థులు విజృంభించారు. అతను అనేక మంది స్థానిక ప్రభువుల్ని ఓడించాడనీ, మలబారు తీరంలో రోమన్ నౌకా బలాన్ని వశపర్చుకున్నాడనీ ప్రతీతి.

*రోమన్ వాణిజ్యం :* వ్యాపారం నిమిత్తం రోమన్ నౌకలు మలబారు తీరాన్ని, తమిళనాడు తూర్పు కోస్తాని సందర్శించాయి. మధ్యధరా తీర దేశాలు మొత్తం ఆనాడు రోమన్ సామ్రాజ్యం క్రింద ఉండేవి. రోమ్ బజార్లలో భారతీయ విలాస వస్తువులకు అపరిమితమైన గిరాకీ ఉండేది. రోమన్లకి భారత దేశంలో లభ్యమయ్యే సుగంధ ద్రవ్యాలు, చేనేత వస్త్రాలు, వజ్ర వైఢూర్యాది విలువైన రాళ్ళు, నెమలి మొదలైన పక్షులు, కోతులు వగైరా జంతువులు అంటే మహా మోజు. రోమన్ నౌకలు ఎర్ర సముద్రం నుంచి బైల్దేరి, అరేబియా సముద్రం మీదుగా మలబారు తీరం చేరేవి; మన్నార్ జలసంధి నుంచి తూర్పు కోస్తా చేరేవి. వాళ్ళకి అవసరమైన వస్తువులనన్నింటిని ఓడల్లో నింపుకుని, ఆ వస్తువులకు బంగారు నాణాల్లో కిమ్మతు చెల్లించి రోమ్ తిరిగి వెళ్ళేవాళ్ళు. దాక్షిణాత్య రాజ్యాలు రోమన్ బంగారంతో ఉచ్ఛస్థితికి వచ్చాయి.

దక్షిణ భారతదేశ తూర్పు కోస్తా పట్టణాల్లో రోమన్లు కొంత కాలం నివసించారు. రోముకు కావలసిన సరుకులు అక్కడ కొనుగోలు చేసి, నౌకలు తూర్పు తీరం చేరేనాటికి సిద్ధంగా ఉంచేవాళ్ళు. పాండిచ్చేరికి దగ్గర్లో అరికమేడు అనే చిన్న పట్టణంలో 1945లో జరిపిన తవ్వకాలలో అనేక రోమన్ వస్తువులు బైటపడ్డాయి. ఈ రేవు పట్టణాల నుంచి భారత నౌకలు ఆగ్నేయఆసియా దేశాలకు పయనించాయి. భారతీయ వర్తకులు చైనాతో సైతం సముద్ర వ్యాపారం చేశారు. ఆనాటి ఓడల్లో సముద్రయానం చెయ్యటం ప్రమాద భూయిష్టం అయినా ఆ ప్రమాదాలను లెక్కచెయ్యని సాహసవంతులు ఉండే వాళ్ళు. మనదేశం లోపల దక్షిణాది నుంచి ఉత్తరాదికి అనేక వస్తువులు ఎగుమతి అయ్యేవి. ముఖ్యంగా దక్షిణాది నుంచి ఎగుమతయిన విలువైన రాళ్ళు ఉత్తరాది రాజ్యాల్ని సంపన్నవంతం చేశాయి.

ప్రజా జీవనం : దక్షిణ భారతదేశంలో ప్రజలు ఎక్కువగా గ్రామాల్లోనే జీవించారు. భూమిని సాగులోకి తేవటం కష్టతరమైన కొంత ప్రాంతాల్లో ప్రజలు పశువుల్ని, తదితర జంతువుల్ని పోషణచేశారు. వ్యాపారస్తులు, వృత్తి పనివారు ఎక్కువగా పట్టణాల్లో జీవించారు. ఈ పట్టణాలన్నీ దాదాపు కోస్తా వెంబడే వెలిశాయి. అంచేత వ్యాపారం సుళువైంది కూడా. రాజు బ్రాహ్మణ సలహాదార్ల సాయంతో రాజ్య పరిపాలన చేశాడు. తెగ పెద్దలందరితో కూడిన "సభ" ఉండేది. "సభ"లో అనేక విషయాలు చర్చకు వచ్చేవి. యుద్ధానికి వెళ్లాలా వద్దా, ఏదేనా నేరానికి ఒక మనిషిని శిక్షించాలా లేదా మొదలైన విషయాల్ని సభ చర్చించేది. రాజుకు ఆదాయం పన్నుల రూపంలో రైతులు, పశుపాలకులు, వృత్తి పనివారు, వర్తకుల నుండి వసూలయ్యేది. వర్తకులు తమ సరుకును ఒక చోటు నుండి వేరొక చోటికి తరలించేప్పుడు సుంకం కట్టేవాళ్ళు.

పల్లెల్లో గాని, పట్నాల్లో గానీ జీవితం దాదాపు నిరాడంబరంగా సాగింది. పగలంతా పని చేశాక, సాయంత్రం క్రీడలు, జూదాల్లో ప్రజలు పొద్దుబుచ్చటం కద్దు. సంగీతం, నృత్యం, కవితా పఠనం ఆనాడు ప్రజల్లో వ్యాప్తి పొందాయి. అనేక రకాల సంగీత వాయిద్యాలు వాడుకలో ఉన్నాయి. పగలు గాని, రాత్రి గాని ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క రకపు ప్రత్యేక సంగీతం వాయించే సంప్రదాయం ఉంది

మతం : వైదిక మత దేవతారాధన, బౌద్ధ జైనమత సిద్ధాంతాలు మొదలైన ఉత్తరాది మత విశ్వాసాలు, భావాలు ఆనాడు దక్షిణదేశ ప్రజలకు పరిచితమే. ప్రజల్లో కొందరు ఈ మతాల్ని అనుసరించినప్పటికీ, ఎక్కువ మంది తమ పాత దేవుళ్ళని, దేవతల్ని కొలవటమే ఆచారం; తమ మత క్రతువుల్నే ఆచరించేవాళ్ళు. ఉత్తర భారతదేశంలో కార్తికేయుడు లేదా స్కంధుడు అని వ్యవహరింపబడే మురుగన్ తమిళ ప్రజల ఇష్టదైవం. యుద్ధాల్లో వీరోచితంగా పోరాడి మరణించిన మృతవీరుల్ని కూడా ప్రజలు పూజించారు. తీర ప్రాంతంలో నివసించిన ప్రజలు సముద్రుణ్ని పూజించారు.

అనేక శతాబ్దాల పర్యంతం, తమిళ ప్రజలు ఈ తీరుగా జీవించారు. ఆరవ శతాబ్దంలో పల్లవ రాజులు ఒక సువిశాల రాజ్యాన్ని స్థాపించే వరకు ప్రజల జీవన విధానం అలానే కొనసాగింది.

## ఉత్తర భారతదేశం

**ఈలోపు భారత దేశం ఉత్తర కొనకి క్రీ.పూ. 200-క్రీ.శ 100 సంవత్సరాల మధ్య అనేక మంది విదేశీయులు అలలు అలలుగా ఉరికి వచ్చారు. వచ్చిన వాళ్ళు తిరిగి వెళ్ళిపోకుండా భారతదేశంలోనే**





క్రీ.పూ. 167-159 నాటి బాక్ట్రియా నాణెం                    నాణెం వెనుక భాగం

స్థిరపడిపోయి ఒక సరికొత్త జీవన విధానాన్ని భారతీయ సంస్కృతికి పరిచయం చేశారు. ఆ విధంగా దేశంలోకి చొచ్చుకువచ్చిన విదేశీయులు- బాక్ట్రియా గ్రీకులు, పార్థియన్లు, శకులు, కుషాన్లు. ఒక్క గ్రీకులు తప్ప మిగిలిన వారంతా మధ్యాసియా నుంచి వచ్చిన వాళ్ళు. మధ్యాసియా నుంచి భారతదేశంలో ప్రవేశించి భారతీయ సంస్కృతిని ప్రభావితం చెయ్యటమే కాకుండా భారత ప్రజల్లో ఒక భాగంగా కలిసిపోయిన పరిణామ క్రమంలో ఇది ఆరంభం.

ఇండో గ్రీకులు : అలెగ్జాండర్ సేనాపతులు ఇరాన్, అఫ్ఘనిస్థాన్‌లలో ప్రభువులుగా పీఠం వేశారు. తరువాత, వాళ్ళ వారసుల కళ్ళు ఉత్తర భారతదేశం మీద పడ్డాయి. ఉత్తరాది ఆనాడు సుసంపన్నంగా ఉంది పైగా ఇరాన్, పశ్చిమ ఆసియాలతో వర్తక వాణిజ్యాలు ముమ్మరంగా సాగుతున్నాయి. శక్తివంతమైన మౌర్య సామ్రాజ్యం ముక్కలు చెక్కలయ్యాక గ్రీకు రాజులకు పంజాబు ప్రాంతాన్ని, కాబూలు లోయని జయించటం సులువయింది. ఇండో-గ్రీకు రాజులు పరిపాలించిన గాంధార దేశమంటే ఇదే. వాళ్ళు అనేక నాణాల్ని ముద్రించారు. ఆ నాణాల ఆధారంతోనే ఆ కాలపు చరిత్రని పొందుపర్చటం సాధ్యమైంది. మీనాండర్ లాంటి ఇండో గ్రీకు రాజులు కొందరు బౌద్ధ మతం స్వీకరించారు. మరికొందరు విష్ణువుని ఆరాధించారు. కాబట్టి వాళ్ళ సంస్కృతి వాస్తవానికి భారతీయ-యవన సంస్కృతుల సమ్మేళనం అనవచ్చు.

శకులు : శకులు పశ్చిమ భారత ప్రాంతంలోకి చొచ్చుకువచ్చి సింధు, సౌరాష్ట్రాలని కొల్లగొట్టి చివరికి కాఠియవాడ్, మాళవ ప్రాంతాలలో స్థిరపడ్డారు. [illegible]

యుద్ధాలు సాగాయి శకరాజుల్లో [illegible]

శాతవాహన సామ్రాజ్యం [illegible]

ప్రాంతంలో [illegible] 150వ సంవత్సరం నాటి ఒక శాసనంలో రుద్రదమ [illegible]

వ్యక్తిత్వం నిపులంగా వర్ణించబడింది. రుద్రదమనుని మరణానంతరం శకరాజ్య శక్తి సంపదలు [illegible]

పోయాయి. ఉత్తర ప్రాంతానికి తమ రాజ్యాన్ని విస్తరింపజేయ్యాలనే శకుల ప్రయత్నం కుషాన్ల రాకతో వమ్మయిపోయింది.

కుషాన్లు : చైనా టర్కిస్థాన్‌ల యూచీ తెగకి చెందిన కుషాన్లు క్రీ. శ. 1వ శతాబ్దంలో అఫ్ఘనిస్థాన్‌లో ప్రవేశించి ఇండో-గ్రీకు రాజుని ఓడించి తక్షశిల, పెషావర్‌లలో రాజ్యాధికారం స్థాపించుకున్నారు. క్రమేణా పంజాబ్ మైదానం మొత్తం స్వాధీనం చేసుకున్నారు కుషాన్ రాజ్యం దక్షిణ భూభాగంలో మధుర అతి ముఖ్యమైన కేంద్రం కుషాన్ రాజుల్లో కనిష్కుడు మహా కీర్తిశాలి. అతని కాలంలోనే కుషాన్



మధుర వద్ద దొరికిన కనిష్కుని శిథిల విగ్రహం

వంశం గొప్ప పేరు ప్రతిష్ఠలు పొందింది. ఉత్తర భారతదేశ సాంస్కృతిక వికాస చరిత్రలో కుషాన్ యుగం ఒక విశిష్ట అధ్యాయం. కనిష్కుని సైన్యాలు మధ్యాసియా దాకా జైత్ర యాత్ర కావించాయి. కుషాన్ రాజ్యం దక్షిణాన సాంచీ దాకా, తూర్పున వారణాసి దాకా విస్తరించింది. చైనా చరిత్ర పుటల్లో ఒక కుషాన్ రాజు ప్రస్తావన ఉన్నది. హన్ చక్రవర్తి సేనలతో కుషాన్ సైన్యం తలపడి జనరల్ పాన్‌చావో చేతుల్లో ఓడిపోయినట్లు తెలుస్తుంది.



తక్షశిలలో ఒక ఆరాధనా మందిరంలో దొరికిన శిరో శిల్ప ప్రతిమ-అచ్చుపోయటాని ఉపయోగించే ఒక రకమైన గచ్చులో తయారు చేయబడింది. కుషాన్ కాలం నాటి గాంధార శిల్పం. గ్రీకు-రోమన్ శిల్పకళా సంప్రదాయ ప్రభావాన్ని ఇది ప్రస్ఫుటంగా సూచిస్తుంది. ఈ ప్రతిమ ముఖంలో గోచరించే భావాభివ్యక్తి అసాదృశమని కళావేత్తల అభిప్రాయం.

బౌద్ధుల వ్రాతల్ని బట్టి కనిష్కుడు బౌద్ధ మతాభిమాని, అతడు బౌద్ధ స్థూపాలు, చైత్యాల నిర్మాణానికి భూరి విరాళాలిచ్చాడు. అతని కాలంలోనే బౌద్ధ ధర్మశాస్త్రం, సిద్ధాంతాల మీద సమగ్ర చర్చ జరపటం కోసం నాల్గవ బౌద్ధ సంఘ సదస్సు జరిగింది. దాని ఫలితంగానే, బౌద్ధమత ప్రచార కార్యకలాపాలు బలం పుంజుకున్నాయి. బౌద్ధమత ప్రచారకులు మధ్యాసియాకు, చైనాకు పయనించారు.

వీటన్నింటి ఫలితంగా- మతానికి, కళలు, విజ్ఞాన శాస్త్రాలకు సంబంధించి అనేక నూతన భావాలు భారతీయ జీవన వివిధ రంగాలలో ప్రవేశించాయి. తద్వారా అనేక మార్పులు చోటు చేసుకున్నాయి. భారత దేశం ఇరాన్, మధ్యాసియాలకు సన్నిహితమయింది. వాణిజ్యం ముమ్మరించింది. భారతీయ వస్తువులు మధ్యధరా సముద్ర తీర నగరాలకు రవాణా అయ్యాయి. ఈజిప్టులో నైలు నదీ ముఖంలోని అలెగ్జాండ్రియా రేవు పట్టణంతో భారతీయ వాణిజ్యం పెరిగింది. భారత దేశానికి అలెగ్జాండ్రియాకి మధ్య గల అనంత దూరం ఇరు దేశాల మధ్య వాణిజ్య వికాసానికి అడ్డంకి కాలేదు. వర్తక వ్యాపారాల కారణంగా తక్షశిల, మధుర, ఉజయిని

మొదలైన పట్టణాలు ప్రాముఖ్యం సంతరించుకున్నాయి.

మధ్యాసియాతో సంబంధాల వల్ల గ్రీకు శిల్పం ఉత్తర భారతదేశ నగరాలకు పాకింది. గ్రీకు రోమన్ దేవతల ప్రతిమలు, మధ్యధరా సముద్ర తీర ప్రజల బొమ్మలు మన నగరాల్లో దర్శనమిచ్చాయి. గాంధారలో పనిచేసే భారతీయ కళాకారులు, శిల్పులు ఈ నూతన శిల్ప కళా ధోరణిలో ఆసక్తి ప్రదర్శించారు; ప్రభావితులయ్యారు. వాళ్ళు తయారుచేసిన బుద్ధ విగ్రహాలు, బుద్ధుని జీవితంలోని ప్రధాన ఘట్టాలను, చిత్రిస్తూ చెక్కిన శిల్పాలు గ్రీకు శిల్పకళా ధోరణిని ప్రతిబింబించాయి. దీన్నే గాంధార శిల్పకళ అన్నారు. ఈనాటి పంజాబు, కాశ్మీరు వంటి ప్రాంతాలలోనే కాకుండా అఫ్ఘనిస్థాన్‌లో సైతం గాంధార శిల్పకళ చాలా ఆదరణ పొందింది. అక్కడ జరిపిన తవ్వకాల్లో గాంధార శిల్పకళావశేషాలు బయల్పడ్డాయి. మధురలోని భారతీయ శిల్పులు గాంధార శిల్ప సంప్రదాయాన్ని అనుకరించకుండా స్వతంత్ర శైలిలో బుద్ధ విగ్రహాలు మొదలైనవి నిర్మించారు. దీన్ని మధుర శిల్పకళా సంప్రదాయం అంటారు.

ఆ ప్రతిమలు, విగ్రహాలు కేవలం బుద్ధునివే కావు; బోధిసత్వులని పిలవబడే అనేక మంది మహాపురుషులవి కూడా. బోధిసత్వులంటే బుద్ధుడు పుట్టక పూర్వమే ఈ పృధ్విలో జీవించిన పుణ్యపురుషులు జాతక కథల్లో బోధిసత్వుల్ని గూర్చి అనేక కథలున్నాయి. అప్పటికి బౌద్ధ మతం చాలా మారిపోయింది బుద్ధుడు బోధించిన నాటి నిరాడంబర మతం కాదు; పైగా మహాయాన, హీనయాన శాఖలుగా చీలిపోయింది మహాయానం అనేక క్రతువులు, కర్మకాండల్లో ముడిపడింది. మహాత్ములకు పూజలు మొదలయ్యాయి మహాయాన మతాచార్యులు అత్యంత శక్తివంతంగా తయారయ్యారు. ఈ మహాయాన శాఖని అంగీకరించని ప్రజలు భారత దేశంలో వేరే చోట్ల ఉన్నారు. వాళ్ళని హీనయాన బౌద్ధులు అనేవాళ్ళు. మహాయాన బౌద్ధులు చైనాకు మతప్రచారకుల్ని పంపించారు. కొద్ది కాలంలోనే బౌద్ధం మధ్యాసియా, చైనాలలో విశేషవ్యాప్తి చెందింది.

మధ్యాసియాతో మన సంబంధాల ద్వారా మరొక ముఖ్యమైన ఫలితం కలిగింది. భారతీయ ఖగోళ శాస్త్రజ్ఞులు తమ విజ్ఞానాన్ని గ్రీకుల శాస్త్ర విజ్ఞానంతో పోల్చి చూసుకున్నారు. తద్వారా మన ఖగోళ విజ్ఞానం ముందంజ వేసే వీలు కలిగింది. శాస్త్రీయ అధ్యయనానికి ఇది చాలా ఉపయోగపడింది గాని రాను రాను జ్యోతిష శాస్త్రంగా వెర్రి తలలు వేసింది. శుశ్రుతుడు, చరకుడు రాసిన గ్రంథాలు, చేసిన కృషి ద్వారా వైద్య విజ్ఞానం వికసించింది. శస్త్ర చికిత్సా రంగంలో గణనీయమైన అభివృద్ధి సాధించబడింది. రానున్న శతాబ్దాలలో గుప్తుల కాలంలో సాధించబోయే ప్రగతికి భారతదేశంలో రంగం సిద్ధమవుతోంది.

# 7

# ఉత్తర భారతంలో "విశిష్టయుగ" ఆవిర్భావం

## క్రీ. శ. 300 - 700

*గుప్తయుగం :* మౌర్యుల తరువాత భారతదేశంలోకి వచ్చిన యవనులు (గ్రీకులకు,రోమనులకు మనం పెట్టిన పేరు), కుషాన్లు, శకులు మొదలైన విదేశ జాతులు, తెగలు ఈ దేశంలో స్థిరపడిపోయారు; ఇక్కడి మతాల్ని స్వీకరించారు, ఈ సంస్కృతిని ఒంటపట్టించుకున్నారు కాలక్రమేణా, వాళ్ళు పదహారణాల భారతీయులయ్యారు. క్రీ.శ. 4వ శతాబ్దంలో మగధలో ఒక కొత్త భారతీయ వంశం తలెత్తింది. ఉత్తర భారతదేశంలో ఒక విశాల రాజ్యాన్ని నిర్మించిన ఆ కొత్త పాలక వంశం గుప్తవంశం. గుప్తవంశరాజులు రెండువందల ఏళ్ళకు పైగా ఉత్తరభారతదేశంలో ఒక సువిశాల భూభాగాన్ని పరిపాలించారు. ప్రాచీన భారత చరిత్రలో గుప్తయుగాన్ని విశిష్టయుగంగా చరిత్రకారులు పేర్కొంటారు.

ఉన్నత వర్గాల ప్రజలకు సంబంధించినంతవరకు ఈ వర్ణన అక్షరాల సరిపోతుంది. పై వర్గాల జీవన ప్రమాణాలు వెనక కనీవినీ ఎరగని ఉచ్చస్థాయి అందుకున్నాయి. ఉత్తరభారతదేశం మట్టుకి ఈ వర్ణన యదార్థం గుప్తులు పాలించిన కాలాన్ని "స్వర్ణయుగం"గా కూడా వర్ణిస్తారు. ఇరవయ్యో శతాబ్ది ఆరంభంలో రాసిన చరిత్రకారులకు స్వర్ణయుగం అంటే సుదూరగతంలో వర్ధిల్లిన ఒక సంపూర్ణ ఆదర్శ లోకం అయి వుండాలి; హిందూ సంస్కృతి సుస్థిరంగా వేళ్ళు తన్నిన కాలం కూడా అయివుండాలి. ఏమైనా, గుప్తయుగ వైశిష్ట్యం ఉత్తర భారతానికి మాత్రమే పరిమితమైంది.

గుప్తవంశ రాజుల్లో చెప్పుకోదగ్గ తొట్టతొలి ముఖ్యుడు మొదటి చంద్రగుప్తుడు. అతడు లిచ్ఛవీ గణానికి చెందిన కుమారదేవిని వివాహమాడాడు అప్పటికి లిచ్ఛవీ గణానికింకా ఈశాన్య భారతంలో కీర్తి ప్రతిష్ఠలున్నాయి. అతడు సుమారు క్రీ శ. 320 లో రాజ్యానికి వచ్చాడు. సాకేత (అయోధ్య ప్రాంతం), ప్రయాగ (అలహాబాదు), మగధలతో కూడిన చిన్న రాజ్యాన్ని పరిపాలించాడు. అతని కుమారుడు సముద్రగుప్తుని కాలంలో మగధరాజ్యం ఉత్తరహిందుస్థానంలో తిరిగి శక్తివంతంగా రూపొందింది.

సముద్రగుప్తుని గురించి* అలహాబాదు శాసనం ద్వారా చాలా సమాచారం అందుబాటయింది. ఆ

* శాంతికాముకుడయిన అశోకుని శిలాస్తంభం పైననే సమరకాముకుడైన సముద్రగుప్తుని శాసనం చెక్కబడింది.

శాసనాన్ని సముద్రగుప్తుని ఆస్థాన కవి ఒకరు రచించారు. అందులో అతను సాధించిన దిగ్విజయ పరంపర విపులంగా వర్ణించబడింది.

సముద్రగుప్తుడు తండ్రిచేత పట్టాభిషిక్తుడయిన తరువాత అనేక దండయాత్రలు జరిపి ఎన్నో రాజ్యాలను గెలిచాడు. మొట్టమొదట ఉత్తర భారతదేశంలోని నలుగురు రాజుల్ని ఓడించి నేటి ఢిల్లీ ప్రాంతాన్ని, ఉత్తరప్రదేశ్ పడమటి భాగాన్ని తన రాజ్యంలో కలుపుకున్నాడు. దక్షిణభారతదేశం, తూర్పు భారత ప్రాంతం యుద్ధంలో ఓడి కప్పం చెల్లించాయి. ఆర్యావర్తంలో (గంగామైదానంలో పశ్చిమ భాగం) తొమ్మిది రాజ్యాలు కూకటి వేళ్ళతో పెకలించబడ్డాయి. వింధ్యారణ్యపు ఆటవిక రాజులు కప్పం చెల్లించారు. రాజస్థాన్‌లో మాళవ, యౌధేయ మొదలైన తొమ్మిది గణతంత్ర రాజ్యాలు సముద్రగుప్తుని సార్వభౌమాధికారాన్ని అంగీకరించాయి. కుషాన్లు, శకులు, ఆఖరికి సింహళరాజుతో సహా సముద్రగుప్తునికి కప్పం చెల్లించారు

అయితే, ఈ శాసనంలో వర్ణించబడ్డ దిగ్విజయ యాత్రకి సంబంధించి మనం కొంత మెళకువ ప్రదర్శించాల్సిన అవసరం ఉంది. దక్కను, దక్షిణాది రాజులు సముద్రగుప్తుని సార్వభౌమాధికారం కింద లేరు. అనేకమంది ఉత్తరహిందూస్థానం రాజుల మాదిరిగా కేవలం నజరానా చెల్లించారు. చాలామంది రాజులు కప్పం చెల్లించారే గాని, వాళ్ళ రాజ్యాలు సముద్రగుప్తుని సామ్రాజ్యంలో చేరిపోలేదు. అతని ప్రత్యక్ష రాజ్యాధికారం గంగానదీ మైదానానికి మాత్రమే పరిమితమైంది శకులు పశ్చిమభారతదేశాన్ని ఎదురు లేకుండా ఏలారు. రాజస్థాన్ తెగలు కేవలం కప్పం చెల్లించాయే గాని రాజ్యాలు అప్పగించలేదు. పంజాబు అతని ప్రత్యక్ష రాజ్యాధికార పరిధికి వెలుపలే ఉంది. సింహళరాజు గయలో ఒక బౌద్ధ విహారాన్ని నిర్మించటానికి అనుమతి కోరుతూ కానుకలు పంపాడేగాని కప్పం చెల్లించలేదు.

మౌర్యరాజులతో పోల్చిచూస్తే, గుప్తరాజుల ప్రత్యక్ష పరిపాలన కింద వున్న భూభాగం చిన్నది. కప్పం చెల్లించిన రాజ్యాలు ప్రత్యక్షంగా గుప్త ప్రభుత్వం కింద లేవు. కాబట్టి, విస్తీర్ణంలో గుప్త సామ్రాజ్యం మౌర్య సామ్రాజ్యమంత సువిశాలమైంది కాదు.

సముద్రగుప్తుడు కేవలం విజేత మాత్రమే కాదు-కవి, సంగీత విద్వాంసుడు. వీణ వాయించే సముద్రగుప్తుని బొమ్మ గల ఒక నాణాన్ని బట్టి అతని సంగీతాభిమానం వెల్లడవుతున్నది.

*రెండవ చంద్రగుప్తుడు*. సముద్రగుప్తుని కుమారుడు రెండవ చంద్రగుప్తుడు. గుప్తరాజులందరిలో కెల్లా రెండవ చంద్రగుప్తుని మించిన ధీరోదాత్తుడు, యోధాగ్రేసరుడు మరి లేడు. అతడు విక్రమాదిత్య బిరుదాంకితుడు.

క్రీ శ. 388-409 సంవత్సరాల మధ్య చంద్రగుప్తుడు శకుల్ని ఓడించాడు. అనేక సంవత్సరాలు పశ్చిమ భారతదేశంలో దుర్నిరీక్షంగా వెలిగి, గుప్తరాజులకు పక్కలో బల్లెంలా తయారైన శకులు చంద్రగుప్తుని చేతుల్లో తిరిగి తలెత్తలేని ఓటమి చవిచూశారు. దక్కను, దక్షిణాది రాజులతో వివాహ సంబంధాలు నెరపి స్నేహవాతావరణం నెలకొల్పాడు ఆ వైవాహిక బంధాల్లో ముఖ్యమైనది-తన కుమార్తెని వాకాటక రుద్రసేనునితో వివాహం జరిపించటం.

కళలను సాహిత్యాన్ని పోషించిన ప్రభువుగా చంద్రగుప్తుడు చరిత్ర ప్రసిద్ధి పొందాడు. ఆయనని

మెప్పించిన తాత్వికులు, కవులు, రచయితలు భూరి బహుమానాలు పొందారు. మహాకవి కాళిదాసు చంద్ర గుప్తుని ఆస్థానకవి. క్రీ. శ. 405-411 సంవత్సరాల మధ్య భారతదేశాన్ని సందర్శించిన చైనా బౌద్ధ యాత్రికుడు పాహియాన్ చంద్రగుప్తుని కాలంనాటి పరిస్థితుల్ని వర్ణిస్తూ దేశం బహు సుభిక్షమై వుందని రాశాడు.

చంద్రగుప్తుని తరువాత వచ్చిన గుప్తరాజులు బలహీనులు. దానికి తోడు, భారతదేశానికి ఉత్తర సరిహద్దునుంచి హూణుల దండయాత్రలు ప్రారంభమయ్యాయి. హూణులు మధ్యాసియా సంచార తెగకి చెందినవాళ్ళు. చైనాని ఓడించటానికి ప్రయత్నించి విఫలురై భారతదేశ సంపదని గురించి విని 5వ శతాబ్దంలో ఉత్తర భారతదేశం మీదికి దండెత్తి వచ్చారు. హూణుల ఎడతెగని దాడుల వల్ల గుప్తరాజుల ప్రతిఘటనా శక్తి సన్నగిలి పోయింది. చివరికి హూణులు పంజాబు, కాశ్మీరాలకు ప్రభువులయ్యారు. సుమారు వంద సంవత్సరాలపాటు హూణులు మహా బలీయంగా ఉన్నారు. తరువాత, వాళ్లూ క్షీణించి పోయారు. అప్పటికే హూణుల్లో అనేక మంది ఈ దేశంలో శాశ్వతంగా స్థిరపడిపోయి భారత ప్రజల్లో ఒక భాగంగా కలిసిపోయారు.

*గుప్తపరిపాలన* : మౌర్య పరిపాలనకు భిన్నమైంది గుప్త పరిపాలన. గుప్త సామ్రాజ్యం రాష్ట్రాలుగా (దేశం లేదా భుక్తి), రాష్ట్రాలు జిల్లాలుగా (ప్రదేశం లేదా విషయం) విభజించబడింది. ప్రతి జిల్లాకు ప్రత్యేకంగా పరిపాలనోద్యోగులు ఉండేవాళ్ళు. అయితే, స్థానిక పరిపాలన దాదాపు కేంద్ర ప్రభుత్వంతో సంబంధం లేకుండా స్వతంత్రంగా నడిచింది. రాజకీయ విధానానికి సంబంధించిగాని, కొన్ని విడి విడి పరిస్థితుల్లోగాని నిర్ణయాలు స్థానిక స్థాయిలో జరిగాయి. జిల్లాని పాలించే ఆయుక్త, రాష్ట్రపాలనని నిర్వహించే కుమారామాత్య-ఈ ఇద్దరు అధికారులే స్థానిక పరిపాలనకు-కేంద్ర ప్రభుత్వానికి మధ్య లింకు. మౌర్యులకు—గుప్తులకు మధ్య వ్యత్యాసం ఇక్కడ స్పష్టంగా కనిపిస్తుంది. జిల్లాల్లో పనిచేసే చిన్న అధికారుల కార్యకలాపాల్ని సైతం అశోకుడు కనిపెట్టి ఉండేవాడు గుప్తరాజులు స్థానిక పరిపాలనాధికారం ఆయుక్త, కుమారామాత్యుల చేతుల్లో పెట్టి సంతృప్తిపడ్డారు.

పల్లెటూళ్ళు గ్రామణి, గ్రామ పెద్దలతో కూడిన గ్రామ సంస్థల అదుపులో ఉండేవి. స్థానిక ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే పరిపాలనా నిర్వహణని ప్రవేశ పెట్టే ధోరణిని ఇది ప్రతిబింబించింది. అంతేగాని, అధికార్లతో కూడిన యంత్రాంగాన్ని రుద్దే ధోరణి కానరాదు. నగరాలలో సైతం వర్తక శ్రేణుల ముఖ్య ప్రతినిధి, వృత్తి పనివారి ప్రతినిధి, ఒక ముఖ్య రాజోద్యోగితో కూడిన పురపాలక సభ నగరపాలన నిర్వహించేది. మౌర్యులకాలంలో నగర పాలన నిర్వహించే కమిటీల్ని ప్రభుత్వమే నియమించింది. గుప్తుల కాలంలో నగరసభలో స్థానిక ప్రతినిధులకు ప్రాతినిధ్యం ఉంది. ముఖ్యంగా, వాణిజ్య వర్గాలు ఆధిక్యత సంపాదించాయి.

గుప్తులు తమ రాజోద్యోగులకు వేతనాలు నగదురూపంలో చెల్లించారు. గుప్తుల అనంతరం ఈ పద్ధతి మారిపోయింది. నగదు రూపంలో వేతనాల చెల్లింపు పద్ధతికి బదులు జాగీర్లు ఇచ్చి పన్ను వసూలు చేసుకునే అధికారం ప్రభుత్వాధికారులకు ప్రసాదించింది.

భూములు అనుభవించమని ఇచ్చిన హక్కు ద్వారా రాజోద్యోగులమీద రాజు అదుపాజ్ఞలు అదు

గంటాయి. మౌర్యులకాలంలో మాదిరిగా అధికార్ల మీద అదుపు లేకుండాపోయింది. రెండవ చంద్రగుప్తుని తరువాత వచ్చిన రాజులు బలహీనులు కావటంవల్ల దూర రాష్ట్రాల్ని పాలించే అమాత్యులు రాజుల మాదిరి అధికారం చలాయించారు. గుప్త సామ్రాజ్యం విచ్ఛిన్నమైపోయినప్పుడు, ఈ అమాత్యులు తాము పాలించే చిన్నచిన్న రాష్ట్రాలకు ప్రభువులుగా ప్రకటించుకున్నారు.

## ప్రజాజీవనం

*సమాజం :* కుషాన్ రాజులకాలంలో భారతీయ బౌద్ధ భిక్షువులు, మత ప్రచారకులు మధ్యాసియా, పశ్చిమాసియాలలో బహు చురుగ్గా ఉన్నారు. కొందరు ప్రచారకులు చైనాలో కూడా ప్రవేశించారు. చైనా పండితులకు బౌద్ధమతం పట్ల ఆసక్తి కలిగింది. భారతదేశంలో దొరికే బౌద్ధ మూల గ్రంథాలను అధ్యయనం చెయ్యాలని వాళ్ళు తపించిపోయారు. అటువంటి వాళ్ళలో పాహియాన్ ఒకడు. ఆయన క్రీ.శ. 399లో చైనా నుంచి బైల్దేరి గోబీ ఎడారిదాటి, మధ్యాసియా గుండా నడిచి భారతదేశం చేరుకున్నాడు. బౌద్ధ మూలగ్రంథాలు అధ్యయనం చేస్తూ, స్వదేశానికి వెంట తీసుకుపోవటానికి ధర్మగ్రంథాలు సేకరిస్తూ ఆయన వివిధ బౌద్ధ విహారాలలో చాలా ఏళ్ళు గడిపాడు. చైనా తిరిగి వెళ్ళాక ఆయన భారతదేశంలో తన అనుభవాల్ని విపులంగా రాశాడు. గుప్తకాలం నాటి భారతదేశం గురించి తెలుసుకోడానికి ఫాహియాన్ వ్రాతలు చాలా ఉపయోగపడతాయి. ఆనాడు బౌద్ధులు బ్రాహ్మణులు పరస్పరం శాంతి, సఖ్యతలతో జీవించారని ఆయన రాశాడు. భారతదేశ సౌభాగ్య, సంపదల్ని ఆయన ఉజ్వలంగా వర్ణించాడు. ప్రజలు నిజాయితీ పరులుగా, చట్టవిధేయులుగా జీవించారు. చట్టాలు మెతగ్గా ఉన్నాయి; శిక్షలు క్రూరంగాలేవు. గ్రామాలు అసంఖ్యాకం. సాగుభూమి మీద విధించే పన్నుల ద్వారా ప్రభుత్వానికి ఆదాయం వచ్చేది. పాహియాన్ రాసిన దాన్ని బట్టి ఎక్కువ మంది ప్రజలు శాకాహారులు. అయితే, ఇతర చారిత్రకాధారాల్ని బట్టి ఆ కాలంలో మాంసాహారం తీసుకునే అలవాటు ఉన్నట్టు కనబడుతుంది.

సమాజం కులాలుగా విభజింపబడి ఉంది. సమాజంలో అధిక సంఖ్యాకులు సామరస్యభావంతో కలిసి మెలిసి జీవించారు. కాని, ఒక తరగతి మనుషుల్ని మాత్రం చాలాహీనంగా చూశారు—వాళ్లే అంటరానివాళ్ళు. వాళ్ళు ఊరికి, నగరానికి వెలుపల నివసించారు. నగరంలోని పౌరులకు ఎడంగా జీవించారు. ఉన్నత కులాల వాళ్ళు ఆ తరగతిని ఎంత హీనంగా పరిగణించారంటే, వాళ్ళ నీడపడితేచాలు అపవిత్రులమైపోతామనుకునే వాళ్ళు. ఈ అంశం గుప్తకాలం నాటి సమాజానికి శోభ నివ్వదు. తోటి మానవులపట్ల అటువంటి నిర్దాక్షిణ్యం గుప్త నాగరికతకి తీవ్ర కళంకం

*వాణిజ్యం :* వ్యాపార వాణిజ్యాలు పెరిగాయి కాబట్టి పట్టణాలు సౌభాగ్యవంతం అయ్యాయి. గుప్తులకాలంలో భారతదేశం లోపల జరిగే వ్యాపార కార్యకలాపాలే కాకుండా మధ్యాసియాతోను, ఆగ్నేయ ఆసియాతోను విదేశ వాణిజ్యం విశేషంగా జరిగింది. వర్తకులు అధిక సంఖ్యలో విదేశాలకు ప్రయాణంచేసి, వెంట తీసుకుపోయిన వివిధ సరుకుల్ని విక్రయించి అపారలాభాలు ఆర్జించారు. వ్యాపార వాణిజ్యాల వికాసంతోపాటు సముద్రయానం గురించిన పరిజ్ఞానం, నౌకా నిర్మాణ కౌశల్యం అభివృద్ధి అయ్యాయి. పూర్వం కన్నా పెద్ద పెద్ద నౌకలు నిర్మించారు. తూర్పు, పడమటి కోస్తాల వెంబడి రేవు పట్టణాల్లో నౌకల రద్దీ పెరిగింది.

ఆగ్నేయ ఆసియా దేశాలతో జరిగిన వ్యాపారంలో ఎక్కువ భాగం గంగా మైదానంలోని తామ్రలిప్తి రేవు ద్వారా జరిగింది. సువర్ణభూమి (బర్మా), యవ ద్వీపం (జావా), కాంభోజ (కంబోడియా) ఆనాడు ప్రధానమైన ఆగ్నేయాసియా దేశాలు. పడమటి తీరంలో బ్రోచ్ (భరుకచ్ఛం), సోపార, కళ్యాణ్ ప్రధానమైన ఓడరేవులు. ఈ రేవుల నుంచి కూడా అనేక నౌకలు ఆగ్నేయాసియా దేశాలకు పయనమై వెళ్ళాయి. వ్యాపారం సరసన భారతీయ మత, సంస్కృతులు-బౌద్ధం, హిందూమతం, సంస్కృత భాష, కళలు, ఇంకా తదితర భారతీయ సంస్కృతీ రూపాలు ఆగ్నేయ ఆసియా చేరాయి. ఆగ్నేయ ఆసియా ప్రజలు తమ దేశీ సంప్రదాయ, సంస్కృతుల్ని కాపాడుకుంటూనే భారతీయ సంస్కృతిలోని కొన్ని అంశాల్ని అభిమానించి, స్వీకరించారు. ఈ నాటికీ కూడా భారత-ఆగ్నేయాసియా సంస్కృతుల మధ్య చాలా సామ్యం ఉంది

మలబారు తీరంలో కాలికట్టు, కొచ్చిన్ మొదలైన రేవు పట్టణాల నుంచి భారతీయ వస్తువులు ఆఫ్రికా, అరేబియా, ఇరాన్, మధ్యధరా సీమలకు రవాణా అయ్యాయి. వర్తకుల బిడారుల్తో కలిసి మత ప్రచారకులు భూమార్గాన మధ్యాసియాకు, చైనాకు పయనించారు.

మతం : గుప్తులకాలంలో హిందూమతం చాలా శక్తివంతంగా రూపొందింది. వాస్తవానికి "హిందు" శబ్దం అరబ్బులు వచ్చాక వాడుకలోకి వచ్చింది. హింద్‌దేశ ప్రజలు కాబట్టి భారతీయుల్ని వాళ్ళు హిందువులని వ్యవహరించారు. హిందువులు శివ, విష్ణువుల్ని ఆరాధించారు. శైవ, వైష్ణవారాధన గుప్తుల కాలంలో బహుళ ప్రజాదరణ పొందింది. అంచేత గుప్తులకాలంనాటి మతాన్ని మనం హిందూమతం అనే ప్రస్తావిస్తున్నాం

గుప్తరాజుల్లో ఎక్కువ మంది వైష్ణవులు, అంటే గుప్తులు విష్ణువుని ఆరాధించారని భావం వాళ్ళు అశ్వమేథం లాంటి యజ్ఞయాగాదులు చేశారు. దేవాలయ నిర్మాణానికి, గ్రంథ రచనకు భూరి విరాళాలు ఇచ్చారు. బౌద్ధులు, జైనులు, శైవులు మొదలైన ఇతర మతస్థుల కూడా దానధర్మాలు చేశారుగాని గుప్తులు బ్రాహ్మణ మత పక్షపాతులు. వైదిక క్రతువులు వగైరా చేసినప్పటికీ, వైదిక కాలంలో చేసినంత విస్తారంగా మాత్రం కాదు ప్రార్థనలు, శ్లోక పఠనం ద్వారా విష్ణువుని భక్తితో పూజించటమే ఎక్కువ ముఖ్యమని ఇప్పుడు బ్రాహ్మలు కొత్త వివరణ ఇచ్చారు మానవుల్ని సన్మార్గంలో నడిపించటానికి విష్ణువు యుగే యుగే ఈ భూమి మీద అవతరిస్తాడనే నమ్మకమే ఇందుకు కారణం. (మానవ రూపంలోగాని, మృగ రూపంలోగాని అవతరిస్తాడు) రామాయణం, మహాభారతం, పురాణాలు వగైరా ప్రాచీన సాహిత్యాన్ని ఈ కాలంలోనే తిరగరాశారు. వాటిని మతహితమైన సాహిత్యంగా పరిగణించటం మొదలయింది ఈనాడు మనం సంస్కృతంలో చదివే ఆ కావ్యాలు, పురాణాలు గుప్తుల కాలంలో తిరగరాయబడ్డవే.

శిల్పం గుప్త రాజులు, వారి సమకాలికులైన ఇతర రాజులు శైవ, వైష్ణవ దేవాలయాల నిర్మాణానికి విశేషంగా ధన సహాయం చేశారు. ఇవి కొండల్లో తొలిచి, మలిచిన అజంతా, ఎల్లోరా గుహాలయాల వంటివికావు; ఇటుక, రాళ్ళతో పక్కాగా కట్టినటువంటివి. మొట్టమొదటి రోజుల్లో కట్టిన దేవాలయాలు చాలా, సామాన్యంగా ఉండేవి. ఆలయమంటే దేవతా విగ్రహాన్ని ప్రతిష్ఠించిన ఒకే ఒక గది. ఆ గది ప్రవేశ ద్వారాన్ని శిల్ప కళాభిరామంగా అలంకరించేవాళ్ళు. క్రమేణా, ఆ పద్ధతి మారిపోయింది. హిందూ దేవా

లయం గర్భ గృహంతో మొదలై (దైవ విగ్రహాన్ని ప్రతిష్ఠించే గది), ఒక ముఖ మండపం, ఒక వసారా ఒక ఆవరణ, ఆవరణ చుట్టూ ప్రహరీ సమకూడి విశాలమైంది. ఆ ఆవరణలోనే ఇంకా కొన్ని కట్టడాలు లేచాయి. మొట్టమొదటి రోజుల్లో అతి సామాన్యంగా కట్టిన హిందువుల గుడి సారనాథలో బౌద్ధ స్థూపానికి సమీపంలో ఈ నాటికీ దర్శనమిస్తుంది. అట్లాగే దేవగఢలో కూడా అలనాటి ఏక గృహ దేవాలయం ఒకటి ఉంది.

గుప్తుల కాలంలో వారణాసికి దగ్గర్లో సారనాథలో ఒక బ్రహ్మాండమైన బౌద్ధ స్థూపం ఉంది. భారతదేశం నిర్మించిన శిలా శిల్పాలలో అత్యుత్తమ శ్రేణికి చెందిన బుద్ధుని శిలా ప్రతిమలు ఇక్కడ దొరికాయి. హిందువులు కూడా దేవుని విగ్రహాల్ని తయారుచేసి గుళ్ళలో నిలపటం మొదలుపెట్టారు. కొండల్ని తొలిచి కట్టిన గుహల్లో కొన్ని బౌద్ధ విహారాలు ఉన్నాయి. ఔరంగాబాద్ సమీపంలో అజంతా విహారం అటువంటిదే. గుహల గోడల మీద బుద్ధుని జీవితాన్ని రంగుల చిత్తరువుల్లో ప్రదర్శించారు. వాటినే కుడ్య చిత్రాలని అంటాం అవి ఈనాటికీ చెక్కుచెదరకుండా ఉన్నాయి. ఆ రంగులు గీసిననాడు ఎంత కొత్తదనం వెలార్చాయో ఇప్పుడూ అలానే ఉన్నాయి.

సాహిత్యం . రాజపోషణలో సంస్కృత సాహిత్యం (పద్య, గద్యాలు రెండూ) అపూర్వంగా విస్ఫారించింది. అది సమాజంలో ఉన్నత వర్గాల సాహిత్యం, రాజాస్థాన సాహిత్యం; కులీన ప్రభువుల సాహిత్యం; ఆ వర్గాలతో అల్లుకుపోయిన శిష్టజనుల సాహిత్యం. గుప్తుల కాలం నాటి సంస్కృత సాహిత్యం మాట ఎత్తగానే, కాళిదాస మహాకవి జ్ఞప్తికి వస్తాడు. అతడతి విశిష్ట సంస్కృత కావ్య, నాటకకర్త. ఆయన "శాకుంతలమ్" సుప్రసిద్ధ నాటకం. ప్రపంచ ప్రఖ్యాతుడైన జర్మన్ మహాకవి గెటే మనస్సులో ఆ నాటకం ప్రగాఢ ముద్ర వేసింది. తద్వారా, శాకుంతలం యూరప్ ఖండమంతటా ప్రసిద్ధమైంది. ఆయన 'మేఘదూత' కావ్యం ఆనాడు గొప్ప ప్రచారంలో ఉంది. ఆనాటి కొన్ని శాసనాల్లో మేఘదూత ప్రతిధ్వనులు వినిపిస్తాయి. నీతికథా సంపుటి "పంచతంత్రం" ఆనాటి సృష్టి. పంచతంత్రం అన్ని ప్రపంచ భాషల్లోకి తర్జుమా అయింది.

విజ్ఞాన శాస్త్రం : కళా, సాహిత్యాలే కాకుండా శాస్త్ర విజ్ఞానం కూడా గుప్తుల కాలంలో అభివృద్ధి చెందింది. ఖగోళ, గణిత శాస్త్రాలలో ఆర్యభట్ట, వరాహమిహిరులు అపూర్వమైన నూతన విషయాలు వెలికి తెచ్చారు. క్రీ. శ. 499లో ఖగోళ శాస్త్రంలో ఎంతో మౌలికమైన సమస్యల్ని ప్రపంచం ముందు ఉంచిన మొట్టమొదటి శాస్త్రజ్ఞుడు ఆర్యభట్ట. $\pi$ (పై)ని 3 1416 గా నిర్ధారించినవాడు, సౌర సంవత్సరానికి 365.3586805 రోజులని తేల్చినవాడు ఆర్యభట్ట (సూర్యుని చుట్టూ భూమి ఒకసారి తిరిగి రావటానికి పట్టే కాలం). భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతుందని, చంద్రుడు భూచ్ఛాయలో పడినప్పుడు గ్రహణం పడుతుందని క్రీ. శ. 5వ శతాబ్దంలోనే కనుగొన్నవాడు ఆర్యభట్ట. కాని ఆర్యభట్ట సిద్ధాంతాన్ని ఆనాడు ఒప్పుకోలేదు. ఆయన ఆనాడు చెప్పింది నిత్యసత్యంగా ఈనాడు రుజువైంది. భారతీయ గణిత శాస్త్రజ్ఞులకు "సున్నా" గురించి తెలుసు. వాళ్ళు దశాంశ పద్ధతిని ఉపయోగించారు. ఇతర దేశాల్లో కన్నా ఆనాడు భారత దేశంలో సంఖ్యాగణిత పద్ధతి చాలా ముందంజలో ఉంది. లోహాలకు సంబంధించిన విజ్ఞానంలో ఆనాడు గొప్ప ఆసక్తి ఉంది లోహాల్ని కరిగించి ఒక దానితో మరొకటి కలపటంలో అనేక



మృగయులు 'ఛద్దంతు'ని (బోధిసత్త్వుని) పట్టుకొనబూనుట అజంటా, పదవగుహ

దంతములనుచూచి రాణి మూర్ఛిల్లుట, అజంటా, పదవగుహ

ప్రయోగాలు చేయబడ్డాయి. ఢిల్లీ సమీపంలో మెహ్రౌలిలోని ఇనుప స్తంభం ఆనాడు వాడిన అత్యున్నత శ్రేణి ఇనుముకు ఉదాహరణగా నిలిచివుంది. 23 అడుగుల 8 అంగుళాల ఆ స్తంభం ఎన్నడూ తుప్పు పట్టలేదు.

వైద్య శాస్త్ర గ్రంథ రచన కూడా ఆనాడు సాగింది. భారతీయ వైద్య విజ్ఞానం పశ్చిమంగా పయనించి పశ్చిమాసియా వైద్యుల ఉత్సుకతని పెంపొందించింది. ఆరవ శతాబ్దంలో ఒక పర్షియన్ వైద్య వేత్త భారతీయ వైద్యాన్ని అధ్యయనం చెయ్యటం కోసం ఇక్కడికి వచ్చాడు.

భాషాధ్యయనం ముఖ్యంగా వ్యాకరణం, నిఘంటు రచన చాలా ఉచ్చదశలో ఉన్నాయి.

కాబట్టి, అభివృద్ధి చెందిన ఒక నాగరికతతో ముడిపడిన అనేక ఘనకార్యాలు గుప్త యుగానికి పరిచితాలే. ప్రజలు సుభిక్షంగా, సుఖంగా జీవించారు. విద్యాధికులకు ఆలోచించటానికి, తత్వ, విజ్ఞాన శాస్త్రాలు, నాటకాలు రాయటానికి చాలినంత వ్యవధి దొరికింది. చిత్ర, శిల్ప కళల్ని ఆదరించి పోషించే దాతలున్నారు. అది ఒక అభ్యుదయ యుగం.

# 8

# చిన్న చిన్న రాజ్యాలు వర్ధిల్లిన కాలం

## ఉత్తరాది

క్రి. శ. 500-800 సంవత్సరాల మధ్య ఉత్తర భారతదేశంలో ఒక సువిశాల రాజ్యాన్ని స్థాపించే ప్రయత్నం ఒకటి సాగింది కాని, ఆ ప్రయత్నం ఆట్టే కాలం కొనసాగలేదు ఉత్తర దేశం క్రమేపీ అనేక చిన్న చిన్న రాజ్యాలుగా చీలిపోయింది ఆ రాజ్యాల మధ్య నిరంతరాయంగా యుద్ధాలు ప్రజ్వరిల్లాయి.

హర్షుడు : హూణ దండయాత్రల్తో గుప్తసామ్రాజ్యం నిర్వీర్యమైపోయింది. గుప్తరాజ్య పతనం తరువాత సుమారు నూరు సంవత్సరాలకి, 7వ శతాబ్దంలో ఒక కొత్త రాజ్యం తలెత్తింది. ఢిల్లీకి ఉత్తరంగా రమారమి 100 మైళ్ళ దూరంలో కురుక్షేత్రానికి చేరువగా థానేశ్వర్ అనే ఓ చిన్న పట్టణం ఉండేది ఇప్పుడు ఆ పట్టణాన్ని తలుచుకొనేవాళ్ళు లేరు కాని, ఆనాడది ఒక ప్రసిద్ధ రాజన్యుని జన్మస్థానం. 7 వ శతాబ్దంలో స్థానేశ్వర రాజ్యానికి అది రాజధాని; హర్షవర్ధనుడు పుట్టిన చోటు. సాధారణంగా హర్షుడని వాడుకపడ్డ అతడు 606 లో సోదరుడు మరణించగా రాజ్యానికి వచ్చినప్పుడు వయస్సులో చిన్నవాడు. కాని ఆ చిన్నవాడే ఉత్తర భారతంలో గుప్తసామ్రాజ్యానికి దీటయిన మరొక సామ్రాజ్యాన్ని నిర్మించటానికి తలపడ్డ బలమైన రాజుగా పరిణతుడయ్యాడు హర్షుని ఆస్థాన కవి అయిన బాణ మహాకవి హర్ష చరిత్ర రచించాడు. చరిత్ర ప్రసిద్ధుడైన చైనా బౌద్ధ యాత్రికుడు హ్యుయాన్‌సాంగ్ హర్షుని కాలంలోనే భారతదేశం సందర్శించాడు; తన అనుభవాల్ని పొందుపర్చి భావి తరాల కందించి పోయాడు.

హర్షుడు థానేశ్వరం నుంచి తన రాజధానిని కనౌజ్‌కి మార్చాడు. తరువాత దిగ్విజయ యాత్ర చేసి ఉత్తరభారతదేశంలో అనేక ప్రాంతాల్ని జయించాడు. పంజాబు, తూర్పు రాజస్థాన్, గంగానదీలోయ కైవసం చేసుకుని అస్సాందాకా జైత్రయాత్ర సాగించాడు. దక్కను రాజ్యాల్నికూడా ఓడించి తన సామ్రాజ్యంలో కలుపుకోవాలని కలలు కన్నాడు. గాని, వాతాపి చాళుక్యరాజు రెండవ పులకేశి ఆ ప్రయత్నానికి పుట్టిల్లోనే సంధికొట్టాడు.

హర్ష రాజ్యానికి గుప్తరాజ్యంతో పోలికలున్నాయి. హర్షుని చేతుల్లో ఓడిపోయిన రాజులు ఆయనకి కప్పం చెల్లించారు; యుద్ధావసరాలకోసం సైన్యం సమకూర్చి పంపారు; హర్షుని సార్వభౌమాధికారం

అంగీకరించారు; కాని, తమ రాజ్యాల్ని తామే పాలించారు. స్థానిక ప్రాముఖ్యం కలిగిన విషయాల్లో స్వతంత్ర నిర్ణయాలు తీసుకున్నారు.

హర్షుడు బౌద్ధమతాన్ని అభిమానించాడు. తరువాత సంవత్సరాల్లో బౌద్ధం స్వీకరించాడు. బౌద్ధం స్వీకరించినా ఇతర మతాల్ని కూడా ఆదరించాడు. హ్యుయాన్ సాంగ్ భారతదేశం వచ్చినప్పుడు ఆయనని కలుసుకోవాలని హర్షుడు ఆసక్తి ప్రదర్శించాడు. హర్షునితో సుదీర్ఘ చర్చా సంవాదాలు జరిపినట్టు హ్యుయాన్ సాంగ్ తన అనుభవాల్లో రాశాడు. ఆనాటికి వెలువడ్డ గ్రంథాల్లో హర్షునికి విశేష పరిచయ, పాండిత్యాలు ఉన్నట్టుగా ప్రశంసించాడు. హర్షుడు స్వయంగా కవి, నాటక కర్త. సంస్కృతంలో మూడు నాటకాలు రచించాడు.

*సాంఘిక పరిస్థితులు*. హర్షుని కాలంనాటి భారతదేశం గురించి తెలుసుకోడానికి బౌద్ధ యాత్రికుడు హ్యుయాన్ సాంగ్ వదిలిపెట్టిపోయిన సమాచారమే మనకు మిగిలిన చారిత్రకాధారాలలో ముఖ్యమైనది. హ్యుయాన్‌సాంగ్ తన 26 వ యేట చైనా సరిహద్దు దాటి మధ్యాసియా గుండా ప్రయాణం చేసి పాహియాన్ అడుగు జాడల్లో భారతదేశం చేరాడు. మార్గమధ్యంలో ఆయన బౌద్ధ స్మారక చిహ్నాలు నిర్మించబడ్డ అనేక పుణ్యస్థలాల్లో కొద్దికాలం నిలిచిపోయాడు; మధ్యాసియాలో ఆనాడు బౌద్ధులు విస్తారంగా ఉండేవారు. హ్యుయాన్‌సాంగ్ భారతదేశంలో విస్తృతంగా పర్యటించాడు. అనేక విహారాల్లో ఏళ్ళ తరబడి బౌద్ధ గ్రంథాలు అధ్యయనం చేశాడు. వయస్సులో ఉండగా చైనా వదిలిపెట్టిన హ్యుయాన్‌సాంగ్ వయో వృద్ధుడుగా స్వదేశం చేరాడు.

భారతదేశంలో సర్వత్రా బౌద్ధమతం మాత్రమే వ్యాపించి ఉంటుందనుకుని వచ్చిన హ్యుయాన్ సాంగ్ కొన్ని ప్రాంతాలలో మాత్రమే బౌద్ధం విశేషంగా ఉండటం గమనించాడు. భారతదేశ తూర్పు ప్రాంతంలో బౌద్ధం ఆనాడు విశేష వ్యాప్తిలో వుంది. ఆయన కొన్నేళ్ళపాటు నలందా విహారంలో (పాట్నాకు సమీపంలో ఉంది) ఉండిపోయాడు. ఆ కాలంలో భారతదేశం మొత్తంలో నలందా విశ్వవిద్యాలయాన్ని మించింది మరొకటి లేదు. యావత్ ఆసియా ఖండం నుంచి అనేకమంది పండితులు నలందాని సందర్శించారు.

వర్ణవ్యవస్థ ఉనికిని పట్టణాలకి ఎడంగా నిరాదరణలో జీవించే అస్పృశ్యుల్ని ఆయన గమనించాడు. మాంసాహారం విడనాడవలసిందిగా ప్రచారం ఉన్నప్పటికీ ప్రజలంతా శాకాహారులు కారు. పట్టణాల్లో సంపన్నుల ఇళ్ళకు పేదవారి ఇళ్ళకు మధ్య తేడా ఉంది. సంపన్నులు అద్భుతంగా కట్టిన ఇళ్ళలో జీవించారు; పేదవాళ్ళు వెల్లవేసిన సాదా మట్టి ఇళ్ళలో నివసించారు ప్రజల వస్త్రధారణలో ఒక ప్రాంతానికి మరొక ప్రాంతానికి తేడాలుండేవి. భారతదేశస్థులకు ముక్కుమీద కోపం అని వర్ణించాడు వాళ్ళ నిజాయితీని ప్రశంసించాడు. శుచి, శుభ్రతల పట్ల మన దేశస్థులు నిక్కచ్చిగా ఉండటం గురించి ప్రస్తావించాడు. నేరస్థులు ఎక్కువగా లేరని రాసినా, ప్రయాణాల్లో కొల్లగొట్టబడ్డ బాటసారుల దురదృష్ట కథల్ని ఆయన అనేకం పేర్కొన్నాడు. ఆనాడు మరణశిక్ష అమల్లో లేదు. యావజ్జీవ కారాగార వాసం ఒక్కటే అత్యంత కఠిన శిక్ష.

హర్షుని మరణంతో ఉత్తరభారతదేశంలో కొద్దికాలం పాటు గందరగోళం వ్యాపించింది.

## దక్కను పీఠభూమి, దక్షిణాది

చాళుక్యులు : శాతవాహనులు క్షీణించిపోయాక దక్కను సీమలో అనేక చిన్న రాజ్యాలు తలెత్తాయి. వాకాటకులు పటిష్టమైన రాజ్యాన్ని నిర్మించాలని ప్రయత్నించారు గాని, వారి రాజ్యం ఎక్కువ కాలం మనలేదు. వారి తర్వాత, వాతాపి రాజధానిగా చాళుక్య వంశం విజృంభించింది. చాళుక్యరాజు రెండవ పులకేశి, ఉత్తర భారతాన్ని పరిపాలించిన హర్షుడు సమకాలికులు. యావత్తు దక్కను పీఠభూమిని తన ఏలుబడి కిందికి తెచ్చుకోవాలని రెండవ పులకేశి ఆశించాడు. అతని ఆశ నెరవేరినా అది మూణ్నాళ్ళ ముచ్చటగా ముగిసిపోయింది. అతడు నర్మదా నది ఒడ్డున జరిగిన యుద్ధంలో హర్షుని ఓడించాడు. చాళుక్యులకు ఉత్తరభాగంలో రాష్ట్రకూటులు, దక్షిణాన పల్లవులు పులకేశితో శత్రుత్వం వహించారు. రాష్ట్రకూటులు ఉత్తర దక్కను పీఠభూమిలో ఒక చిన్న రాజ్యాన్ని పాలించారు. మొదట. చాళుక్యులకు అణగి మణగి ఉండి తరువాత 8 వ శతాబ్దంలో రాష్ట్రకూటులు శక్తివంతంగా రూపొందారు. చాళుక్య రాజుమీద దండెత్తి, విజయం సాధించారు. అదే సమయంలో దక్షిణాదిన పల్లవులు బలీయంగా తయారయ్యారు. రెండవ పులకేశి పల్లవరాజు మహేంద్రవర్మను యుద్ధంలో ఓడించాడు. కొద్ది సంవత్సరాల తరువాత పల్లవరాజు నరసింహవర్మ రెండవ పులకేశి మీద దాడి జరిపి అతని రాజధానీ నగరాన్ని పట్టుకున్నాడు. చాళుక్యులకిది ఘోర పరాజయం.

చాళుక్య రాజధాని వాతాపి ఆనాడు భోగభాగ్యాలతో విలసిల్లుతున్న నగరం. ఇరాన్, అరేబియా ఇంకా ఎర్ర సముద్రపు రేవులతోను, ఆగ్నేయ ఆసియా రాజ్యాలతోను చాళుక్యుల వాణిజ్య సంబంధాలు కొనసాగాయి. వాణిజ్యం ద్వారా చాళుక్య రాజ్యం సంపన్నమైంది. రెండవ పులకేశి పర్షియా రాజయిన రెండవ ఖుస్రూ దర్బారుకు ఒక రాయబార వర్గాన్ని పంపాడు. నాటికి వంద యేళ్ళ తరువాత, జొరాష్ట్రియన్ మతస్థులు ఇరాన్‌ని విడిచిపెట్టి ఇండియాకు తరలివచ్చినప్పుడు దక్కను పడమటి తీర పట్టణాల్లో స్థిరపడ్డారు. వాళ్ళనే మనం పార్శీలంటున్నాం. జొరాష్టర్ (జరాతృష్ట అని కూడా అంటారు) ప్రబోధించిన మతాన్ని జొరాష్ట్రియన్ మతం అంటారు. దాదాపు క్రీ. పూ. 6 వ శతాబ్దానికి ముందే ఆయన ఈ మతాన్ని ఇరాన్‌లో బోధించాడు. మంచి, చెడులనే అజ్ఞాతశక్తులు నిరంతరం సంఘర్షించుకొంటాయి, 'మంచి' అంతిమ విజయం పొందుతుంది అని ఆయన ప్రవచించాడు. జొరాష్ట్రియన్ మతస్థుల పవిత్ర మతగ్రంథంపేరు "జెంద్-అవెస్తా" పశ్చిమాసియా, మధ్యాసియా ప్రాంతాల ప్రజల మత విశ్వాసాల్ని జొరాష్ట్రియన్ మతం గాఢంగా ప్రభావితం చేసింది. ఇస్లాం వ్యాపించేదాకా ఇరాన్‌లో ఇదే ప్రధాన మతంగా వర్ధిల్లింది.

చాళుక్యరాజులు గొప్ప కళాపోషకులు. దేవాలయాల నిర్మాణానికి, దక్కను పీఠభూమిలోని పర్వతాల్లో గుహాలయాల నిర్మాణానికి చాళుక్యరాజులు అపారంగా డబ్బు వెచ్చించారు. ఎల్లోరా గుహల్లోని శిల్ప చిత్ర కళావైభవం చాళుక్య, రాష్ట్రకూట రాజులకు రుణపడి వుంది.

పల్లవులు దక్షిణ భారతదేశాన్ని పాలించిన పల్లవులు బహుశా శాతవాహన రాజుల సామంతులై ఉండవచ్చు. శాతవాహన రాజ్యం క్షీణదశకు వచ్చినప్పుడు పల్లవులు స్వతంత్రం ప్రకటించి తమ రాజ్యాధికారాన్ని కాంచీపురం నుంచి దక్షిణానికి విస్తరింపజేశారు. పాండ్యులతో, చాళుక్యులతో పల్లవరాజులు అనేక యుద్ధాలు చెయ్యవలసి వచ్చింది పాండ్యులు, చాళుక్యులు ఉభయులు పల్లవుల్ని పైకి రానీకుండా అణగ



7వ శతాబ్దంలో పల్లవ వంశస్థులు నిర్మించిన ఏకశిలా నిర్మితాలు-పంచ పాండవ రధములు, మహాబలిపురము

దొక్కడానికి అనేక ప్రయత్నాలు చేశారు అయినా పల్లవులు నిలదొక్కుకుని రాజ్యం స్థాపించారు. కాంచీపురానికి దక్షిణంగా వున్న ప్రాంతాన్ని, తంజావూరును, పుదుకోట్టై ప్రాంతాన్ని పల్లవులు జయించారు. వారు జయించిన ప్రాంతం చాలా సారవంతము, సంపన్నము అయిన భూమి.

పల్లవరాజు మహేంద్రవర్మ హర్షునికి, రెండవ పులకేశికి సమకాలికుడు ఆనాటి అనేకమంది రాజుల మాదిరిగానే, మహేంద్రవర్మ గొప్ప యోధుడే కాకుండా కవి, సంగీత విద్వాంసుడు కూడా. అతడు మొట్టమొదట జైనుడు తరువాత, తమిళ నయనార్లలో (శైవభక్తులు) ఒకడైన అప్పార్ అతనికి శైవమత దీక్ష ఇప్పించాడు

తమిళ శైవవైష్ణవ భక్తులు (నయనార్లు, ఆళ్వార్లు)· భగవంతునికి (విష్ణువు/శివుడు) మనిషి తనని తాను సమర్పించుకోవటమే మతసారం అని నమ్మిన కొందరు భక్తులు ఆనాడు దక్షిణాదిన ఉండేవారు. దాన్నే తరువాతి కాలంలో భక్తిధోరణి అన్నారు. ఈ వైష్ణవ, శైవ భక్తులు అనేక కులాలనుంచి వచ్చినవాళ్ళు వారిలో ఎక్కువమంది వృత్తిపనులు, వ్యవసాయం చేశారు. విష్ణు, శివ నామ సంకీర్తనం చేస్తూ వాళ్ళు ఊళ్ళు తిరిగే వాళ్ళు. వైష్ణవ భక్తుల్ని ఆళ్వారులనీ, శైవభక్తుల్ని నయనార్లనీ అంటారు. అప్పుడప్పుడు ముఖ్యంగా పర్వదినాలో వాళ్ళు కాంచీపురం చేరుకుని వైష్ణవ, శైవ భక్తి గీతాలు ఆలాపించే

వాళ్ళు. ఆ భక్తి గీతాలు ప్రజల భాష తమిళంలో రాయబడ్డవి. సంస్కృతంలో రాయబడ్డ వైదికమంత్రాలు పురోహితులకు, విద్యాధికులకు తప్ప అర్థమయ్యేవి కాదు.

కాంచీపురం పల్లవ రాజధాని మాత్రమే కాదు; తమిళ, సంస్కృత భాషా సాహిత్యాల కేంద్రం కూడా. దండి మహాకవి లాంటి వాళ్ళు రాజాస్థాన సదస్యుల కోసం, ఉన్నత కులాల వారికోసం సంస్కృతంలో రాశారు.

పల్లవరాజులు అనేక దేవాలయాలు నిర్మించారు. మహాబలిపురంలోని ఏకశిలారథాలు పల్లవులు చెక్కించినవే. ఒకే శిలనుంచి దేవాలయాలను, పెద్ద పెద్ద విగ్రహాలను జీవకళ ఉట్టిపడేట్టుగా చెక్కిన నైపుణ్యం మహాబలి పురంలోను, కాంచీపురంలోను చూడవచ్చు. దేవతా విగ్రహాన్ని ప్రతిష్ఠించిన గుడిపైన నిర్మితమైన ఎత్తయిన గోపుర శిఖరాలు నేటికీ తమిళనాడులో అనేకచోట్ల దర్శనమిస్తాయి. తమిళనాడులో పర్యటించేప్పుడు, దిగంతం మీద మొట్టమొదట దృగ్గోచరమయ్యేవి గుళ్ళ గాలి గోపురాలే.

గ్రామంలో అందరూ గుమిగూడే చోటు గుడి. అదే గ్రామస్థుల సమావేశ మందిరం. సాయంత్రం వేళ పల్లె ప్రజలు గుడి ఆవరణలో కూర్చుని వార్తలు, విశేషాలు చెప్పుకుంటారు; గ్రామసంక్షేమానికి సంబంధించిన ఊసు ముచ్చటించుకుంటారు. ఆ ఆవరణలోనే పూజారి పిల్లలకు చదువు నేర్పుతాడు. పగటి పూట గుడి ఆవరణే బడి. పండుగలకు, పబ్బాలకు ఊళ్ళో సంబరాలు జరిగితే, నృత్యాలు నాటకాలు గుడి ఆవరణలో ప్రదర్శించబడతాయి.

# 9

# మనం - మన చుట్టూ ప్రపంచం

## బైటి ప్రపంచంతో భారతీయ సంపర్కం

క్రీ. శ. 7 వ శతాబ్దం నాటికి ఆగ్నేయ ఆసియా ద్వీపాలతో భారతదేశ వాణిజ్య సంబంధాలు గణనీయంగా పెరిగాయి. భారతీయ వర్తకులు తమ సరుకుని విక్రయించటానికి, సుగంధ ద్రవ్యాలు కొనుగోలు చెయ్యటానికి ఈ ద్వీపాలకు సముద్రయానం చెయ్యటంతో వ్యాపార సంబంధాలు మొదలయ్యాయి. అక్కడ కొనుగోలు చేసిన సుగంధద్రవ్యాలు మన వర్తకులకు అపారలాభాలు ఆర్జించిపెట్టాయి. ఎంచేతనంటే, మన వర్తకులు ఆ సుగంధ ద్రవ్యాల్ని తిరిగి మధ్యాసియా వ్యాపారస్థులకు అమ్మేవారు. మాతృదేశానికి, ఆగ్నేయాసియాకు మధ్య నౌకలమీద రాకపోకలు సాగించటం కన్నా ఏకంగా ఆ ద్వీపాలలోనే నివాసం ఉండిపోతే ఇంకా సమర్థవంతంగా వ్యాపారం నిర్వహించవచ్చు అని మన వర్తకులు కొందరు అభిప్రాయపడ్డారు. వెంటనే, ఆ ద్వీపాలలో తీర రేవు పట్టణాల్లో స్థిరపడ్డారు. కొందరు ఆయా దేశాల స్త్రీలని వివాహం చేసుకున్నారు.

థాయ్ చరిత్రలో ఒక కథ ఉంది కౌండిన్యుడనే బ్రాహ్మణుడు కాంబోడియా చేరి అక్కడ స్థిరపడ్డాడు. ఆ దేశాన్ని ఏలే రాణిని పెళ్ళాడాడు. భారతీయ సభ్యతని, ఆచారాల్ని ఆమె చేత అనుసరింపజేశాడు. రాణి గారు అనుసరించారనే సరికి, దేశంలోని మిగతా ప్రభువర్గీయులంతా భారతీయ ఆచార, సంప్రదాయాల్ని స్వీకరించారు.

నెమ్మదిగా, భారతీయ సంస్కృతిలోని కొన్ని అంశాలను ఆగ్నేయ ఆసియా ప్రజలు గ్రహించారు. అయినా, ఆ ప్రజలు తమ సంప్రదాయాల్ని అనుసరించడం విడనాడలేదు. నిజానికి, వాళ్ళ సంప్రదాయాలకు మన ఆచారాలతో చాలామట్టుకి పోలిక వుంది. భారతీయ సంస్కృతి ఎక్కువగా ఆగ్నేయ ఆసియా పట్టణాల్లోను, రాజాస్థానాల్లోను సమాదరణ పొందింది. గ్రామాల్లో, పాత జీవనపద్ధతులే కొనసాగాయి. భారతీయవర్తకులు సౌరాష్ట్ర, తమిళనాడు, బెంగాలు మొదలైన అనేక ప్రాంతాలనుంచి అక్కడికి వెళ్లారు. కాబట్టి వాళ్ళు తమతోపాటు తమ ప్రాంతీయ అలవాట్లను, భావాలను అక్కడికి కొనిపోయారు. సౌరాష్ట్ర నుంచి వెళ్ళిన వాళ్ళలో ఎక్కువమంది జైనమతస్థులు; దక్షిణాదినుంచి వెళ్ళినవారు శైవ, వైష్ణవ మతస్థులు, బెంగాలునుంచి వెళ్ళిన వాళ్ళతో చాలమంది బౌద్ధులు.



హిందూ దేవాలయం-క్రీ. శ. 900లలో మధ్య జావాలో శైలేంద్ర వంశ రాజులు కట్టించిన ప్రంబారాం ఆలయ సముదాయంలో ఒక భాగం

మొట్టమొదటగా మనం సంబంధాలు పెట్టుకున్న దేశాలు : బర్మా (సువర్ణభూమి), మలయా (సువర్ణద్వీపం), కంబోడియా (కాంభోజ), జావా (యవద్వీపం)లు. భారతీయ దేవాలయాల్ని పోలిన బ్రహ్మాండమైన ఆలయాలు అక్కడ నిర్మింపబడ్డాయి. భారతీయ ఆచారాలు పాటించబడ్డాయి. కాంబోడియాలోని అంకోర్ వాట్ దేవాలయాన్ని ఉదాహరణగా తీసుకోవచ్చు. పౌరోహితులు, రాజకుటుంబీకులు సంస్కృతభాష నేర్చుకున్నారు. మన పురాణ, ఇతిహాసాలలోని కథలు తెలుసుకున్నారు స్థానిక కథలతో భారతీయ కథల్ని కలగలిపిన ఒక కొత్త తరహా సాహిత్యం అభివృద్ధి చెందింది. జావా ద్వీపంలో ఆలపింపబడే

రామాయణం జావా, భారతదేశాల సంప్రదాయాల మేలి కలయిక.

రాను రాను, హిందూమతం క్షీణించి బౌద్ధం ప్రజాదరణ పొందింది. కాంబోడియాలో బాయోన్ బుద్ధ కోవెల అంకోర్ వాట్ దగ్గర్లో నిర్మించబడింది. జావాలోని బోరి బుదూర్ బౌద్ధస్థూపం ఈనాటికూడా ఆ ప్రాంతంలో కెల్లా తలమానికమైన బౌద్ధాలయం. థాయ్‌లాండ్, బర్మాదేశాలు సైతం బౌద్ధాన్ని స్వీకరించాయి. ఆ దేశాల్లోని ఆలయాలు, శిల్ప, చిత్రకళలు మన దేవాలయాల్ని, కళా సంప్రదాయాల్ని పోలి ఉంటాయి. అయితే, ఆ దేశాల్లోని దేవాలయాల్ని, శిల్ప, చిత్రకళల్ని చూసినప్పుడు ఆ ప్రజల సంస్కృతిలో ఏదో ఒక విలక్షణత కనిపిస్తుంది. అంటే, ఆ దేశాల సంస్కృతి భారతీయ సంస్కృతికి కేవలం అనుకరణ కాదు.

వ్యాపారస్థులు, మత ప్రచారకులు ఆసియాలోని తదితర ప్రాంతాలకూడా వెళ్ళారు. ఆ కాలంలో చైనాతో మన సంబంధబాంధవ్యాలు చాలా సన్నిహితంగా ఉండేవి. చైనాలోను, మధ్యాసియాలోను బౌద్ధమతం బలీయమైన శక్తిగా రూపొందింది. అట్లాగే, మనవర్తకులు, మతప్రచారకులు మహోన్నత హిమాలయ పర్వత శ్రేణులు దాటి పయనించటంతో టిబెట్టుతో మన సంబంధాలు అభివృద్ధి అయ్యాయి. చైనా-పశ్చిమాసియాల మధ్య వాణిజ్య మార్గం మధ్యాసియా గుండా సాగింది. దీన్నే "పురాతన సిల్కు బాట" అంటాం. ముఖ్యంగా చైనా చీనాంబరాలు ఈ మార్గాన రవాణా అయ్యేవి కాబట్టి దానికాపేరు వచ్చింది. భారతీయ వర్తకులు ఈ వ్యాపారంలో విశేషంగా పాల్గొన్నారు. పశ్చిమాసియాలోని పర్షియా, అరేబియా, ఈజిప్టు దేశాలతో కూడా మన వర్తకులు వ్యాపార వాణిజ్యాలు పెంపొందించారు. ఇంకా అంతకన్నా దూర ప్రదేశాలైన తూర్పు ఆఫ్రికా తీర పట్టణాలకూడా భారతీయ వర్తకులు మన సరుకులు కొనిపోయారు.

## భారతదేశంలో అరబ్బులు

7వ శతాబ్దం దరిమిలా అరేబియాలో ఆవిర్భవించి ప్రపంచంలోని పలు ప్రాంతాలకు వ్యాపించిన ఒక నూతన, చైతన్యాత్మక శక్తి ఆసియా, ఉత్తర ఆఫ్రికాలలో తన ప్రభావం ప్రసరించింది. ఆ నూతన శక్తి-ఇస్లాం. భారతదేశంలో కూడా ఇస్లాం మతం తలెత్తి నలు చెరగులకు పాకింది. ఇస్లాం మతాన్ని మన దేశానికి తెచ్చినవాళ్ళు అరబ్బులు.

*మహమ్మద్ ప్రవక్త:* క్రీ. శ. 6వ శతాబ్దం ముగిసే సమయంలో అరేబియా చరిత్రనే కాకుండా, ఆసియా, ఆఫ్రికా దేశాల చరిత్రని సైతం మార్చివేసే ఒక బాలుడు అరేబియాలో పుట్టాడు అతడే మహమ్మద్ ప్రవక్త-ఇస్లాం నూతన మత ప్రవక్త. చిన్నతనంలో జరిగిన ఒక విషాద సంఘటన మూలంగా మహమ్మద్ ప్రవక్త ఒంటరివాడుగా బ్రతికాడు. పుట్టకముందే తండ్రి చనిపోయాడు; పుట్టి బుద్ధెరక్క ముందే తల్లి మరణించింది. ఒక మేనమామ అతణ్ని చేరదీసి పెంచాడు

ఆనాడు అరేబియా పెద్ద వ్యాపార కేంద్రం. జలమార్గాన, భూమార్గాన సరుకులు దిగుమతి అయ్యేవి. అరేబియాలో మక్కా, మదీనాలు చాలా ముఖ్యమైన పట్టణాలు పెద్ద పెద్ద ఒంటెల బిడారులు కలిగిన మహా ధనిక వర్తకులు అక్కడ నివసించే వాళ్ళు. అరేబియా, సంపద యావత్తు ఈ రెండు నగరాల్లోనే పోగుబడింది. ఎడారిలో జీవించే అరబ్బులు నిరుపేదలు; వాళ్ళది కఠోరమైన బ్రతుకు.

ఒంటెల బిడార్ల మీద సరుకులు ఒక చోటు నుంచి మరొక చోటికి రవాణా అయ్యేవి. ఆ ఒంటెల

బిడార్లలో పనిచేస్తూ మహమ్మద్ ప్రవక్త పొట్టనింపుకున్నాడు నిర్మానుష్యమైన ఆ ఎడారి ఇసుకతుప్పరల్లో సుదీర్ఘ ప్రయాణ కాలంలో మహమ్మద్ ప్రవక్తకి ఆలోచించే సమయం దొరికింది. రాజకీయంగా, అరబ్బు జాతి అనేక తెగలుగా చీలిపోయివుంది. ఆ తెగల మధ్య ఎడతెగని అంతః కలహాలు. .. మహమ్మద్ ప్రవక్త తన ప్రజల సాంఘిక జీవితం గురించి, మత విశ్వాసాలు గురించి తీవ్రంగా ఆలోచించాడు. వాళ్ళ మధ్య ఎలాగైనా ఐక్యత సాధించగలిగితే, అంతఃకలహాలు మాటుమాయమై పోయి శక్తి, సంపదల్తో పురోగమిస్తారు అని అయన ఆలోచించాడు

నూతన మతం . అరబ్బు ప్రజలు ఆనాడు అనేక దేవుళ్ళని ఆరాధించే వాళ్ళు. తన ప్రజల మత విశ్వాసాలపట్ల మహమ్మద్ ప్రవక్తకు అసంతృప్తి కలిగింది. యూదులు, క్రైస్తవుల మాదిరిగా ఆయన దేవుడొక్కడే అని నమ్మాడు. ఆనాడు అరబ్బులు రాయీ రప్పని దేవుళ్ళుగా భావించి పూజించటం తప్పని నమ్మాడు. ఆ విషయాన్ని గురించి ఆయన పదేపదే ఆలోచించాడు. భగవంతుడు తన సందేశాన్ని ప్రజలకు అందించటానికి తనని నియమించాడని మహమ్మద్ ప్రవక్త భావించాడు.

దేవుడొక్కడే; అతడే అల్లా; మహమ్మద్ ప్రవక్త అనే తను ఆ అల్లా దూత అని ప్రకటించాడు మహమ్మద్ప్రవక్త.ఈ విశ్వాసాన్ని పంచుకున్న వాళ్ళు మహమ్మదీయులు;వాళ్ళ మతం,ఇస్లాం దైవవచనంగా మహమ్మదీయులంతా భావించే కొరాన్ పవిత్ర మత గ్రంధం ప్రకారం అవసరం ఏర్పడినప్పుడంతా, భగవంతుడు ప్రజల వద్దకి ప్రవక్తని పంపుతూనే ఉన్నాడు పేరుపేరునా ఆ ప్రవక్తలు కొరాన్‌లో ప్రస్తావించబడ్డారు యూదు ప్రవక్తలైన అబ్రహాం, మోజెస్, జీసస్ క్రీస్తుల్ని దేవుని దూతలుగా మహమ్మద్ ప్రవక్త గుర్తించాడు.

ప్రతిరోజూ అయిదు తూర్లు ప్రార్థన (నమాజు) చెయ్యాలనీ, ఉపవాసాలుండాలనీ, మక్కాకు తీర్థయాత్ర చెయ్యాలనీ, తమ ఆదాయంలో కొంతభాగం దానధర్మాలకు వినియోగించాలనీ మహమ్మద్ ప్రవక్త బోధించాడు ఇస్లాం అనుయాయులు ఎలా జీవితం గడపాలో ఆయన కొన్ని నియమ నిబంధనలు ఏర్పరచాడు. భగవంతుని దృష్టిలో అందరూ సమానులే అని ఆయన నొక్కి చెప్పాడు. వర్గ, వర్ణ భేదభావాల్ని ముస్లింలు ఆమోదించకూడదని ఆయన ప్రబోధం చేశాడు.

మొట్టమొదట ఆయన తన భార్యని బంధువుల్ని ఇస్లాం మతంలోకి మార్చాడు. ఈ కొత్త మతాన్ని మొదట్లో చాలా రహస్యంగా ఉంచవలసి వచ్చింది ఆరబ్బులకు ఈ మతం సంగతి తెలిస్తే, మహమ్మద్ ప్రవక్త మీద మండిపడి పోయేవాళ్ళే

ఈమతాన్ని గురించి తెలియగానే మక్కాపౌరులు మహమ్మద్ప్రవక్తని చంపటానికి తయారయ్యారు. ఆయన మదీనాకు నిష్క్రమించాడు.ఇది 622లో జరిగింది. మహమ్మదీయులు క్యాలెండరు(హిజ్రా—ఇంగ్లీషులో A. H అని రాస్తాం) ఆ సంవత్సరం నుంచే ఆరంభమవుతుంది. చిట్ట చివరకి, మక్కా పౌరులు సైతం మనస్సు మార్చుకుని ఈ కొత్త మతాన్ని స్వీకరించారు.

ఇస్లాం మత వ్యాప్తి: క్రీ.శ. 632లో మహమ్మద్ ప్రవక్త నిర్యాణం చెందాక ఇస్లాంమతం వేగంగా వ్యాప్తి చెందింది ఒక్క శతాబ్దంలోపునే, అరబ్బు సైన్యాలు సువిశాల భూభాగం జయించాయి. వాళ్ళ జైత్రయాత్ర పశ్చిమాసియాలో మొదలై ఉత్తర ఆఫ్రికా గుండా స్పెయిన్ దాకా సాగింది. గెలిచిన భూభాగంలో

కలీఫా రాజ్యం స్థాపించబడింది. కలీఫా అంటే మహమ్మద్ ప్రవక్త తరువాత అధికారం సంక్రమించిన ఉత్తరాధికారి.

అరబ్బు రాజ్యం సువిశాలమైంది. పశ్చిమాసియా, గ్రీసు ప్రాచీన ప్రజలకు, సంస్కృతులకు-యూరప్ సంస్కృతులకు మధ్య అరబ్బులు వారధి అయ్యారు. అరబ్బులు మన దేశానికి తెచ్చిన ఇస్లాం మత ప్రభావం మన దేశం మీదా పడింది.

*భారతదేశంలో అరబ్బులు :* క్రీ. శ. 712లో అరబ్బులు సింధు రాష్ట్రాన్ని జయించారు. పశ్చిమ భారతదేశాన్ని పట్టుకునే ప్రమాదం ఏర్పడింది. ఇప్పుడు రాజస్థాన్ అని మనం వ్యవహరించే ప్రాంతంలో ఆనాటి స్థానిక పాలకులు అరబ్బు దాడిని తిప్పికొట్టారు. సింధు ప్రాంతం మీద మాత్రం అరబ్బుల రాజకీయాధికారం నిలబడింది. భారత దేశంలో ఈ ప్రాంతంలోనే మొట్టమొదట ఇస్లాం ప్రధాన మతంగా రూపొందింది. కాని, అరబ్బులు విజేతలుగా మాత్రమే రాలేదు; మన పడమటి తీరంలో పశ్చిమాసియా నుంచి వచ్చిన అరబ్బు వర్తకులు అనేక వ్యాపార కేంద్రాలు నెలకొల్పారు; స్థానిక ప్రజలతో సఖ్యతతో జీవించారు. స్థానిక స్త్రీలని వివాహం చేసుకున్నారు. ఆసియాలో ఇతర దేశాల్తో జరిగే భారత వ్యాపార వాణిజ్యాల్లో పాలు పంచుకున్నారు.

*ముగింపు :* ఆ విధంగా క్రీ. శ. 8వ శతాబ్దంలో భారతీయ నాగరికత విలసిల్లింది; భారత ప్రజలు సుఖంగా జీవించారు. భారతీయ సంస్కృతి భారతదేశానికి మాత్రమే పరిమితం కాలేదు. ఇతర దేశవాసులకు మన దేశం గురించి, సంస్కృతి గురించి తెలుసు. ఆయా దేశాలతో సంబంధ బాంధవ్యాలు బాగా చేరువైన కొన్ని కొన్ని సందర్భాల్లో ఆ దేశవాసులు సైతం భారతీయ సంస్కృతికి సేవచేశారు. అరబ్బులు మన దేశానికి కేవలం ఇస్లాం మతాన్ని మాత్రమే కాకుండా అనేక నూతన సంస్కృతీ ప్రభావాల్ని కూడా పరిచయం చేశారు అవి తరువాతి శతాబ్దాంలో మొగ్గ దొడిగి పూలు పూశాయి. ఆ విధంగా ఒక వేపు భారత దేశం తన సంస్కృతిని పరసీమలకి పంపిణీ చేస్తోంది; మరో వేపు ఒక నూతన సంస్కృతిని దిగుమతి చేసుకుంటోంది.

అన్నిటికన్నా ముఖ్యమైన అంశం యేమిటంటే, అప్పటికి భారతీయ సమాజంలో, ప్రభుత్వ వ్యవస్థలో, సంస్కృతిలో అనేక మార్పులు చోటు చేసుకున్నాయి. ఈ మార్పులు రానున్న శతాబ్దాలలో ఫలీకరించి భారత చరిత్రని సుసంపన్నం చేశాయి.

భారత చరిత్రలో ప్రాచీన యుగం ఇక్కడితో ముగిసింది. భారత దేశం మధ్య యుగాలలోకి పయనిస్తోంది

# 1
# భారతదేశం - మిగతా ప్రపంచం

భారత చరిత్రలో "మధ్యయుగం" అని మనం తరచు వ్యవహరించేది - ప్రాచీన యుగానికి, ఆధునిక యుగానికి మధ్య గడిచిన కాలం; అంటే నడిమి కాలం. మధ్యయుగానికి క్రీ. శ. 8వ శతాబ్దాన్ని ఆరంభంగాను, 18వ శతాబ్దాన్ని ముగింపుగాను తీసుకుంటాం. ఎందుచేతనంటే-భారతీయ సమాజంలో దాదాపు 8వ శతాబ్దంలో అనేక మార్పులు చోటు చేసుకున్నాయి. ఆ మార్పులు సమాజంలో వివిధ రంగాలను ప్రభావితం చేశాయి. రాజకీయ, ఆర్థిక రంగాలు, సామాజిక కట్టుబాట్లు, మతం, భాష, కళలు-ఒకటనేమిటి, దాదాపు అన్ని రంగాల్ని ఆ మార్పులు స్పృశించాయి. ఆ కాలంలో భారత చరిత్రలో ఒక నూతన దశ ఉత్పన్నమైనట్టుగా గుర్తిస్తాం. ఇది రమారమి 8వ శతాబ్దంలో మొదలయింది.

ఈ పరివర్తన ఫలానా కాలంలో సంభవించిందని ఖచ్చితంగా చెప్పటం సాధ్యం కాదు. సమాజం మారటానికి చాలా సమయం పడుతుంది. మార్పు తాలూకు ప్రభావం ఒకే సమయంలో ప్రతి ఒక్కరి మీదా పడదు. ఆ మాటకొస్తే, ఈ మార్పుల్లో కొన్ని 8వ శతాబ్దం కంటే ముందే సంభవించాయి. ఈ మార్పుల తాలూకు ప్రభావం భారతదేశంలో కొన్ని ప్రాంతాల మీద కొంత ఆలస్యంగా ప్రసరించింది మొత్తం మీద, ఈ దేశంలో ఒక నూతన దశ 8వ శతాబ్దంలో వేరూనింది అని మాత్రం చెప్పవచ్చు. అదే మాదిరిగా, మొగల్ సామ్రాజ్యం విచ్ఛిన్నమైపోయి, బ్రిటీషువాళ్ళు ప్రవేశించటంతో 18వ శతాబ్దంలో అనేక మార్పులు జరిగాయి. కాబట్టి, ఈ శతాబ్దాన్ని మధ్య యుగానికి ముగింపుగా తీసుకుంటాం.

మధ్య యుగాల భారత చరిత్ర ప్రాచీన భారత చరిత్ర కన్నా అనేక విధాలుగా భిన్నమైంది. ఎంచేతనంటే, మధ్యయుగం నాటి చాలా విశేషాలు మనం సన్నిహితంగా ఎరిగినటువంటివి. ఈనాడు మనం మాట్లాడుతున్న భాష అప్పుడు అభివృద్ధి అయిందే; మనం భుజించే ఆహారం, ధరించే బట్టలు ఆనాటి ప్రజలలో వ్యాప్తి అయినవే; నేటి మన మత విశ్వాసాలలో అనేకం ఆ కాలంలో పుట్టి పెరిగినవే. ఈ విషయాలన్నీ మనం ఎలా ఎరుగుదుం అంటే ప్రాచీన భారత చరిత్ర మీద కన్నా మధ్యయుగం మీద మనకు బోలెడు సమాచారం అందుబాటులో వుంది. కాలంలో ఈ యుగం మనకు దగ్గరగా వుంది అంచేత అనేక చారిత్రకాధారాలు చెక్కుచెదరకుండా వున్నాయి; ఆ విధంగా మధ్య యుగాల చరిత్ర దృశ్యం స్పష్టంగా కళ్ళకు కడుతుంది.

ప్రాచీన చరిత్రకు సంబంధించిన ఆధారాలు రెండు చోట్ల నుంచి సేకరించుకున్నట్లు లోగడ చెప్పుకున్నాం. 1. వాఙ్మయం, 2. పురాతత్వ విజ్ఞానం. మధ్య యుగాల చరిత్రకు సంబంధించి కూడా ఇవే సాక్ష్యాధారాలు. మధ్యయుగం మొదలై కొన్నేళ్ళు గడచిన కాలానికి సంబంధించి - అంటే 8-13 శతాబ్దాల మధ్య కాలం గురించి మనకు చాలా సమాచారం శాసనాల్లో దొరికింది రాగిరేకుల మీద లేదా శిలా ఫలకాలు, స్తంభాల మీద లిఖిత రూపంలో ఉన్న ఈ శాసనాలు మనకు దేశమంతటా పలుతావుల్లో, ఆలయాల్లో దొరికాయి ఈ శాసనాల అధ్యయనం ఆ కాలానికి సంబంధించిన ప్రధాన సాక్ష్యాధారంగా రూపొందడంలో చిత్రమేమీలేదు.

ఇవికాక, అనేక వాఙ్మయాధారాలు కూడా ఉన్నాయి. వాటిల్లో ఎక్కువ భాగం తాటాకుల మీద, కొండ రావిచెట్టు పట్టల మీద రాయబడ్డాయి 13వ శతాబ్దం నుంచి కాగితాల మీదకెక్కాయి. ఇవన్నీ దాదాపు మిగిలి వున్నాయి. వీటిల్లో కొన్ని చరిత్ర కథలు; మరికొన్ని వివిధ రాజుల, రాజవంశాల జీవిత కథలు, కార్యకలాపాల వర్ణనలు. ఇవికాక బాబర్, జహంగీర్ మొదలైన పాదుషాలు తమ జ్ఞాపకాల్ని రాసిపెట్టియారు. ఇదే కాలంలో భారత దేశాన్ని సందర్శించిన విదేశ యాత్రికులు తమ పర్యటానుభవాలు వర్ణించారు. ఇంకా మత విషయకమైన పుస్తకాలు, సాహిత్య గ్రంథాలు ఉన్నాయి చాలా పుస్తకాల్లో ఆయా విషయాల్ని కళ్ళకు కట్టే అందమైన చిత్తరువులు సైతం ఉన్నాయి

8వ శతాబ్దం నుంచి 13వ శతాబ్దం దాకా విస్తరించిన మధ్యయుగపు మొదటి భాగంలో ప్రతీహారులు, పాలరాజులు, రాష్ట్రకూటులు పరిపాలించారు కనౌజ్‌ని కైవసం చేసుకోటానికి వీరంతా దండయాత్రలు నడిపించిన కాలం కూడా ఇదే. వీళ్లు కాక ఉత్తరాదిన రాజపుత్ర రాజ్యాలు, దక్షిణాదిన చోళరాజ్యం విలసిల్లాయి. 13వ శతాబ్దం లగాయతు సాగిన మధ్య యుగం మలిదశలో దక్కను సుల్తానుల రాజ్యం, బహమనీ, విజయనగర రాజ్యాలు, ఆ తరువాత మొగల్ సామ్రాజ్యం వర్ధిల్లి, అంతరించాయి.

మధ్యయుగం తొలిదశలో భారతీయ సమాజంలో చోటు చేసుకున్న మార్పులు మనం లోగడ చెప్పుకున్న ప్రాచీన చరిత్ర కాలం నాటి సంస్థలు, వ్యవస్థల పునాదుల మీద లేచాయి. మలిదశలో, ఈ మార్పులు స్థిరంగా పాతుకుపోయి కొత్త అని అనిపించలేదు ఇవికాక, మరికొన్ని నూతన భావాలు, మార్పులు భారతదేశం బయట నుంచి చొరబడ్డాయి..భారత ఉపఖండంలో కొన్ని ప్రాంతాల్లో రాజ్యాధికారం చేబట్టిన కొత్త ప్రభు వంశాల రాకతో ఈ కొత్త గాలులు వీచాయి. విదేశాల నుంచి వచ్చిన ఈ పాలకులు ముఖ్యంగా తురుష్కులు (టర్కీ జాతీయులు), ఆఫ్ఘన్లు, మొగలాయీలు. వీరంతా భారతదేశంలో స్థిరపడిపోయారు. వీరు తమతో పాటు తెచ్చిన నూతన భావాలు భారతీయ సమాజంలో మౌలికమైన మార్పును కలిగించకపోయినా భారతీయ సంస్కృతిని సుసంపన్నం చేశాయి కాబట్టి, 13వ శతాబ్ది నుంచి భారత దేశాన్ని పరిపాలించిన వాళ్ళు విదేశీయులే అయినా, వాళ్ళు పాలించిన కాలాన్ని మధ్య యుగమనే అంటున్నాం. రాజులు మారినంత మాత్రాన సమాజంలో మార్పులు రావు మధ్య యుగం తొలిదశలో భారతీయులు ఎలా జీవించారో, తురుష్కులు మొగలాయీలు పరిపాలించిన కాలంలో కూడా వాళ్ళు అదే విధంగా జీవించారు. ఏది ఏమైనా తురుష్కులు, మొగలాయీలు భారతదేశాన్ని స్వదేశంగా భావించారు; భారత ప్రజల్లో ఒకరుగా కలిసిపోయారు.

భారత దేశం వెలుపల నుంచి విదేశీయులు మధ్య యుగంలో ఇక్కడికి రావటంతో ఈ దేశానికి బైటి ప్రపంచంతో సన్నిహిత సంబంధం ఏర్పడింది. భారతదేశానికి ఈ విదేశీయుల రాక గురించి సక్రమంగా అవగాహన చేసుకోటానికి పశ్చిమ ఆసియా, ఐరోపా, మధ్య ఆసియా, చైనా, ఆగ్నేయ ఆసియాల్లో ఆ కాలంలో సంభవించిన పరిణామాల్ని గురించి తెలుసుకోవటం అవసరం.

లోగడ మనం చెప్పుకున్నట్టుగా, క్రీ. శ. 7వ శతాబ్దంలో అరేబియాలో మహా ప్రాముఖ్యం కలిగిన సంఘటన ఒకటి జరిగింది. మహమ్మద్ ప్రవక్త ఇస్లాం అనే ఒక నూతన మతాన్ని ప్రచారం చేశాడు ఇస్లాం మత ప్రభావం ద్వారా అరబ్బు తెగలన్నీ సమైక్యమై ఒక రాజకీయ శక్తిగా రూపొందాయి. అరబ్బులు పశ్చిమాసియాలో జోర్డాన్,సిరియా, ఇరాక్, టర్కీ, పర్షియా, సింధు, ఈజిప్టు దేశాల్ని జయించారు. మహమ్మద్ ప్రవక్త మరణానంతరం, కలీఫాలనబడే ప్రవక్త వారసులు అరబ్బు ప్రపంచాన్ని పరిపాలించారు. మొదటి కలీఫాలు నలుగురూ మహమ్మద్ ప్రవక్త సహచరులు. వాళ్ళ తరువాత ఉమయ్యీదులు డమాస్కస్ రాజధానిగా రాజ్యచక్రం తిప్పారు. ఆ తరువాత అబ్బాసీద్‌లు బాగ్దాదునుంచి పరిపాలన చేశారు ప్రపంచ ప్రసిద్ధమైన హరున్ అల్ రషీద్ రాజాస్థానం బాగ్దాదులోనే ఉండేది

క్రమేణా అరబ్బుల ప్రాబల్యం విస్తృతంగా విస్తరిల్లింది. ముఖ్యంగా ఉత్తర ఆఫ్రికా యావత్తు అరబ్బులకు స్వాధీనమై పోయింది. అరబ్బు జండా స్పెయిన్‌లో ఎగిరింది. ఫ్రాన్సుకు సైతం అరబ్బు ముప్పు ముంచుకొచ్చింది కాని, దక్షిణ ఫ్రాన్సు గట్టిగా ప్రతిఘటించటంతో అరబ్బులు వెనక్కి మరల వలసి వచ్చింది. దేశాలు జయించటం ఒక్కటే వాళ్ళ ధ్యేయం కాదు. వ్యాపారం మీద వాళ్ళకి అపారమైన ఆసక్తి వుంది. తాము ఆదుపు చేసిన భూభాగంలో వాణిజ్యాభివృద్ధికి ప్రోత్సాహం ఇచ్చారు. ప్రపంచంలోని పలుప్రాంతాలతో-ముఖ్యంగా ఇండియా, చైనా, ఐరోపా, పశ్చిమాసియాలతో అరబ్బు వ్యాపారం ముమ్మరించింది. ఈ వ్యాపారం అరబ్బులకు ఎనలేని సంపద ఆర్జించిపెట్టింది. అరబ్బులు ఆ డబ్బుని ఒక నూతన నాగరికతా నిర్మాణానికి వినియోగించారు. ఈ కాలంలోనే వాళ్ళు గ్రీకు, పర్షియన్, చైనా, భారతీయ విజ్ఞానం పట్ల గొప్ప ఆసక్తి ప్రదర్శించారు. ఈ విజ్ఞానాన్ని తమ విద్యా విజ్ఞాన కేంద్రాలలో ఇంకా పెంపొందించారు. ఆనాడు ప్రపంచంలో అరబ్బు నాగరికత అగ్రగామిగా నిలిచింది.

ఇంతటి సంపద, సాంస్కృతిక ప్రగతి సాధించిన ఉచ్ఛదశలో, అరబ్బులకు ఐరోపా రాజ్యాలతో మంగోలులతో యుద్ధం వచ్చిపడింది. రోమన్ సామ్రాజ్యం కూలిపోయాక ఐరోపా శక్తి గణనీయంగా క్షీణించిపోయింది. హూణులు (భారతదేశంలో గుప్తసామ్రాజ్యం పైన దాడి చేసిన హూణజాతీయుల్లో ఒక శాఖ), గాత్‌లు (ఒక అనాగరిక జర్మన్ తెగ), వేండాలులు వగైరా బర్బర మూకలు అలలు అలలుగా రోమ్ మీద పడి నాశనం చేశారు. క్రీ. శ. 500 నాటికి రోమన్ సామ్రాజ్యం కుప్పకూలింది. దీని ఫలితంగా ఐరోపా అనేక కష్టనష్టాలకు గురయింది. ఐరోపాలో 5-11 శతాబ్దాల మధ్యకాలానికి "అంధ యుగ"మని మచ్చ పడింది. నిరంతర యుద్ధాలవల్ల రాజకీయభద్రత లేకుండా పోయింది. శాంతిభద్రతలు కరవయ్యాయి. ముఖ్యంగా రైతులు కష్టపడి పండించిన పంటని వాళ్ళ కళ్ళముందే దుండగులు కొల్లగొట్టుకుపోయారు. వ్యాపారం క్షీణించిపోయింది. దాంతోపాటు, పెద్ద పెద్ద నగరాలు చతికిలపడిపోయాయి. విజ్ఞానానికి విలువ పోయింది. విద్యావికాసాలు ఒంట పట్టించుకోటానికి అవసరమైన వ్యవధి దొరకకుండా పోయింది; విద్యా

భ్యాసం మతకేంద్రాలకు, మతాలకు మాత్రమే పరిమితమైంది. ఆనాడు యూరప్‌ఖండంలో సాంస్కృతిక జీవితం అంటూ ఉంటే అది ఒక్క క్రైస్తవ మతం మాత్రమే. క్రైస్తవ సన్యాసులు యూరప్‌ఖండం యావత్తు సంచారం చేస్తూ ప్రజల్ని క్రైస్తవ మతంలోకి మార్చారు. క్రైస్తవ మతం క్రమేణా ప్రజల్లో విస్తరించింది. జర్మన్ రాజుల్లో కొందరు క్రైస్తవమతం పట్ల అత్యంత ఉత్సాహం చూపారు. 10 వ శతాబ్దంలో జర్మనీ, ఇటలీ, ఇంకా మరికొన్ని దేశాలు కలిసి ఒక సామ్రాజ్యం ఏర్పరిచాయి. దాన్నే పవిత్ర రోమన్ సామ్రాజ్యం (Holy Roman Empire) అంటాం.

ఈ "అంధయుగ" కాలంలోనే యూరప్‌లో ఫ్యూడల్ (భూస్వామ్య) వ్యవస్థ వేళ్ళూనింది ఇది "ఫ్యూడమ్" అనే లాటిన్ పదం నుంచి పుట్టింది. ఫ్యూడమ్ అంటే "సేవకి ప్రతిఫలంగా (ఇనాముగా) మంజూరైన భూమి" అని అర్థం. రాజు తన ఉద్యోగులకు నగదు రూపంలో వేతనాలు చెల్లించేబదులు భూమిని ఇనాముగా ఇచ్చాడు; తను మెచ్చిన ఇతర్లకి కూడా ఇనాములిచ్చి తృప్తిపర్చాడు. కాబట్టి, రైతులు తమ ప్రభువులకి, రాజునుంచి భూదానం స్వీకరించిన సామంతులకి శ్రమచేసి పెట్టవలసి వచ్చింది. రాజుకి అవసరమైన సైనికుల్ని సమకూర్చి పంపటం సామంతుని బాధ్యతల్లో ఒకటి. ఇక-రైతులు వెట్టిచేసే జీతగాళ్ళు. భూస్వాములకు, సామంత ప్రభువులకు చాకిరీ చేసి పెట్టటం వాళ్ళ విధి. వాళ్ళు సామంతులు కొనుక్కున్న బానిసలు కారు. కాని, ప్రభువులు వాళ్ళని బానిసలకన్నా హీనంగా చూశారు. ఫ్యూడల్ వ్యవస్థ తాలూకు ప్రయోజనాలు దొరల పాలయ్యాయి. రేయింబవళ్ళు రెక్కాడించటం రైతులవంతు; పండిన పంటని అనుభవించటం దొరల హక్కు. రైతులు సృష్టించిన సంపదని దొరలు, రాజు కాజేసి జల్సాగా జీవించారు. రైతులు కటిక పేదరికంలో కూరుకుపోయారు.

"అంధయుగం" లో ఐరోపాకి అరబ్బు ప్రపంచంతో సంబంధాలు తెగిపోయాయి. అంధయుగం అంతరించాకనే ఐరోపాకి అరబ్బు ప్రపంచం మీద ఆసక్తి పుట్టింది. రెండురంగాలలో ఈ ఆసక్తి కలిగింది. ఒకటి, వ్యాపారం; రెండు, మతం. వ్యాపారం అరబ్బుల్ని భాగ్యవంతుల్ని చేసింది. కనుక, కొందరు ఐరోపా వర్తకులకి ఆ వ్యాపారంలో పాలు పంచుకోవాలని ఆశ కలిగింది. మరి, మతం మాటకొస్తే కొత్తగా క్రైస్తవమతం పుచ్చుకున్న వాళ్ళకి ఇస్లాం వ్యాప్తిని చూసి గాభరా పుట్టింది. ఇకనేం-పవిత్ర మతయుద్ధాలు పరంపరగా ప్రజ్వరిల్లాయి. వాటినే క్రుసేడ్లు అంటారు. ఈ "ధర్మయుద్ధా"ల్లో ఐరోపా రాజులు, వారి సామంతులు సైన్యసమేతంగా తూర్పు మధ్యధరా ప్రాంతంలో మహమ్మదీయుల్తో తలపడ్డారు. కాని, క్రుసేడర్లు భూభాగం అంటూ ఏదీ జయించలేకపోయారు. అయితే, ఈ యుద్ధాలు ఐరోపాని అరబ్బు ప్రపంచాన్ని దగ్గరకు చేర్చాయి. ఐరోపావాసులు అరబ్బువ్యాపారంలో ప్రవేశించటం ప్రారంభమైంది. అరబ్బు విజ్ఞానం పట్ల ఐరోపావాసులు ఆసక్తి ప్రదర్శించారు. 15, 16 శతాబ్దాలలో ఐరోపా విజ్ఞాన ప్రగతికి అరబ్బు విజ్ఞానం గొప్పగా దోహదపడింది.

9 వ శతాబ్దంలో అబ్బాసీద్ కలీఫాల ప్రాబల్యం నిర్వీర్యమైపోయింది. వాళ్ళ ఆక్రమణలో వుండి, రాష్ట్రాలుగా విభజితమైన అరబ్బు భూభాగం అబ్బాసీద్ కలీఫాల చేజారిపోయింది. ఏ ప్రాంతానికా ప్రాంతం స్వతంత్రం ప్రకటించుకొంది. ఆ విధంగా స్వతంత్రం ప్రకటించిన రాష్ట్రాల్లో ఘజ్నీ, గోరీ రాష్ట్రాలు ముఖ్యమైనవి. మధ్యాసియాలో శక్తివంతంగా రూపొందిన సెల్జుక్ టర్కులు పశ్చిమదిశగా కదలి, స్వతంత్రం

ప్రకటించిన రాష్ట్రాలు కొన్నింటిలో రాజ్యాధికారం స్థాపించారు. 11 వ శతాబ్దంనాటికి సెల్జుక్ టర్కులు పశ్చిమాసియాలో తమ అధికారం స్థాపించుకోసాగారు. వాళ్ళు పర్షియా, ఇరాక్, సిరియా ఇంకా బిజాంటిన్ సామ్రాజ్యంపైన దండయాత్రలు జరిపి, ఆ విశాల ప్రాంతంలో తిష్టవేశారు బిజాంటిన్ సామ్రాజ్యానికి రాజధానిగా ఉన్న కాన్‌స్టాంటినోపిల్ (నేటి ఇస్తాంబుల్) ఒకనాడు సామ్రాజ్య విస్తృతిలో, సంపదలో రోమ్‌తో పందెం వేసిన చరిత్రాత్మక నగరం. బిజాంటిన్ నాగరికతకి ప్రాతిపదిక ప్రాచీన గ్రీకు నాగరికత. తూర్పు మధ్యధరా ప్రాంతానికి-రష్యా, స్కాండినేవియా (నార్వే, స్వీడన్‌లు)లకు మధ్య జరిగిన వ్యాపార వాణిజ్యాల్ని అదుపులో ఉంచుకున్న కారణంగాను, చైనా నుంచి మధ్యాసియా మీదుగా పర్షియాతో సాగిన వ్యాపారంలో పాలుపంచుకున్న కారణంగాను కాన్‌స్టాంటినోపిల్ అపార సంపద సాధించింది. అటువంటి బిజాంటిన్ సామ్రాజ్యం సెల్జుక్ టర్కుల ధాటికి తట్టుకోలేక కుప్పకూలింది. 13 వ శతాబ్దంలో మరొక ప్రచండ దండయాత్ర ప్రారంభమయింది. అది చెంఘిజ్‌ఖాన్ నాయకత్వాన సాగిన మంగోలు దండయాత్ర మంగోలుల దాడి మధ్యాసియాలో సెల్జుక్ టర్కుల ప్రాబల్యాన్ని క్షీణింపజేసింది. ఈ దాడుల వాతపడకుండా తప్పించుకున్న ఏకైక జాతి, ఒట్టొమాన్ టర్కులు. వీళ్ళు ఎనటోలియాలో తమ స్థానాన్ని గట్టిపర్చుకొని 1453లో కాన్‌స్టాంటినోపిల్‌ని స్వాధీనం చేసుకున్నారు మధ్యాసియాలో టర్కీ వగైరా ప్రాంతాలతో కూడిన భూభాగం మీద ఒట్టొమాన్ టర్కుల ప్రాభవం కొనసాగింది

ఇదిలా వుండగా, మంగోలుల ప్రాబల్యం మూడుపూవు లారుకాయలుగా ముమ్మరించింది. పశ్చిమాసియా, దక్షిణరష్యాలు మొదలుకొని మధ్యాసియా మీదుగా చైనా వరకు గల సమస్త భూభాగం మంగోలుల కైవసమైంది. 13వ శతాబ్దం మధ్య నుంచి 14వ శతాబ్ది మధ్యదాకా మంగోలులు చైనాని పరిపాలించారు. మంగోలుల రాకకి ముందు 7 వ శతాబ్దం లగాయతు 13 వ శతాబ్దం దాకా టాంగ్, సుంగ్ వంశాల ఏలుబడిలో చైనా శక్తి, సంపదలతో తుల తూగింది. కాబట్టి, చైనాని ఆక్రమించుకోటం ద్వారా మంగోలులు తమ రాజకీయాధికారాన్ని, సంపదని పెంచుకున్నారు చైనా-పశ్చిమాసియాల మధ్య వ్యాపార వాణిజ్యాలు మధ్యాసియా గుండా జరగడం కారణంగా ఆనాడు మధ్యాసియాకు గొప్ప ప్రాముఖ్యం ఉండేది. వర్తక బిడారులు పయనించిన ఆ మార్గాన్ని "పట్టుపుంత" అని వ్యవహరించేవాళ్ళు. ఎంచేతనంటే, ఆ మార్గంలో రవాణా అయ్యే సరుకుల్లో చైనా చీనీచీనాంబరాలు చాలా ముఖ్యమైనవి. దీనికి తోడు, చైనాలో కనిపెట్టబడ్డ కొత్త వస్తువులు మిగతా సరుకుతోపాటు పశ్చిమాసియా చేరేవి. తుపాకిమందు, కాగితం చైనాలో కనిపెట్టబడ్డవే; దిక్సూచిని కనిపెట్టిందికూడా చైనాయే; ముద్రణా ప్రక్రియ చైనానుంచే ఇతర దేశాలకు పాకింది. కనుక, వ్యాపార వాణిజ్యాల కారణంగా మధ్యాసియాని అదుపులో పెట్టుకోటం చాలా లాభదాయకమైంది. మంగోలులు ఇస్లాం మతం స్వీకరించారు. వాళ్ళు ఇస్లాం మతంలోకి మారటమే కాకుండా, మధ్యాసియాలో జీవించే కొన్ని తెగలకి సైతం ఇప్పించారు.

చైనా వ్యాపార వాణిజ్యాలలో "పట్టు పుంత" ఒక్కటే ఏకైక రవాణా మార్గం కాదు చైనా వర్తకులు సముద్ర వ్యాపారం కూడా చేశారు. చైనా నౌకలు కాంటన్, అమోయ్ మొదలైన దక్షిణ చైనా తీర రేవుల నుండి బయలుదేరి భారతదేశానికి, తూర్పు ఆఫ్రికాకు పయనించాయి. కొన్ని నౌకలు ఆగ్నేయ ఆసియా దేశాలైన ఆనాం, లావోస్, కంబోడియా, జావా, సుమత్రా, మలయా రేవు పట్టణాల్లో ఆగాయి.

ఈ దేశాలతో సాగిన వ్యాపార వాణిజ్యాలలో చైనా, భారతీయ వర్తకులు ఉభయులూ పోటీపడ్డారు. వర్తకులు తమ సరుకుల నౌకల్నే కాకుండా తమ దేశ సంస్కృతిని కూడా ఆ దేశాలకు కొనిపోయారు. 14వ శతాబ్దంలో అరబ్బు వర్తకులు సైతం ఆగ్నేయ ఆసియా దేశాలలో తమ వాణిజ్యానికి గట్టి పునాదులు వేసుకున్నారు.

ఆ విధంగా, మధ్య యుగంలో యావత్ ప్రపంచం సన్నిహితం కాజొచ్చింది. వ్యాపారం విభిన్న దేశాల ప్రజల మధ్య సంబంధాలు నెలకొల్పింది. ఏ దేశమూ ఇతర దేశాల్తో పొత్తు లేకుండా ఏకాకిగా ఉండిపోజాలని స్థితి ఏర్పడింది.

భారత దేశం కూడా ఈ ప్రవంతిలో ఒక పాయ అయింది. అరబ్బులతో, చైనీయులతో వ్యాపారం ద్వారా భారత దేశానికి సంబంధం ఏర్పడింది. 'మధ్యాసియాలోని తురుష్కులు, మొగలాయీలు ఈ వ్యాపారాన్ని ప్రోత్సహించారు. తరువాత వాళ్లే ఈ దేశానికి విజేతలుగా దిగారు. యూరప్‌కు సంబంధించి కూడా ఇదే తంతు నడిచింది. యూరోపియన్లు సైతం వ్యాపారస్థులుగా ప్రవేశించి, రాజ్య పాలకులుగా నెత్తికెక్కారు.

మధ్య యుగం తొలి దశలో ఉత్తర భారతదేశం అనేక రాజ్యాలుగా చీలిపోయి వుంది. ఈ రాజ్యాల మధ్య నిరంతరం యుద్ధాలు సాగాయి. ఇక—దక్షిణ భారత దేశంలో చోళ రాజులు శక్తివంతంగా ఉన్నారు. భారత ద్వీప కల్పంలో అతి విశాల భూభాగాల్ని చోళులు జయించారు. చోళ సైన్యాలు ఉత్తరాభిముఖంగా గంగాతీరం దాకా చొచ్చుకు పోయాయి. చోళ రాజ్యం వైభవోపేతంగా వర్థిల్లింది. ఆ కాలంలో దక్షిణాది వర్తకులు ఆగ్నేయ ఆసియా దేశాలతోను, చైనాతోను సాగించిన వ్యాపారం ద్వారా చోళ రాజ్యం అతులిత సంపద గడించింది. అందులో ఎక్కువ భాగం సుందర దేవాలయ నిర్మాణానికి ఖర్చయింది. ఆ దేవాలయాలు విద్యా పీఠాలుగా కూడా విలసిల్లాయి. మధ్య యుగం తొలిదశలో భారతీయ సంస్కృతి ఇతోధికంగా అభివృద్ధి చెంది సుసంపన్నమైంది దక్షిణ భారతదేశంలోనే.

# 2

# దక్షిణ భారత దేశం : క్రీ. శ. 800-1200

మన మధ్యయుగ చరిత్రలో భారత ఉపఖండంలో ఉత్తర, దక్షిణ భాగాలు రెండూ బాగా సన్నిహితం అయ్యాయి, వింధ్య పర్వతాలు, దక్కను పీఠభూమి లోగడ మాదిరి అడ్డుగోడగా లేవు పైపెచ్చు ఈ ప్రాంతం ఉత్తర దక్షిణాల మధ్య వారధిగా రూపొందింది. ఆనాడు జరిగిన మూడు రకాల పరిణామాల్లో ఈ అంశం సుస్పష్టమవుతుంది: ఒకటి - ఉత్తర దక్కను రాజ్యాలు తమ అధికారాన్ని గంగా నదీ లోయ దాకా విస్తరింపజేసుకోటానికి ప్రయత్నించాయి; రెండు - దక్షిణాది మత ఉద్యమాలు ఉత్తరాదిలో సైతం ప్రజాదరణ పొందాయి; మూడు - ఉత్తరాది బ్రాహ్మణులు దక్కను ప్రాంతానికి, దక్షిణాదికి ఆహ్వానించబడ్డారు. వాళ్ళీ ప్రాంతాల్లో స్థిరపడిపోయి మడులు, మాన్యాలు దానంగా పొందారు. పూర్వం మాదిరి ఈ భారత ఉపఖండంలోని వివిధ రాజ్యాలు పరస్పర సంబంధాలు లేకుండా చుట్టూ గిరి గీసుకుని కూర్చునిలేవు.

గంగానదీ లోయలో కొంత భాగాన్ని జయించటానికి ప్రయత్నించిన వాళ్ళలో ఉత్తర దక్కనుకు చెందిన రాష్ట్రకూటులు ముఖ్యులు. రాష్ట్రకూటులు (వీరిని గురించి తరువాతి అధ్యాయంలో విపులంగా చెప్పుకుందాం) కనౌజ్‌ని, దాని పరిసర ప్రాంతాన్ని కైవసం చేసుకోటానికి ప్రతీహార, పాల వంశాలతో పదే పదే యుద్ధాలు చేశారు. ప్రతీహారులు పశ్చిమ, మధ్య భారత దేశంలోను; పాలరాజులు భారత తూర్పు ప్రాంతంలోను (వంగ దేశం) సుస్థిరంగా ఉన్న కాలం అది. ఈ ఉభయుల్తో మాత్రమే కాకుండా రాష్ట్రకూటులు వీరి కన్నా శక్తివంతులైన చోళ రాజుల్తో తలపడవలసి వచ్చింది.

చోళరాజులు మొట్టమొదట ఇప్పటి తంజావూరు చుట్టూ వున్న తమిళకాన్ని పాలించారు. క్రమేణా, పల్లవరాజుల్ని తదితర స్థానిక ప్రభువుల్ని జయించి చోళులు తమరాజ్యాధికారాన్ని విస్తరింపజేసుకున్నారు. 11 వ శతాబ్దం నాటికి దక్షిణ భారతదేశంలో చోళరాజ్యం సాటిలేని మేటి రాజ్యం. తంజావూరుకు ఇంకా దక్షిణంగా ఇప్పటి మధురై చుట్టు పక్కల ప్రాంతాన్ని పాండ్య రాజులు పాలించేవారు. పశ్చిమ తీరంలో ప్రస్తుతం మనం కేరళ అని వ్యవహరించే ప్రాంతాన్ని చేర రాజులు పాలించేవారు. 12 వ శతాబ్దం నాటికి ఈ రాజ్యాలలో కొన్ని కూలిపోయి, కొత్తరాజ్యాలు తలెత్తాయి రాష్ట్రకూటుల స్థానంలో చాళుక్యులు తలెత్తారు. 7 వ శతాబ్దంలో ఉత్తరమైసూరుని పాలించిన బాదామి చాళుక్యుల సంతతి వారే వీరు.

అంచేత వీరిని కడపటి చాళుక్యులు అన్నారు. చాళుక్యుల్ని త్రోసివేసి దేవగిరి యాదవులు రాజ్యాధికారం చేజిక్కించుకున్నారు. ఓరుగల్లుని (వరంగల్) కాకతీయులు పాలించారు. ద్వారసముద్రాన్ని (మైసూరు నగరానికి చేరువలో ఉంది) హోయసాల రాజులు పాలించారు. చోళులు తమ అధికారాన్ని కాపాడుకోటానికి ఈ రాజ్యాలన్నిటితో పోరాడవలసివచ్చింది 13 వ శతాబ్దం దాకా ఈ పోరు కొనసాగింది

చోళ రాజులు : క్రీ. శ. 1 వ శతాబ్దం లగాయతు చోళులు సేనాపతులుగా తమిళనాడులో అధికారం చలాయించారు. 9 వ శతాబ్దం మధ్యలో విజయాలయ చోళుడు తమిళనాడుకు గుండెకాయ అయిన తంజావూరుని జయించి స్వతంత్ర రాజ్యం స్థాపించాడు. తొలి చోళ రాజుల్లో అత్యంత ముఖ్యుడుగా కీర్తించ బడ్డ మొదటి పరాంతకుడు క్రీ. శ. 907 లో రాజ్యానికి వచ్చాడు. సుమారు 50 సంవత్సరాల పాటు అవిచ్ఛిన్నంగా పరిపాలించాడు. పాండ్యుల్ని ఓడించి పాండ్య రాజధాని మధురైని స్వాధీనం చేసుకున్నాడు కాని పరాంతకుని చివరి సంవత్సరాల్లో రాష్ట్రకూటులు విజృంభించి చోళ రాజ్యంలోని ఉత్తర జిల్లాల్ని ఆక్రమించుకున్నారు.

మొదటి పరాంతకుని అనంతరం మూడు దశాబ్దాలపాటు చోళ మండలాన్ని ఏలిన రాజులు బల హీనులు కావటం చేత చోళుల అధికారం క్షీణించిపోయింది. అదే సమయంలో, ఎదురు లేకుండా వెలుగొందు తున్న రాష్ట్రకూటులకు తమ చాళుక్య సామంతులవల్ల కష్టకాలం వచ్చిపడింది. ఈ గందరగోళంలో చోళ రాజుల్లో అత్యంత శక్తివంతుడైన మొదటి రాజరాజు రాజ్యానికి వచ్చాడు. రాష్ట్రకూటులు ఆక్రమించిన చోళ భూభాగాన్ని పునరాక్రమించాడు. మొదటి రాజరాజు, అతని కుమారుడు రాజేంద్రుడు ఏలిన యాభై సంవత్సరాల కాలంలో చోళరాజ్యం జేగీయ మానంగా వెలిగింది.

రాజరాజు పాండ్య, చేర రాజుల మీద దండయాత్రలు నడిపాడు. చేర నౌకా బలాన్ని ధ్వంసం చేశాడు. మధురైని స్వాధీనం చేసుకున్నాడు. సింహళరాజుని ఓడించి శ్రీలంక ఉత్తరప్రాంతాన్ని చోళ రాజ్యంలో కలుపుకున్నాడు. వేంగి నాడుని జయించాడు. మాల్దీవుల్ని ఆక్రమించాడు సముద్రాధిపత్యం యొక్క ప్రాధాన్యాన్ని గుర్తించినవాడు కాబట్టి రాజరాజు ఈ దండయాత్రలు నడిపి విజయం సాధించాడు. కేరళ తీరం, సింహళం, మాల్దీవులు వ్యాపారం మీద అపార ధనం ఆర్జించాయి. అతడు నడిపిన నౌకా యుద్ధాలకు ఇది కూడా ఒక కారణం. భారతదేశం ఆనాడు పశ్చిమాసియాకు బట్టలు, సుగంధద్రవ్యాలు, రత్నాలు వగైరా అనేక వస్తువులు ఎగుమతి చేసింది పశ్చిమాసియా నుంచి వచ్చిన అరబ్బు వర్తకులు ఈ వస్తువుల్ని కొనుగోలుచేసి నౌకల మీద తమ దేశాలకు తరలించారు ఆ అరబ్బు వర్తకుల్లో ఎక్కువమంది భారత పశ్చిమ తీరం వెంబడి పట్టణాల్లో స్థిరపడిపోయారు; స్థానిక స్త్రీలని వివాహం చేసుకున్నారు; శాంతియుతంగా జీవించారు. భారతీయుల్తో కలిసి మెలిసి సుహృద్భావంతో జీవిస్తూ, పశ్చిమాసియాతో వాణిజ్యంద్వారా అపార సంపదని ఈ దేశానికి ఆర్జించిపెట్టారు కాబట్టి వాళ్ళపట్ల గౌరవం, ఆదరభావం ఉండేవి. చేరరాజ్యం, సింహళం, మాల్దీవులు ఈ వ్యాపార వాణిజ్యాలకు ప్రధాన కేంద్రాలుగా భాసిల్లాయి. కాబట్టి, ఈ రాజ్యాల్ని ఆక్రమించటం ద్వారా పశ్చిమాసియాతో వ్యాపారం వల్ల ఒనగూడే సంపద యావత్తు చోళరాజ్యానికి సంక్రమించింది. రాజరాజు ఈ రాజ్యాల్ని జయించినప్పటికీ, వాటిని తన అధికారం కింద అట్టే కాలం నిలుపుకో లేక పోయాడు.

రాజరాజు కుమారుడు రాజేంద్రుడు తండ్రికన్నా ఘనుడు. క్రీ.శ. 1044 వరకు బహుదీర్ఘకాలం రాజ్యం చేశాడు. అతడు నడిపిన దండయాత్రల్లో రెండు మాత్రం అత్యంత సాహసోపేతమైనవి. ఒకటి—ఒరిస్సాగుండా భారత తూర్పు తీరంలో వంగదేశం దాకా నడిపిన దండయాత్ర; రెండు—ఆగ్నేయ ఆసియా మీద జరిపిన నౌకా యుద్ధం

తూర్పు తీరం ఎగువకి నడిపిన దండయాత్రలో రాజేంద్రుడు వంగదేశాన్ని పాలించే పాలరాజుని గడగడ లాడించి దక్షిణాదికి తిరిగి వచ్చాడు. 700 సంవత్సరాలకు పూర్వం సముద్రగుప్తుని దక్షిణయాత్రకి దీనికి దగ్గర పోలికలున్నాయి.

భారతీయ వర్తకులు అనేక శతాబ్దాలుగా ఆగ్నేయ ఆసియా దేశాల్లో వర్తక వ్యాపారాలు నిర్వ హిస్తున్నారు. ఈ వ్యాపార కార్యకలాపాలు దక్షిణ చైనా దాకా వ్యాపించాయి. భారతదేశం నుంచి బయలు దేరిన నౌకలు ఆగ్నేయ ఆసియాదేశాలు చేరాలంటే మలాక్కా జలసంధి దాటిపోవాలి. మలాక్కా జలసంధి ఆనాడు మలయా, సుమత్రాల్ని పాలించిన శ్రీ విజయ అధికారం కింద ఉండేది. శ్రీ విజయుని రాజ్యంలోని వర్తకులు ఈ లాభసాటి సముద్ర వ్యాపారాన్ని తాము చేజిక్కించుకునే ఊహతో భారతీయ నౌకలకు ఇబ్బందులు కల్పించారు. భారతీయ వర్తకులు చోళరాజైన రాజేంద్రకు విజ్ఞప్తి చేశారు. చోళ నౌకాదళం శ్రీ విజయుని నౌకా బలాన్ని జయించింది. భారతీయ నౌకలు మలాక్కా జలసంధి గుండా నిరపాయకరంగా ప్రయాణించే సౌకర్యాలు సమకూరాయి. చోళరాజ్య వర్తకులు ఆర్జించే లాభాలు ఆ రాజ్య ఆదాయాభివృద్ధికి తోడ్పడుతున్న కారణంగా రాజేంద్రుడు వాళ్ళని ఆదుకొని ఉండవచ్చు.

రాజేంద్ర తరువాత అధికారంలోకి వచ్చిన రాజులు తమ సమయం, శక్తి, సంపద పరరాజుల మీద యుద్ధాలలోనే వెచ్చించారు. ఈ యుద్ధాలు కొన్నింటిలో విజయం చేకూరలేదు. క్రమేణా చోళరాజ్యం బలహీనపడింది; ఇతర రాజ్యాలు బలపడ్డాయి. 13వ శతాబ్దం ముగిసే నాటికి చోళరాజ్యం అస్తమించింది.

*చోళ పరిపాలన :* చోళరాజ్య వ్యవస్థలో రాజు సర్వాధికారి. రాజుని దేవునిగా కొలిచే పూజా ధోరణి ప్రోత్సహించబడింది. చనిపోయిన రాజులకు దేవాలయాలు నిర్మించబడ్డాయి. వాళ్ళ విగ్రహాలు ఆ దేవాలయాల్లో ప్రతిష్ఠించబడ్డాయి. ఈ ఆలయాలే కీర్తిశేషులైన ఆ రాజుల స్మారక చిహ్నాలు కూడా.

ఉత్తర భారతదేశ రాజకీయ వ్యవస్థలో పురోహితుడు నిర్వహించిన పాత్ర చోళరాజ్య వ్యవస్థలో కొంత మార్పుకు లోనయింది. చోళుల రాజ గురువు లౌకిక వ్యవహారాల్లో, మత విషయాల్లో రాజుకు సలహాదారు మాత్రమే కాకుండా ఆంతరంగిక సచివుడయ్యాడు. రాజగురువు మాత్రమే కాకుండా, వివిధ విషయాలలో రాజు సంప్రదింపులు నెరపటానికి ఒక అధికార మండలి కూడా ఉండేది. ఒక క్రమబద్ధమైన మంత్రి మండలి ఉన్నట్టుగా ఖచ్చితమైన ఆధారాలు కనిపించవు. ఒక సమగ్రమైన అధికార సమితి పరి పాలన నిర్వహించింది.

చోళ రాజ్యంలో రాష్ట్రాలను మండలాలు అని వ్యవహరించే వాళ్ళు. జిల్లాలను వలనాడులని పిలిచే వాళ్ళు. జిల్లాలు కొన్ని గ్రామ సముదాయాలుగా విభజింపబడ్డాయి. చాలా పెద్ద గ్రామాన్ని ఒకే యూనిటుగా పరిగణించిన సందర్భాలు ఉన్నాయి. అటువంటి పెద్ద గ్రామాన్ని తనియూర్ అని పిలిచారు.

తంజావూరు చోళ రాజ్యానికి మొట్టమొదటి రాజధాని. తరువాత, కాంచీపురం రాజధాని అయింది.

కొంత కాలం పాటు "గంగైకొండ-చోళపురం" కూడా రాజధానిగా ఉంది. ఇది తంజావూరుకి సమీపంలో ఉంది. గంగా మైదానాన్ని జయించిన రాజుల నగరం అని దీని అర్థం.

గ్రామ పరిపాలనని ప్రభుత్వాధికార్లు నిర్వహించేవాళ్ళు కాదు. గ్రామస్థులే స్వయంగా గ్రామ వ్యవహారాలు నిర్వహించుకునేవాళ్ళు. గ్రామస్థాయిలో ప్రవేశపెట్టబడ్డ ఈ స్వపరిపాలనాధికారం ఆనాడు గొప్ప ముందంజ. చోళ ప్రభుత్వాధికార్లు కేవలం సలహాదార్లుగా, పరిశీలకులుగా గ్రామ పరిపాలనా వ్యవహారాల్లో పాల్గొన్నారే తప్ప పరిపాలకులుగా మాత్రం కాదు. గ్రామాలలో "ఊరు" లేదా "సభ" అనే సంస్థ స్థానిక స్వపరిపాలన నిర్వహించేది. భూమి పుట్రావున్న కామందులు, అగ్ర కులాలవాళ్ళు చీట్లులాగే పద్ధతిలో గ్రామ సభకు ఎన్నికయ్యే వారు. గ్రామంలో ప్రతి వార్డులో ఆ వార్డులో ఉండే అర్హులైన గ్రామ ప్రజల పేర్లు రాసిన చీట్లు ఒక కుండలో పోసి దేవాలయ అర్చకుల సమక్షంలో ఒక చిన్న కుర్రవాడిచేత చీటీ లాగించే వాళ్ళు. చీటీలోవున్న పేరు గల పెద్దమనిషి ఆ వార్డుకి ప్రతినిధిగా ఎంపికయినట్లు లెక్క. వ్యవసాయ కూలీల పేర్లు ఆ చీట్ల మీద రాసేవారు కాదు. భూమి శిస్తు చెల్లించే గుత్తదార్లకు-కూలికి పనిచేసే వ్యవసాయ కార్మికులకు మధ్య గల తేడా ఇక్కడ స్పష్టంగా తెలుస్తుంది. వ్యవసాయ కూలీలకు గ్రామసభలో ప్రాతినిధ్యం లేదు. ఓటర్ల జాబితాలో వాళ్ళ పేర్లు నమోదు కావు. గ్రామంలో బాధ్యతాయుతమైన పదవిని చేపట్టే అర్హత కష్టజీవులకు ఉండదు. వాళ్ళ పేద బ్రతుకులోకి ప్రగతి కిరణం ప్రసరించే అవకాశం లేదు.

గ్రామ ప్రతినిధుల సభ గ్రామ జీవితానికి, కార్యకలాపాలకు సంబంధించిన అన్ని వ్యవహారాలు చర్చించేది. గ్రామ సౌభాగ్యానికి అందరూ సమిష్టిగా బాధ్యత పంచుకోవాలి. సభ అనేక కమిటీలుగా విభజించబడింది. ఒక్కొక్క కమిటీ ఒక్కొక్క ప్రత్యేక బాధ్యత స్వీకరించేది. ఉదాహరణకి, ఒక గ్రామ ప్రతినిధుల సభలో చెరువులకి సంబంధించిన కమిటీ ఉంది; ఊరి చెరువులో నీరుందా, ఆ నీరు గ్రామస్థులందరి పొలాలకు సక్రమంగా అందుతుందా అనే విషయాలు సరి చూసుకోవాల్సిన బాధ్యత ఆ కమిటీది.

చోళ రాజ్యానికి ఆదాయం భూమి మీద, పంట మీద విధించిన శిస్తు, పన్నుల ద్వారాను, వాణిజ్య పన్నుల ద్వారాను సమకూరింది. గనులు, అరణ్యాల మీద, ఉప్పు మీద, వృత్తుల మీద, ఎగుమతి దిగుమతుల మీద పన్నులు వసూలయ్యేవి. రహదారి సుంకం కూడా ఉండేది. ఆదాయంలో కొంత భాగం రాజుకు పోయేది. మిగిలిన భాగం రహదార్ల నిర్మాణం, చెరువుల తవ్వకం మొదలైన ప్రజాహిత కార్యాలకు, రాజోద్యోగుల జీతభత్యాలకు, సైన్య పోషణకు, ఆలయ నిర్మాణానికి వినియోగింపబడేది. భూమి శిస్తును గ్రామ సభ వసూలు చేసి కోశాగారానికి చెల్లించేది. ధనిక భూస్వాములు నేరుగా ప్రభుత్వాధికార్లకు శిస్తు చెల్లించే వాళ్ళు. నగరాలలో జీవించే వర్తకుల నుంచి వాణిజ్య పన్నులు వసూలు చేసేవాళ్ళు.

*సమాజం :* రాజు, రాజ కుటుంబం, రాజాస్థాన సభ్యులు కాక రాజ్యంలో విశేష గౌరవ మన్ననలకు పాత్రమైన రెండు వర్గాలున్నాయి. ఒకరు : బ్రాహ్మణులు; రెండు : వర్తకులు. పండితులుగా బ్రాహ్మణులు సన్మానింపబడ్డారు. రాజు బ్రాహ్మణ పండితులకి భూములు, అగ్రహారాలు ఇనాముగా ఇచ్చి సత్కరించాడు. వాటినే బ్రహ్మదేయ ఇనాములంటాం. బ్రాహ్మణులు పన్ను కట్టాల్సిన అవసరం లేదు. అంచేత వాళ్ళు ఆర్థికంగా ఉచ్చస్థితిలో ఉండేవాళ్ళు. దానం గ్రహించిన పెద్దవాళ్ళు కాలం చేశాక, ఆ ఇనాములు వాళ్ళ బిడ్డలకు సంక్రమించాయి. ఆ విధంగా బ్రాహ్మణులు తరతరాల పాటు హాయిగా జీవించారు.

ధనవంతులైన బ్రాహ్మణులు తాము కూడబెట్టిన సొమ్ముని వ్యాపారాల్లో పెట్టుబడి పెట్టారు.

చోళ రాజ్యంలో వర్తకులు బాగా పైకొచ్చారు. చైనా, ఆగ్నేయ ఆసియా, పశ్చిమాసియాలతో ఆనాడు ముమ్మరంగా వ్యాపారం జరిగింది. విదేశ వ్యాపారానికి తోడు, దేశంలో ఉత్తర-దక్షిణ ప్రాంతాల మధ్య సరుకుల మార్పిడి విశేషంగా ఉంది. వర్తకులు ఒక సంఘంగా ఏర్పడే వాళ్ళు. అటువంటి వర్తక శ్రేణిని "మణిగ్రామం" వగైరా పేర్లతో పిలిచేవాళ్ళు. ఒకే వృత్తిలో పని చేసే సభ్యులతో ఆ వృత్తిశ్రేణి కూడి వుండేది. వర్తకశ్రేణిలో సభ్యులంతా కలిసి తమ సొమ్ముని ఒక ఉమ్మడి నిధిలో వేసేవాళ్ళు. దీన్ని ఒక రకమైన బ్యాంకుగా పరిగణించవచ్చు. దీనివల్ల చాలా ఉపయోగం జరిగింది. వర్తకులు ఎవరికి వారు విడివిడిగా వ్యాపారం చెయ్యటం కన్నా అందరూ కలిసి ఏర్పాటు చేసుకున్న ఉమ్మడి నిధితో భారీ ఎత్తున వ్యాపారం చేయటానికి వీలయింది. ప్రతివర్తక శ్రేణికి సరుకుల రవాణా కోసం స్వంత బిడారులుండేవి. కొన్ని శ్రేణులకు స్వంత బిడార్లే కాకుండా, బిడార్ల వెంట కాపలాగా పోయే సాయుధ రక్షకదళాలు సైతం ఉండేవి. మార్గంలో దోపిడి దొంగల దాడి నుండి ఈ రక్షకదళాలు బిడార్లని కాపాడేవి.

పట్టణాల్లో నగరశ్రేణి స్థానికంగా తయారైన వస్తువుల్ని సేకరించి విక్రయించేది. స్థానికంగా కాకుండా, ఇతర స్థలాల్లో ఆ వస్తువులకు గిరాకీ వున్న సందర్భాల్లో వర్తక శ్రేణి స్థానిక వస్తువుల్ని కొనుగోలు చేసి గిరాకీ గల ప్రాంతాలకు తరలించటం కద్దు. ఒక వస్తువుని తీసుకుని దానికి బదులుగా వేరే వస్తువుని ఇచ్చే వస్తు మారకమూ ఉంది; నగదు చెల్లించి వస్తువుల్ని కొనుగోలు చేసే ఆచారమూ ఉంది. వర్తకులు విశేషంగా లాభాలు ఆర్జించి, దండిగా పన్నులు చెల్లించటం ద్వారా రాజ్యానికి రాబడి పెరిగింది. 1077లో 72 మంది వర్తక ప్రముఖులతో కూడిన ఒక ప్రతినిధి వర్గం చైనాతో ఇంకా ఎక్కువ వ్యాపారం కొనసాగించే అవకాశాల్ని పరిశీలించటానికి ఆ దేశం వెళ్ళిందంటే ఆశ్చర్యం లేదు!

బ్రాహ్మలు, వర్తకులు మాదిరిగా రాజ్యంలో అందరూ సిరి సంపదలతో తులతూగలేదు. పట్నాలలో కూలి పని చేసుకునేవాళ్ళు, పల్లెటూళ్ళలో వ్యవసాయం మీద జీవించే రైతులు, కూలీలు బహు పేదరికంలో జీవించారు. రాజు, రాజాదరణ పొందిన వర్గాలు సుఖంగా జీవించటం కోసం వీళ్ళు కఠోరంగా పరిశ్రమించవలసి వచ్చింది. ముఖ్యంగా శూద్రులు కఠోర జీవితం గడిపారు. దేవాలయ మాన్యాల మీద రెక్కలు ముక్కలు చేసుకునే హీన కులాల వాళ్ళకి దైవ దర్శనం చేసుకునే అర్హత సైతం నిరాకరించ బడింది. పనికిరాని భూముల్ని సాగులోకి తేవటం, అడవుల్ని నరికి తెరిపి చెయ్యటం రైతు, కూలీల దైనందిన శ్రమలో ఒక భాగం.

దేవాలయాలు: రాజు, రాజ్యంలో సంపన్నులు దేవాలయ నిర్మాణానికి, నిర్వహణకి విశేషంగా భూమి, డబ్బు విరాళంగా ఇచ్చారు. గుడి లేని పల్లె, పట్నం లేవు. పెద్ద పెద్ద నగరాల్లో, పుణ్యక్షేత్రాల్లో నిర్మింపబడ్డ ఆలయాలు మిగతా స్థలాల్లో కట్టిన వాటికన్నా బ్రహ్మాండమైనవి. ముఖ్యంగా, తంజావూరులోని బృహదీశ్వరాలయం వంటి రాజనిర్మితమైన దేవాలయాలు అత్యద్భుతమైనవి.

పల్లవ రాజుల కాలంలోని ఆలయాలు శిలలలోంచి మలిచినవి. అంటే—పెద్ద పెద్ద రాళ్ళని, కొండవాలుల్ని తొలిచి కట్టిన దేవాలయాలన్నమాట. ఇటువంటి నిర్మాణాలలో మహాబలిపురంలోని దేవాలయాలు అద్భుతమైనవి. క్రమేణా, ఈ పద్ధతి మరుగుపడిపోయి, శిల్పులు పెద్ద పెద్ద బండరాళ్ళతో

చదునైన నేల మీద ఆలయ నిర్మాణానికి పూనుకున్నారు. అలా కట్టిన తొలి దేవాలయాలు కాంచీపురంలో విశేషంగా కనిపిస్తాయి. అటువంటి దేవాలయాల్లో గర్భగుడి, గర్భ గృహానికి ముందు వరండా మాత్రమే ఉన్నాయి. రాను రాను ఘనతరమైన పూజాపునస్కారాలు పెరిగినకొద్దీ, అదనంగా అనేక గదులు చావడులు నిర్మించాల్సిన అవసరం కలిగింది తరువాత ఆలయ ఆవరణ చుట్టూ ప్రాకారం నిర్మించబడింది. సింహద్వారం పైన కట్టిన కట్టడాన్ని గోపురం అంటున్నాం. దేవాలయ ఆవరణలో ఇతర దేవుళ్ళకి, ఋషులకు వేరుగా గుడులు కట్టటం ఆచారమైంది భక్తులు ఈ చిన్న చిన్న గుడులు కూడా దర్శించి పూజలు



తంజావూరులో క్రీ.శ. 1006లో చోళరాజులు నిర్మించిన బృహదీశ్వరాలయం–శివునికి అంకితమైన గొప్ప దేవాలయం [illegible] తర చిత్రకళావశేషాలను నేటికీ ఈ ఆలయంలో చూడవచ్చు.

చెయ్యటం ఆనవాయితీ. ఇవి కాక, కేంద్ర గర్భగృహంపైన శంకు ఆకారంలో ఎత్తయిన శిఖర నిర్మాణం కూడా జరిగింది. ఈ అత్యున్నత ఆలయశిఖరాన్నిబట్టి అసలు గర్భగుడి ఏదో భక్తులకు సులువుగా తెలుస్తుంది.

దేవుని/దేవత విగ్రహాన్ని గర్భగుడిలో ప్రతిష్టించారు. ఈ విగ్రహాలు/ప్రతిమలలో కొన్ని రాతివి, మరికొన్ని కంచువి. కంచుతో తయారుచేసిన విగ్రహాలు, ప్రతిమలు అతి సుందరమై ఉగ్రత్ప్రసిద్ధి పొందాయి.

చోళ రాజ్యంలో ముఖ్యంగా గ్రామసీమల్లో దేవాలయం సాంఘిక, ఆర్థిక జీవన కార్యకలాపాలకు కేంద్రంగా భాసించింది. గుడి అనేది కేవలం ఆరాధనా మందిరమే కాకుండా ప్రజలు సమావేశమయ్యే మందిరం కూడా పండుగలు, పర్వాలు జరిగే దినాల్లో చుట్టుపక్కల పల్లెపట్టుల జనమంతా కలిసి ఒక చోట సమావేశమయ్యే స్థలంగా దేవాలయం ప్రాచుర్యం పొందింది. సంపన్నులిచ్చిన భూరి విరాళాలు దేవాలయ అలంకరణకు ఉపయోగపడ్డాయి. దేవాలయ కుడ్యాలమీద దేవుళ్ళ, మనుషుల చిత్తరువుల తాలూకు శిల్ప, చిత్రకళా విన్యాసాలు చోటు చేసుకున్నాయి. రాజాస్థాన దృశ్యాలు, యుద్ధ దృశ్యాలు, పూజాదృశ్యాలు, సంగీత, నృత్య దృశ్యాలు అనేకం గుడి గోడలమీద కనువిందు చేస్తాయి. కంచు, రాతి దైవ ప్రతిమల్ని అత్యంత శ్రద్ధా భక్తుల్తో శిల్పులు తయారు చేశారు పర్వదినాల్లో దైవ ప్రతిమల్ని ఖరీదైన చీని చీనాంబరాలలో, బంగారు ఆభరణాలతో అలంకరిస్తారు. దైవ ప్రతిమల్ని రథం మీద ఊరేగిస్తారు దేవాలయం సుందరమైన కట్టడం మాత్రమే కాకుండా వెండి బంగారాల అక్షయ నిధి కూడా.



11వ శతాబ్దం చోళకాలం నాటి శివ–కాంస్య విగ్రహం

చోళ రాజుల కాలంలో తంజావూరు దేవాలయం అత్యంత భాగ్యవంతమైంది. విరాళాలు, దక్షిణలు, దేవాలయ మాన్యాలు వగైరాల ద్వారా వచ్చే ఆదాయం ఇంత అని చెప్పలేనంత ! ఆలయంలో పనిచేసే సిబ్బంది వందల సంఖ్యలో ఉండేవారు. తంజావూరు ఆలయంలో 400 మంది దేవదాసీలు, 212 గురు పరిచారకులు, 57 గురు సంగీత విద్వాంసులు, వందలాది అర్చకులు కొలువు చేసే వాళ్ళు. దేవాలయంమీద వచ్చే అంతులేని ఆదాయాన్ని నిలవపెట్టకుండా వ్యాపార సంస్థలకు, గ్రామ సభలకు, తదితర సంస్థలకు సంవత్సరానికి 12 శాతం వడ్డీ చొప్పున డబ్బు అప్పుగా ఇచ్చే ఆచారం ఉంగి. పూర్వం విపరీతంగా డబ్బు కూడబెట్టిన బౌద్ధమఠాలు వ్యాపార వరాలకు

పడ్డీమీద డబ్బు అప్పుపెట్టిన పద్ధతిని హిందూదేవాలయాలు కూడా అనుసరించాయి

దేవదాసి అంటే దేవునికి అంకితమై పోయిన ఆడ బానిస. వాళ్లలో బాగా నైపుణ్యం కలిగిన వాళ్ళని భరతనాట్య ప్రదర్శనకు ఎంపిక చేసేవాళ్ళు. రానురాను ఈ దేవదాసీ వ్యవస్థ భ్రష్టు పట్టిపోయింది. దేవదాసీల్ని వేశ్యలుగా మార్చి దోపిడీచేశారు. వేశ్యాధనాన్ని ఆలయ ధర్మకర్తలు వసూలుచేశారు. రాజాస్థానాలలో రాజుని, రాజపరివారాన్ని, సదస్యుల్ని అలరించే నర్తకికి దేవదాసి మాదిరిగా రాకుండా మర్యాద, మన్ననలుండేవి. రాజాస్థానాల్లో నృత్యం చేసే ఈ వెలయాళ్ళకు, ఉన్నత వర్గాల స్త్రీలకు, మిగతా స్త్రీలకన్నా ఎక్కువ స్వాతంత్ర్యం ఉండేది. సామాన్య గృహిణులవలె కాకుండా వీళ్ళు సామాజిక కట్టుబాట్లని కొంత మేరకి ధిక్కరించ గలిగారు మిగిలిన స్త్రీ జనం చాలామంది వంటింటి గోడలమధ్య. పంటపొలాల్లో చాకిరీ చేశారు.



నృత్య భంగిమలో కృష్ణుడు—చోళరాజుల కాలం నాటి కాంస్య ప్రతిమ

విద్య. సంస్కృతంలో యధావిధిగా బోధించే వైదిక విద్యకి దేవాలయం కేంద్రం. ఇది అనూచానంగా వచ్చిన సంప్రదాయం. గుడి తప్ప వేరే బడి అంటూ లేదు. గుడిలో పూజలు నిర్వహించే అర్చకులే స్థానిక గురువులు కూడా. విద్య నేర్చుకునే పిల్లల్లో ఎక్కువ మంది బ్రాహ్మల పిల్లలే. వాళ్ళు సంస్కృతం, తమిళం రెండూ నేర్చుకునే వాళ్ళు. మతపరమైన విద్య యావత్తు సంస్కృతంలో ఉండడంచేత వేదాధ్యయనం తప్పనిసరి. చోళ రాజ్య ప్రజలు మాట్లాడే భాష తమిళం కాబట్టి ప్రాంతీయ భాషని కూడా అభ్యసించేవాళ్ళు. సంస్కృతభాష తమిళాన్ని ప్రభావితం చేసింది. అనేక సంస్కృత పదాలు తమిళంలో కలగలసిపోయాయి. సంస్కృత భాషలో ఉన్న సాహిత్య గ్రంథాలు, మత సర్వస్వాలు తమిళంలోకి అనువదింపబడి ప్రజాదరణ పొందాయి. కంబన్ రచించిన రామాయణం ఆ విధంగా బహుళ ప్రచారం పొందింది. చోళ రాజుల శాసనాలు సంస్కృత, తమిళ భాషలు రెండిటిలోనూ రాయించబడ్డాయి. ఆనాడు తమిళ కవులు, నాటక కర్తలు మాతృభాష అయిన తమిళంలో కావ్యాలు, నాటకాలు రాశారు.

తమిళం చాలా ప్రాచీనమైన భాష అయినప్పటికి, అది దక్షిణ భారతదేశంలో ప్రజలు మాట్లాడిన ఏకైక భాషకాదు. ఆంధ్ర ప్రాంతంలో తెలుగు మాట్లాడేవాళ్ళు. రామాయణ, మహాభారతాలు తెలుగులో వెలువడ్డాయి. ఇవి కాక, తెలుగు స్వతంత్ర రచనలు కూడా ప్రజలలో విశేష ప్రచారం పొందాయి. ఆంధ్ర మహాభారతంలో నన్నయ మహాకవి రచించిన ఆదిపర్వం ఆయనని చిరస్మరణీయుణ్ణిగా చేసింది. మిగిలిన పర్వాలను తిక్కన కవీంద్రుడు పూర్తి చేశాడు. నన్నయ అసంపూర్ణంగా వదలివెళ్ళిన భాగాన్ని ఎర్రాప్రెగడ పూర్తి చేశాడు.

మైసూరు ప్రాంతంలో కన్నడం ప్రజల భాష. ఆనాడు, ఈనాడు కూడా. తెలుగు కవిత్రయం మాదిరిగానే కన్నడంలో పంపన, పొన్న, రన్న అనే ముగ్గురు కవులు కన్నడ సాహిత్యంలో "రత్నత్రయం"గా ప్రసిద్ధికెక్కారు. వాళ్ళు కన్నడ భాషలో కమనీయ కవిత్వం చెప్పారు. లింగాయతులనే శైవమతారాధకుల ద్వారా కూడా కన్నడం ప్రజల్లో విశేష వ్యాప్తి పొందింది. వాళ్ళు తమ బోధల్ని సంస్కృతంలో కాకుండా కన్నడంలో బోధించారు. వీళ్ళకి పూర్వం తమిళనాడులో నయనార్లు, ఆళ్వార్లు అనే శైవ, వైష్ణవ భక్తులు సంస్కృతం వదిలి వేసి తమిళంలోనే దైవ సంకీర్తనం చేశారని లోగడ చెప్పుకున్నాం. లింగాయతులు కన్నడంలో మతబోధ చెయ్యటానికి కారణం - అది ధనిక, పేద వ్యత్యాసం లేకుండా సకల ప్రజలకు అర్థమయ్యే భాష. వాళ్ళు సంస్కృతంలో బోధించి వుంటే, శైవం కొద్ది మంది విద్యావంతులకే పరిమితమై వుండేది.

మతం : చోళుల కాలంలో దక్షిణ భారత దేశంలో ప్రజాదరణ పొందిన అనేక మత ఉద్యమాలు వర్ధిల్లాయి. కొన్ని నయనార్ల, ఆళ్వార్ల భక్తి మార్గాన్నే ప్రబోధించాయి. మిగతా ఉద్యమాలు, కొన్ని నూతన భావాల్ని ప్రవేశపెట్టాయి. మతం అంటే విగ్రహాల్ని పూజించటం, పురోహితులు చేసే ప్రార్థనల్ని వల్లెవేయటం కాదు, భగవంతుణ్ని ప్రేమించటం, తోటి మానవుని పట్ల దయగా ప్రవర్తించటం మతసారం అని ఈ ఉద్యమాల్లో అనేకం బోధించాయి. ఈ ఉద్యమాలు నడిపిన వాళ్ళు కులాలుగా చీలిపోయిన సమాజాన్ని నిరసించారు. మానవులంతా సమానులే అని వాళ్ళు బోధిం



తమిళ యోగి సుందరమూర్తి కాంస్య ప్రతిమ-10-11 శతాబ్దాల కాలంలో చోళ రాజుల నాటి ఈ ప్రతిమ కిలైయూరు (తమిళనాడు)లో దొరికింది.

చారు. వీరశైవ మత స్థాపకుడైన బసవరాజు 12వ శతాబ్దంలో జీవించాడు.

తత్వశాస్త్రం పట్ల అనేక మంది పండితులు, విద్వాంసులు అపారశ్రద్ధ ప్రదర్శించిన కాలం కూడా ఇదే. దక్షిణ భారత దేశంలో వాళ్ళు ప్రబోధం చేసిన తత్వశాస్త్రం భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో ప్రజాదరణ పొందింది. ఈ మతగురువుల్లో శంకరుడు, రామానుజుడు సుప్రసిద్ధులు. శంకరాచార్యుడు 8వ శతాబ్దంలో కేరళలో జీవించాడు. ఆయన అద్వైత వేదాంతాన్ని ప్రచారం చేశాడు. జ్ఞానమార్గం ద్వారా భగవంతుణ్ణి చేరవచ్చుననేది ఆయన బోధనల్లో ప్రధానమైనది. ఆయన తన అద్వైత వేదాంతాన్ని ప్రచారం చేస్తూ దేశమంతటా పర్యటించాడు; అనేక మంది ఇతర మత గురువులతో, పండితులతో చర్చా సంవాదాలు కావించాడు. దేశంలో పలుచోట్ల అద్వైత మత పీఠాల్ని నెలకొల్పాడు.



తమిళయోగి మణిక్కవచార్—13వ శతాబ్దిలో కంచుపటి చోళులకాలం నాటిది.

రామానుజాచార్యులు 11వ శతాబ్దంలో తిరుపతిలో ఒక తమిళ బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. భక్తి మార్గమొక్కటే జీవన్ముక్తి మార్గమని ఆయన చాటాడు. అందు చేతనే, ఆయన శంకరుని జ్ఞానమార్గన్ని అంగీకరించలేదు. జ్ఞాన మార్గం ద్వారా కంటే ప్రేమతో భగవంతుణ్ణి మేలుగా సేవించవచ్చునని ఆయన నమ్మాడు. తక్కువ కులాలకు చెందిన వారికి దేవాలయ ప్రవేశం లేకపోవటం చూసి ఆయన ఖేదపడ్డాడు. ఆయన దృష్టిలో ఉన్నత, నీచ కులాలంటూ లేవు; అందరూ సమానులే. శూద్రులకు దేవాలయ ద్వారాలు తెరిపించటానికి రామానుజుడు తీవ్ర కృషి చేశాడు.

రామానుజుని తరువాత పేర్కొనదగ్గవాడు మధ్వాచార్యుడు. ఆయన బోధించిన మతం ద్వైతం ఆయన 13వ శతాబ్దిలో జీవించాడు. రామానుజాచార్యుని మాదిరిగా ఈయన కూడా భక్తి ఉద్యమ భావాలకు హిందూమత ధర్మశాస్త్రానికి మధ్య సమన్వయం సాధించటానికి కృషి చేశాడు.

ఈ విధంగా చోళులు రాజ్యమేలిన కాలం భారతీయ సంస్కృతీ వికాసానికి గొప్ప సేవచేసింది. చోళుల రాజకీయాధికారం చోళ రాజ్యాన్ని అత్యంత శక్తివంతంగా రూపొందించింది. కొంత కాలంపాటు భారత ఉపఖండంలోని అతి బలీయమైన రాజ్యాలలో చోళ రాజ్యం ఒకటిగా వెలిగింది ఆ కాలపు వ్యాపార, వాణిజ్యాలు వర్తకులకి, చోళ రాజ్యానికి అపార సంపద చేకూర్చి పెట్టాయి. తమిళ, తెలుగు, కన్నడదేశ

భాషల్లో కవులు, రచయితలు అనేక కృతులు వెలార్చారు [illegible] సృష్టించబడ్డాయి. భక్తి మార్గాన్ని బలపరుస్తూ తలెత్తిన ప్రసిద్ధ మత ఉద్యమాలు [illegible] నూతన భావాల్ని ప్రవేశపెట్టాయి. ఆనాటి తత్వశాస్త్రజ్ఞులు భారతీయ విచారధారని సుసంపన్నం [illegible] అనేక పతిణా మాలు దక్షిణాదిలోనే కాకుండా దేశంలోని ఇతర ప్రాంతాల మీద కూడా [illegible] ప్రసరింపజేశాయి.

# 3

# ఉత్తర భారతంలో ప్రాంతీయ రాజ్యాల ప్రారంభం : క్రీ. శ. 800-1200

ఉత్తర భారతదేశంలో గుప్తుల తరువాతి కాలం ప్రధానంగా చిన్న రాజ్యాల యుగం. అడప తడప, శ్రీ హర్షుని లాంటి చక్రవర్తి సామ్రాజ్య నిర్మాణానికి ప్రయత్నించాడు. కాని, ఆ ప్రయత్నాలు అట్టే ఫలించ లేదు అయితే, సామ్రాజ్యం స్థాపించాలనే సంకల్పం మాత్రం అడుగంటి పోలేదు. క్రీ. శ. 750-1000 సంవత్సరాల మధ్య మూడు పెద్ద రాజ్యాలు ఉత్తర భారతదేశం మీద ఆధిపత్యం కోసం పరస్పరం పోటాపోటీలు పడి ఎడతెగకుండా యుద్ధాల్లో మునిగి తేలాయి. ఫలితం శూన్యం.

*కనోజ్ కొరకు పోరాటం :* ఉత్తరభారతంలో జరిగిన దండయాత్రా పరంపర కనోజ్ నగరాన్ని కైవసం చేసుకోటానికి జరిగినవే. కనోజ్ ఒకప్పుడు శ్రీ హర్షుని రాజధాని. హర్షుని తరువాత కూడా ఆ నగర ప్రాముఖ్యం చెక్కుచెదరలేదు. ఉత్తరమైదానంలో కీలక ప్రదేశంలో పాదుకొన్న నగరం కావటంచేత, కనోజ్‌ని స్వాధీనం చేసుకున్నవాడే గంగానదీ లోయ మీద అధికారం చలాయించగలుగుతాడు. కనోజ్ కోసం జరిగిన సుదీర్ఘ సంఘర్షణలో మూడు ప్రధాన రాజ్యాలు ఆనాడు కూరుకుపోయాయి ఒకరి తరవాత ఒకరు కనోజ్‌ని ఆక్రమించారు. ఆధునిక చరిత్రకారులు కనోజ్‌కోసం జరిగిన ఈ సంఘర్షణని త్రైపాక్షిక పోరాటంగా అభివర్ణిస్తారు. ఆ మూడు పక్షాలు : రాష్ట్రకూటులు, ప్రతీహారులు, పాలరాజులు.

రాష్ట్రకూటులు నాసిక్ చుట్టూగల ఉత్తర దక్కను ప్రాంతాన్ని పరిపాలిస్తూ వుండేవాళ్ళు. రాజధాని మాల్‌ఖేడ్ సుందర, సంపన్న నగరం రాష్ట్రకూట రాజుల్లో ప్రసిద్ధుడైన అమోఘవర్షుడు రాష్ట్రకూటుల అధికారాన్ని దక్కనులో వలె ఉత్తరభారతదేశంలో కూడా పటిష్టం చెయ్యాలని వాంఛించాడు. కాబట్టి కనోజ్‌ని కైవసం చేసుకోటం ద్వారా ఉత్తరాదిని తన చెప్పుచేతల్లో పెట్టుకోవాలని అమోఘ వర్షుడు ప్రయత్నించాడు.

ఆదేకాలంలో ప్రతీహారులు అవంతిని, దక్షిణ రాజస్థాన్‌లో కొన్ని ప్రాంతాల్ని పరిపాలించారు. ప్రతీహారుల్ని ద్వారపాలకులని రాష్ట్రకూటులు చులకనగా మాట్లాడారు. ప్రతీహారులు బహుశా రాజప్రాసాదంలో అధికార్లు అయివుండవచ్చు క్రమేణా అధికారం చేజిక్కించుకొని స్వతంత్ర పాలకవంశంగా పరిణతి చెందారు ఆ కాలానికి సంబంధించిన ఆధారాల్ని బట్టి, ప్రతీహారులు మొట్టమొదట "మ్లేచ్ఛ"ల్ని ఓడించి బలపడ్డట్టు

తెలుస్తుంది. మ్లేచ్ఛుడంటే పశుప్రాయుడు లేదా వెలివేయబడ్డవాడు అని అర్థం. సాధారణంగా విదేశీయుల్ని వర్ణించటానికి ఈ పదం వాడేవాళ్ళు. ఈ సందర్భంలో ఆ మ్లెచ్ఛు లెవరో తెలీదు. బహుశా, సింధులోని అరబ్బులు కావచ్చు. ప్రతీహారులు అరబ్బులమీద విజయం సాధించాక, సైన్యాల్ని తూర్పుదిక్కుకి మళ్ళించారు. 8 వ శతాబ్దం ముగింపు నాటికి ప్రతీహారులు కనోజ్‌ని స్వాధీనం చేసుకున్నారు.

బెంగాల్‌ని పరిపాలించే పాలరాజులు కూడా కనోజ్ మీద కన్నువేశారు. పాలరాజులు షుమారు 400 యేళ్ళు రాజ్యం చేశారు. సంపూర్ణ వంగదేశం, బీహార్‌లో కొంతభాగం పాలరాజ్యంలో ఉండేవి. మొట్టమొదటి పాలరాజు గోపాల. అతనికి పూర్వం ఉన్నరాజు నిస్సంతుగా మరణించడం వల్ల ప్రభువర్గీయులంతా కలిసి గోపాలను రాజుగా ఎన్నుకున్నారు. ఇతడే పాలవంశ స్థాపకుడు.

గోపాలుని కుమారుడు ధర్మపాలుడు పాల వంశాన్ని ఉత్తర భారతదేశ రాజకీయాల్లో శక్తివంతంగా తీర్చిదిద్దాడు. అడుగులోనే హంసపాదులా రాష్ట్రకూటుల చేతుల్లో అపజయం కలిగినా, ధర్మపాలుడు తన సైన్యాన్ని పునస్సమీకరించి, పరిసర రాజ్యాలతో సత్సంబంధాలు నెలకొల్పుకొని 8వ శతాబ్దాంతానికి కనోజ్‌ని పట్టుకోగలిగాడు. ధర్మపాలుడు టిబెట్‌తో స్నేహసంధి చేసుకున్నాడు. దక్షిణాదిన చోళ రాజుల మాదిరిగా పాలరాజులు సైతం ఆగ్నేయ ఆసియాతో సముద్రవ్యాపారం పట్ల ప్రత్యేక శ్రద్ధ ప్రదర్శించారు. వంగ వర్తకులకి ప్రోత్సాహం అందించారు.

పాలరాజులు కనోజ్‌ని ఎక్కువ కాలం నిలుపుకోలేకపోయారు. భోజుడనే రాజు కాలంలో ప్రతీహారులు తిరిగి బలం పుంజుకున్నారు. భోజరాజు క్రీ. శ. 836 నుంచి 882 వరకు పరిపాలించాడు. ఆనాడు ఉత్తర భారతంలో భోజరాజంతటి యశశ్శాలి లేడు. అతడు మహాయోధుడు; కనోజ్‌ని పునరాక్రమించాడు. కాని, రాష్ట్రకూటుల మీద జరిపిన దాడిలో భోజరాజు సుప్రసిద్ధ రాష్ట్రకూట రాజు ధృవుని చేతుల్లో ఓడిపోయాడు. 851 ప్రాంతంలో సులేమాన్ అనే అరబ్బు వర్తకుడు నాటి భారతదేశ పరిస్థితుల్ని వర్ణిస్తూ రాశాడు. 'జుర్జ్' అనే శక్తిసంపన్నుడైన రాజు ఒక సంపన్న రాజ్యాన్ని పరిపాలించినట్లుగా అతడు రాశాడు. గుజరాతును 'జుర్జ్' అని అరబిక్ భాషలో అని వుండవచ్చునని చరిత్రకారులు భావిస్తున్నారు. ఆ కాలంలో గుజరాతుని పాలించినవాడు భోజరాజు కాబట్టి ఆ అరబ్బు వర్తకుడు భోజరాజుని గురించి వ్రాసి వుంటాడని చరిత్రకారుల విశ్వాసం. భోజరాజు గొప్ప సాహిత్య పోషకుడు; వైష్ణవమతాన్ని ఆదరించినవాడు ఆయన నాణాలమీద విష్ణువు వరహావతారం ముద్రితమై ఉంది. "ఆదివరాహుడ"ని ఆయన స్వయంగా బిరుదు ధరించాడు. బహుకాలం రాజ్యంచేసి ఆయన సింహాసన పరిత్యాగం చేశాడని ఒక కథ ప్రచారంలో ఉంది. బహుశా అది కట్టు కథ కావచ్చు.

916 లో రాష్ట్రకూటులు తిరిగి తమ బలాన్ని కూడదీసుకుని కనోజ్ పైన దాడిచేశారు. అప్పటికి కనోజ్ మీద కాంక్షతో జ్వలించిన రాష్ట్రకూటులు, ప్రతీహారులు, పాలరాజులు-ముగ్గురూ పరస్పర యుద్ధాలతో నీరసించిపోయారు. ఎడతెగకుండా సాగిన ఈ పరస్పర మారణయుద్ధాల్లో తామెంత నిర్వీర్యులైపోయారో గ్రహించలేకపోయారు. ఒక్క శతాబ్దం లోపున మూడు రాజ్యాలూ క్షీణించిపోయాయి. రాష్ట్రకూటు లేలిన సీమ కడపటి చాళుక్యుల హస్తగతమైంది. పాలరాజ్యం మీద చోళ సైన్యాలు విరుచుకుపడ్డాయి. పాలరాజుల స్థానంలో సేనవంశం అధికారానికొచ్చింది. ప్రతీహార రాజ్యం ముక్కచెక్కలైంది.

చీలిపోయిన ఆ ముక్కలు కొన్నింట రాజపుత్రులు తలెత్తారు.

రాజపుత్రులు : రాజపుత్రులది ఆసక్తిదాయకమైన సుదీర్ఘ ఇతిహాసం. వాళ్ళు ఎవరో, ఎక్కడ నుంచి వచ్చారో అంతుబట్టని రహస్యంగా మిగిలిపోయింది. ఉత్తర భారతదేశం మీద హూణుల దండయాత్ర తరువాత ఇక్కడ స్థిరపడిపోయిన కొన్ని మధ్యాసియా తెగలకు చెందినవారై వుంటారని మన చరిత్రకారుల అభిప్రాయం. రాజపుత్ర వంశాలు కోకొల్లలు. తాము క్షత్రియ కుల సంజాతులమని వాళ్ళు నొక్కి చెప్పుకుంటారు. ప్రాచీన భారతీయ రాజుల సూర్య, చంద్ర వంశాలతో ముడివేసి తమ వంశావళి చరిత్ర రాయించుకున్నారు కొందరు రాజపుత్ర రాజులు. అయితే, ఈ సూర్య, చంద్ర వంశాలకు తాము చెందమని చాటుకున్న నాలుగు రాజపుత్ర వంశాలున్నాయి. అగ్ని కుల వంశం నుంచి ఉద్భవించామని వాళ్ళు చెప్పుకుంటారు. ఈ నాలుగు వంశాలు 9-13 శతాబ్దాల మధ్య భారత చరిత్రలో చాలా ముఖ్యమైనవి వాళ్ళు ప్రతీహారులు లేదా పరిహారులు, చౌహాన్లు, సోలంకీలు (లేదా చాళుక్యులు), పవార్లు (లేదా పరమార్లు)

ఈ నాలుగు వంశాల వారు పశ్చిమ భారతంలోను, మధ్య భారతం, రాజస్థాన్‌లలో కొన్ని ప్రాంతాలలోను తమ అధికారం ప్రతిష్టించుకున్నారు. పరిహార్లు కనోజ్ ప్రాంతాన్ని పాలించారు. చౌహాన్లు మధ్య రాజస్థాన్‌లో గద్దె ఎక్కారు. సోలంకీలు కథియవాడు, ఆ చుట్టుపక్కల ప్రాంతాలలో రాజ్యం చేశారు. పవార్లు మాళవ ప్రాంతాన్ని పాలించారు. వాళ్ళ రాజధాని ఇండోర్‌కి సమీపంలో వున్న ధార్. ఈ వంశాల్లో చాలా మంది ప్రతీహారులు, రాష్ట్రకూటుల కింద చిన్న ప్రభువులుగా ప్రారంభమై, తమ సార్వభౌముల్ని ఎదిరించి స్వతంత్రం ప్రకటించారు.

ఇంకా చాలా మంది చిల్లర మల్లర ప్రభువులు నెమ్మదిగా ఉత్తర భారతదేశంలో వివిధ ప్రాంతాల్లో బలపడి చిన్న చిన్న రాజ్యాలు స్థాపించారు. ఉదాహరణకి నేపాల్, కామరూప (అస్సాం), కాశ్మీరు, ఉత్కళ వగైరా రాజ్యాలు అలా తలెత్తినవే. ఈ సమయంలోనే చంపక (చంబా), దుర్గరా (జమ్ము), కులుతా (కులూలోయ) వగైరాలతో సహా అనేక పర్వత రాజ్యాలు పంజాబులో ఆవిర్భవించాయి. ఈ రాజ్యాలు కొండల్లో వుండటం చేతగానీ, రాజపుత్ర రాజ్యాలకు సుదూరంగా వుండటం చేతగానీ రాజపుత్ర చరిత్రలో పాలు పంచుకోలేదు. బుందేల్‌ఖండ్‌కు చెందిన చందేలులు, మేవాడ్‌లోని గుహిలాలు మొదలైన మధ్యభారత్, రాజస్థాన్ ప్రాంతాలలోని రాజ్యాలు రాజపుత్ర చరిత్రలో పాలుపంచుకున్నాయి. చౌహాన్‌లకు ఈశాన్యంగా తోమార్లు హరియానాని, ఢిల్లీ చుట్టూ వున్న ప్రాంతాన్ని పాలించారు. తోమార్లు కూడా ప్రతీహారుల కింద చిన్న సామంత ప్రభువులుగా ఉండి ప్రతీహారులు బలహీనమయ్యాక స్వతంత్రులయ్యారు. క్రీ. శ. 736లో ఢిల్లికా పట్టణం (ఢిల్లీ) నిర్మించారు. ఆ తరువాత చౌహాన్లు తోమార్లని ఓడించి వాళ్ళ రాజ్యాన్ని ఆక్రమించుకున్నారు. హిందీ కవి చాంద్‌భాట్ రాసిన "ప్రధ్వీరాజరాసా" అనే ప్రసిద్ధ కావ్యంలో కథానాయకుడైన మూడవ పృథ్వీరాజు చౌహాన్ వంశజుడే.

ఈ రాజ్యాలు తమ బలప్రదర్శన కోసం పరస్పరం యుద్ధాల్లో మునిగి తేలాయి; ఈ నిష్ఫల యుద్ధాల్లో నిర్వీర్యమైపోయాయి. ఈశాన్య దిశనుంచి తురుష్కుల దండయాత్రలు ప్రారంభమైనప్పుడు ఈ రాజ్యాలు ఆత్మరక్షణ చేసుకోలేనంత బలహీనమయ్యాయి. ఆఫ్ఘనిస్థాన్‌నుంచి భారతదేశం మీద దాడిచేసిన మొట్టమొదటివాడు ఘజినీ మహమ్మద్.

ఘజినీ మహమ్మద్ : 10 వ శతాబ్దంలో ఆఫ్ఘనిస్థాన్‌లో ఒక తురుష్క సామంతుడు స్థాపించిన చిన్న రాజ్యం ఘజినీ. అతని తరువాత రాజ్యానికి వచ్చిన మహమ్మద్ ఘజినీ రాజ్యాన్ని 'బలీయమైన విశాల రాజ్యంగా రూపొందించటానికి సమకట్టి మధ్యాసియాలో కొంత ప్రాంతాన్ని జయించాలని సంకల్పించాడు. ఆ జైత్రయాత్రకి సుశిక్షితమైన భారీసైన్యం అవసరమయింది. సైన్యానికి అవసరమైన ఆయుధ సంపత్తికి, సైన్య పోషణకి అపార ధనం సమకూర్చుకోవలసి వచ్చింది. పొరుగున భారతదేశం సిరి సంపదలతో తులతూగుతోందని మహమ్మద్‌కు తెలిసింది. కాబట్టి, భారతదేశాన్ని కొల్లగొట్టి, ఆ అపార ధన రాశితో మధ్యాసియా దండయాత్రకి అవసరమైన సైన్యం, సాధన సంపత్తి సమకూర్చుకోవాలని నిశ్చయించాడు.

మొట్టమొదటి దండయాత్ర క్రీ.శ. 1000లో జరిగింది. మహమ్మద్ తను పాలించిన 25 సంవత్సరాల్లో భారతదేశం మీద 17 తూర్లు దండయాత్రలు చేశాడు. ఈ దాడులవల్ల ఉత్తరభారతదేశ పౌరులు గడ గడలాడిపోయారు. ముఖ్యంగా డబ్బు, బంగారాల కోసం అతని వెంపర్లాట మూలంగా పౌరులు ప్రాణాలు అరచేత పెట్టుకుని జీవించారు. అతణ్ని నిరోధించటానికి ప్రయత్నించిన వాళ్ళని నిర్దాక్షిణ్యంగా వధించాడు. తరువాత పంజాబుని ఆక్రమించి ఘజ్నీ రాజ్యంలో కలిపేసుకున్నాడు.

క్రీ. శ. 1010-1025 సంవత్సరాల మధ్య మహమ్మద్ ఉత్తరభారతదేశంలో దేవాలయాల మీద మాత్రమే దాడిచేశాడు దేవాలయాల్లో అపార ఐశ్వర్యరాసులు పోగుబడి వున్నాయని అతనికి తెలియరావటంతో తన దాడుల్ని దేవాలయాల మీద మాత్రమే కేంద్రీకరించాడు. చరిత్ర ప్రసిద్ధమైన సోమనాథ దేవాలయం మీద జరిపిన దాడి ముఖ్యంగా పేర్కొనదగింది. దేవాలయ విధ్వంసం ద్వారా విగ్రహ విచ్ఛేదకుడుగా మహమ్మద్ మత పరమైన కీర్తి సంపాదించాడు.

1030 లో ఘజినీ మహమ్మద్ మరణించినప్పుడు ఉత్తర భారతప్రజలు ఊపిరి పీల్చుకున్నారు. మహమ్మద్ భారతదేశంలో ఇంత విధ్వంసకాండ జరిపినా, స్వదేశంలో ఒక సుందరమైన మసీదుని, గొప్ప గ్రంథాలయాన్ని నిర్మించాడు. షానామా అనే మహత్తర ఐతిహాసిక కావ్యాన్ని రచించిన ఫిరదౌసి కవీంద్రుణ్ణి గౌరవించి సన్మానించాడు. మధ్యాసియా పండితుడైన ఆల్‌బెరూనీని భారతదేశం పంపించాడు. ఆల్‌బెరూనీ ఈ దేశంలో చాలా యేళ్ళు జీవించి, మనదేశాన్ని మనదేశంలో ఆనాటి పరిస్థితుల్ని వర్ణిస్తూ ఒక అద్భుతమైన గ్రంథం రాశాడు.

మహమ్మద్ ఘోరీ : ఘజినీ మహమ్మద్ డబ్బు, బంగారాలు కొల్లగొట్టుకు పోవటానికి భారత దేశం మీద దాడులు జరిపాడు అతని తరువాత, 12 వ శతాబ్దం చివర్లో మహమ్మద్‌ఘోరీ భారతదేశంలో కొంత భాగాన్ని జయించి తన రాజ్యంలో కలుపుకోడానికి దండయాత్ర ప్రారంభించాడు ఇతిడు కూడా ఆఫ్ఘనిస్థాన్‌లో ఒక చిన్న రాజ్యానికి ప్రభువు. బంగారం, నగలు కొల్లగొట్టుకుపోవటం ఇతని ప్రధాన ఆశయం కాదు పంజాబు ఎలాగూ ఘజ్నీ రాజ్యంలో భాగమే గనుక మహమ్మద్ ఘోరీ దండయాత్రలకి సహాయకారిగా ఉపయోగపడింది.

మహమ్మద్ ఘోరీ భారత దండయాత్రలు చాలా పకడ్బందీగా జరిగాయి. భారతదేశంలో తను జయించిన భూభాగంలో సేనాపతిని నియమించి అతడు స్వదేశం తిరిగివెళ్లాడు. అఫ్ఘనిస్థాన్‌లో అతనికి

నిరంతర ఉపద్రవాలు కలగటం వల్ల ఒక్కచోట స్థిరంగా ఉండలేక ఈ రెండు దేశాల మధ్య తరచు రాకపోకలు సాగించాడు. చౌహాన్ రాజపుత్ర వంశస్థుడైన మూడవ పృథ్వీరాజుతో సాగించిన యుద్ధం అతడు చేసిన యుద్ధాల్లో అత్యంత ముఖ్యమైనది. 1192లో జరిగిన రెండవ స్థానేశ్వర యుద్ధంలో పృథ్వీరాజు ఓడిపోయాడు ఢిల్లీ రాజ్యం మహమ్మద్ ఘోరీ వశమయింది. భారతదేశంలో ఘోరీ అధికారానికి పునాదులు పడ్డాయి 1206 లో ఘోరీ హత్యచేయబడ్డాడు. భారతదేశంలో అతడు జయించిన భూభాగం కుతుబుద్దీన్ ఐబక్ అనే ఘోరీ సేనాపతి చేతుల్లోకి పోయింది

ఢిల్లీలో తుర్కీ జాతీయుల (తురుష్కులు) పరిపాలనకిది ఆరంభం. కేవలం 14 సంవత్సరాల స్వల్ప కాలంలో తురుష్కులు ఉత్తర భారత దేశంలో అనేక ముఖ్యమైన నగరాల్ని, వాణిజ్య మార్గాల్ని ఎలా పట్టుకోగలిగారనేది ఎవరైనా తరచుగా అడిగే ప్రశ్న. దీనికి జవాబు ఉత్తర భారతదేశంలో ఆనాటి రాజ్యాలలో జరిగిన రాజకీయ పరిణామాలలో మాత్రమే కాకుండా, అప్పటి సమాజం, ఆర్థిక వ్యవస్థల తీరు తెన్నులలో కూడా దొరుకుతుంది.

ఆర్థిక వ్యవస్థ . పూర్వం నుంచీ అవిచ్ఛిన్నంగా సాగుతూ వచ్చిన రెవెన్యూ వసూలు పద్ధతి మారిపోవటం మధ్య యుగంలో సంభవించిన ఒక పెద్ద మార్పు. ఇప్పుడు రాజుకి రాజ్యాదాయం మీద ప్రత్యక్ష అధికారం లేదు. ఇది ఇతర జీవన రంగాలలో కూడా మార్పు తెచ్చింది.

గుప్తుల కాలంలో కొంతమంది రాజోద్యోగులకి వేతనంగా డబ్బు చెల్లించే బదులు రెవెన్యూ వసూలు చేసుకునే హక్కు ఇవ్వబడింది. కొంత భూమిగానీ, లేదా ఒక గ్రామం గానీ ఇచ్చి శిస్తు వసూలు చేసుకునే అధికారం కొందరు అధికారులకి గుప్తరాజులు కట్టబెట్టారు. ఒక ఉద్యోగికి సాధారణంగా ముట్టే వేతనానికి ఆ రెవెన్యూ సరి సమానం. మొదట్లో వాళ్ళకి ఆ భూమి మీద యాజమాన్యపు హక్కులేదు కేవలం రెవెన్యూ మాత్రమే అనుభవించే వాళ్ళు. మధ్యయుగం ప్రవేశించే నాటికి వాళ్ళు ఆ భూమికి హక్కుదారులయ్యారు. భూములు, రెవెన్యూ మంజూరు చేసేపద్ధతి మధ్యయుగంలో పరిపాటయింది. ఆ విధంగా రాజు నుండి భూములుగాని, రెవెన్యూ వసూలు చేసుకునే హక్కులు గానీ పొందిన అధికార్లు రాయ్, రాకూర్ వగైరా బిరుదులు ధరించారు. ఈ బిరుదులు నిన్న మొన్నటి దాకా కొనసాగాయి. అయితే, వీళ్ళలో కొన్ని తేడాలున్నాయి. కొందరు రాజోద్యోగులు; మరి కొందరు యుద్ధాల్లో ఓడిపోయి తమ పూర్వపు భూముల్ని అనుభవించటానికి రాజు చేత అనుమతింపబడ్డ స్థానిక నాయకులు. వీళ్ళకాక రాజు నుండి దానాలు గ్రహించిన బ్రాహ్మణులు, పండితులు ఉన్నారు. వీళ్ళ మాన్యాలు మాత్రమే కాకుండా, రెవెన్యూ వసూలు చేసుకునే హక్కు సైతం సంపాదించారు. వీటినే అగ్రహారాలనే వాళ్ళం. అగ్రహారాలు పొందిన బ్రాహ్మణులు రాజు గారికి చేసిపెట్టాల్సిన విధులంటూ యేమీ లేవు. నిష్పూచీగా ఆ భూమి మీద వచ్చే రాబడిని వాళ్లు, వాళ్ళ కుటుంబాలు అనుభవించవచ్చు. దక్షిణ భారత దేశంలో బ్రహ్మదేయ మంజూర్లనేవి కూడా ఇంచు మించు ఇలాంటివే. అయితే బ్రాహ్మణులు కాక మిగతా దానగ్రహీతలు రాజుగారికి నిర్వర్తించి పెట్టవలసిన బాధ్యతలు కొన్ని ఉండేవి. వాళ్ళు రైతుల నుంచి శిస్తు వసూలు చేసుకుని, ఎక్కువ భాగం తాము అట్టే పెట్టుకుని మిగిలింది రాజుకి కట్టేవాళ్ళు. రాజుకి అవసరమైనప్పుడు పంపటానికి గాను కొద్ది సైన్యాన్ని కూడా పోషించవలసివుంది

ఈ దానాలు పొందినవాళ్ళ సంఖ్య ఎక్కువవుతున్న కొద్దీ, పెద్దగా భూమి ఈ దాన గ్రహీత చేతుల్లోకి పోయింది. రాజుకి వచ్చే ఆదాయం క్రమంగా తగ్గిపోయింది. ఒక్కొక్క ఊరు కాక ఏకంగా ఒక జిల్లా మొత్తాన్ని మంత్రిలాంటి ఓ పెద్ద అధికారికి రాజు దానం చేసేవాడు. అతగాడు జిల్లాలో వుండే అన్ని గ్రామాల నుండి రెవెన్యూ వసూలు చేసుకోలేక, తనకింద ఉద్యోగులకు గ్రామాలు దానం చేసేవాడు. వాళ్ళు రైతుల దగ్గర శిస్తు వసూలు చేసేవాళ్ళు. ఈ విధంగా రాజుకీ-రైతులకు మధ్య అనేక మంది దళారీలు పుట్టుకొచ్చారు

రెవెన్యూ వసూలు పద్ధతిలో వచ్చిన ఈ మార్పు ఫలితంగా అనేక మార్పులు కలిగాయి. రాజోద్యోగులు ఇప్పుడు రాజు మీద పూర్తిగా ఆధారపడిలేరు. వాళ్ళు స్వతంత్ర పాలకుల మాదిరిగా ప్రవర్తించారు. రైతులు తమ మీద ప్రత్యక్ష అధికారం చెలాయించే సామంతుల పట్ల ఎక్కువ విధేయత ప్రకటించారు. పూర్వం రాజోద్యోగులు రాజు పేరు మీద శిస్తు వసూలు చేసేవాళ్ళు. ఇప్పుడు తమ పేరు మీద వసూలు చేసుకుంటున్నారు. పైగా, రాజు రైతుతో ఎలాంటి సంబంధం లేకుండా ఎక్కడో దూరాన నివసించే పరాయివాడయ్యాడు. పూర్వం రెవెన్యూ మొత్తం రాజుగారి ఖజానాకి పోయేది కనుక ఆయన పెద్ద సైన్యాన్ని నిర్మించాలనుకుంటే ఖజానా నుంచి ఉదారంగా డబ్బు తీసి ఆ పనికి వినియోగించేవాడు. ఇప్పుడు రాజు, సామంతుల దయ మీద ఆధారపడవలసి వచ్చింది. పెద్ద సైన్యాన్ని తయారు చేసుకోటానికి అవసరమైన అదనపు డబ్బు రాజు దగ్గర లేదు. ఉత్తర భారతదేశంలో చాలా రాజ్యాలు తురుష్కుల దాడి నుంచి ఆత్మరక్షణ చేసుకోలేకపోవడానికి ఇది కూడా ఒక కారణం.

రాజుకి-సామంతులకి మధ్య సంబంధాలు కూడా కొన్ని ఇబ్బందులతో కూడుకున్నటువంటివి. సామంతులంతా రాజుగారి చెప్పుచేతల్లో ఉండవలసిన వాళ్ళే. కాని, రాజుని ఇబ్బంది పెట్టాలంటే పెట్టగల సమర్థులు. వసూలు చేసిన శిస్తు పైకంలో రాజుగారి వాటా పంపించటంలో ఆలస్యం చెయ్యటం ద్వారా, అవసరమైన సమయంలో సైనికుల్ని పంపించేటప్పుడు మోసం చెయ్యటం ద్వారా రాజుని ఇరుకులో పెట్టగలరు. రాజు తన సామంతుల మీద ఎక్కువ ఆధారపడ్డ కొద్దీ, ఇంకా బలహీనుడై పోయాడు. రాజు సామంతునికిచ్చిన జమీని తిరిగి లాక్కోవచ్చు గాని అటువంటి సందర్భాలు చాలా అరుదు. అంచేతనే, సామంతులు కూడా చాలా శక్తిమంతులుగా వుండేవాళ్ళు. రాజు తన సామంతులతో ఎంతో జాగరూకతతో మెలగవలసి ఉండేది.

సామంతుల్లో పరస్పర ఈర్ష్యా ద్వేషాలు పెరగసాగాయి. అందరూ ఒకే రాజు కింద సామంతులే అయినా, పరస్పరం వైరాలు పెంచుకున్నారు. ఈ వైరాలు యుద్ధాలకు దారి తీశాయి. ఏ కొద్ది పొరబాటు జరిగినా, ఏ పొరపాటు మాట దొర్లినా సామంతులు చాలా తీవ్ర విషయంగా భావించేవాళ్ళు. తగాదా పరిష్కారం కావాలంటే యుద్ధం శరణ్యమైంది. తమ ఆధిక్యతని ప్రదర్శించుకోటానికి యుద్ధం ఒక సాధనమైంది. ఆ విధంగా, రైతుల నుంచి వసూలు చేసుకున్న సొమ్ము రాళ్ళ పాలయింది.

తాను చాలా పెరిగిపోయాననుకున్న సామంతుడు రాజుని ఎదురు తిరిగి స్వాతంత్ర్యం ప్రకటించి స్వంత రాజ్యం స్థాపించాడు సాధారణంగా రాజు శక్తిహీనుడు కావటం చేత సామంతుణ్ని యేమీ చెయ్యలేకపోయాడు. చాళుక్యుల కింద సామంతులుగా వున్న రాష్ట్రకూటులు ఆ విధంగానే స్వాతంత్ర్యం ప్రకటించి,

చివరకి చాళుక్యుల్నే తోసివేశారు. అదే రాష్ట్రకూటుల్ని వాళ్ళ కింద సామంతులుగా పని చేసిన కడపటి చాళుక్యులు పడదోశారు. అదే విధంగా, ప్రతీహారుల అడుగులకు మడుగులొత్తిన చందేళ రాజపుత్రులు స్వతంత్రం ప్రకటించారు. దక్షిణాదిన సామంత ప్రభువులుగా ఉన్న చోళులు స్వతంత్రులై సామ్రాజ్యం స్థాపించుకున్నారు. ఏ సామంతుడికైనా స్వతంత్రం ప్రకటించాలని కోరిక పుడితే, "మహారాజాధిరాజ" వగైరా పెద్ద పెద్ద బిరుదులు తగిలించుకునేవాడు. ఆ బిరుదులు వినటానికి గొప్పగా వుంటాయే తప్ప, వాటిల్లో ఏ పసా లేదు.

ఈ వ్యవస్థలో విపరీతంగా కష్టాలుపడ్డ వాళ్ళు-రైతులు. ప్రభువుకి శిస్తులు కట్టటమే కాకుండా, వాళ్ళు నానారకాల వెట్టిచాకిరీ చేసిపెట్టారు. భూమికి శిస్తు వసూలు చెయ్యటమే కాకుండా, నీటి పారుదలకి, రోడ్ల నిర్మాణానికి, ఇంకా చిల్లర మల్లర లాభాలు చేసిపెట్టినందుకు రైతుల నుంచి ఈ సామంతులు అదనంగా పన్నులు గుంజారు. రైతు రాజుతో మొరపెట్టుకోలేడు. సామంతుని మీద రాజు అధికారం చాలా పరిమితమైంది. ఆ పరిస్థితుల్లో, రాజ్యమేలేవాడు రాజపుత్రుడా, తురుష్కుడా అని రైతు పట్టించుకోలేదు. రైతు ఇంకా ఇంకా కష్టం చేసి చేసి కటికి నిరుపేదగా మిగిలిపోయాడు.

సమాజం : పూర్వపు స్థితితో పోల్చుకుంటే రాజు రాజకీయంగా, ఆర్థికంగా బలహీనుడైపోయినప్పటికీ, ఆడంబరంగా దర్జాగా జీవించాడు. రాబడి మొత్తం సుందర రాజ ప్రాసాదాలు, దేవాలయాలు నిర్మించటానికి ఖర్చయిపోయింది; మహా ఖరీదైన చీనాంబరాలు; ఆభరణాలకు, దర్బారు జీవితానికి ఖర్చయిపోయింది. రాజు ప్రవేశపెట్టిన విలాస సంప్రదాయరీతుల్ని సామంతులు అనుకరించారు.

రాజ దర్బారుకి సామంతులే కాకుండా సంపన్న బ్రాహ్మణులు సైతం హాజరయ్యే వారు.

అగ్రహారాలు పొందిన బ్రాహ్మలు సంపన్నులుగా, శక్తివంతులుగా ఉన్నారంటే, వాళ్ళు తాము వసూలు చేసుకున్న రాబడిలో చిన్న మొత్తు రాజుకి కట్టే పనిలేదు. అంచేత, వాళ్ళు బాగా మదించి వైభవోపేతంగా జీవించారు. ఆఖరికి భూమినైనా సాగు చేసేవాళ్ళు కాదు. శూద్ర రైతులు సాగుచేసి పెట్టేవాళ్ళు. అగ్రహారాలు పొందినందుకుగాను, బ్రాహ్మలు రాజుగారికి మతపరమైన క్రతువులు కర్మలు జరిపించేవాళ్ళు. మరికొందరు అగ్రహారీకులు రాజుని కీర్తిస్తూ చరిత్రలు రాశారు. ఇంకా అనేక మంది రాజాస్థానాల్లో అధికార్లుగా కొలువు చేశారు.

చిన్న చిన్న పట్టణాల్లో, నగరాల్లో జీవించిన ప్రజల్లో ఎక్కువ మంది వృత్తి పనులు చేసేవాళ్ళు, వ్యాపారస్థులు. భారతదేశపు పడమటి తీరంలో స్థిరపడ్డ అరబ్బు వ్యాపారుల పుణ్యమా అని పశ్చిమ ఆసియాతోను, మధ్యధరా తీర ప్రాంతంతోను వ్యాపారం ముమ్మరంగా సాగింది. భారతీయ వస్తువులు తూర్పు ఆఫ్రికా తీర పట్టణాలకి సైతం పాకిపోయాయి. భారత దేశం ఇతర దేశాలకు కుంకుమ పువ్వు, పట్టు, నూలు, ఉన్ని వస్త్రాలు, రత్నాలు, చందనం, సుగంధ ద్రవ్యాలు ఎగుమతి చేసింది. మధ్యాసియా నుంచి, అరేబియా నుంచి మేలు జాతి గుర్రాలు భారతదేశానికి దిగుమతి అయ్యాయి. ఈ గుర్రాల్ని భారతీయ వర్తకులు విపరీతమైన ఖరీదుపెట్టి కొనుగోలు చేశారు. ద్రాక్ష సారాయి, ఖర్జూరం పశ్చిమాసియా నుంచి దిగుమతయ్యాయి.

సమాజంలోని సకల వర్గాల్లో శూద్రుల స్థితి దయనీయమైంది. పొలంలో కష్టం చెయ్యటమే వాళ్ళ

వృత్తి కాబట్టి అందరికన్నా పేదవాళ్ళు శూద్ర రైతులు అదే కాలంలో ప్రపంచమంతటా కూడా రైతు దుర్భర జీవితం గడిపాడు. యూరప్‌లో కట్టుబానిసలు, చైనాలో రైతులు దారుణ కష్టాలు అనుభవించారు. ఆహారాన్ని ఉత్పత్తి చేసినవాళ్ళు రైతులు; కాబట్టి సమాజంలో అన్ని వర్గాలూ రైతుల మీద ఆధారపడ్డాయి. అయినా రైతుకి ఏ హక్కులూ లేవు; ఎవరికీ తన గోడు వినిపించలేడు; తన దుర్భర స్థితికి వ్యతిరేకంగా ఎదిరించి నిలబడలేడు భారత దేశంలో రైతు తక్కువ కులంవాడు కాబట్టి హీనంగా చూశారు. పై వర్గాల క్రూర నిరాదరణకి విసిగిపోయినప్పుడు, దేశంలో వేరే ప్రాంతాలకు పారిపోవటానికి రైతులు ప్రయత్నించిన సందర్భాలు ఉన్నాయి. కాని అది కూడా సాధ్యమయ్యేది కాదు. శూద్రులే కాకుండా ఇంకా హీనమైన పనులు చేసిపెట్టే అంటరాని వాళ్ళు అట్టడుగున ఉన్నారు.

*విద్య, విజ్ఞానం :* మతపరమైన క్రతువులు, కర్మలు చెయ్యటం ఒక్కటే కాకుండా విద్యా బోధన బ్రాహ్మల బాధ్యత. గుడి ఆవరణలో బడిపెట్టి ఉన్నత కులాల పిల్లలకి విద్యాబుద్ధులు నేర్పారు ఆ గురువుల్లో చాలామంది సంస్కృతం, గణితం, మతగ్రంథాలు చదివిన వాళ్ళు. బీహార్‌లో నలందా విశ్వ విద్యాలయం చాలా ప్రసిద్ధమైంది. గుప్తుల కాలంలో విద్యా విజ్ఞానాలపట్ల ముఖ్యంగా విజ్ఞానశాస్త్రం పట్ల గాఢమైన అనురక్తి ప్రదర్శితమైంది

మధ్య యుగాల్లో ఇదంతా గత ప్రశస్తిగా మారిపోయింది. విజ్ఞాన శాస్త్ర తృష్ణ క్షీణించిపోయింది. కొత్తవిషయాలు కనిపెట్టాలనే ఆసక్తి భారతీయ పండితుల్లో అడుగంటి పోయింది. తెలిసిందేదో పదే పదే వల్లె వేస్తూ కాలక్షేపం చేశారు. నేర్చుకున్న కొద్దిపాటి విజ్ఞానాన్ని కూడా వ్యర్థమైన పనులకు ఉపయోగ పెట్టారు. ఉదాహరణకి, ఖగోళ శాస్త్రంలో ఆర్యభట్ట కనిపెట్టిన కొత్తవిషయాల్ని భూమి, సూర్యుడు, అనంత విశ్వం గురించి మరెన్నో నూతనాంశాలు కనుక్కోడానికి వాడుకునే బదులు జ్యోతిషశాస్త్రపు మిడిమేళపు మూఢ నమ్మకాలకు జోడించారు. భారతీయ వైద్యవిజ్ఞానం ప్రపంచ ప్రసిద్ధమైనటువంటిది. మధ్యయుగంలో భారతీయ వైద్యశాస్త్రంలో అభివృద్ధి నిలిచిపోయింది మృత శరీరాన్ని ముట్టుకుంటే కులం పోతుందన్నారు. ఇది భారత దేశ దౌర్భాగ్యం. ఇదే కాలంలో అరబ్బు దేశాల్లోను, చైనాలోను, ఇంకా తదితర దేశాల్లో విజ్ఞాన శాస్త్రం అసమాన ప్రగతి సాధించింది. భారతదేశం వెనకబడి పోయింది.

శాస్త్ర, సారస్వతాలకు సంస్కృత భాషే ఇంకా వాడుకలో ఉంది. సంస్కృతంలో "కథా సరిత్సాగరమ్' నే కథా సంపుటి గొప్ప ప్రజాదరణ పొందింది. రాజుల చరిత్రలు కూడా రచింపబడ్డాయి. బిల్హణ కవి శేఖరుని "విక్రమాంక దేవ చరిత్ర" ఈ కోవకి చెందుతుంది. కాశ్మీర చరిత్రకు అద్దం పట్టిన కల్హణుని "రాజతరంగిణి" 12వ శతాబ్దపు సృష్టి. ఉత్తర భారతదేశంలో కృష్ణ భక్తి పెరిగిపోయింది. రాధా, కృష్ణుల ప్రణయ కథలు ప్రజల్లో విరివిపొందాయి. రాధా మాధవ ప్రణయ లీలల పైన అనేకమంది కవిత లల్లారు. జయదేవుని గీత గోవిందం ఆ కోవలోనిదే.

సంస్కృతంతో పాటు దేశభాషలు కూడా అభివృద్ధి కాసాగాయి. ఆనాడు అట్లా అభివృద్ధి అయిన భాషల్నే ఇప్పుడు మనం ప్రాంతీయ భాషలని వ్యవహరిస్తున్నాం. సామాన్య ప్రజలు మాట్లాడే 'అపభ్రంశ' భాషల నుంచి ప్రాంతీయ భాషలు వికసించాయి. అపభ్రంశం అంటే వికృతమైన లేదా వక్రమైన అని అర్థం. విద్యాధికులైన ఉన్నత వర్గాలవారు మాటాడే ప్రాచీన సంస్కృత భాషకి బదులుగా జనసామాన్యం మాట్లాడే

దేశి భాషల్ని 'అపభ్రంశ' భాషలని పిలిచారు. మరాఠీ, గుజరాతీ భాషల తొలిరూపం పశ్చిమ భారతదేశం లోను, బెంగాలీ భాష భారత తూర్పు ప్రాంతంలోను వ్యాప్తిలో ఉండేవి.

మతం : హిందూమతంలో రేకెత్తిన భక్తి ఉద్యమం ఈ నూతన భాషా వికాసానికి తోడ్పడింది. ఈ ధోరణి మొట్టమొదట దక్షిణభారతదేశంలో తమిళ ఆళ్వార్లు, నయనార్ల భక్తిప్రబోధంలో మొగ్గదొడిగి క్రమేణా ఉత్తర భారతదేశానికి పాకిపోయింది భక్తిప్రబోధకులు దిగువ కులాల జనానికి బోధచేశారు కాబట్టి వాళ్ళు ప్రాంతీయ భాషల్నే ఎన్నుకున్నారు పట్టణాల్లో వృత్తిపని వాళ్ళు, పల్లెల్లో రైతుకూలీలు భక్తి ఉద్యమం పట్ల ఆకర్షితులయ్యారు ఒక విధంగా ఈ భక్తి ఉద్యమ ప్రాబల్యం బౌద్ధమత క్షీణతకి దారి తీసింది. మధ్యయుగంలో బౌద్ధం భారత తూర్పు ప్రాంతంలో ప్రబలంగానే ఉంది. వంగదేశాన్ని ఏలిన పాలరాజులు బౌద్ధమతాన్ని ఆదరించారు సంపన్నవాణిజ్యవర్గాలుకూడా బౌద్ధాన్ని ఆదరించాయి. అయితే బౌద్ధం గౌతమబుద్ధుడు బోధించిన నాటి సులభగ్రాహ్యమైన సిద్ధాంతంగా ఇప్పుడు లేదు. తురుష్కులు నలందా విహారం మీద దాడిచేసినప్పుడు, బౌద్ధ భిక్షువులు ఆగ్నేయ ఆసియాలోని వివిధ దేశాలకు పారిపోయారు.

ఉత్తర భారతదేశంలో శైవ, వైష్ణవ మతాలు రెండూ ప్రజల్లో విశేష వ్యాప్తి పొందాయి. విష్ణువు కృష్ణావతారాన్ని భక్తులు విశేషంగా ఆరాధించారు. మధురానగరంలో గోపాలకృష్ణయ్య బాల్యచేష్టలు, రాధతో కృష్ణుని ప్రణయం, కంసునికి వ్యతిరేకంగా కత్తిగట్టిన కృష్ణయ్య సాహసం కథలుగా, కావ్యాలుగా జనంలో ప్రచారం పొందాయి. ఈ కథల్ని జనం పాటలుగా పాడుకున్నారు. దేవాలయ కుడ్యాలమీద శిల్పులు ఈ కథల్ని చిత్రాలుగా చెక్కారు. అట్లాగే, విష్ణుమూర్తి రామావతారం కూడా ప్రజల పూజలందుకుంది.

శిల్ప, చిత్రకళలు : ప్రముఖుడైన ప్రతి రాజూ, శక్తివంతుడైన ప్రతి సామంతుడూ దేవాలయం కట్టించాడు. మధ్యయుగంలో కట్టిన చిన్నా పెద్దా ఆలయాలు వందలాదిగా ఉన్నాయి. ఒరిస్సాలో పూరీ, భువనేశ్వరల్లో నిర్మించిన ఆలయాలు, కోణార్క సూర్యదేవాలయం శిల్ప కళా ప్రతీకలు. మధ్య భారతంలో చందేలా రాజులు నిర్మించిన ఖజురహో దేవాలయాలు జగత్ప్రసిద్ధమైనవి. రాజస్థాన్, గుజరాత్ లలో అనేక సుందర దేవాలయాలు నిర్మించబడ్డాయి. రాజస్థాన్‌లో అబూ శిఖరం మీద తెల్లని పాలరాయితో కట్టిన జైనదేవాలయాలు చెప్పుకోదగ్గవి. హిందూ దేవాలయాల్లో ఎక్కువభాగం శివునికో, విష్ణువుకో అంకిత మయ్యాయి

వంగదేశంలో పాలరాజులు బౌద్ధ, హిందూ మతాలు రెంటినీ ఆదరించారు. వాళ్ళు కట్టించిన ఆలయాల్లో రకరకాల దేవుళ్ళ, దేవతల కంచు ప్రతిమలు లేదా నల్లరాయిలో చెక్కిన చిత్తరువులు పెట్టారు. వీటిల్లో చాలాభాగం నలందా పరిసరాల్లో దొరికాయి.

వాస్తు, శిల్పకళలేకాకుండా చిత్రలేఖనం కూడా వికసించింది. కుడ్య చిత్రాల ప్రాచీన సంప్రదాయం కొనసాగుతూనే వచ్చింది. దేవాలయాలు, రాజప్రాసాదాల గోడలమీద చిత్రాలంకరణచేయించారు. ఇది కాక, వేరే చిత్రకళా పద్ధతి ఒకటి ఈ యుగంలోనే మొగ్గతొడిగి తరువాత మొగలుల కాలంలో పూలెత్తింది. ఇదే సూక్ష్మ చిత్రలేఖనం. పుస్తకాల్లో విషయ విశదాత్మకమైన చిన్న చిన్న చిత్తరువుల చిత్రీకరణ ఇది. పశ్చిమ భారతదేశంలో జైన భిక్షువులు, నేపాల్‌లో బౌద్ధులు తమ రాతప్రతుల్లో మత విషయాల్ని విశద పర్చే చిత్తరువుల చిత్రీకరణని విశేషంగా అభిమానించారు. తమ గ్రంథాల్లో వర్ణించిన ఘట్టా



బుందేల్‌ఖండ్‌లో ఖజురహో దేవాలయ సముదాయంలోని సువిఖ్యాత ఖాండవీర మహాదేవ ఆలయం; ఖజురహో ఒకప్పుడు చందేలా రాజపుత్రుల రాజధాని. చందేలా రసపుత్ర రాజులు 950-1150 సం.ల మధ్య ఖజురహోలో షుమారు ఎనభై దేవాలయాలు నిర్మించారు. కాలగతిలో ఖిలమై పోకుండా నిలిచినవి, ముప్ఫై ఆలయాలు. పై చిత్రంలోని ఆలయం షుమారుగా క్రీ.శ. 1000లో నిర్మించబడింది.



ఆబూ శిఖరం మిద అలరారె దిల్వారా మందిరంలో శిల్పవిన్యాస ప్రతికలైన స్తంభాలను, ఆర్చీలను ప్రదర్శించే అంతర్భాగం



ఒరిస్సా సుప్రసిద్ధ దేవాలయాలలో చిట్టచివరిది, సూర్యదేవాలయం; తూర్పు తీరంలో కోణార్క్‌లో 1230 ప్రాంతంలో నిర్మించబడింది. నిర్మాణం అసంపూర్తిగా మిగిలిపోయినా, అసాధారణ సృజనాత్మక భావనా శక్తికి ప్రత్యక్ష నిదర్శనంగా నిలిచిపోయింది. చిత్రంలో కనిపించే శిల్పాలంకృత చక్రం దేవాలయ రథపు పన్నెండు చక్రాలలో ఒకటి. చక్రంలోని ఎనిమిది ఆకుల మీదా సామాన్య మానవుని దైనిక గృహ కృత్యాల అసామాన్య చిత్రణ చూడవచ్చు. శృంగార ప్రేమ దేవాలయంగా దీన్ని అభివర్ణిస్తారు. మిథున శృంగార లీలల్ని బట్టబయలు చేసే బూతు బొమ్మలకు ప్రసిద్ధి కెక్కింది.

లను తాటాకులమీద చిన్న సైజులో చిత్తరువుల్లో చిత్రీకరించారు మొట్టమొదట ఈ చిత్తరువులు ఒ... వుండేవి. రాను రాను, మరిన్ని రేఖలు, రంగులు దిద్ది ప్రతి చితరువు ఒక సుందర కళాఖండంగా తీర్చి దిద్దారు.

క్రీ. శ. 800-1200 సంవత్సరాల మధ్యకాలంలో ప్రజల సామాజిక, ఆర్థిక జీవితంలో అనేక మార్పులు చోటు చేసుకున్నాయి. ఈ మార్పులు ఒక నూతన జీవన సరళికి బాటలు వేశాయి. ఉత్తర, దక్షిణభారత ప్రాంతాల్లో ఒకే మాదిరి సంఘటనలు సంభవించిన కాలంకూడా ఇదే. తద్వారా, భారత ఉపఖండంలోని వివిధ ప్రాంతాలు పరస్పరం దగ్గరయ్యాయి. సమస్త భారత సామ్రాజ్యాన్ని పరిపాలించాలని కలలు గన్న తురుష్క, అఫ్ఘన్ పాలకుల హయాంలో ఈ ధోరణి యింకా బలపడింది.

# 4

# ఢిల్లీ సుల్తానుల రాజ్యం

*బానిస రాజులు - క్రీ. శ.* ***1206-1290 :*** ఢిల్లీని పాలించిన తొట్టతొలి సుల్తానులు మామ్లుక్‌లు. వాళ్ళనే బానిస రాజులని కూడా అంటాం. బానిస రాజుల్లో చాల మంది బానిసలో, బానిసల కొడుకులో కావటం చేత చరిత్రలో ఆ విధంగా వాడుకపడ్డారు. బానిస రాజుల్లో మొట్ట మొదటివాడు కుతుబుద్దీన్ ఐబక్. ఇతడు మహమ్మద్ ఘోరీ సేనాపతి. ఘోరీ స్వదేశం తిరిగి వెళ్ళిపోతూ ఇతణ్ని ఉత్తర భారతదేశంలో తన ప్రతినిధిగా నియమించాడు. ఘోరీ మరణించాక, కుతుబుద్దీన్ ఐబక్ భారత దేశంలో స్థిరపడి, స్వతంత్రంగా రాజ్యం స్థాపించాడు. ఇతణ్ని కూలదోసి, ఢిల్లీ రాజ్యాన్ని ఆక్రమించు కోటానికి ఘజ్నీ రాజు చేసిన ప్రయత్నం ఫలించలేదు.

కుతుబుద్దీన్ అనంతరం అతని అల్లుడు ఇల్టట్‌మిష్ సుల్తానయ్యాడు. ఆనాటికి ఉత్తర భారత దేశం ఒక ప్రత్యేక రాజ్యంగా రూపొందే ఛాయలు స్పష్టంగా కనిపించాయి. అప్పుడే ఢిల్లీ సుల్తానుల రాజ్యం అనే పేరుతో ఒక కొత్త రాజ్యం ఆరంభమైంది. ఢిల్లీ సుల్తానులు క్రమేణా తూర్పున బెంగాలు దాకా పడమట సింధు దేశం దాకా తమ రాజ్యం విస్తరింపజేశారు.

ఢిల్లీ రాజ్యాన్ని పరిపాలించటం అంటే సుల్తానుకు సునాయాసమైన పనికాదు. ఢిల్లీ సుల్తాను రెండు అతి క్లిష్టమైన సమస్యల్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఒక వంక సుల్తాను అనుయాయులు, మరొక వంక, ఉత్తర భారత దేశంలో ఓడిపోయిన స్థానిక ప్రభువులు సుల్తానుకు పెద్ద తలనొప్పిగా పరిణమించారు. సుల్తాను అనుయాయులంటే మధ్యాసియా నుంచి వచ్చి ఈ దేశంలో స్థిరపడ్డ తురుష్క సర్దార్లు, బానిసలు. వీళ్ళు లెక్కలేనంత మంది. సుల్తాను తను జయించిన భూభాగంలో వీళ్ళందరికి తలా ఒక ముక్కా యిచ్చి రెవెన్యూ వసూలు చేసుకునే హక్కు ప్రసాదించాడు. దానికి ప్రతిఫలంగా వాళ్ళు సుల్తానుకు సైన్యం సమకూర్చిపెట్టారు; పరిపాలనా నిర్వహణలో చేదోడువాదోడుగా నిలబడ్డారు.

ఉత్తర భారతదేశంలో వెనక భూమి శిస్తు వసూలుచేసుకుని అనుభవించే అధికారం ప్రసాదించబడిందేగాని భూమి మీద హక్కు మాత్రం కాదు. అదే విధంగా, శిస్తు వసూలు చేసుకునే హక్కు ఇచ్చేసి సర్దార్లని చెప్పుచేతల్లో ఉంచుకోవచ్చునని సుల్తాను అభిప్రాయపడ్డాడు. కాని, సర్దార్లు ఈ హక్కుతో సంతృప్తిపడలేదు. వాళ్ళని సంతృప్తి పర్చటమనేది సుల్తానుకు సమస్యగా తయారైంది.

వీళ్ళ సమస్య కాక, సుల్తాను చేతుల్లో ఓడిపోయిన స్థానిక మాజీ ప్రభువుల బెడద మరొకటి. ఈ మాజీల భూములు—పూర్తిగా సుల్తాను స్వాధీనం చేసుకున్నాడు. కాని కొంత మందికి మాత్రం ఎవరి భూములు వారు తిరిగి అనుభవించటానికి అనుమతి ఇచ్చాడు. ఆ విధంగా, పోయిన భూముల్ని తిరిగి పొందిన ప్రభువులు సుల్తానుకు ఏటా కప్పం కట్టారు; అవసరమైనప్పుడల్లా సైనిక సహాయం అందజేశారు. అసంతృప్తి చెందిన కొందరు రాజపుత్రులు సైనికుల్ని పోగుజేసి సుల్తాను సైన్యాల్ని చీకాకు పర్చారు.

ఈ రెండు సమస్యలకి తోడుగా, ఉత్తర సరిహద్దుల్లో కొత్త ఉపద్రవం వచ్చిపడింది. మధ్యాసియా నుంచి చెంఘిజ్ ఖాన్ నాయకత్వంలో మంగోలులు విజృంభించారు. సింధునదీ తీర ప్రదేశాన్ని ఆక్రమించుకున్నారు. అడపతడప, సింధునది దాటి పంజాబు మీద దాడి చెయ్యటం ప్రారంభించారు. కొద్దికాలం పాటు మంగోలులు పంజాబుని ఆక్రమించుకుని ఢిల్లీ సుల్తానుల రాజ్యానికి ముసలం తెచ్చిపెట్టారు.

ఇల్టుట్‌మిష్ ఢిల్లీ గద్దె ఎక్కాక, ఎదుర్కోవలసి వచ్చిన సమస్యల్లో ఇవి కొన్ని. ఇల్టుట్‌మిష్ మరణించాక అతని కుమార్తె రజియా సుల్తానా రాజ్యాధికారానికి వచ్చింది. తండ్రి ఎదుర్కొన్న సమస్యలే తనయ కూడా ఎదుర్కొంది. పైగా, స్త్రీ కావటం చేత ఆమె ఇంకా ఎక్కువ అవస్థపడవలసి వచ్చింది. ఆమె కొద్దికాలం మాత్రమే రాజ్యం చేసి మరణించింది. ఆమె తరువాత అనామకులు అనేక మంది ఢిల్లీ సుల్తానులయ్యారు చిట్టచివరకి, 1265లో బహు గట్టివాడు, వజ్ర సంకల్పుడు అయిన బాల్బన్ ఢిల్లీ సింహాసనం ఎక్కాడు.

ఇల్టుట్‌మిష్, రజియా సుల్తానాల్ని పట్టి పీడించిన సమస్యల్ని బాల్బన్ విజయవంతంగా పరిష్కరించాడు. ఉత్తర దిక్కున విజృంభించిన మంగోలుల దాడి నుంచి ఢిల్లీ సుల్తానుల రాజ్యాన్ని కాపాడాడు. తనని, తన రాజ్యాన్ని చీకాకు పర్చే స్థానిక ప్రభువుల్ని అణచివేశాడు. ఢిల్లీ రాజ్యానికే ఎసరు తెచ్చేటంత బలీయంగా తయారైన తురుష్క సర్దార్లని నిదానంగా, దృఢంగా ఎదుర్కొని వాళ్ళ కోరలు పీకేశాడు. సుల్తాను స్థానాన్ని సర్వశక్తివంతంగా రూపొందించాడు. తన శక్తి యుక్తులతో సర్దార్ల విశ్వాసం చూరగొన్నాడు. సైన్యంలో, పరిపాలనా నిర్వహణలో అతడు ప్రవేశపెట్టిన మార్పులే అతని విజయానికి కొంత వరకు కారణం సైన్యం మీద, పరిపాలనా యంత్రాంగం మీద సుల్తానుకు సంపూర్ణాధికారం ఉండాలని బాల్బన్ పట్టుబట్టాడు. ఆ విధంగా, సర్దార్ల మధ్య తిరుగుబాటు ధోరణి ప్రబలిందంటే మరుక్షణం అణచి వెయ్యగలిగాడు.

సుల్తాను అధికారం సర్వ స్వతంత్రమైంది; దాన్ని ధిక్కరించే హక్కు ఎవ్వరికీ లేదు అని బాల్బన్ గట్టిగా నమ్మాడు. ఇరాన్‌ని ఏలిన మహాచక్రవర్తుల ఒరవడిలో తన వ్యక్తిత్వానికి రూపుదిద్దుకున్నాడు. ప్రజలు తన సమక్షంలో మోకరిల్లి తల నేలకి తాకించి ప్రణామం చెయ్యమని కోరాడు. సంప్రదాయ పరాయణులైన ముస్లిములు ఈ విడ్డూరం చూసి గుండెలు బాదుకున్నారు. ఇస్లాం మతంలో మానవులంతా సమానులే. భగవంతుని ముందు తప్ప మరెవ్వరి మ్రోల మోకరిల్లి ప్రణామం చెయ్యటం ఇస్లాం విరుద్ధ చర్య.

***ఖిల్జీ సుల్తానులు-1290-1320***. బానిస రాజుల తరువాత ఖిల్జీలనబడే ఒక కొత్త పాలక వంశం 1290లో ఢిల్లీ సింహాసనం ఆక్రమించింది. ఈ పాలక వంశంలో పేర్కొనదగ్గవాడు

**అల్లావుద్దీన్ ఖిల్జీ** యువక రక్తం ఉప్పొంగే అల్లావుద్దీన్ 1296లో ఢిల్లీ సుల్తానయ్యాడు. సుల్తాను కాగానే పౌరులకు ఒక చేత్తో బంగారు కానుకలు పంచిపెట్టి, రెండవ చేత తన భీకర అధికార దండం ప్రదర్శించాడు. అవిధేయత ప్రదర్శించే వాడినెవడినైనా నిర్దాక్షిణ్యంగా శిక్షిస్తానని స్పష్టం చేశాడు.

ఇతనికి బాల్బన్ కన్నా ఇంకా పెద్ద కోరికలున్నాయి. తను అలెగ్జాండరంతటివాడై ప్రపంచ విజేత కావాలని కలలు కన్నాడు. దానికి తొలిమెట్టుగా భారత సర్వం సహాధికారం స్థాపించ పూనుకున్నాడు. తన కలలు ఫలించాలంటే, ముందుగా మూడు కర్తవ్యాలు పరిపూర్తి చెయ్యాలి. ఒకటి — సర్దార్ల విశ్వాసం చూరగొని వాళ్ళ కోరలు పెరికి వెయ్యాలి, రెండు- దక్షిణ రాజ్యాల్ని, రాజస్థాన్‌ని జయించాలి; మూడు- బలప్రయోగంతో మంగోలు మూకల్ని తరిమి కొట్టాలి (అప్పటికి మంగోలు ప్రజలు ఇస్లాం మతం స్వీకరించినప్పటికీ, ఢిల్లీ సుల్తానుల రాజ్యానికి వాళ్ళవల్ల ముప్పు తొలగలేదు) ఈ కర్తవ్య పరిపూర్తికి విశాల సైన్యం కావాలి. విశాల సైన్యాన్ని నిర్మించి, పోషించాలంటే అపార ధనం కావాలి.

అపార ధనం కావాలంటే రాజ్యాదాయం పెరగాలి. అల్లావుద్దీన్ తన రాజ్య ఆదాయం పెరిగే మార్గాలు ఆలోచించాడు. గంగా, యమునా నదుల మధ్య సారవంతమైన భూముల్ని సాగుచేసే సంపన్న భూస్వాముల భూమిశిస్తు పెంచాడు. సర్దార్లు వసూలు చేసుకుని అనుభవించే రాబడిలో తమ వంతుకి ముట్ట వలసిన సొమ్ము కన్నా పైసా ఎక్కువ కూడబెట్టడానికి వీలు లేకుండా కట్టుదిట్టం చేశాడు. వస్తువుల ధరలు అదుపులో పెట్టి అక్రమ లాభార్జనని అరికట్టాడు. వస్తువుల ధరలు సామాన్య పౌరులకు అందుబాటులో ఉండేటట్లు చర్యలు తీసుకున్నాడు. సక్రమ శిస్తు వసూలు కోసం సాగుభూమిని కొత్తగా మదింపు వేయించాడు. అంటే, సాగులో వున్న మొత్తం భూమిని కొలిపించి, దాని మీద ఎంత ఆదాయం వచ్చేదీ లెక్కలు కట్టించాడు. ఈ కొత్త మదింపు ద్వారా వివిధ ఉద్యోగులు, అధికార్లు వసూలు చేసే రెవెన్యూ మొత్తాన్ని అంచనా వెయ్యటానికి, ఆ మొత్తాన్ని కంట్రోలులో ఉంచుకోడానికి వీలయింది.

ఇక - మంగోలుల దాడుల్ని తిప్పికొట్టే సమస్య ఉంది. అల్లావుద్దీన్ పరిపాలనా కాలం నాటికి మంగోలులు స్వంత గొడవల్లో తల మునకలై ఉన్నారు. అంచేత, ఢిల్లీ సుల్తానుల రాజ్యానికి మంగోలుల నుంచి తక్షణ ప్రమాదం తప్పిపోయింది. దాంతో అల్లావుద్దీన్ దృష్టి భారత పశ్చిమ ప్రాంతం మీదికి మళ్ళింది. గుజరాత్, మాళవ రాజ్యాల్ని జయించాడు. ప్రసిద్ధ రణతంభోర్, చితోడ్ గడ్ దుర్గాల్ని పట్టుకొని రాజస్థాన్ మీద సర్వాధిపత్యం సాధించాడు.

ఇక అతని కత్తివాటుకి దక్షిణాది మిగిలింది. మాలిక్ కాఫుర్ అనే సేనాని నాయకత్వంలో భారీ సైన్యాన్ని దక్షిణాది మీదికి దండయాత్ర పంపాడు. దక్షిణాదిని జయించాలనే తృష్ణే కాకుండా, అపార ధనరాసుల్ని బంగారాన్ని కొల్లగొట్టటం ప్రధాన లక్ష్యంగా పెట్టుకున్నాడు. మాలిక్ కాఫుర్ ఎడా పెడా బంగారం దోచిపారేశాడు. దేవగిరి యాదవుల్ని, ఓరుగల్లు కాకతీయుల్ని, ద్వారా సముద్ర హొయసాలుల్ని, ఇంకా అనేక చిల్లర మల్లర రాజ్యాల్ని స్థానుసారంగా కొల్లగొట్టాడు. కప్పం కడతామని కాల్మొక్కిన రాజులకి వాళ్ళ సింహాసనాలు దక్కాయి. మాలిక్ కాఫుర్ సైన్యాలు మధురై నగరాన్ని సైతం ముట్టడించాయి. అప్పటి దాకా దక్షిణ కొసన మధురై వరకు చొచ్చుకుపోయిన ఉత్తర భారత సైన్యమంటూ చరిత్రలో లేదు.

అల్లావుద్దీన్ కొద్ది కాలంపాటు అశోక చక్రవర్తి ఏలినంతటి విశాల సామ్రాజ్యాన్ని ఏలాడు. అయితే, ఉత్తర దక్కను మీద ఆతని అధికారం పరోక్షమైంది మాత్రమే.

ఖిల్జీ వంశంలో ఆఖరి సుల్తాను హత్యకు గురికావటంతో తుగ్లకులనే కొత్త సుల్తాను వంశం ఢిల్లీ గద్దె ఆక్రమించింది.

*తుగ్లక్ సుల్తానులు - **1320-1399 :*** తుగ్లకులు సైతం అఖిల భారత సామ్రాజ్యాన్ని ఏలాలని కలలు కన్నారు. మొదట్లో విజయ పరంపర సాధించినా, వెంటనే పరాజయాలు సంభవించ సాగాయి. ఒకానొక సమయంలో దక్కను మీద తుగ్లకులు తమ పట్టు నిలుపుకోవటమే కాకుండా, ప్రత్యక్ష పరిపాలన సైతం సాగించారు. ఢిల్లీ సుల్తానులు బలహీనపడ్డంతో ఈ పరిస్థితి తారుమారయింది. ఢిల్లీకి సుదూరంగా వుండే రాష్ట్రాల గవర్నర్లు, దక్షిణాది ప్రాంతాల్లో సుల్తాను ప్రతినిధులు సుల్తాను బలహీనతని పసిగట్టి, తిరుగుబాట్లు జరిపి స్వతంత్రరాజ్యాలు స్థాపించుకున్నారు.

తుగ్లక్ వంశపు రాజుల్లో మహమ్మద్ బీన్ తుగ్లక్ చాలా ముఖ్యుడు. ఇతడు 1325 నుంచి పాతిక సంవత్సరాలు రాజ్యమేలాడు. ఇతని పరిపాలనా కాలాన్ని కళ్ళకికట్టే సమాచార గ్రంథాలు, ఆధా రాలు లెక్కలేనన్ని ఉన్నాయి. ఉత్తర ఆఫ్రికా అరబ్బు యాత్రికుడు ఇబ్న్ బతూతా ఇతని కాలంలోనే భారతదేశం పర్యటించాడు. భారతదేశంలో మహమ్మద్ బీన్ తుగ్లక్ పాలనలో నెలకొన్న పరిస్థితుల్ని ఆయన విపులంగా వర్ణించాడు. మహమ్మద్ తుగ్లక్ ఆదర్శవాది, హేతుబద్ధమైన సూత్రాల వెలుగులో పరిపాలన సాగించాలని శాయశక్తులా ప్రయత్నించినవాడు. ఒక గణిత శాస్త్రజ్ఞుణ్ని, ఒక తర్క కోవి దుణ్ని తన సలహాదార్లుగా నియమించుకున్నాడు. అతని ఆలోచనలు చాలావరకు అర్థవంతమైనవి, సహేతుక మైన వీను. కాని, అవి ఆచరణలో నిష్ఫలమయ్యాయి. ఎంచేతనంటే, అవి ఆచరణలో ఫలప్రదం కావ టానికి అవసరమైన సక్రమ కార్యాచరణలో అతడు విఫలమయ్యాడు.

మహమ్మద్ బీన్ తుగ్లక్ భారత భూభాగాన్ని మాత్రమే కాకుండా మధ్యాసియాని సైతం జయిం చాలని సంకల్పించాడు. దానికి విశాల సైన్యం, సైన్య పోషణకి అపార ధనం కావాలని మనకు తెలిసిందే. అదనంగా ఆదాయం రాబట్టుకోటానికి గంగా-యమునా నదుల మధ్య మైదానంలో రైతుల మీద పన్నులు పెంచాడు. ఆ సమయంలో అక్కడ కరువు విలయతాండవం చేస్తోంది. సహజంగా, ప్రజలు అదనపు పన్నులు చెల్లించటానికి నిరాకరించి సుల్తాను మీద తిరగబడ్డారు. చివరకి, తుగ్లక్ తను పెంచిన శిస్తుని ఉపసంహరించుకో వలసివచ్చింది.

అలాగే, రాజధాని మార్పు సందర్భంలో కూడా మహమ్మద్ తప్పటడుగువేశాడు. రాజధానిని ఢిల్లీ నుంచి దేవగిరికి (దౌలతాబాద్) మార్చాడు. విశాల దక్కను పీఠభూమిని చెప్పుచేతల్లో ఉంచుకోడానికి దేవగిరి చాలా అనువైన స్థలంగా అతడు భావించాడు. కాని ఈ మార్పు అభాసుపాలయింది. దేవగిరి ఉత్తర భారతదేశానికి చాలా దూరమైంది. ఉత్తర సరిహద్దుల్ని ఒక కంట కనిపెట్టి ఉండటం సుల్తానుకు అసాధ్యమయింది. కాబట్టి, రాజధానిని దేవగిరి నుంచి తిరిగి ఢిల్లీకి మార్చాడు. దక్షిణాది రాజ్యాలకు ఢిల్లీ సుల్తాన్ల బలహీనత బోధపడింది. దక్కను ప్రాంతంలో రెండు స్వతంత్ర రాజ్యాలు ఆవిర్భవించాయి. అవే, బహమనీ, విజయనగర రాజ్యాలు. దక్కను వ్యవహారాల్లో ఢిల్లీ సుల్తానుల ప్రాబల్యం అడుగంటి

పోయింది.

మహమ్మద్ తుగ్లక్ మరొక ప్రయోగం చేశాడు. అదీ విఫలమైంది. అదీ డబ్బుకోసంగాను చేసిన ప్రయోగమే. వెండి నాణాలకు బదులు ఇత్తడి, రాగి నాణాలు చలామణిలోకి తెచ్చాడు. ఈ నాణాలు ప్రభుత్వ టంకసాల మాత్రమే ముద్రించే కట్టుదిట్టాలు చేసివుంటే, అతని ప్రయోగం ఫలించి వుండేది. కాని, దేశంలో అనేక మంది ఈ ఇత్తడి, రాగి నాణాలు తయారు చెయ్యటం మొదలెట్టారు సుల్తానుకు తన ఖజానా మీద అదుపు తప్పిపోయింది అడుసుతొక్కి కాళ్ళు కడుక్కున్న మాదిరి ఈ ఇత్తడి, రాగి నాణాల్ని చలామణి నుంచి ఉపసంహరించాడు.

దురదృష్టవశాత్తు, మహమ్మద్ విధానాలు పెడదారి పట్టటంతో అతనికి ప్రజల్లో మాత్రమే కాకుండా సర్దార్లలో, ఉలేమాల్లో సైతం పలుకుబడి నశించింది ఉలేమాలంటే పూర్వాచార పరాయణులైన ముస్లిం మత గురువులు. సర్దార్లు, ఉలేమాలు, ప్రజలు సహకారం అందించి, సకాలంలో సరయిన సలహా యిచ్చివుంటే, అతని విధానాలు కొన్నయినా విజయవంతం అయ్యేవి. కాని, అది జరగలేదు.

మహమ్మద్ తరువాత ఫిరోజ్‌షా అధికారం స్వీకరించాడు (1351-'88). మహమ్మద్ వైఫల్యానికి కారణాలేమిటో ఫిరోజ్‌షా గ్రహించాడు సర్దార్లని కట్టుకున్నాడు. శిస్తు వసూలు చేసుకునే హక్కు ప్రసాదించి వాళ్ళని సంతృప్తి పర్చాడు వాళ్ల పట్ల మెతకగా ప్రవర్తించాడు రాజ్య వ్యవహారాలకు సంబంధించిన కొన్ని విధానాల్లో పూర్వాచార పరాయణులైన ఉలేమాల జోక్యాన్ని అనుమతించాడు. ఫిరోజ్ షాకు మత సహనం తక్కువ. ముస్లిమేతరుల విషయంలోనే కాకుండా, సంప్రదాయ బద్ధులు కాని ముస్లిముల పట్ల కూడా అసహనం ప్రదర్శించాడు ఆ విధంగా, రాజాస్థానంలో బలీయంగా తయారైన వర్గాలతో సఖ్యత పెంపొందించుకున్నాడు. తద్వారా, సుల్తాను అధికారం కూడా క్షీణించిపోయింది.

అదే అదనుగా బీహార్, బెంగాల్ ప్రాంతాలలో కొందరు గవర్నర్లు తిరుగుబాటుచేశారు వాళ్ళని అణచటానికి సుల్తాను చేసిన ప్రయత్నాలు అట్టే విజయవంతం కాలేదు.

ప్రజా సంక్షేమం పట్ల ఫిరోజ్‌షా చాలా శ్రద్ధ చూపాడు. కాలువలు వగైరా నీటి పారుదల సౌకర్యాలు కల్పించి రాజ్యంలో కొన్ని ప్రాంతాలను అభివృద్ధి చేశాడు. యమునా కాలవ అతను తవ్వించిందే ఫిరోజ్‌పూర్, ఫిరోజాబాద్, హిస్సార్-ఫిరోజా, జౌన్‌పూర్ మొదలైన నూతన నగరాల్ని నిర్మించాడు. అనేక విద్యా, వైద్య సంస్థల్ని నెలకొల్పాడు. అతనికి ప్రాచీన భారతీయ సంస్కృతి పట్ల ఆసక్తి హెచ్చు. మతం, తత్వశాస్త్రం వగైరా విషయాల మీద పేరొందిన అనేక సంస్కృత గ్రంథాల్ని పర్షియన్, అరబిక్ భాషల్లోకి తర్జుమా చేయించాడు. అశోక చక్రవర్తి శిలా స్తంభాల్లో రెంటిని ఢిల్లీకి తెప్పించి. ఒక శిలా స్తంభాన్ని తన రాజ ప్రాసాదపు కప్పు కింద నిలబెట్టించాడు

ఫిరోజ్ షా తుగ్లక్ మరణించాక, వారసుల మధ్య అంతర్యుద్ధాలు చెలరేగాయి. అనేకరాష్ట్రాల్లో గవర్నర్లు స్వతంత్రం ప్రకటించారు. ఢిల్లీ చుట్టుపక్కల కొద్ది ప్రాంతం మాత్రమే తుగ్లక్ సుల్తానులకు మిగిలింది

***ఢిల్లీ సుల్తానుల రాజ్య విచ్ఛిత్తి*** : 1398 లో ఉత్తరభారతదేశం పైకి మధ్యాసియా సైన్యాల దాడి మళ్ళీ మొదలయింది తుర్కీజాతి నాయకుడు తైమూర్‌లంగ్ (కుంటి తైమూరు) భారతదేశం మీద దాడి

చేశాడు. ఇతన్నే తామర్లేన్ అని కూడా అంటారు. ఉత్తర భారతం మీద పడి దోచుకున్నంత దోచుకుని మధ్యాసియాకు మరలిపోవటం అతని ప్రధాన లక్ష్యం. తైమూర్ కరకు మూకలు ఢిల్లీ మీద పడి, నగరాన్ని కొల్లగొట్టి, కంటపడ్డ జనం యావన్మందిని కత్తి కెరజేసి మధ్యాసియాకు మరలిపోయారు. అంతటి ఘోరకలి ఏ నగరంలోనూ జరిగివుండదు. ఘజ్నీ మహమ్మద్ మాదిరిగానే తైమూర్ లంగ్ కూడా భారతదేశంలో దోచిన సంపదలో కొంత భాగాన్ని సమర్ఖండ్‌ని శోభాయమానంగా తీర్చిదిద్దడానికి ఖర్చుపెట్టాడు. బ్రహ్మాండమైన భవనాలు, రాజప్రాసాదాలు మసీదులు కట్టించాడు. మధ్యాసియాలో కొన్ని ప్రాంతాల్నీ కలుపుకుని ఇరాన్‌దాకా వ్యాపించిన ఒక సువిశాల సామ్రాజ్యాన్ని తైమూర్ పరిపాలించాడు. పశ్చిమాసియాలో బలపడ్డ తుర్కులు బిజాంటిన్ సామ్రాజ్యానికి, అరబ్బు సంస్కృతికి వారసులైన కాలంకూడా ఇదే.

కాని, భారతదేశం నిర్వేద భారంతో, నిస్సహాయ స్థితిలో దర్శన మిచ్చిన కాలం ఇది. 1413లో తుగ్లక్ వంశం రూపుమాసిపోయింది. ఒక స్థానిక గవర్నరు ఢిల్లీని ఆక్రమించి సయ్యద్ వంశాన్ని స్థాపించాడు. (1414-1451) సయ్యద్ వంశం కొద్ది సంవత్సరాలు ఢిల్లీని ఏలి కాలగర్భంలో కలిసిపోయింది. తరువాత ఇంకొక గవర్నరు ఢిల్లీ గద్దె ఎక్కాడు. అతడు లోడీ వంశస్థుడైన ఒక అఫ్ఘన్ సర్దారు.

*లోడీ వంశం* - ***1451-1526*** . లోడీ వంశపు రాజులు ఢిల్లీ సుల్తానుల రాజ్యాన్ని పటిష్ఠం చెయ్యటానికి ప్రయత్నించారు. తిరుగుబాటుకు కాలు దువ్వే గవర్నర్లని అణచివేసే ప్రయత్నాలు జరిగాయి. జాన్‌పూర్ రాజ్యంతో సుదీర్ఘ కాలం పోరాటం నడిచింది. చిట్టచివరకి, జాన్‌పూర్ పట్టుబడింది. సికిందర్ లోడీ (1489-1517) పశ్చిమ బెంగాల్ దాకా గంగానదీలోయని అదుపులో పెట్టుకున్నాడు. ఢిల్లీ నుంచి రాజధానిని ఒక కొత్త నగరానికి తరలించాడు. అదే, తరువాత ఆగ్రాగా ప్రసిద్ధిపొందింది. ఆగ్రా రాజధానిగా తన రాజ్యాన్ని సమర్థవంతంగా అదుపు చెయ్యగలనని సికిందర్ లోడీ భావించాడు. ప్రజా సంక్షేమ కార్యక్రమాలు విరివిగా అమలు జరపటం ద్వారా ప్రజా విశ్వాసాన్ని చూరగొనటానికి విశేష కృషి చేశాడు. వస్తువుల ధరల్ని అదుపులో పెట్టి, జీవితావసర వస్తువులు తక్కువ వెలకి ప్రజలకి అందుబాటయ్యేట్లు చేసి ఆర్థిక పరిస్థితుల్ని మెరుగు పర్చాలని వాంచించాడు. లోడీరాజులు అఫ్ఘను జాతీయులు కాబట్టి వాళ్ళ బలం అఫ్ఘన్ సర్దార్ల విధేయత మీద ఆధారపడి వుంది. సుల్తాను సర్వశక్తివంతమైన హోదా అఫ్ఘన్ సర్దార్లకి నచ్చలేదు. తిరుగుబాట్ల ద్వారా కొందరు తమ అసంతృప్తి బైట పెట్టారు. లోడీ సుల్తాన్లలో ఆఖరివాడయిన ఇబ్రహీం లోడీని ప్రముఖ అఫ్ఘన్ సర్దార్లు ప్రతిఘటించారు. చివరకి, కాబూల్‌రాజు బాబర్‌తో కుట్ర పన్ని 1526 లో ఇబ్రహీం లోడీని గద్దె దింపారు.

*సర్దార్లు :* ఢిల్లీ సుల్తానుల రాజ్యంలో సర్దార్లు బాగా బలపడ్డారని చాలా తూర్లు చెప్పుకున్నాం. కొన్ని కొన్ని సందర్భాల్లో, వాళ్ళు రాజ్యవిధానాన్ని ఇష్టానుసారం మార్చారు. గవర్నర్లుగా వాళ్ళు తిరుగుబాట్లు నడిపారు; స్వతంత్రం ప్రకటించారు: లేదా ఏకంగా ఢిల్లీ సింహాసనాన్నే పట్టుకున్నారు. ఈ సర్దార్లలో చాలామంది తుర్కీ, అఫ్ఘన్ కుటుంబాలనుంచి వచ్చి భారతదేశంలో స్థిరపడ్డారు. వీళ్ళలో కొందరు అదృష్టం వెతుక్కుంటూ భారతదేశంలో ప్రవేశించి సుల్తాన్లకు సేవచేశారు. చాలా రాష్ట్రాల్లో గవర్నర్లుగా, సేనాపతులుగా వెలిగిన ఈ సర్దార్లు తుర్కీ, అఫ్ఘన్ కుటుంబాలనుంచి వచ్చినవాళ్లే. అల్లావుద్దీన్ ఖిల్జీ అనంతరం, భారతీయ ముస్లిములు, హిందువులు కూడా అధికార పదవులు పొందారు.

వేతనానికి బదులుగా భూములు, ఊళ్ళు ఇచ్చి రెవెన్యూ అనుభవించే హక్కు వెనకటినుంచీ వస్తున్నదే. ఈ పద్ధతినే ఢిల్లీ సుల్తాన్లు కూడా కొనసాగించారు. ఇది వంశ పారంపర్యంగా అనుభవించే హక్కు కాదు. ఈ హక్కుని ఒక అధికారినుంచి లాగివేసి మరొకనికి కట్టబెట్టవచ్చు. కాని వెనకటి కాలంలో మాదిరిగానే కేంద్రప్రభుత్వ అధికారం బలహీనం కాగానే, ఈ హక్కుని అనువంశికంగా పరిగణించటం ప్రారంభమైంది. ఈ రెవెన్యూ మంజూరు చేయబడ్డ పరగణాని "ఇక్తా" అని వ్యవహరించారు. ఒక అధికారి తాను వసూలు చేసిన రెవెన్యూలో కొంత తన జీత భత్యాలకింద ఉంచుకొని మిగతా సొమ్ముని సుల్తానుకోసం, సైనికుల పోషణ కోసం వినియోగించేవాడు. ఆ అధికారికి ఆదాయ, వ్యయాల్ని సమగ్రంగా నిర్వహించ వలసిన బాధ్యత వుండేది; తను రెవెన్యూ వసూలు చేసుకునే జమీలో శాంతిభద్రతలు కాపాడ్డం అతని విధి. ఈ పద్ధతికి కొంత భిన్నంగా ఉన్న సందర్భాలు కూడా ఉన్నాయి. రెవెన్యూ వసూలు చేసుకునే అధికార్లు సుల్తానుకు ఒక నిర్ణీతమైన మొత్తాన్ని సాలీనా చెల్లించే సంప్రదాయం ఉండేది. సుల్తానుకు చెల్లించేది చెల్లించగా కూడా సర్దార్ల దగ్గర ఖుషీగా జీవితం గడపటానికి చాలినంత సొమ్ము ఉండేది. అయినా, కొంత మంది సర్దార్లు హిందూ వడ్డీ వ్యాపారస్థులకి తరచు రుణగ్రస్తులై ఉండేవాళ్ళు.

సుల్తానుల పరిపాలనా విధానం : భూమి శిస్తు వసూలు చెయ్యటం, శిస్తువివరాలు నమోదు చేసుకోవటం, శాంతిభద్రతల పరిరక్షణ సుల్తానుల ప్రభుత్వ నిర్వహణలో ప్రధానాంశాలు. భూమిలో కొంత శాతం సుల్తానుకు ప్రత్యేకంగా కేటాయించబడి ఉండేది. అది అతని ప్రత్యక్షాధీనంలో ఉండేది. దాని మీద వచ్చే రాబడి సుల్తాను స్వంత ఖర్చులకు ఉపయోగపడేది. అటువంటి భూముల మీద ఫలసాయంలో మూడవ వంతు ప్రభుత్వానికి చెల్లించవలసిన మొత్తంగా నిర్ణయించబడింది. గ్రామాలలో, జిల్లాలలో పనిచేసే స్థానిక ఉద్యోగులు ప్రభుత్వానికి కట్టవలసిన సొమ్ముని వసూలు చేసేవాళ్ళు. తురుష్కులు, ఆఫ్ఘన్లు రాకపూర్వం పని చేసిన మాదిరిగానే ఈ ఉద్యోగులు ఇప్పుడూ పని చేశారు ప్రభుత్వ పరిపాలనా విధానం గ్రామాలలో యేమీ మారలేదు. ముకద్దం, పట్వారీ, ముశ్రిఫ్ వగైరా ఉద్యోగులే శిస్తు వసూళ్ళ పని నిర్వహించారు. వంశ పారంపర్యంగా సాగే గ్రామ పెద్ద-ముకద్దం; గ్రామంలో రెవెన్యూ లెక్కలు రాసే ఉద్యోగి-పట్వారీ; ఆ రెవెన్యూ లెక్కల్ని పర్యవేక్షించే అధికారి-ముశ్రిఫ్. గ్రామాధికార్లు చాలా మంది ఈనాటికీ అదే పేర్లతో వ్యవహరించబడుతున్నారు.

సుల్తాను దర్బారులో కూడా రెవెన్యూ లెక్కలు చూసే ఉద్యోగులున్నారు. వజీర్, బక్షీలనబడే అధికార్లు ఆస్థానోద్యోగుల్లో అతి ముఖ్యమైన వాళ్ళు. రెవెన్యూ ఖజానాకి చేరగానే తనిఖీ చేసి, దానికి సంబంధించిన వివరాల్ని నమోదు చేసుకోవడం వజీరు, అతని కింది ఉద్యోగుల పని. బక్షీ అంటే సైన్యానికి జీత భత్యాలు బట్వాడా చేసే అధికారి.

వీళ్ళుకాక, ఇంకా తదితర ప్రభుత్వ కార్యకలాపాలు చూసే ఉద్యోగులూ ఉన్నారు. సైన్యానికి, సైన్యానికి అవసరమైన సాధన సంపత్తికి సంబంధించిన వ్యవహారాల్ని కొందరు చూసేవాళ్ళు. ఢిల్లీ రాజ్యానికి ఇతర రాజ్యాలకి మధ్య సంబంధాలను మరికొందరు చక్కబెట్టేవాళ్ళు. కాజీ ప్రధాన న్యాయమూర్తి. మత సంబంధమైన వ్యవహారాలలో సైతం ఆయన సలహాలిచ్చేవాడు. మొత్తం అధికార్ల పని తీరుని వజీర్ పర్యవేక్షించేవాడు వజీరు సమర్థత మీద, సలహా మీద సుల్తాను ఎక్కువ ఆధారపడ్డాడు అయితే, తుది నిర్ణయం

సుల్తానుదే.

కొత్త రాజ్యాలు : ఢిల్లీ సుల్తానుల రాజ్యాధికారం క్రమేణా క్షీణించటంతో భారత ఉపఖండంలో పలు ప్రాంతాల్లో అనేక కొత్త రాజ్యాలు అవతరించాయి. వాటిల్లో చాలా భాగం సుల్తానుల రాజ్యంలో వాళ్ళ అధికారానికి లోబడిన రాష్ట్రాలే అవే నెమ్మదిగా స్వతంత్ర రాజ్యాలుగా పరిణతి చెందాయి.

భారత పశ్చిమ ప్రాంతంలో గుజరాత్, మాళవ రాజ్యాలు ముఖ్యమైనవి అహమ్మదాబాద్ నగరాన్ని స్థాపించిన అహ్మద్‌షా గుజరాత్ శక్తి సంపన్నంగా రూపొందడానికి కారకుడు. హుషాంగ్‌షా కాలంలో మాళవ ప్రాముఖ్యం సంతరించుకొంది. మాండూ అనే సుందర నగర దుర్గాన్ని నిర్మించినవాడు హుషాంగ్ షా. గుజరాత్ - మాళవ మధ్య ఎడతెగకుండా యుద్ధాగ్ని జ్వాలలు రగిలిన మూలాన, ఆ రెండు రాజ్యాల శక్తి హరించుకుపోయింది. అదే విధంగా మేవార్, మార్వార్ రాజపుత్ర రాజ్యాలు కూడా నిర్వీర్యమై పోయాయి ఈ రెండు రాజ్యాల మధ్యా పచ్చగడ్డి వేస్తే భగ్గుమంది పైగా, ఈ రెంటి మధ్యా వివాహ బాంధవ్యం వుండి కూడా సఖ్యత కరువైంది. రాజపుత్ర రాజులు ఢిల్లీ సుల్తాన్లతోనే కాకుండా పరస్పరం మారణ యుద్ధాలకు తలపడ్డారనటానికి ఇదొక ఉదాహరణ. మేవార్ ప్రభువు కుంభరాణాని ఈనాటికీ ప్రజలు తలుచుకుంటారు. కుంభరాణా సర్వతోముఖ ప్రజ్ఞాశాలి; స్వయంగా కవి, సంగీత విద్వాంసుడు. ఇదే కాలంలో రాజస్థాన్‌లో బికనీర్ వంటి రాజ్యాలనేకం తలెత్తాయి.

ఈ కాలంలోనే కాశ్మీర రాజ్యం గొప్ప పేరులోకి వచ్చింది. కాశ్మీరాన్ని పరిపాలించిన రాజులందర్లో సుప్రసిద్ధుడైన జైనుల్ ఆబిదీన్ 15వ శతాబ్దంలో రాజ్యం చేశాడు ఫిరోజ్ షా తుగ్లక్ మాదిరిగా ఇతడు కూడా పర్షియన్, సంస్కృత భాషల్లో పండితులకు ప్రోత్సాహం ఇచ్చాడు. మహాభారతాన్ని, రాజతరంగిణిని పారశీకంలోకి తర్జుమా చేయించాడు. "బద్‌షా" అని ప్రజలు ఈయనని పిలిచేవాళ్ళు. "బద్‌షా ఎంత దొడ్డ ప్రభువు! ప్రజల మంచి కోసం ఎంత పాటుపడ్డాడు!" అని ప్రజలు ఈనాటికీ జైనుల్ ఆబిదీన్‌ని తలుచుకుంటారు.

భారత తూర్పు ప్రాంతంలో జాన్‌పూర్, బెంగాలులు ముఖ్యమైన రాజ్యాలు. ఢిల్లీ సుల్తాన్ల కింద గవర్నర్లుగా పని చేసిన సర్దార్లే సుల్తాన్‌కి వ్యతిరేకంగా తిరుగుబాటుచేసి ఈ రెండు రాజ్యాల్ని స్థాపించారు. జాన్‌పూర్‌ని షర్కీ వంశపు రాజులు పరిపాలించారు. వీరు ఢిల్లీని ఆక్రమించాలని కలలు కన్నారు గాని అది కలగానే మిగిలిపోయింది. ఆ తరువాత జాన్‌పూర్ హిందీ భాషా, సాహిత్యాలకు కేంద్ర పీఠంగా భాసించింది. బెంగాల్‌ని అనేక జాతుల రాజులు పాలించారు. తుర్కులు, అఫ్ఘన్లు, అబ్సీనియన్లు వగైరా అనేక జాతుల వాళ్ళు వంగ సింహాసనమెక్కారు. అల్లావుద్దీన్ ఖిల్జీ అనంతరం హాజీ-ఇలియాసీ, అతని తరువాత అల్లాఉద్దీన్ హుస్సేన్ షా, ఘియాజుద్దీన్ ప్రభృతులు బెంగాల్‌లో రాజ్యం చేశారు. వీరంతా వంగభాషని పోషించి ఆదరించారు.

ఇక దక్కనులోను, దక్కనుకు దక్షిణంగాను బహమనీ, విజయనగర రాజ్యాలు వర్ధిల్లాయి. మహమ్మద్ బిన్ తుగ్లక్ కాలంలో ఢిల్లీ సుల్తానుల రాజ్యం బలహీనపడినప్పుడు ఇవి రెండూ ఇంచుమించు ఏక కాలంలో తలెత్తాయి. ఢిల్లీ సుల్తానుల కింద పనిచేసిన అధికారులే ఈ రెండు రాజ్యాల్ని స్థాపించారు.

మహమ్మద్ బిన్ తుగ్లక్ కింద అధికారిగా ఉన్న హసన్ గంగు సుల్తానుకు వ్యతిరేకంగా తిరుగు


విజయనగర సామ్రాజ్య ప్రాభవానికి తార్కాణంగా నిలిచిన హంపీ రాతిరథం

బాటు చేసి 1347లో బహమనీ రాజ్యాన్ని స్థాపించాడు. బహమన్ షా బిరుదు ధరించి బహమనీ వంశ స్థాపకుడయ్యాడు.

బహమనీ రాజ్యానికి దక్షిణాన విజయనగర రాజ్యాన్ని హరిహర రాయలు, బుక్కరాయలు అనే అన్నదమ్ములు స్థాపించారు. వీరు సంగమ వంశీకులు. అన్నదమ్ములిద్దరూ ఢిల్లీ సుల్తానుల రాజ్యానికి క్షీణదశ ఆరంభమైన అదను కనిపెట్టి హోయసాల భూభాగాన్ని (ప్రస్తుత మైసూరు ప్రాంతం) జయించి 1336లో స్వాతంత్ర విజయనగర రాజ్యాన్ని నెలకొల్పారు. ఈనాడు మనం హంపీ అని వ్యవహరిస్తున్న హస్తినావతిని రాజధానిగా చేసుకున్నారు. బహమనీ, విజయనగర రాజ్యాలు రెండూ ఆనాడు సఖ్యతతో వ్యవహరించి వుంటే అవి మహాశక్తివంతంగా రూపొందగలిగేవి కాని, ఆ రెంటి మధ్యా తరచు యుద్ధాలు ప్రజ్వరిల్లాయి. కృష్ణా, తుంగభద్ర నదుల మధ్య సారవంతమైన దోఆబ్ మండలాన్ని గురించి ఆ ఇరురాజ్యాలు నిరంతర వైరం పెంచుకున్నాయి. ఇదిగాక వేరే కారణం కూడా ఉంది. బహమనీ రాజ్యంలో భాగమైన గోల్కొండలోని వజ్రాల గనుల మీద విజయనగర రాజుల కన్నుపడింది. పైగా, ఉభయులూ దక్షిణాపథం మొత్తాన్ని పాదాక్రాంతం చేసుకోవాలని ఉవ్విళ్లూరారు.

యుద్ధాలు ఈ రెండు పెద్ద రాజ్యాల మేరకే పరిమితం కాలేదు. దక్షిణాదిన చిన్న చిన్న రాజ్యాలనేకం ఈ ఉభయుల్లో ఎవరో ఒకరి కొమ్ము కాశాయి దాంతో యీ పెద్ద రాజ్యాల దాడుల వల్ల చిన్న రాజ్యాలు కష్టనష్టాలకు గురికావలసి వచ్చింది. విజయనగర రాజ్యం 1370లో మధురైని జయించింది; పశ్చిమ తీరంలో తన బలాలను మోహరించింది. రేవతి ద్వీపాన్ని (గోవా) తన భూభాగంలో కలుపుకుంది. రేవతి ద్వీపం ఆనాడు ముఖ్యమైన వ్యాపార కేంద్రం. మరో వేపు, బహమనీ రాజ్యం తన ఉత్తర సరిహద్దు రాజ్యాలైన గుజరాత్, మాళవల మీద దండయాత్రల్లో తలమునకలై వుంది (బహమనీ, విజయనగర రాజ్యాల వికసనం గురించి తరువాతి అధ్యాయంలో చూడండి).

భారత ఉపఖండంలోని ఈ రాజ్యాలు (జౌనపూర్, గుజరాత్, బెంగాల్ మొదలైనవి) భూమి శిస్తు ద్వారాను, వ్యాపారం ద్వారాను వచ్చే అపరిమితమైన ఆదాయంతో బాగా మదించి ఉన్నాయి. గుజరాత్,

బెంగాల్ రాజ్యాలు పశ్చిమాసియా, తూర్పు ఆఫ్రికా, ఆగ్నేయ ఆసియా, చైనాలతో సముద్రాంతర వ్యాపారం మీద అపార లాభాలు ఆర్జించాయి. బహమనీ, విజయనగర రాజ్యాలు కూడా ఈ వ్యాపార వాణిజ్యాలలో పాలు పంచుకున్నాయి. రాజస్థాన్, మాళవ రాజ్యాలు దేశం లోపలి వ్యాపార వాణిజ్యాల ద్వారా ఆర్థికంగా బాగా పైకొచ్చాయి అయితే, ఇవి ఒకప్పటి ఢిల్లీ సుల్తానుల రాజ్యం మాదిరిగా రాజకీయంగా బలపడిలేవు. పూర్వ సంస్కృతి ఇప్పుడు విస్తార పరిణతి సంతరించుకున్నది ఈ రాజ్యాలలోనే. ప్రాంతీయ భాషల్లో సాహిత్యం, శిల్ప చిత్రకళలు, నూతన మత విచారం ఈ రాజ్యాలలోనే వర్ధిల్లాయి.

# 5
# ప్రజా జీవితం

ఒక పరాయి దేశం వాళ్ళు ఇంకొక దేశాన్ని జయించి, అక్కడ స్థిరపడ్డప్పుడు వాళ్ళతోపాటు నూతన జీవితరీతులు వెంట వస్తాయి. ఈ రీతులు విజిత (ఓడిన) దేశ సంస్కృతిని ప్రభావితం చేస్తాయి. అట్లాగే, విజిత దేశ సంస్కృతి విజేతల జీవన విధానాన్ని ప్రభావితం చెయ్యటం కూడా కద్దు. టర్కులు, అఫ్ఘన్లకు సంబంధించి ఈ రెండు పరిణామాలూ సంభవించాయి. వాళ్ళు ఇరాన్ చక్రవర్తుల్ని ఒరవడిగా పెట్టుకున్నారు. ఇరాన్, మధ్యాసియాల నుంచి వాళ్ళు ఈ కొత్త భావాల్ని వెంట తెచ్చారు. భారత దేశంలో స్థిరపడింది లగాయతు, భారతీయ జీవన విధానం ఆ విజేతల ఆలోచనని, ప్రవర్తనని ప్రభావితం చెయ్య



నీటి పారుదల విధానంలో—ఇస్లాము సంస్కృతి మన దేశానికి పరిచయం చేసిన పర్షియను వీల్ పద్ధతి.

సాగింది. అదే విధంగా వారి రాక భారతీయ సమాజంలో అనేక పరిణామాలకు శ్రీకారం చుట్టింది. ఈ పరిణామాలు, మార్పులు వివిధ జీవిత రంగాలలో ప్రస్ఫుటంగా ప్రదర్శితమయ్యాయి. కాలంతో పాటుగా అనేక ఆచారాలు ప్రజానీకంలో ఒక నిర్దిష్టమైన అనురూపతని సంతరించుకోసాగాయి.

ఢిల్లీ సుల్తాన్ల కాలంలో సమాజం నాలుగు ప్రధాన తరగతులుగా విభజితమై వుంది. ప్రభువర్గం, పురోహితులు, పట్టణ ప్రజలు, రైతులు.

*ప్రభువర్గం* : ప్రభు వర్గమంటే పాలకవర్గం-సుల్తాను, సర్దార్లు, హిందూరాజులు, బడా భూకామందులతో కూడిన వర్గం. సుల్తాను ఢిల్లీ దర్బారులో వైభవ, వైభోగాలు వెళ్ళబోశాడు. కొత్త సుల్తాను సింహాసనం ఎక్కి-ఎక్కగానే తన పేర మసీదుల్లో ఖుత్బా చదివించేవాడు; తన పేరు ముద్రించిన నాణాల్ని టంకశాల నుంచి విడుదల చేసేవాడు. ఈ విధంగా కొత్త సుల్తాను గద్దె ఎక్కినట్లు ధృవపడేది. సుల్తానంటే ఒక ప్రత్యేక వ్యక్తి. ప్రతినిత్యం దర్బారులో ఆయన కార్యకలాపాలన్నీ మహా అట్టహాసంగా నిర్వహింపబడేవి. ఆయన గారి ప్రత్యేక లక్షణాలు అందరికీ తెలిసేట్టు ప్రస్ఫుటం కావటానికి ఆ అట్టహాసం అవసరమైంది. ఆయన రాచ మందిరంలో అనేక మంది చిన్నా పెద్దా అధికార్లు, దాస,దాసీలు సేవలు చేసేవాళ్ళు. వీళ్ళు గాక, ఆయన అడుగులకు మడుగులొత్తే అనేక మంది బానిసలు కూడా ఉండేవాళ్ళు. ఇక సుల్తాను గారి సర్దార్లు సుల్తాను ఒరవడిలో మహా విలాసంగా, దర్జాగా జీవించారు.

*పురోహితులు* . బ్రాహ్మలు, ఉలేమాలు వగైరా పురోహితులు, మత గురువులు సమాజంలో ఒక ముఖ్యమైన భాగం. పాలకులకి సచివులుగా, సలహాదార్లుగా వ్యవహరించిన పురోహిత గణానికి బ్రహ్మాండమైన పలుకుబడి ఉండేది. వాళ్ళల్లో చాలామంది భూరి భూదానాలు స్వీకరించిన వాళ్ళు కావటం చేత ధనబలం కలిగినవాళ్లు. సుల్తాన్లు కూడా ముఖ్యులైన బ్రాహ్మల్ని గౌరవించి భూదానాలతో ఘనంగా సత్కరించారు. బ్రాహ్మలు, ఉలేమాలు ఉభయుల్లో గ్రామీణ ప్రాంతాల్లో స్థిరపడ్డవాళ్ళున్నారు. ఈ విధంగా ఉభయులూ హిందూ, ఇస్లాం సంస్కృతుల వ్యాప్తికి తోడ్పడ్డారు. అయితే ఈ హిందూ, ముస్లిమ్ పురోహితుల ప్రవర్తన నచ్చనివాళ్ళు రెండు మతాల ప్రజల్లోనూ లేకపోలేదు. ఈ మత గురువులకి మతంలో తగినంత ఆసక్తి లేదనే అసంతృప్తి సర్వత్రా ఉంది. మతం మీద కన్నా వాళ్ళకి లౌకిక విషయాల మీదే దృష్టి ఉండేది.

*పట్టణ ప్రజలు* . వ్యాపార వాణిజ్యాల వికాసం అనేక కొత్త నగరాలు పెరగటానికి దోహదం చేసింది. నగరాల్లో జీవించే ప్రజలు ఎక్కువగా వర్తకులు, వ్యాపారస్థులు. వృత్తి పనివాళ్ళు. కొంతమంది ప్రభు వర్గీయులు, అధికార్లు కూడా పట్టణాల్లో జీవించారు. పట్టణాల్లో ఎక్కువ భాగం వ్యాపార కేంద్రాలు. కొన్ని మాత్రం పరిపాలనా, సైనిక కేంద్రాలు. ఇటువంటి పట్టణాల్లో అధికార వర్గం, సైనికులు హెచ్చుగా ఉండేవాళ్ళు. ఇకపోతే, మత ప్రాధాన్యం కలిగిన పుణ్య క్షేత్రాలుగా ప్రశస్తి పొందిన పట్టణాలు తీర్థయాత్రికుల్తో, పురోహితుల్తో కిటకిటలాడేవి.

వృత్తి పనివాళ్ళు తమ తమ వృత్తుల్ని అనుసరించి పట్టణంలో ఒక్కొక్క ప్రత్యేక ప్రాంతంలో బసచేసేవాళ్ళు. ఉదాహరణకి-బట్టలు నేసే సాలీలు ఒక ప్రాంతంలో నివసిస్తే, కమ్మరి పనివాళ్ళు వేరొక ప్రాంతంలో నివసించేవాళ్ళు. అటాగే బంగారపు పనిచేసే కంసాలి బతులు ఇంకొక ప్రాంతంలో వేరుగా

జీవించేవాళ్ళు. అంచేత ఈనాటికీ కొన్ని పట్టణాల్లో కుమ్మరి వీధి, సాలె వీధి వగైరా పేర్లు తారసపడతాయి. ప్రభు వర్గానికి చెందిన కులీనులకి, వాళ్ళ కుటుంబాలకి అవసరమైన కుండలు, పాత్రలు వగైరా నిత్యావసర పనిముట్లు, సిల్కు బట్టలు, వెండి బంగారు సరిగ పనితనం ఉట్టిపడే ఖరీదైన విలాస వస్త్రాలు ఈ వృత్తి పనివాళ్ళు సమకూర్చిపెట్టేవాళ్ళు. అంతే కాకుండా, విదేశాలకి ఎగుమతి చెయ్యటానికి దేశంలో ఇతర ప్రాంతాలకు సరఫరా చెయ్యటానికి చాలినన్ని వస్తువులు కూడా తయారు చేసేవాళ్ళు. ఈ వస్తువులు వ్యాపార వాణిజ్యాలకి ప్రాతిపదిక అయ్యాయి. వీళ్ళు కాకుండా, సుల్తాన్లు వివిధ వస్తువుల తయారీకి వందలాది బానిసల్ని కార్ఖానాల్లో పెట్టి పని చేయించారు.

వ్యాపారం ప్రతి పట్టణంలో వ్యాపారస్థుల బేరసారాలకోసం ఒక సంతపేట (అంగడి వీధి) ఉండేది పెద్ద పెద్ద సంతలు జరగటం సర్వ సాధారణం. వ్యాపారమే ప్రత్యేక వృత్తిగా పెట్టుకున్న బనియాలు, ముల్తానీలు మొదలైన వాళ్ళు గొప్ప చొరవతో దేశమంతా పర్యటించేవాళ్ళు. దక్షిణాదిన మలబారు దాకా వెళ్ళే వాళ్ళు. పెద్ద పెద్ద బిడార్లు కలిగిన బంజారాలు ఒక మార్కెట్టు నుంచి మరొక మార్కెట్టుకు సరుకు చేరవేసేవాళ్ళు

ఇబ్న్ బటూటా అనే విదేశ యాత్రికుడు ఢిల్లీ వంటి బ్రహ్మాండమైన నగరాన్ని మునుపెన్నడూ సందర్శించలేదని ప్రశంసించాడు దేశం నలుమూలల నుంచి ఢిల్లీకి వివిధ వస్తువులు వచ్చిపడేవి. తూర్పు ప్రాంతం నుంచి తెల్ల బియ్యం, కనోజ్ నుంచి చక్కెర, గంగా యమునల మధ్య మైదానం నుంచి గోధుమ, దక్షిణాది నుంచి పట్టుబట్టలు, నూలు వస్త్రాలు, లోహ పనిముట్లు, ఆభరణాలు, దంతం వగైరా వగైరాలు కుప్పలుతెప్పలుగా వచ్చి పడేవి ఇంకా - అరేబియా, తూర్పు ఆఫ్రికా, శ్రీవిజయ, చైనాల నుండి సరుకుల ఓడలు యమునా తీరంలో లంగరు దించేవి. చైనాతో వ్యాపారానికి బెంగాలు కేంద్రంగా వర్థిల్లింది. ఎందరో చీనా వర్తకులు, చీనా ప్రతినిధి వర్గాలు 15వ శతాబ్దంలో బెంగాలు సందర్శించారు. చైనా చారిత్రక గ్రంథాల్లో బెంగాలుని గురించి అనేక విపుల వర్ణనలు కనిపిస్తాయి.

వాణిజ్యాభివృద్ధివల్ల డబ్బు మారకానికి ప్రోత్సాహం లభించింది లక్షల నాణాలు ప్రభుత్వ టంకసాలల నుంచి విడుదలయ్యాయి. ఆనాడు ప్రజల్లో విరివిగా వ్యాప్తిచెందిన నాణెం-వెండి టంకం. దీన్ని సుల్తాన్ ఇల్టట్‌మిష్ చలామణీలోకి తెచ్చాడు. దీని నుంచే వెండి రూపాయి రూపు దిద్దుకుని వ్యాప్తిలోకి వచ్చింది. మెట్రిక్ పద్ధతి ప్రవేశ పెట్టబడ్డదాకా, ఆనాడు వ్యాప్తిలోవున్న కొలతలు తూనికలే ఉత్తర భారత దేశంలో చలామణి అయ్యాయి.

రైతులు : రైతాంగం జీవితం-లేదా పల్లెల్లో బ్రతుకు ఎదుగు బొదుగు లేకుండా వెనకటి మాదిరిగానే కొనసాగింది. టర్కులు, అఫ్ఘన్ల రాకతో ప్రవేశించిన మార్పులు సమాజంలో పై వర్గాలకే పరిమితమైపోయాయి.

భూ వ్యవస్థ ప్రాథమికంగా పూర్వం ఎలా ఉందో అలానే ఉండిపోయింది. రైతు భూమిని సాగు చేసుకుంటూనే ఉన్నాడు. రాజోద్యోగులకో, లేదా స్థానిక భూకామందుకో పన్నులు చెల్లిస్తూనే ఉన్నాడు. ఏ రాజు వచ్చాడో, ఏ రాజు పోయాడో రైతు పట్టించుకోలేదు. టర్కులు, అఫ్ఘన్లు సంఖ్యాత్మకంగా చాలా తక్కువ మంది కావటంచేత, కింది తరగతి పరిపాలనాధికారులంతా వెనకటి వాళ్ళే. అయితే, నూతన ఇస్లాం

సంస్కృతి భారతీయ నాగరికతా విధానంలోకి చొరబడి బలీయమైన ప్రభావ ముద్రవేసింది. ఈ దిగువ స్థాయిలలోనే

కుల వ్యవస్థ సమాజపు ముఖ్య లక్షణంగా మిగిలిపోయింది. ఆఖరికి, ఇస్లాం మతంలోకి మారిన హిందువులు కూడా వివాహాది సందర్భాల్లో పూర్వకులాచారాల్ని పాటించటం మానలేదు. కులీనులకి సంబంధించి టర్కులు-అఫ్ఘన్లకు మధ్య, వీరికి-ఇస్లాం మతం స్వీకరించిన వాళ్ళకి మధ్య అంతర్వివాహాలు జరిగాయి. కాబట్టి సహజంగానే ఆచారాలు, ఆలోచనలు పరస్పరం మార్పిడి అయ్యాయి. అనేక ముస్లిం ఆచారాలు హిందూ జీవనంలో భాగమైనట్టుగానే, అనేక హిందూ ఆచారాలు ముస్లిం జీవితాలలో చోటు చేసుకున్నాయి.

*మతం :* భారత దేశంలో ఇస్లాం రాకవల్ల అనేక ఫలితాలు కలిగాయి. ఆ ఫలితాల్లో చాలా ఆసక్తికరమైనదేమంటే - హిందూ ముస్లిములుభయులూ పరస్పరం మత సంబంధమైన భావాలను అరువు తీసుకున్నారు ఇది జనరంజకమైన రెండు మత ఉద్యమాలకు బాటలు పరిచింది. ఒకటి-సూఫీ ఉద్యమం, రెండు- భక్తి ఉద్యమం.

**సూఫీలు :** పర్షియా నుంచి, ఇంకా ఇతర ఆసియా సీమల నుంచి 11వ శతాబ్దంలో భారత దేశంలో అడుగుపెట్టిన ముస్లిములలో 'సూఫీ' లనబడే భక్తిపరులు కొందరున్నారు. వాళ్ళు ఈ దేశంలో వివిధ ప్రాంతాలలో స్థిరపడ్డారు; ఎందరో హిందూ భక్తుల్ని ఆకట్టుకున్నారు. భగవంతునికి చేరువ కావటానికి ప్రేమ, భక్తి తత్పరతల్ని మించిన మార్గాలు లేవని సూఫీలు బోధించారు. భగవంతుణ్ని చిత్తశుద్ధితో ప్రేమించేవాడు భగవంతునికి, సోదర మానవులకి సన్నిహితం అవుతారు. ప్రార్థనలు, ఉపవాసాలు, కర్మకాండ వగైరాలు భగవంతుని పట్ల నిజమైన ప్రేమకి సాటిరావు. ప్రేమభావం మీద పెద్ద విశ్వాసం వున్నవాళ్ళు కాబట్టి, సూఫీలు ఇతర మతాలపట్ల, విశ్వాసాల పట్ల సహన భావం ప్రదర్శించారు. భగవంతుణ్ని చేరటానికి మార్గాలు బహుళం అని నమ్మారు. మానవులందర్నీ సమానంగా గౌరవించటం వాళ్ళ మతం. సంప్రదాయ పరాయణులైన ఉలేమాలకు సూఫీలంటే గిట్టలేదు. సూఫీ బోధలు కొన్ని ఇస్లాం సంప్రదాయ విరుద్ధ



17వ శతాబ్దం నాటి బిజాపూర్ సాధువు

మైనవిగా వాళ్ళు భావించారు. అయితే, అసంఖ్యాక హిందువులు ఈ సూఫీ యోగుల్ని భక్తితో కొలిచారు. 'పీర్'లనబడే గురువుల వద్ద ప్రజలు సూఫీ బోధలు గ్రహించడం అవసరమని వాళ్ళు భావించారు. "పీర్" బోధలు ఆలకించటానికి పట్నాల నుంచి, పల్లెల నుంచి ప్రజలు గుమిగూడే వాళ్ళు. సూఫీలు హిందువుల్ని ఇస్లాం మతంలోకి మార్చటానికి ప్రయత్నించలేదు ఒకే ఒక నిజమైన దేవుణ్ని ప్రేమించటం మేలని సూఫీలు హిందువులకు హితవు పలికారు.

మొయినుద్దీన్ చిష్తి సూఫీ యోగుల్లో సుప్రసిద్ధుడు. ఆయన అజ్మీర్‌లో ఉండేవాడు. 1236లో అజ్మీర్‌లోనే మరణించాడు. భగవంతునికి దగ్గర కావటానికి భక్తి సంగీతం ఒక మార్గం అని ఆయన విశ్వాసం. మధుర భక్తి సంగీత ధునిలో తేలియాడేప్పుడు భగవంతుని సమక్షంలో ఉన్నట్టుగా ఉంటుందని ఆయన భావించాడు. మతంతో సంగీతాన్ని ముడి వెయ్యటాన్ని ఉలేమాలు ఆమోదించలేదు. మొయినుద్దీన్ చిష్తి భక్తులు సమావేశమైన భజన స్థలాల్లో, ఉల్లాన్ని పల్లవింపజేసే చక్కటి సంగీతం జల్లు కురిసేది. ఆ సమావేశాల్లో పాల్గొన్న భక్తులు ఖవాలీ పద్ధతిలో శ్రావ్యంగా గానం చేసేవాళ్ళు. హిందీ కీర్తనలు సైతం జనాన్ని రంజింపజేశాయి.

మొయినుద్దీన్ చిష్తి తరువాత పేర్కొనదగ్గవాడు బాబా ఫరీద్. ఆయన అజోధన్ (ప్రస్తుతం పాకిస్థాన్‌లో ఉంది) అనే చోట జీవించాడు. అటువంటి సూఫీ యోగులు దేశంలో పలుచోట్ల స్థిరపడి తమ బోధలు ప్రచారం చేశారు. గుల్బర్గాలో సయ్యద్ మహమ్మద్ గెసుదరాజ్, గుజరాత్‌లో షా ఆలం బుఖారీ, ముల్తాన్‌లో బహాఉద్దీన్ జకారియా, సిల్హెట్‌లో షేక్ షిహాబ్ ఉద్దీన్ సుహ్రావర్ది ఆనాటి సూఫీ యోగుల్లో ప్రముఖులు. సుల్తాన్లు, సామాన్య జనం ఉభయులూ గొప్పగా గౌరవించిన ఒక సూఫీ యోగి పేరు నిజాముద్దీన్ ఆలియా, ఆయన ఢిల్లీ పరిసరాల్లో ఒక భక్తికేంద్రాన్ని నెలకొల్పి అక్కడే ఉన్నాడు. ఆయన చాలా నిజాయితీ పరుడు; ధైర్యశాలి. నిర్భయంగా తన భావాల్ని ప్రకటించాడు సుల్తాను నచ్చని పనేదయినా చేసినప్పుడు, ఆయన నిర్భయంగా తెగేసి చెప్పేవాడు. మిగతావాళ్ళ మాదిరి ఆయన సుల్తానంటే భయపడి నోరు కట్టేసుకో లేదు.

*భక్తిఉద్యమం* : ఆనాడు జనాదరణ పొందిన మతగురువులు సూఫీ లొక్కరే కాదు. భక్తి ఉద్యమానికి చెందిన ప్రబోధకులు కూడా ఉన్నారు. భారతదేశంలో వీరికి సుదీర్ఘ చరిత్ర ఉంది. కీర్తనలు, కథలు ద్వారా భక్తి భావాన్ని ప్రబోధం చేసే సంప్రదాయాన్ని తమిళ భక్తి ఉద్యమ కారులైన ఆళ్వార్లు, నయనార్లు మొట్టమొదట ప్రారంభించారు. ఈ ఉద్యమాన్ని పట్టణాల్లో వర్తకులు, వృత్తిపనివాళ్ళు, పల్లెల్లో రైతాంగం విశేషంగా ఆదరించారు. ఆళ్వార్లు, నయనార్ల మార్గాన్నే భక్తి ఉద్యమం అనుసరించింది. ఈ గురువుల్లో ఎక్కువ మంది బ్రాహ్మణేతర కులాలవాళ్ళు. భగవంతునికి – మానవునికి మధ్య అనుబంధానికి పునాది ప్రేమ అనీ, లెక్కలేనన్ని మత కర్మలు నిర్వహించటం కన్నా భక్తితో భగవంతుణ్ణి ఉపాసించటం మేలనీ ఈ భక్తి ఉద్యమ గురువులు బోధించారు. మనుషుల మధ్య, మతాల మధ్య సహనం యొక్క అవసరాన్ని నొక్కి చెప్పారు.

బెంగాల్‌లో చైతన్యుడనే భక్తిసంప్రదాయ ప్రవర్తకుడు భక్తి ప్రబోధం చేశాడు. ఆయన కృష్ణ భక్తిపరుడు. కృష్ణుణ్ని కీర్తిస్తూ అనేక కీర్తనలు రచించాడు. ఆయన తన బోధలు వినిపించటానికి చేరదీసిన

భక్త బృందానికి ఆ కీర్తనలు నేర్పాడు. దేశంలో వివిధ ప్రాంతాలు పర్యటించి, చివరికి ఒరిస్సాలోని పూరీ క్షేత్రంలో స్థిరపడ్డాడు. మహారాష్ట్రలో జ్ఞానేశ్వరుడు భక్తి ప్రబోధం చేశాడు. ఆయన భగవద్గీతని మరాఠీలోకి అనువదించి, సంస్కృత భాష చదువుకోని సామాన్య ప్రజలకు గీతోపదేశం అర్థం చేసుకునే అవకాశం కల్పించాడు. వీరికంటే కూడా అమిత ప్రజాదరణ చూరగొన్న భక్తులు నామదేవ్, తుకారాంలు. ప్రేమ ద్వారా భగవంతుణ్ని భజించే భక్తిమార్గాన్ని వీళ్ళు ఇంకా ముందుకు కొనిపోయారు.

వారణాసిలో కబీర్ అనే నేత పని చేసుకునే ముస్లీం మతస్థుడు భక్త కబీరుగా ప్రసిద్ధి పొందాడు. ఆయన తను స్వయంగా రచించి, తన అనుయాయులకు నేర్పిన ద్విపదలు ఈ నాటికీ బహుళ ప్రచారంలో ఉన్నాయి. హిందూమతానికి - ఇస్లాంకి మధ్య సేతువు నిర్మించటానికి ఆయన కృషి చేశాడు. మత భేదాలు కాదు ముఖ్యం, ప్రతి ఒక్కరూ భగవంతుణ్ని ప్రేమించటం అన్నదే ముఖ్యం అని ఆయన భావించాడు. భగవంతునికి పెక్కు పేర్లు; కొందరు రాముడంటారు, మరికొందరు రహీమ్ అంటారు. ఒకరికి హరి, మరొకరికి అల్లా; పేర్లుగురించి ప్రజలు ఎందుకు పేచీలకు దిగాలి? కనుక, కబీరు అనుయాయులు ఒక ప్రత్యేక బృందంగా ఏర్పడ్డారు వాళ్ళని కబీర్ పంథీయులంటారు, అంటే కబీరు మార్గీయులని అర్థం. కబీర్ తరువాత సూరదాస్, దాదూలు భక్తి సంప్రదాయాన్ని కొనసాగించారు.

కబీరంతటి ప్రసిద్ధి పొందిన మరొక మత ప్రవక్త పంజాబు ప్రాంతంలో ప్రభవించిన కాలం కూడా అదే. ఆయన మత బోధచేసిన కొన్ని శతాబ్దాల తరువాత ఉత్తర భారతదేశంలో ఆయన మతాను



శిష్యుడు పాడుతుండగ మగ్గము మీద పని చేసున్న కబీరు

యాయులు అత్యంత శక్తివంతంగా రూపొందారు. వాళ్ళే సిక్కులు. సిక్కు మతాన్ని స్థాపించిన ఆ మత గురువు నానక్. ఆయన తండ్రి పంజాబులో ఓ గ్రామ పట్వారీ. నానక్ బంధువొకరు ఆయనకి దౌలత్ ఖాన్ లోడీ అనే స్థానిక గవర్నరు కొలువులో ఓ ఉద్యోగం సంపాదించి పెట్టడానికి సాయపడ్డాడు. కాని, నానక్‌కి ఆ ఉద్యోగం మీద మనసులేదు. వెంటనే ఉద్యోగానికి స్వస్తి చెప్పి దేశమంతటా పర్యటించాడు. చివరికి తిరిగి స్వగ్రామం చేరి కొంతమంది అనుయాయులకు జ్ఞాన బోధ చేశాడు. ఆయన బోధించిన సూక్తులు సిక్కుల పవిత్ర మతగ్రంథమైన "ఆది గ్రంథ్"లో భాగమయ్యాయి. భగవంతుణ్ని ప్రేమించటం ఒక్కటే ఆయనకి దగ్గరయ్యే ఏకైక మార్గం అని గురునానక్ బోధించాడు. మానవుల్లో కులభేదాలకు తావు లేదని ఆయన ఘంటాపథంగా ప్రకటించాడు. తన అనుయాయులంతా ఏ పట్టింపులు లేకుండా కలిసి భుజించటానికి ఒకే ఒక సమిష్టి భోజనశాల (లంగర్) ఏర్పాటు చేశాడు. తన అనుయాయులందర్నీ ఒక్కటిగా చేసి, తన తరువాత తన మతాన్ని శాశ్వతం చెయ్యటానికి ఒక శిష్యుని వారసునిగా నియమించాడు. దీన్ని అనుసరించే గురు పరంపర ప్రారంభమైంది. క్రీ. శ. 1699 లో "ఖాల్సా" స్థాపన జరిగింది ఖాల్సా అంటే కత్తితో చిలికిన అమృత జలంలో పరిశుద్ధులైన వాళ్ళని అర్థం. 17 శతాబ్దంలో ఖాల్సా బలియమైన సైనిక సంస్థగా రూపొందింది. సిక్కులు ఇతర ప్రజలనుండి విలక్షణంగా కనిపించటానికి అయిదు ప్రత్యేక లక్షణాల్ని అలవర్చుకున్నారు. కేశం (జుట్టు), కృపాణ్ (కత్తి), కచ్చా (లంగోటి), కంఘ (దువ్వెన), కర (ఇనుపగాజు) అనే అయిదు వస్తువుల్ని ప్రతి సిక్కు మతస్థుడు విధిగా ధరించాలనే సంప్రదాయం ప్రారంభమైంది.

భక్తి ఉద్యమం మత సంబంధమైన ఉద్యమం మాత్రమేకాదు; సాంఘిక భావాల్ని అది ప్రభావితం చేసింది. తమిళ భక్తి ఉద్యమానికి చెందిన నయనార్లు, ఆళ్వార్లు, కృష్ణభక్తి ప్రవక్త చైతన్యుడు ప్రభృతులు మతానికే పరిమితమయ్యారు. కాని కబీర్, నానక్‌లు సామాజిక వ్యవస్థ మీద స్వతంత్రాభిప్రాయాలు ప్రకటించారు. కులాలుగా చీలిపోయిన సమాజాన్ని ఆ ఉభయులూ నిరసించారు. స్త్రీల పట్ల సమాజం చిన్న చూపుని ఇద్దరూ ఆమోదించలేదు. తమ వివిధ కార్యకలాపాలలో పురుషులతో పాటుగా స్త్రీలు పాల్గొనడాన్ని ప్రోత్సహించారు. కబీర్, నానక్ అనుయాయుల సమావేశాల్లో స్త్రీలు విరివిగా పాల్గొన్నారు. అతి మధురమైన భక్తి గీతాలు కొన్ని మహాభక్తురాలైన మీరాబాయి రచించినవే. ఆమె రాజస్థాన్ రాకుమారి. విలాస జీవితాన్ని విడిచిపెట్టి ఆమె కృష్ణ భక్తురాలుగా మారిపోయింది.

భాషా సాహిత్యాలు : భక్తి ఉద్యమ ప్రచారకులు సామాన్య ప్రజలకు అర్థమయ్యేలాగు తమ బోధల్ని ప్రాంతీయ భాషల్లో కొనసాగించారు. ఆనాడు వివిధ ప్రాంతాలలో ప్రజలు మాట్లాడిన భాషలు నేటి మన భారతీయ భాషల్లాంటివి. వాస్తవానికి, ఈనాటి మన ప్రాంతీయ భాషలు ఆనాడు ప్రజలు వాడిన భాషా రూపాలనుంచే వికసించాయి. హిందీ రూపాలైన వ్రజ, అవధి భాషలు ఆనాటి ప్రజలు మాట్లాడారు. ఉత్తరాదిన పంజాబీ భాష అప్పుడే మొగ్గ తొడుగుతోంది. అల్లాగే పశ్చిమ భారత ప్రాంతంలో గుజరాతీ, తూర్పు ప్రాంతంలో బెంగాలీ, పశ్చిమోత్తర దక్కనులో మరాఠీ, మైసూరు ప్రాంతంలో కన్నడం, ఆంధ్ర ప్రాంతంలో తెలుగు వికసించటం ప్రారంభమైన కాలం ఇదే. ఆంధ్రకు దక్షిణాన తమిళం అనేక శతాబ్దాలుగా వాడుకలో వుంది ఒరియా, అస్సామీ, సింధీ, మళయాళం భాషలు ఇదే కాలంలో అభివృద్ధి

అయ్యాయి. ఈ భాషలన్నీ అపభ్రంశ భాషల నుంచి, ప్రాకృత మూలం నుంచి పుట్టి పెరిగాయి.

దేశంలో పలుప్రాంతాలలో పర్షియన్ భాష రాజ భాషగా చలామణీ కావటం వల్ల, ప్రాంతీయ భాషలనేకం పర్షియన్ భాషవల్ల ప్రభావితం అయ్యాయి. ఆయా ప్రాంతీయ భాషా పదజాలంలో పర్షియన్ పదాలు చోటు చేసుకున్నాయి. పర్షియన్-హిందీ భాషల కలయికలో ఉర్దూ అనే కొత్త భాష పుట్టింది. ఉర్దూ అంటే శిబిరం అని అర్థం. విభిన్న ప్రాంతీయ భాషలు మాతృ భాషగా కలిగిన సైనికులు పరస్పరం మాట్లాడుకోవటానికి ఉపయోగించిన భాష ఉర్దూ. ఉర్దూ వ్యాకరణం హిందీ వ్యాకరణానికి నకలు. అయితే ఉర్దూ పదజాలమంతా పర్షియన్, తుర్కీ, హిందీ భాషల నుంచి గ్రహించిందే. దక్కనులో మాట్లాడే ఉర్దూ భాష మీద తెలుగు, మరాఠీ భాషల ప్రభావం ఎక్కువగా పడింది క్రమేణా ఉర్దూ పట్టణాల్లో సర్వ సాధారణంగా మాట్లాడే భాషగా రూపొందింది పడమటి కోస్తాలో మధ్యాసియా నుంచి వచ్చిన వర్తకులు అరబిక్ భాష ఉపయోగించారు. ఈ అరబిక్ భాష స్థానిక భాషల్ని ప్రభావితం చేసింది.

కొద్ది మంది ప్రజలు సంస్కృతాన్ని ఉపయోగిస్తూనే వచ్చారు. శైవులు, వైష్ణవులు తమ మత పరమైన కర్మకాండలో సంస్కృతాన్నే ఉపయోగిస్తూ వచ్చారు. విజయనగర రాజులవంటి హిందూ రాజుల ఆస్థానాల్లో ప్రభుత్వ సంబంధమైన ఉత్సవాదులు జరిగే సందర్భాల్లో కూడా సంస్కృతం ఉపయోగించ బడింది. ఉన్నత విద్యాభ్యాసానికి సంస్కృతమే వాడుకలో ఉంది. పురాణాలు, రామాయణ మహాభారతాల వంటి సంస్కృత పౌరాణిక సాహిత్యం ప్రాంతీయ భాషల్లోకి అనువదింపబడింది. తమిళంలో కంబ రామాయణం, తెలుగులో పోతన మహా భాగవతం సంస్కృతం చదువుకోని ప్రజలకు పౌరాణిక సాహిత్యాన్ని చవి చూపించాయి. ఈ పౌరాణిక గ్రంథాలు భారతీయ భాషల్లోనే కాకుండా పర్షియన్, అరబిక్ భాషల్లో సైతం ప్రజాభిమానం పొందాయి.

ఈ కాలంలో సాహిత్యం కేవలం సంస్కృతానువాదాలకి మాత్రమే పరిమితం కాలేదు. వివిధ భాషల్లో స్వతంత్రి కావ్యాలు, ప్రబంధాలు అవతరించాయి. శ్రీనాథ కవి సార్వభౌముడు తెలుగులో శివుణ్ణి కీర్తిస్తూ హరవిలాసం రచించాడు. మాలిక్ మహమ్మద్ జయాసీ రచించిన పద్మావత్ హిందీలో ప్రసిద్ధ కావ్యంగా పేరొందింది. అట్లాగే, మైథిలి భాషలో విద్యాపతి కవి రచించిన పద్యాలు, గీతాలు బహుళ ప్రచారం పొందాయి. కొందరు కవులు, రచయితలు పర్షియన్ సాహిత్యం ద్వారా ప్రభావితులయ్యారు. ఉదాహరణకి, అమీర్ ఖుస్రూ తన కవిత్వంలో చాలా భాగాన్ని పర్షియన్ భాషలోనే రాశాడు. పర్షియన్ భాషలో రాసినప్పటికీ, ఆయన కవిత్వంలో భారతదేశాభిమానం, భారతీయుణ్ణని చెప్పుకున్న గర్వభావం తొణికిసలాడాయి

వాస్తు శిల్పం : పర్షియా, మధ్యాసియాల నుంచి టర్కులు, అఫ్ఘన్లు తమతోపాటు వాస్తు శిల్పంలో నూతన ధోరణుల్ని, కళా సంప్రదాయాల్ని వెంట తెచ్చారు. ఇవి ప్రాచీన భారతీయ వాస్తు కళా సంప్రదాయాలతో కలగలిసిపోయి ఒక నూతన వాస్తు శిల్పం రూపెత్తింది. సిసలైన ఆర్చి, గోపుర కళా విన్యాసాలు విరివిగా వ్యాప్తిలోకి వచ్చాయి. ఈ రెండు రూపాలూ బాగా అభివృద్ధి చెందిన గణితశాస్త్ర విజ్ఞానం, సాంకేతిక నైపుణ్యాల ప్రాతిపదిక మీద రూపొందాయి. టర్కులు మన దేశానికి రాక పూర్వం, మన వాస్తు శిల్పులకు ఆర్చి నిర్మాణం గురించి పరిజ్ఞానం ఉన్నప్పటికీ తమ పరిజ్ఞానాన్నీ, నైపుణ్యాన్ని ఆ

దిశలో ఉపయోగించలేదు. అంచేతనే, టర్కులు మొదలైన వాళ్ళు ఈ దేశానికి రాక పూర్వం నిర్మించిన భవనాల్లో గోపురాలు కన్పించేవి కావు; శంకు ఆకారంలో వుండే పై నిర్మాణాలు, శిఖరాలు మాత్రమే కని పించేవి. ఇక ఆర్చీల మాటకొస్తే, నిటారుగా వుండే రెండు నిలువు కమ్ముల మీద అడ్డంగా తనాబీ వేసి ఆర్చీలు కట్టబడ్డాయి. పర్షియా, మధ్యాసియాల నూతన వాస్తు కళా ధోరణులు పరిచయమయ్యాక మసీదులు రాజ ప్రాసాదాలు, స్మారక చిహ్నంగా కట్టే సమాధులు మొదలైన నిర్మాణాల్లో గోపురం, ఆర్చీలు సర్వ సాధారణమయ్యాయి. సన్నని, ఎత్తయిన స్తంభాకార మందిర నిర్మాణం (మినారెట్) కొత్తగా వ్యాప్తిలోకి వచ్చింది.

ఆకృతిలో ఈ భవనాలు పర్షియా, మధ్యాసియాలలోని కట్టడాల్ని పోలివున్నా అలంకరణలో భార తీయత విశేషంగా గోచరిస్తుంది. ఎంచేతనంటే, ఈ భవనాల్ని నిర్మించిన వాళ్ళు భారతీయ శిల్పులు. కాబట్టి పర్షియా, మధ్యాసియాల నూతన వాస్తు శిల్ప రీతులు, భారతీయ శిల్పుల నిర్మాణ కౌశల్యం కలసి కొన్ని అతి సుందరమైన కట్టడాలకు రూపుదిద్దాయి. ఢిల్లీలో కుతుబ్ మినార్, దాని సరసన మసీదు ఈ కట్టడాలలో మొట్ట మొదటివి. ఇవి మామ్‌లుక్ కాలంలో కట్టబడ్డాయి. బానిస వంశ రాజుల్లో మొట్టమొదటి వాడయిన కుతుబుద్దీన్ ఐబక్ చరిత్ర ప్రసిద్ధమైన కుతుబ్‌మినార్‌ని కట్టించాడు. ఢిల్లీ సుల్తాన్లు వైభవోపేతంగా జీవించి



ఢిల్లీ పెద్ద తుగ్లకాబాద్‌లోని గియాజుద్దీన్ స్మారక చిహ్నం

అనేక సుందరరాజ మందిరాల్ని నిర్మింపజేశారు. ఫిరోజ్‌షా కోట్లా అని వ్యవహరించబడే ఫిరోజ్ తుగ్లక్ దుర్గం గానీ, తుగ్లకాబాద్‌లోని కోటగానీ ఢిల్లీ సుల్తానులు కట్టించిన సుందర భవనాలకు ఉదాహరణగా పేర్కొనవచ్చు. లోడీ సుల్తాన్ల మసీదులు ఆ కాలంలో ఇంకెంత మనోజ్ఞంగా వుండేవో అనిపిస్తుంది. గోపురం మీద పెంకు తాపి కూర్చిన చిత్రాతిచిత్రమైన వర్ణ విన్యాసం అద్భుతమైంది. ఆకాశనీలం, ఆకుపచ్చ, పసుపుపచ్చ, కెంపు వగైరా ప్రకాశవంతమైన వివిధ వన్నెల చిన్నెలీనుతూ ఆ కట్టడాలు చూపరుల మనస్సుల్ని ఆకట్టుకుంటాయి.

ఈ కొత్త తరహా కట్టడాలు ఒక్క ఢిల్లీలోనే కాదు, అనేక ఇతర నగరాలలో సైతం ప్రత్యక్షమవుతాయి. భారతీయ–పర్షియన్ కళా సంప్రదాయాల సమ్మేళనం భవన నిర్మాణంలో ఎన్నో నూతన ప్రయోగాలకు, సరికొత్త రూపకల్పనకు బాటలు పరిచింది. రాష్ట్రాలలో అధికారం స్థాపించిన రాజులు సైతం



ఢిల్లీలో, కుతుబ్‌మినార్ వద్ద నున్న కువత్తుల్–ఇస్లాం మసీదు. దానికెదురుగా నున్నది ఈ నాటికీ తుప్పు పట్టని ఇనుప స్తంభం.

తమ రాజధానుల్ని, కోటల్ని సుందరతరంగా తీర్చిదిద్దారు. జాన్‌పూర్‌ని పాలించిన షర్కి వంశపు రాజులు జాన్‌పూర్ పట్టణంలో బహు సుందరమైన మసీదులు కట్టించారు. గుజరాత్ పాలకుడు అహమద్ షా భారత దేశంలోని అత్యంత సుందర నగరాల్లో ఒకటయిన అహ్మదాబాద్‌ని నిర్మించాడు. మాళవని పాలించిన మహమ్మదీయ సుల్తానులు కొండల మీద సుందరరాజ మందిర నిర్మాణం కావించారు. ఈ భవనాలలో ఎక్కువ భాగం రాతితో కట్టినవే. ఈ ప్రాంతాలలో రాయి విశేషంగా దొరకటం ఇందుకు కారణం. అయితే, బెంగాల్‌లో గౌర్, పాండువా లాంటి నగరాల్లో ఇటుకలతో కట్టిన భవనాలు కనపడతాయి. తూర్పు ప్రాంతంలో రాయి తేలికగా దొరకని కారణంగా అక్కడ భవన నిర్మాణానికి ఇటుక ఉపయోగించబడింది. కాశ్మీరులో వాస్తు శిల్పులు మధ్యాసియా నమూనాలో కలపతో చక్కని కట్టడాలు నిర్మించారు. వ్యాపార వాణిజ్యాలు అభివృద్ధి చెంది, సంపద పోగుబడ్డ ప్రతిచోటా రాజులు, వారి సామంతులు కొత్త భవనాలనేకం కట్టించారు.

ఈ విషయంలో బహమనీ సుల్తాన్లు ఢిల్లీ సుల్తాన్లతో పోటీపడ్డారు. గుల్బర్గా, బీదర్ రాజధానీ నగరాల్లో గర్వపడతగ్గ సుందరమైన కట్టడాలెన్నో కనిపిస్తాయి. వీటిలో కొన్ని పురాతన వాస్తు శిల్ప సంప్రదాయాన్ని అనుసరించి కట్టినవి; మిగిలినవి పర్షియన్ వాస్తు శిల్పరీతిలో కట్టినవి. గుల్బర్గాలోని జామా మసీదు, బీదర్‌లోని మద్రసా ఈ రెండవ కోవకి చెందినవి. బహమనీ సుల్తాన్లు కట్టించిన కట్టడాలన్నింట్లో గొప్పగా చెప్పుకోదగ్గది- బిజాపూర్‌లోని గోల్‌గుంబజ్. ఇది ఒక బిజాపూర్ సుల్తాన్ సమాధి. ఈ సమాధి క్షేత్రఫలం ప్రపంచంలో కెల్లా అతి పెద్దదని చెబుతారు. ఈ దక్కన్ రాజులు తమ కోటల లోపల బ్రహ్మాండ



కర్ణాటక రాష్ట్రం బిజాపూర్‌లోని గోల్‌గుంబజ్

మైన భవనాలెన్నో నిర్మించారు. దౌలతాబాద్, గోల్కొండ కోటల్ని ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

ఇక-విజయనగర రాజులు దేవాలయాల నిర్మాణానికి విశేషంగా డబ్బు వెదజల్లారు. విదేశాల నుండి వచ్చిన దువారే బార్బోజా, నన్నిజ్, డొమింగో పయేస్ మొదలైన వర్తకులు, యాత్రికులు హంపీ నగర వైభవాన్ని, సంపదని అద్భుతంగా వర్ణించారు. వెనకటి చోళ ఆలయాల మరమ్మతులకి, పునర్నిర్మాణానికి విజయనగర రాజులు భారీ ధనం వెచ్చించారు. విజయనగర కాలం నాటి కళా కౌశలం హంపీ శిల్పాలలో, శిల్పాలంకరణ విన్యాసంలో ఈనాటికీ గుర్తించవచ్చు. మధురైని పాలించిన పాండ్యరాజులు కూడా గొప్ప కళా పోషకులు.

*చిత్రకళ, సంగీతం :* చిన్న సైజులో సున్నితంగా చిత్రువుల్ని గీసే పూర్వ సంప్రదాయం ఈ యుగంలో కూడా కొనసాగింది. రాజుకు, రాజ పరివారానికి చెందిన గ్రంథాల్ని అందంగా చిత్ర లేఖనంతో అలంకరించేందుకు రాజు చిత్రకారుల్ని నియమించటం వాడుకయింది. కొన్ని సందర్భాల్లో ఆ చిత్రకారులు రాజుగారి వర్ణ చిత్రాల్ని గీశారు; కొన్ని కొన్ని పుస్తకాల్లో అందులోని కథాంశం తీసుకుని చిత్రువులు గీశారు.

సంగీతం కూడా కొత్త రీతులు స్వీకరించి సుసంపన్నమయింది. ఇదే కాలంలో అభివృద్ధి అయిన హిందుస్థానీ సంగీత సంప్రదాయం పర్షియా, అరబ్బు దేశాల సంగీత రీతులతో ప్రభావితమయింది. దీనికి తోడు సితార్, సారంగి, తబలా వంటి సంగీత వాయిద్యాలు బహుళ జనాదరణ పొందాయి. కొంతమంది సూఫీ మత ప్రచారకులు సంగీతం పట్ల ప్రదర్శించిన శ్రద్ధాసక్తులు సైతం ఈ నూతన సంగీత రూపాలు విశేష వ్యాప్తి కావటానికి దోహదం చేశాయి.

టర్కులు, ఆఫ్ఘన్ల రాక నూతన జీవన శైలిలో అనేక ప్రయోగాలకు దారి తీసింది. సూఫీ, భక్తి ఉద్యమాల వ్యాప్తి; ప్రాంతీయ భాషా వికాసం; శిల్ప, చిత్ర, సంగీత కళల్లో సుందరమైన కొత్త రూపాల ప్రాదుర్భావం వగైరాలు ఆనాడు ఆ విధంగా కలిగిన పరిణామాలే.

# 6
# భారతదేశంలో మొఘలులు, యూరోపియన్ల ప్రవేశం

మొఘలులు ఉత్తర భారతదేశాన్ని జయించటానికి ముందు ఢిల్లీని పరిపాలించిన చిట్ట చివరి సుల్తాన్లు లోడీ వంశీయులు. ఢిల్లీ సుల్తానుల రాజ్యం లోడీ వంశకాలం నాటికి బాగా చితికిపోయింది. చాలా రాష్ట్రాలు చీలిపోయి స్వతంత్రం ప్రకటించాయి

లోడీ సుల్తాన్లు తమ అధికార ప్రతాపాన్ని జాగీర్‌దార్లకి చవి చూపించాలని ప్రయత్నం చేశారు. వాళ్ళకి ధోరణి నచ్చలేదు. వాళ్ళు స్వతంత్రాధికారం చలాయించటానికి అలవాటు పడిపోయారు. దాంతో, లోడీ సుల్తాన్ల పీడ ఎలాగైనా వదిలించుకోవటానికి జాగీర్‌దార్లు నిర్ణయించుకున్నారు: ఆనాడు బాబర్ కాబూల్‌ని ఆక్రమించుకుని రాజ్యం చేస్తున్నాడు. బాబర్ తైమూరు సంతతి వాడు. అతడు అప్పటికే భారత సరిహద్దుల దాకా దాడులు నిర్వహించినవాడు. సస్యశ్యామలమైన సంపన్న భారతభూమినిగురించి అతనికి తెలుసు. అటువంటి సమయంలో లోడీల అధికారాన్ని సహించలేని సర్దార్లు బాబర్‌ని ఆశ్రయించారు. బాబర్ తన సైన్యంతో పంజాబుమీద దాడిచేశాడు. లోడీ సుల్తాన్లకు వ్యతిరేకంగా కుట్ర పన్నిన వాళ్ళు ఒక్క జాగీర్‌దార్లు మాత్రమే కాదు; రాజపుత్ర ప్రభువుల్లో మేవాడ్ పాలకుడు రాణా సంగా సైతం లోడీలకి వ్యతిరేకంగా బాబర్‌తో చేతులు కలిపాడు.

బాబర్ 1526 లో చరిత్ర ప్రసిద్ధమైన పానిపట్టు యుద్ధంలో బాబర్ లోడీ సైన్యాల్ని ఓడించాడు. బాబర్ మధ్యాసియా నుంచి తెచ్చిన ఫిరంగులు అతని విజయానికి కొంతవరకు కారణం. ఈ గుండ్ల ఫిరంగులు భారత సైన్యానికి పూర్తిగా కొత్త. పైగా బాబర్‌కు సుశిక్షితమైన ఆశ్విక దళం ఉంది. సైనికులు యుద్ధ క్షేత్రంలో ఒక భాగం నుంచి మరొక భాగానికి సులువుగా కదలటానికి వీలైన అద్భుత వ్యూహరచన చేశాడు. బాబర్ స్వయంగా గొప్ప సేనాని; తన వివిధ బలాల్ని ఎంత అమోఘంగా ఉపయోగించుకోవాలో తెలిసిన యుద్ధనిపుణుడు. కొద్ది గంటల్లో లోడీ సైన్యాలు చిత్తుగా ఓడిపోయాయి. యుద్ధంలో విజయం సాధించాక బాబర్ తనవంతుకు ముట్టవలసిన సంపదని చేజిక్కించుకుని కాబూల్ తిరిగి వెళ్ళిపోతాడని సర్దార్లు ఆశించారు. కాని, బాబర్ భారతదేశంలో స్థిరపడిపోవటానికే నిర్ణయించుకున్నాడు. కాబట్టి ఢిల్లీ, ఆగ్రాల్ని ఆక్రమించాడు అతణ్ని నిరోధించటానికి ఏకమైన రాణా సంగ రాజపుత్ర కూటమిని, అఫ్ఘన్ సర్దార్లని ఓడించాడు.

1526 నుంచి 1529 లోపల కాబూల్ కాందహార్‌ల నుంచి బీహార్ వరకు, హిమాలయాలనుంచి గ్వాలియర్ ఛందేరీల వరకు విస్తరించిన విశాల రాజ్యాన్ని స్థాపించిన ఆనందం అట్టే కాలం నిలవకుండానే బాబర్ 1530 లో మరణించాడు. సైన్య నిర్వహణలో, యుద్ధతంత్రంలో ప్రజ్ఞాశాలి అయిన ఉజ్వల సేనా నాయకుడు మాత్రమే కాకుండా, బాబర్ కవి, రచయిత. తుర్కీ భాషలో అద్భుత రచనలు చేశాడు. తన ఆలోచనల్ని, తన కాలం నాటి వివిధ సంఘటనల్ని పొందుపరుస్తూ బాబర్ స్వీయ చరిత్ర రాసుకున్నాడు (తుజుక్-ఇ-బాబరీ). పర్వతాలు, తరువులు, పూలు, జంతువులతో కూడిన ప్రకృతి సౌందర్యానికి పరవశించిపోయిన భావుకుడు బాబర్. తాను గడిపిన ప్రతిచోటా ఉద్యాన వనాలు నాటించాడు. ఆయనకి పోలో క్రీడ పట్ల (గుర్రాల మీంచి ఆడే హాకీ వంటి ఒక బంతి ఆట) మహా ఆసక్తి. ఆ ఆట తరువాత భారత జాగీర్‌దార్లలో ఇతోధికంగా ఆదరణ పొందింది.

హుమాయూన్ : బాబర్ భారతదేశంలో పెద్ద భూభాగాన్ని జయించి, మొఘల్ వంశాన్ని స్థాపించినా, దాన్ని శత్రువుల బారి నుంచి రక్షించుకునే కట్టుదిట్టాలు చేసే అవకాశం లేకుండానే మరణించాడు. అంచేత, బాబర్ కుమారుడు హుమాయూన్ అధికారానికి వచ్చీరాగానే అనేక అవాంతరాలు ఎదుర్కోవలసి వచ్చింది. పైగా, మొఘలులు భారతదేశానికి కొత్తవారు కావటం చేత ఆది నుంచి తమ స్థానాన్ని పదిల పర్చుకోడంలో అనేక ఇబ్బందులకు గురికావలసి వచ్చింది. వీళ్ళు ఈ దేశం వదిలి వెళ్ళనందుకు వైరం పూనిన ఆఫ్ఘన్ జాగీర్దార్లు మొఘల్ రాజ్యంమీద కత్తిదూశారు. గుజరాత్ సుల్తాను బహదూర్‌షా ఢిల్లీ మీద దాడి చెయ్యటానికి కాలు దువ్వుతున్నాడు. తన తండ్రి జయించిన భూభాగంలో రెవెన్యూ వసూలుని కట్టుదిట్టం చేసుకోడానికి, పరిపాలనా వ్యవస్థని సంఘటిత పర్చుకోడానికి హుమాయూన్‌కి వ్యవధి దొరకలేదు. ఈ పరిస్థితుల్లో హుమాయూన్ గుజరాత్, మాళవ రాజ్యాల్ని జయించినా పశ్చిమ భారతదేశంలో తన అధికారాన్ని స్థాపించుకోలేకపోయాడు. ఇక భారత తూర్పు ప్రాంతాన్ని మహాశక్తివంతుడైన షేర్షా పరిపాలిస్తున్నాడు. అమితమైన రాజ్యకాంక్షతో షేర్షా ఢిల్లీని జయించి సుల్తానుగా ప్రకటించుకునే ఉద్దేశ్యంతో మొఘలులతో తలపడ్డాడు. షేర్షా-హుమాయూన్‌ల మధ్య రెండు ఘోర యుద్ధాలు జరిగాయి. రెంటిలోనూ హుమాయూన్ ఓటమి పొందాడు. పంజాబ్, కాబూల్‌లను పరిపాలించే హుమాయూన్ సోదరుడు అన్నగార్ని ఆదుకోడానికి ముందుకు రాలేదు. మొఘలులు ఉత్తర భారతదేశం నుంచి తిరోగమించారు. బాబర్ సాధించిన సామ్రాజ్యం పోయింది హుమాయూన్ రాజ్యభ్రష్టుడై దేశాలపాలయ్యాడు. రాజస్థాన్, సింధు రాష్ట్రాలలో దిక్కు తోచకుండా తిరిగాడు. ఆ స్థితిలోనే అమర్‌కోటలో హుమాయూన్‌కి పుత్రుడు కలిగాడు. తరువాతి కాలంలో భారతదేశాన్ని ఏలిన మహాచక్రవర్తి అక్బర్ ఆ చిరంజీవే. హుమాయూన్ సింధురాష్ట్రాన్ని వదిలి పర్షియాకి పరారీ అయ్యాడు.

షేర్‌షా : షేర్షా అసలు పేరు ఫరీద్. ఒక తూరి అడవిలో వేటకి వెళ్ళిన సందర్భంలో గాండ్రించే పులిపైన పడి చంపిన కారణంగా షేర్-ఖాన్ అనే బిరుదు పొందాడు. ఆ బిరుదే క్రమేణా షేర్‌షాగా మారింది. జాన్‌పూర్‌లో ఓ జాగీర్దారు ఇతని తండ్రి. మొఘలుల సహాయంతో తన జాగీరుని పునరాక్రమించుకున్న షేర్ షా రాజ్యకాంక్షతో బలీయమైన సైన్యాన్ని నిర్మించి, చుట్టుపక్కల భూభాగాన్ని స్వాధీనం చేసుకుని 1530-1531 నాటికి స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించాడు. షేర్‌షా జీవితంలో అది

విజయోత్సాహ ఘడియ. హుమాయూన్‌ని ఓడించాడు. అనేక దండయాత్రలు చేసి రాజ్యాన్ని విస్తృతం చేసుకున్నాడు. కేవలం భారతదేశానికి ప్రభువుగా వుండటం ఒక్కటే షేర్ షా ఆశయం కాదు, సమర్థుడైన సామ్రాట్టుగా పేరు తెచ్చుకోవటం అతని ధ్యేయం అల్లాఉద్దీన్ రాజ్యపాలనా విధానాలు అతణ్ణి ప్రభావితుణ్ని చేశాయి. ముఖ్యంగా, సైనిక వ్యవహారాల్లో, రెవెన్యూ విధానంలో అల్లాఉద్దీన్‌ను అతడు ఆదర్శంగా స్వీకరించాడు.

సుల్తాను కాగానే, షేర్ షా తన సైన్యాన్ని బలీయంగా సమర్థవంతంగా తీర్చిదిద్దాడు. తన ఉద్యోగులందరికీ సక్రమంగా వేతనాలు చెల్లించి వారిలో అసంతృప్తికి తావివ్వకుండా చేసి పరిపాలన నిర్వహణని మెరుగుపర్చాడు. ఎవరికి ఏ కష్ట నిష్ఠూరాలు కలిగినా తనని స్వయంగా సందర్శించి విన్నవించుకునే వీలు కలుగజేశాడు. ప్రజలల్లో ఆదరణ పొందటానికి ఈ చర్య దోహదం చేసింది. అతడు స్వయంగా దేశమంతటా పర్యటన జరిపి తన ఉద్యోగుల కార్యకలాపాల్ని పర్యవేక్షించాడు. పన్నుల వసూలుకు సంబంధించి రైతులు కట్టవలసిన శిస్తు తలకుమించి భారంగా ఉండకుండా జాగ్రత్త తీసుకున్నాడు. న్యాయమైన భూమిశిస్తు నిర్ణయించడానికి గాను భూమినంతా "భిగా" లనే సమ భాగాలుగా విభజించి, ఫలసాయాన్ని బట్టి మేలి, మధ్య, నాసి రకాల భూములు గుర్తించి సరికొత్త భూమి శిస్తు సంస్కరణలు ప్రవేశపెట్టాడు. అల్లాఉద్దీన్ కాలంలో మాదిరిగా మొత్తం భూమినంతా సర్వే చేయించి కొత్త భూమిశిస్తు విధానాన్ని రూపొందించాడు.

షేర్‌షా అనేక రహదార్ల నిర్మాణానికి ఉత్తర్వులిచ్చాడు. రహదార్ల కిరువైపులా చల్లని నీడనిచ్చే చెట్లు నాటించాడు. బాటసారులు దప్పిక తీర్చుకోటానికి బావులు, అలసట తీర్చుకోడానికి విశ్రాంతిం శాలలు ఏర్పాటు చేశాడు. ఎన్నడో మౌర్యుల కాలంలో వేసిన లాహోర్-బెంగాల్ రహదారిని పునర్ నిర్మించాడు. (నేటి పెషావర్-కలకత్తా గ్రాండ్‌ట్రంక్ రోడ్డుకు ఆనాటి రహదారే పునాది) బుర్హాన్‌పూర్, జాన్‌పూర్‌లని ఢిల్లీతో కలుపుతూ రహదారివేయించాడు. ప్రజలు ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి సుఖంగా ప్రయాణం చెయ్యటానికి మాత్రమే కాకుండా, రాజోద్యోగులు వివిధ ప్రాంతాలకు వేగంగా చేరటానికి కూడా ఈ రహదార్ల నిర్మాణం ఉపయోగపడింది. వర్తకులు తమ సరుకుల రవాణాకు ఈ రహదార్లని ఉపయోగించుకున్నారు. రుపియా అనే నాణాన్ని ప్రవేశ పెట్టినవాడు కూడా షేర్‌షాయే. ఈనాడు మనం వాడే రూపాయి షేర్‌షా వ్యాప్తిలోకి తెచ్చిన రుపియాయే.

షేర్‌షా ఢిల్లీ సామ్రాజ్యాన్ని పాలించిన మహోన్నత చక్రవర్తిగా చరిత్రలో నిలిచిపోయి ఉండేవాడే గాని అతడు పట్టుమని అయిదేళ్ళయినా పూర్తిగా పరిపాలించలేదు. తన సిద్ధాంతాలని సంపూర్ణంగా ఆచరణలో పెట్టటానికి అయిదేళ్ళంటే అతి స్వల్పకాలం. కలింజర్‌కోట ముట్టడి సందర్భంగా ఒక తుపాకి ముఖం మీద పేలి షేర్‌షా మరణించాడు. అతని హఠాన్మరణం హుమాయూన్‌కి అదృష్ట ఘటన అని చెప్పవచ్చు. షేర్‌షా అంతటి మహాశక్తివంతుడైన పాలకుడు ఢిల్లీ సింహాసనం మీద లేకపోవటంతో రాజ్యం ఛిన్నాభిన్నమైంది హుమాయూన్ ఢిల్లీ సింహాసనాన్ని తిరిగి అధిష్ఠించటానికి అవకాశం కలిసివచ్చింది. హుమాయూన్ కాందహార్‌ని తిరిగి జయించి, కాబూల్ మీద తన అధికారాన్ని తిరిగి నెలకొల్పుకోడానికి ఇరాన్ రాజు సహాయం లభించింది. కాబూల్‌ని ప్రాపుగా చేసుకుని అతడు తిరిగి భారతదేశంమీద దండ

యాత్రకి బయల్దేరాడు 1555 లో పంజాబుని జయించి ఢిల్లీ, ఆగ్రాల్ని కైవసం చేసుకున్నాడు. భారత దేశంలో మొఘల్ అధికారానికి పునఃప్రతిష్ఠ జరిగింది. ఇన్ని ఒక్కట్లుపడి సాధించిన ఆనందాన్ని అనుభవించ డానికి నోచుకోకుండానే హుమాయూన్ మెట్లమీద కాలు జారిపడి మరణించాడు. ఢిల్లీ సింహాసనాన్ని తిరిగి సంపాదించి అప్పటికి కనీసం సంవత్సరమైనా నిండలేదు తరువాత అతని కుమారుడు అక్బర్ రాజ్యానికి వచ్చాడు అక్బర్ పరిపాలనా కాలంలో భారతదేశం అసమాన ప్రతిష్ఠ పొందింది.

బహమనీ రాజ్యం . మొఘల్ సామ్రాజ్య స్థాపనకి ముందు ఉత్తర భారతదేశంలో సంభ వించిన సంఘటనల తాలూకు ప్రభావం దక్షిణా పథం మీద పడలేదు. ఆ తర్వాత, పరిస్థితి మారిపోయింది. మొఘల్ అధికారం దక్షిణా పథంలోకి సైతం విస్తరించి యావద్భారత దేశాన్ని సమైక్యం చేసే సమయం ఆసన్నం కాబోతోంది.

15వ శతాబ్దంలో బహమనీ రాజ్యం బాగా అభివృద్ధి చెందింది. బహమనీ రాజ్యంలో బహుకాలం మంత్రిగా పనిచేసిన మహమ్మద్ గవాన్ శక్తి, సామర్థ్యాలు ఇందుకు కొంతవరకు కారణం. మహమ్మద్ గవాన్ మొదట ఒక పర్షియా వర్తకుడు. 1453 లో అతడు బహమనీ రాజ్యం చేరి మూడవ అహ్మద్ షా కాలంలో ప్రధాన మంత్రి పదవికి ఎదిగాడు. బహమనీ రాజులు వివేకవంతంగా న్యాయపరిపాలన సాగించ టానికి మహమ్మద్ గవాన్ 25 సంవత్సరాలు వారికి తోడ్పడ్డాడు. ఒక పటిష్టమైన సైన్య నిర్మాణానికి, పోషణకి డబ్బు లోటు రానీకుండా రెవెన్యూ విధానాన్ని సంస్కరించాడు. అంటే, చాలా మంది తెలివి తక్కువ రాజులు పన్నులు పెంచి ప్రజల్ని పీడించుకున్న పద్ధతిలో గవాన్ వ్యవహరించలేదు. ప్రజలు న్యాయంగా భరించగలిగిన మేరకే పన్నులు విధించాడు. అయితే, ఖజానాని నింపటానికి వేరే పద్ధతులు అవలంభించాడు. ఉదాహరణకి, ఆయన విజయనగర రాజుల నుంచి గోవాని స్వాధీనం చేసుకుని, గోవా వర్తక వాణిజ్యాల ద్వారా వచ్చే అపార లాభాల్ని బహమనీ రాజ్యానికి మళ్ళించాడు.

మహమ్మద్ గవాన్ విశేషంగా ప్రజాభిమానం సంపాదించినా, శత్రువులకి కూడా కొదువలేదు. బహమనీ సుల్తాను దర్బారు రెండు ముఠాలుగా చీలిపోయింది. దక్కనుకు చెందిన స్థానిక ముస్లిం అధికారు లంతా కలిసి ఒక ముఠా; భారత దేశం వెలుపలి నుంచి వచ్చి రాజాస్థానంలో పదవులు సంపాదించిన మహమ్మద్ గవాన్ లాంటి విదేశీయుల వర్గం రెండవది. ఈ రెండు వర్గాల మధ్య స్నేహ సద్భావాలు లేవు. పరస్పరం అసూయతో ద్వేషించుకున్నారు. చిట్ట చివరకి, ఈ ద్వేషం పరాకాష్ట చెంది మహమ్మద్ గవాన్ 1481 లో వధించబడ్డాడు.

మహమ్మద్ గవాన్ హత్య బహమనీ రాజ్యానికి తీరని లోటు. ఆయనంతటి సమర్థవంతుడైన సచివుడు బహమనీ రాజ్యానికి మరి లేడు. బలహీనులైన రాజులు రాజ్యానికి రావటంతో బహమనీ రాజ్యానికి క్షీణదశ ప్రారంభమైంది. సుల్తాను అధికారాన్ని ధిక్కరించే సర్దార్లు కొందరు తలెత్తారు. వీటికి తోడుగా, విజయనగర రాజుల దాడులు విజృంభించాయి. పర్యవసానంగా, బహమనీ రాజ్యం అయిదు ముక్కలయింది. బిజాపూర్, గోల్కొండ, అహ్మద్‌నగర్, బీదర్, బీరార్ లనే అయిదు స్వతంత్ర రాజ్యాలు ఏర్పడ్డాయి. తరువాత, అహ్మద్‌నగర్ రాజ్యం బీరార్‌ని జయించింది; బిజాపూర్ బీదర్ని ఆక్రమించింది. అయిదు రాజ్యాలు మూడు రాజ్యాలయ్యాయి. అవి - బిజాపూర్, గోల్కొండ, అహ్మద్‌నగర్ లు.

*విజయనగర రాజ్యం.* దక్కనులో ఒక భాగమైన బహమనీ రాజ్యంలో ఈ మార్పులు సంభవించిన దశలో, రెండవభాగమైన విజయనగర రాజ్యంలో తరచు మారే రాజవంశాల సమస్యతో సంక్షోభం చోటు చేసుకుంది. 15 వ శతాబ్దంలో విజయనగరరాజ్య బలహీనతకిది కారణమైంది. అయితే, 15 వ శతాబ్దాంతానికి - అంటే మహమ్మద్ గవాన్ మరణం తరువాత బహమనీ రాజ్యానికి క్షీణదశ పట్టిన సమయంలో విజయనగర రాజ్యం తిరిగి బలం పుంజుకుని శ్రీకృష్ణదేవరాయలకాలంలో (1509-30) శిఖరాగ్ర స్థాయికి చేరుకుంది.

కృష్ణ దేవరాయలు రాయచూర్ దోఆబ్‌ని జయించటంతో ఆగకుండా బహమనీ రాజ్యంలోకి చొచ్చుకుపోయి గుల్బర్గా, బీదర్‌లని పట్టుకుని బహమనీ సుల్తాన్ల మీద తన ఆధిక్యతని నిరూపించుకున్నాడు. తరువాత, ఒరిస్సా గజపతుల్ని చిత్తుగా ఓడించాడు. ఇక, పశ్చిమ తీరంలో స్థానిక పాలకులందరితో రాయలు స్నేహసంబంధాలు నెలకొల్పుకున్నాడు. వాళ్ళంతా పశ్చిమ, ఆగ్నేయ ఆసియాతో వర్తక వాణిజ్యాలు నెరపుతూ బాగుపడ్డవాళ్ళు. కాబట్టి, పడమటి కోస్తాలో వ్యాపారంమీద వర్ధిల్లే ఈ రాజ్యాలతో సత్సంబంధాలు విజయనగర వ్యాపార వాణిజ్యాభివృద్ధికి దోహదపడి అపార సంపద ఆర్జించి పెడతాయని రాయలు గ్రహించాడు.

కృష్ణదేవరాయలు తరచు తన రాజ్యమంతటా పర్యటించి పరిస్థితులెలా వున్నాయో తెలుసుకున్నాడు. రాజోద్యోగులు సక్రమంగా పని చెయ్యాలనీ, ప్రజలంతా సుఖసంతోషాలతో జీవించాలనీ రాయల ఆశయం. ప్రజలకి పుష్కలంగా ఆహారం, రాజ్యానికి విశేషంగా ఆదాయం లభించే విధంగా రాయలు వ్యవసాయాభివృద్ధి చర్యలు తీసుకున్నాడు. భారీ నీటి పారుదల ఏర్పాట్లు కావించాడు. నీటిని నిల్వచెయ్యటానికి భారీ ఆనకట్టలు, నీటిపారుదలకు కాలువలు నిర్మింపజేశాడు. జీర్ణదేవాలయాల మరమ్మతులకు, నూతన దేవాలయాల నిర్మాణానికి ఆయన విశేషంగా డబ్బు వెచ్చించాడు. కృష్ణరాయలు సంస్కృతాంధ్ర భాషల్లో పండితుడు. స్వయంగా "ఆముక్తమాల్యద" అనే ప్రబంధాన్ని రచించాడు. అందులో రాజనీతిని విస్తృతంగా వర్ణించాడు.

*బిజాపూర్, గోల్కొండ, అహ్మద్‌నగర్ రాజ్యాలు :* కృష్ణదేవరాయలు 1530లో మరణించాడు. ఆయన మరణంతో విజయనగర రాజ్య క్షీణయుగం ఆరంభమైంది. ఉత్తర దక్కనులో బిజాపూర్, గోల్కొండ, అహ్మద్ నగర్ రాజ్యాలు విజయనగరం మీద విరుచుకు పడటానికి అదనుకోసం ఎదురు తెన్నులు చూస్తున్నాయి. 1565 లో ఆ అదను దొరికింది. ఈ మూడు రాజ్యాలు తాత్కాలికంగా సంఘటిత పడి తళ్ళికోట యుద్ధంలో విజయనగర రాజ్యాన్ని ఓడించాయి. విజయనగర రాజ్యం పతనమైంది. విజయనగర రాజ్యంమీద సాధించిన విజయానందం ఈ మూడు దక్కను రాజ్యాలూ అట్టే కాలం అనుభవించలేదు. ఉత్తరభారతదేశంలో సంభవించిన సంఘటనల ప్రభావం దక్కను చరిత్రమీద పడింది. 16 వ శతాబ్ది రెండవ భాగంలో ఢిల్లీ సుల్తానత్ సంపూర్ణంగా నాశనమైపోయి మొఘల్ రాజ్య స్థాపన జరిగింది. యావద్భారత చక్రవర్తులుగా ఉండాలంటే దక్కన్‌ని అదుపులో ఉంచుకోవాలని మొఘల్ పాలకులు గ్రహించారు. కాబట్టి, మొఘల్ అధికారం దక్కన్‌లోకి చొచ్చుకు రావటంతో దక్కన్ రాజ్యాల అస్తమయం అనివార్యమైంది.

*భారతదేశం - యిరోపా*. భారత చరిత్రగతిని ప్రభావితం చేసినవాళ్ళు మొఘలాయీలొక్కరే కాదు. 15 వ శతాబ్దం ముగిసే దశలో పెద్ద పెద్ద నౌకల్లో ఒక పరాయి దేశం నుంచి కొత్తవాళ్ళు భారత పశ్చిమ తీరంలో దిగారు; అప్పటి దాకా మధ్యాసియా నుంచి భారతదేశంలో ప్రవేశించిన జాతులకి పూర్తిగా భిన్నమైన సరికొత్త జాతీయులు. వాళ్ళనే పోర్చుగీసు వాళ్ళంటాం. పోర్చుగీసు నావికుడు వాస్కోడిగామా 1498 లో కాలికట్ చేరాడు; భారత పశ్చిమతీరాన్ని చేరిన మొట్టమొదటి పోర్చుగీసు నౌక అతనిది. పోర్చుగీసులు వ్యాపారం కోసం వచ్చారు. వ్యాపారం మీద వచ్చే అపార లాభాలు అనేకమంది పోర్చుగీసుల రాకని ప్రోత్సాహ పర్చాయి. పోర్చుగల్ నుంచి భారతదేశానికి అనేక మాసాల సుదీర్ఘ సముద్రయానం, ఆఫ్రికా ఖండపు దక్షిణ కొస అయిన గుడ్‌హోప్ అగ్రాన్ని చుట్టి రావాలి. అయినా, వాళ్ళు వచ్చారు. పడమటి కోస్తాలో చిన్న చిన్న భూభాగాలు సంపాదించారు. ఫ్యాక్టరీలు కట్టారు. ఆ భూభాగాల్ని దబ్బిచ్చీకొన్నారు; బలప్రయోగం ద్వారానూ సంపాదించారు. పోర్చుగీసు వర్తకులు రేవు ప్రాంతంలో తాము కట్టుకున్న ఫ్యాక్టరీల పక్కనే నివాసం ఏర్పాటు చేసుకున్నారు ఆ ప్రాంతాల్ని "సెటిల్మెంటు" లంటారు. పోర్చుగీసులు నెలవు ఏర్పాటు చేసుకున్న స్థలాలకి వర్తకులతో పాటు క్రైస్తవ మత ప్రచారకులు కూడా వచ్చారు. భారతీయుల్ని క్రైస్తవ మతంలోకి మార్చటం వాళ్ళ ఆశయం. పోర్చుగీసుల మొట్ట మొదటి నెలవుల్లో గోవా ఒకటి. గోవాని వాళ్ళు 1510 లో స్వాధీనం చేసుకున్నారు.

అయితే, భారతదేశాన్ని సందర్శించిన మొట్టమొదటి యూరోపియన్లు పోర్చుగీసు లొక్కరేకాదు. వ్యాపారాన్వేషణలో భారతదేశాన్ని ఒక్కరొక్కరుగా సందర్శించిన యూరోపియన్ వర్తకులు చాలా మందిఉన్నారు. వెనిస్ (ఇటలీ) నుంచి వచ్చిన మార్కోపోలో దక్షిణ భారత



పోర్చుగీసు నావికుడు వాస్కోడిగామా

దేశం పర్యటించాడు. రష్యానుంచి నికిటిన్ దక్కను సీమ సందర్శించాడు. ఈ వర్తకులు ఎవరికి వారుగా ఒంటరిగా వచ్చారు కాని, పోర్చుగీసులు జట్లు జట్లుగా వచ్చి నెలవు లేర్పరచుకున్నారు. పైగా, వాళ్ళకి పోర్చుగల్ రాజు మద్దతు ఉంది. వాళ్ళు తమ వెంట సైనికుల్ని తోడు తెచ్చుకున్నారు. సెటిల్మెంటుల్ని ఏర్పాటు చేసుకున్న భూభాగాల్ని జయించారు. 16వ శతాబ్దంలో ఇంకా తదితర ఐరోపాదేశాలు కూడా వర్తక నౌకల్ని పంపాయి. వ్యాపారం నిమిత్తం భారతదేశంలో మంచి నెలవులు ఏర్పాటు చేసుకోవటానికి ప్రయత్నం చేశాయి. ఇంగ్లండ్, ఫ్రాన్సు, డెన్మార్క్, హాలెండ్, స్పెయిన్ దేశాలనుండి వ్యాపార నౌకలు భారతదేశం వచ్చాయి. యూరప్ ఖండం మొత్తం ఒక్క భారతదేశంతో మాత్రమే కాకుండా ఇంకా ఇతర ఆసియా ప్రాంతాల్తో సైతం వ్యాపార సంబంధాలు నెలకొల్పుకోడానికి ఆసక్తి ప్రదర్శించింది. వ్యాపారం ప్రధానమే గాని అదొక్కటే ఏకైక ప్రేరణ కాదు; మిగతా ప్రపంచాన్ని కనుక్కోవాలనీ, అక్కడి కొత్త ప్రజల్ని, వాళ్ళ సంస్కృతిని తెలుసుకోవాలనీ వాళ్ళ కొక జిజ్ఞాస ఉంది. వ్యాపారం పట్ల వాళ్ళ క్రికాంక్ష, మిగతా ప్రపంచాన్ని తెలుసుకోవటం పట్ల వాళ్ళకి జిజ్ఞాస ఎందుకు కలిగాయో అర్థం చేసుకోవాలంటే ఆనాటి యూరప్ పరిస్థితుల్ని సమగ్రంగా పరిశీలించాల్సి వుంటుంది.

*ఐరోపాలో పునరుజ్జీవనం :* 15వ శతాబ్దంలో ఇటలీలో "పునరుజ్జీవనం" ఉదయించింది. దాన్నే యూరప్‌కు పునర్జన్మగా వర్ణిస్తారు. అప్పటి దాకా యూరప్‌ను ఆవరించిన సుదీర్ఘ అంధయుగం అంతరించి ఒక వినూతన ఉద్యమం మొసులెత్తింది. ఆధునిక జీవనంతో, ఆలోచనా విధానంతో మనం ముడిపెట్టే అనేక విశిష్ట అంశాలకు ఆ ఉద్యమం దారి తీసింది ప్రాచీన యూరప్ సంస్కృతి మీద తిరిగి చిగురించిన ఆసక్తితో ఈ పునరుజ్జీవన ఉద్యమం మొదలయింది; ప్రాచీన యూరప్ సంస్కృతి అంటే క్రైస్తవ సంస్కృతి పుట్టక పూర్వం ఉన్న గ్రీకు సంస్కృతి, రోమన్ నాగరికతలన్నమాట గ్రీకు, రోమన్ నాగరికతలు చరిత్ర, తత్వశాస్త్రం, సాహిత్యం, కళలలో సాధించిన విజయాల్ని శ్రద్ధగా అధ్యయనం చెయ్యటం ముమ్మరించింది. ఈ అధ్యయనం నూతన ఆలోచనా ధోరణులకు బాటలు పరిచింది. సమాజం గురించి, చట్టాల గురించి, తత్వచింతన గురించి, మతం గురించి పండితులు ప్రశ్నించటం ప్రారంభమైంది. అంతకు ముందు, ఈ విషయాలలో ఉత్పన్నమయ్యే ప్రశ్నలకు క్రైస్తవ చర్చి ఇచ్చిన జవాబుల్తో ప్రజలు సమాధానపడ్డారు. కాని, ఇప్పుడు ఆ ప్రజలే వేరే జవాబులు ఆశిస్తున్నారు. ప్రతి చోటా ఇటువంటి జిజ్ఞాసకు సంబంధించిన చైతన్యం వెల్లివిరిసింది. ఇటలీలోని అనేక చిన్న చిన్న రాజ్యాల పాలకులు మాత్రమే కాకుండా సంపన్న వర్తకులు సైతం ఈ అధ్యయనంలో ఆసక్తి ప్రదర్శించారు వ్యాపారం ద్వారా అరబ్బుల్తో ఏర్పడ్డ దీర్ఘకాలిక సంబంధం అరబ్బు విజ్ఞానాన్ని ఇటలీకి స్పెయిన్‌కి కొనితెచ్చింది. ఇది కూడా ఆ జిజ్ఞాసకి చురుకు పుట్టించింది.

మధ్యయుగాలలో పండితుల మీద గాఢ ముద్రవేసిన చర్చి ప్రభావం క్రమేణా కరిగిపోసాగింది. విశ్వం గురించి, దేవుని గురించి, మానవ జీవితం గురించి ఇన్నాళ్ళుబట్టి చర్చి చెప్పిన ప్రతి ముక్కా ప్రజలు మారు మాటాడకుండా ఆమోదించే స్థితిలో లేరు. ప్రజలు ఫలానా విధంగా ఆలోచించాలని నమ్మించిన కాలం చెల్లిపోయింది. మనిషి తను స్వయంగా చూసి, అనుభవించి, పరిశీలించగలగడం మీద ఆధారపడి తన ఆలోచన రూపొందించుకుంటున్నాడు. ఈ ప్రయత్నంలో ఆధునిక శాస్త్ర విజ్ఞానం మొలకెత్తింది. ఆ నాటి

పండితులు తమ చుట్టూ ఏ జరుగుతుందో పరిశీలనా పూర్వకంగా గమనించారు; ప్రయోగాలు కూడా చేసిన సందర్భాలు వున్నాయి. తమ సతార్కిక ఆలోచనా శక్తిని విజ్ఞాన శాస్త్ర సూత్రాల్ని కనుగొనడానికి, తమ విజ్ఞానాన్ని మెరుగు పర్చుకోడానికి వినియోగించారు. జ్ఞానం అనేది భగవంతుని నుంచి రాలేదని గ్రహించారు మానవుడు తను చుట్టూ వున్న ప్రపంచాన్ని సూక్ష్మబుద్ధితో పరిశీలించటం ద్వారా విజ్ఞానాన్ని ఆకళించుకోవాలని వాళ్ళు వాదించారు. మానవులు తాము వాడే పరికరాల్ని, అనుసరించే పని పద్ధతుల్ని అధ్యయనం చేసి సాంకేతిక విజ్ఞానాభివృద్ధికి విశేష కృషిచేశారు.

మానవుణ్ణి ఈ ప్రపంచానికి కేంద్రంగా, ఒక విలక్షణ మూర్తిగా గుర్తించడమన్నది దీని మొత్తం సారాంశం. విజ్ఞానం మానవ ప్రయోజనాలకు వినియోగపడాలని ఈ పునరుజ్జీవన యుగానికి చెందిన ఆలోచనా పరులు నొక్కిచెప్పారు. ప్రతి ఒక్కమనిషి యొక్క ప్రాముఖ్యానికి ఊనిక దొరికింది. అట్లాగే సమస్త మానవుల సంఘీభావం ఉద్ఘాటించబడింది. ప్రతి మనిషీ సాటి మనిషితో మంచిగా మెలగాలన్నది భగవంతుడు చెప్పాడని కాదు; ఇద్దరూ మనుషులే కాబట్టి ఆ సద్భావం అవసరం అన్న సత్యాన్ని ప్రజలు గ్రహించారు.

ఆ కాలంలో ఖగోళ శాస్త్రంలో సాధించిన ప్రగతిని పునరుజ్జీవన యుగపుటాలోచనకి నిదర్శనంగా పేర్కొనవచ్చు. 15వ శతాబ్దంలో కోపర్నికస్ అనే పోలిష్ తత్వవేత్త ఒక నూతన విప్లవాత్మక సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఈ విశ్వాంత రాళానికి సూర్యుడు కేంద్ర బిందువనీ, భూమి ఇంకా తదితర గ్రహాలు సూర్యుని చుట్టూ తిరుగుతాయనీ నిరూపించటానికి విశేషంగా కృషి చేశాడు. అప్పటి దాకా క్రైస్తవ మత పీఠం ఈ భూమిని భగవంతుడు సృష్టించాడనీ, అఖిల విశ్వానికి భూమి కేంద్రం అనీ నూరిపోస్తూ వచ్చింది దానికి విరుద్ధంగా కోపర్నికస్ సశాస్త్రీయంగా ఒక సిద్ధాంతం ప్రతిపాదించాడు; కాబట్టి, ఆ సిద్ధాంతం విప్లవాత్మకంగా భావించబడింది. అప్పటికి ఎన్నో శతాబ్దాల కిందట భారతదేశంలో ఆర్యభట్ట ప్రతిపాదించిన విధంగానే కోపర్నికస్ తన సిద్ధాంతాన్ని గణితశాస్త్ర సంబంధమైన లెక్కల ప్రాతిపదిక మీద రుజువు చెయ్యటానికి ప్రయత్నించాడు. ఆ మాటకొస్తే, క్రీ. శ. 7వ శతాబ్దంలోనే గెలీలియో అనే ఇటలీ ఖగోళ శాస్త్రజ్ఞుడు, విజ్ఞాన శాస్త్రవేత్త ఇదే విషయాన్ని నిరూపించి చూపాడు. అయితే, ఆయన తన ప్రతిపాదనని కేవలం సిద్ధాంతపరమైన లెక్కల మీద ఆధారపడి చెయ్యలేదు. పరిశీలన, ప్రయోగం అనే ప్రక్రియని ఆధారం చేసుకున్నాడు. అప్పుడే కనిపెట్టబడ్డ టెలిస్కోప్ (దూరదర్శిని) ద్వారా ఆయన సూర్యుణ్ని, ఇతర గ్రహాల్ని పరిశీలించి ఒక నిర్ణయానికి వచ్చాడు. గెలీలియో కృషి చాలా మహత్తరమైంది. ఆయన తన సిద్ధాంత నిరూపణకు ఒక శాస్త్రీయ పద్ధతిని అనుసరించాడు. అంతేకాదు; క్రైస్తవ మత పీఠాలు బోధిస్తూ వచ్చిన సిద్ధాంతం తప్పని చర్చి అధికారాన్ని సవాలు చేశాడు. ఫలితంగా, ఆయన క్రైస్తవ చర్చి ఆగ్రహానికి గురయ్యాడు. తన సిద్ధాంతం తప్పని చెప్పమని చర్చి ఆయన్ని నిర్బంధించింది. ఏమైతేనేం, ఆయన తన పరిశీలన ద్వారా, ప్రయోగాల ద్వారా సాధించిన విజ్ఞానం యూరప్‌లో అనేక ఇతర దేశాలకు పాకింది; విజ్ఞాన శాస్త్రరంగంలో అనేక నూతన విషయాలు కనిపెట్టటానికి దోహదం చేసింది.

ఇదంతా ఏదో హడావిడిగా జరిగిపోలేదు. పునరుజ్జీవన ఉద్యమం యూరప్‌లో నలుచెరగులకు పాకి ప్రజల, పండితుల ఆలోచనా విధానాన్ని ప్రభావితం చెయ్యటానికి కనీసం రెండు వందల యేళ్ళు

పట్టింది. ఇటలీ పట్టణాల్లో మొట్టమొదట ప్రారంభమై నెమ్మదిగా ఐరోపాలోని తదితర దేశాలకు- ముఖ్యంగా ఫ్రాన్సు, హాలెండు, బెల్జియం, ఇంగ్లండ్ దేశాలలోని పట్టణాలకు పాకిపోయింది. పట్టణాల్లో వర్తక వర్గాలు చర్చి విపరీతాధిపత్యాన్ని సిరసించాయి, తమ మీద కూడా పన్నులు విధించటానికి ప్రయత్నం చేసే ఫ్యూడల్ ప్రభువుల్తో వాళ్ళకి సమైక్య లేదు. కాబట్టి చర్చి అధికారాన్ని, ఫ్యూడల్ ప్రభువుల పెత్తనాన్ని సవాలు చేసిన వర్తక వర్గాల్లో పునరుజ్జీవన ఉద్యమం తాలూకు కొత్త ఆలోచనలు ముసురుకున్నాయి.

ఈ నవ యుగోదయానికి సంకేతంగా పరిగణింపబడ్డ వ్యక్తి, లియొనార్డోడావిన్సీ. ఆయన ఆలోచనలు ఈ ఉద్యమ ప్రభావాన్ని ప్రతిబింబిస్తాయి ఆయన 1452-1519 సంవత్సరాల మధ్య ఇటలీలో జీవించాడు, వృత్తిరీత్యా చిత్రకారుడు సహజ ప్రతిభావంతుడైన కళాకారుడు శైలి, వర్ణ విన్యాసాల్ని ఎంత చక్కగా ఆకళించుకున్నాడో ఆయన చిత్రరువుల్ని చూస్తే తెలుస్తుంది. ఆయన కళాకారుడే కాదు, శాస్త్రజ్ఞుడు కూడా. ఉదాహరణకి- పనిలో నిమగ్నులైన మనుషుల్ని కాన్వాసు మీదికెక్కించినప్పుడు, ఆయన మొట్టమొదట శరీరంలోని కండరాల్ని, కదలిక మీద వాటి ప్రభావాన్ని అధ్యయనం చేశాడు. విజ్ఞాన శాస్త్రంలో ఆయనకున్న శ్రద్ధాసక్తులు అనేక కొత్త కొత్త యంత్రాల్ని కనిపెట్టటానికి పురికొల్పాయి. ఎగిరే యంత్రాన్ని కనిపెట్టటానికి ఆయన చేసిన ప్రయత్నం ఆయన ప్రయోగాలన్నింట్లో మహా ఉత్తేజకరమైంది. ఈ ప్రపంచంలో మనుషులందరూ ఎగిరే పక్షుల్ని చూస్తూనే ఉన్నారు, తాము కూడా అలా ఎగరగలిగితే బాగుణ్ణు అనుకుంటారు. ఆకాశంలోకి ఎగర గలిగితే కలిగే ఆనందానుభూతి మీద కవులనేక మంది కవితలల్లారు; ఊహాలోకాల్లో తేలిపోయారు. గాలిలో తేలిపోయే రథాల్ని వర్ణించిన వాళ్లూ కొందరున్నారు మనిషి ఎగరగలగడాన్ని గురించి లియొనార్డో కేవలం ఊహల్తో సంతృప్తిపడలేదు ఆనాడు అందుబాటైన సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగించుకుని మనిషిని ఆకాశంలో విహరింపజేసే యంత్రాన్ని కనిపెట్టటానికి ఆయన ప్రయత్నం చేశాడు. ఆ యంత్రాన్ని గురించి చేసిన వివరణాత్మక వర్ణన, గీసిన పటాలు చూస్తే ఆయనది ఎంత గొప్ప శాస్త్రీయమైన బుర్రో మనకు అర్థమవుతుంది.

*అపూర్వమైన కొత్త విషయాలు కనిపెట్టబడ్డ యుగం :* పునరుజ్జీవన ఉద్యమ భావాలు యూరప్‌లో ప్రతి పట్టణానికీ పాకిపోయాయి. యూరప్‌లో ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి వ్యాపారం నిమిత్తం పర్యటించే వర్తకులు ఈ భావాల్ని అన్ని చోట్లా బట్వాడా చేశారు. వర్తకులకి ఈ కొత్త భావాల పట్ల ఆసక్తి ఉంది. కాబట్టి వాళ్ళు శాస్త్రజ్ఞులతో చేయి చేయి కలిపి పరస్పరం సహకారం నెరపుకునే సమయం రానున్నది. 1453 లో ఒట్టోమన్ టర్కులు తూర్పు యూరప్ ముఖ్య పట్టణమైన కాన్‌స్టాంటినోపిల్‌ని వశపర్చుకున్నారు. పశ్చిమాసియాలో విశాల భూభాగం అప్పటికే టర్కుల చేతుల్లో ఉంది. ఇప్పుడు కాన్‌స్టాంటినోపిల్‌ని పట్టుకోవటంతో యూరప్‌కి పెద్ద దెబ్బ తగిలింది. ఎంచేతనంటే, ఆసియా ఖండంతో సాగే వ్యాపార వాణిజ్యాలు సమస్తం ఈ ప్రాంతం గుండా జరగవలసిందే. ఆసియా వ్యాపారంతో ఐరోపాకు తెగతెంపులయ్యింది. కాబట్టి, ఆసియాకు, భారతదేశానికి కొత్త వర్తక మార్గాన్ని కనిపెట్టటం యూరప్ వర్తకులకు అనివార్యమైంది.

రెండు కారణాల వల్ల యూరప్ ఖండం ఆసియాతో వర్తక వాణిజ్యాలు కొనసాగించవలసి వచ్చింది. ఒకటి- నిత్యం తినే తిండికి అవసరమైన మిరియం వంటి మసాలా దినుసులు ఆసియా నుంచి

రావాలి; పైగా, మాంసం నిలవజేసుకోటానికి కూడా ఈ దినుసులు అవసరం. ఉత్తర యూరప్‌లో గడ్డ కట్టించే భీకర శీతకాలాలలో ప్రజలు ఈ దినుసుల్తో నిలవ వుంచుకున్న మాంసం భుజిస్తారు. ఆసియా సుగంధ ద్రవ్యాల వర్తకం యావత్తు ఆనాడు అరబ్బు వర్తకుల చేతుల్లో బిగిసిపోయివుంది. ఆసియా దేశాల నుంచి తెచ్చిన సుగంధ ద్రవ్యాల్ని అరబ్బు వర్తకులు పశ్చిమాసియా మార్కెట్లలో ఇటలీ వర్తకులకు అమ్మి అపార లాభాలు ఆర్జించారు. ఇటలీ వర్తకులు ఆ సరుకుని తిరిగి ఇతర యూరప్ దేశాలకు అమ్మి లాభాలు చేసుకుంటున్నారు. కాన్‌స్టాంటినోపిల్ పతనంతో ఈ వ్యాపారానికి చెడ్డ అంతరాయం వచ్చిపడింది రెండు—యూరప్‌లో అనేక పట్టణాలు ఆసియాతో సాగే వ్యాపారం మీద ఆధారపడి వున్నాయి. ఇప్పుడా వ్యాపారం ఆగిపోతే, ఇక ఆ పట్టణాలకి భవిష్యత్తు లేదు. అంచేత, ఈ పట్టణాల్లోని సంపన్న వర్తకులంతా కలిసి ఆసియాతో వ్యాపారం మూతపడకుండా కొనసాగే కొత్త మార్గం కనిపెట్టే ప్రయత్నానికి ఎంత డబ్బయినా కుమ్మరించటానికి సిద్ధపడ్డారు.

యూరప్, ఆసియాల పటం గనుక చూసినట్లయితే, యూరప్ నుంచి ఆసియాకు అతి సుకరమైన భూమార్గం పశ్చిమాసియా గుండా ఉన్నట్టు స్పష్టంగా కనబడుతుంది. మరి, అప్పుడా భూమార్గం మూసుకుపోయింది. ఇక యూరప్‌కి మిగిలిన ప్రత్యామ్నాయం, సముద్ర మార్గం ఒక్కటే కాని, ఆ రోజుల్లో ఆఫ్రికా గురించి (ఉత్తర భాగం మినహాయించి) బొత్తిగా తెలియదు. ఉత్తర, దక్షిణ అమెరికాల గురించి అంతకన్నా ఏమీ తెలియదు పునరుజ్జీవన యుగ శాస్త్రజ్ఞులు యూరప్ వర్తకుల కోసం భారత దేశానికి సముద్ర మార్గం కనిపెట్టే ప్రయత్నంలో ఆసక్తి ప్రదర్శించారు. యూరప్‌లో వివిధ రేవుల నుంచి భారత దేశానికి కొత్త సముద్ర మార్గం అన్వేషించటానికి వివిధ దిశలలో ఓడలు బయలుదేరటంతో నూతన విషయాన్వేషణా యుగానికి నాంది ప్రస్తావన జరిగింది

ఈ రంగంలో పోర్చుగీసులు మొట్టమొదటి వాళ్ళు. 1488లో బార్తలోమే డయాజ్ అనే పోర్చుగీసు నావికుడు ఆఫ్రికా పడమటి తీరం వెంట దిగువకు ప్రయాణం చేసి ఆఫ్రికా దక్షిణ కొన కేప్ ఆఫ్ గుడ్ హోప్ (గుడ్‌హోప్ అగ్రం) చేరాడు. ఆ తరువాత పదేళ్ళకు వాస్కోడిగామా అదే మార్గంలో ప్రయాణం చేసి గుడ్‌హోప్ అగ్రం చుట్టి తూర్పు ఆఫ్రికా కోస్తా వెంట ముందుకు కొనసాగి అరేబియా సముద్రం దాటి భారతదేశ పశ్చిమ తీరం చేరుకున్నాడు. ఇది 1498లో జరిగింది. ఒక అరబ్బు నావికుని సహాయంతో భారతదేశానికి సముద్ర మార్గాన్ని కనుగొన్న పోర్చుగీసులు అరబ్బు వ్యాపార స్థావరాల మీద దాడి చేసి అరబ్బు వ్యాపారాన్ని గుంజుకున్నారు. ఆసియా నుంచి సుగంధ ద్రవ్యాల్ని ఐరోపాకి సరఫరా చేసి విపరీత లాభాలు సంపాదించారు

స్పెయిన్ దేశస్థులు పోర్చుగీసులకు తీసిపోలేదు స్పెయిన్ రాజు సముద్ర మార్గాన్వేషణకు భారీ నిధులు సమకూర్చాడు. చరిత్ర ప్రసిద్ధుడైన క్రిస్టొఫర్ కొలంబస్ నాయకత్వాన స్పానిష్ నావికా బృందం బయల్దేరింది స్పెయిన్ నుంచి పశ్చిమాభిముఖంగా ప్రయాణిస్తే సరాసరి ఆసియాలో దిగవచ్చని అనుకున్నాడు కొలంబస్. అమెరికా ఖండం అంటూ ఒకటున్నదని ఆనాటికింకా ప్రపంచానికి తెలీదు. కొలంబస్ తను అనుకున్న ప్రకారం పశ్చిమంగా ప్రయాణం చేసి వెస్ట్ ఇండీస్ చేరాడు. ఆ దీవులు భారతదేశంలో ఒక భాగం అనుకున్నాడు. అందుకే కొలంబస్ వాటికి పడమటి ఇండియా దీవులని పేరు

పెట్టాడు. ఇది 1492లో జరిగింది. ఆ తరువాత అయిదేళ్ళకి, అంటే 1497లో అమెరిగో Vespucci అనే నావికుడు అమెరికా చేరుకున్నాడు. అప్పటికి ఆనాటి భూగోళ శాస్త్రజ్ఞులు అమెరిగో చేరింది అమెరికాయే గాని ఆసియా కాదని తెలుసుకున్నారు. (అమెరిగో కనిపెట్టాడు కాబట్టి ఆ భూభాగాన్ని అమెరికా అన్నారు) చిట్ట చివరికి, అమెరికా ఖండం యొక్క ఉనికి 1519 లో రుజువయింది. అంటే, మాగెలాన్ ప్రపంచాన్ని చుట్టివచ్చినప్పుడన్నమాట. స్పెయిన్ దేశస్థులు భారతదేశానికి సముద్ర మార్గాన్ని కనిపెట్టలేక పోయారు కాబట్టి ఆసియా వ్యాపారంలో డబ్బు చేసుకోలేకపోయారు. అయితే, అమెరికా ఖండంలో వాళ్ళు రెండు మహా నాగరికతల్ని కనుక్కున్నారు. ఒకటి - మెక్సికోలో అజ్టెక్ జాతి నాగరికత; రెండవది - పెరూ దేశంలో ఇన్కాస్ నాగరికత. స్పెయిన్ నావికులకు అక్కడ విస్తారంగా వెండి, బంగారాలు, విలువైన రాళ్ళు లభించాయి ఆ అపార సంపదని చూసి ఆశ పుట్టి స్పెయిన్ వాళ్ళు మెక్సికో, పెరూ దేశాల్ని జయించి, ఆ మహా నాగరికతల్ని ధ్వంసం చేసి అక్కడున్న వెండి బంగారాల్ని స్పెయిన్ దేశానికి తరలించుకు పోయారు. కొల్లగొట్టుకు వచ్చిన వెండి బంగారాలతో స్పెయిన్ కోట్లకు పడగెత్తింది.

నూతన సీమల, వర్తక మార్గాల అన్వేషణలో శాస్త్రజ్ఞులు యూరప్ వర్తకులకు ఏ విధంగా సహాయపడ్డారు ? ప్రపంచంలో కొత్త దేశాల్ని యింత వేగిరం కనుక్కోటానికి మార్గాన్ని సులభతరం చేసిన అంశాలు రెండు. ఒకటి, భౌగోళిక విజ్ఞానం; రెండు, శాస్త్రీయ పద్ధతులు. ఈ రెంటి మేలు కలయిక సత్వర సత్ఫలితాలు కలిగించింది. మొట్టమొదట భూగోళ పటాల్ని మెరుగు పర్చుకున్నారు. అప్పటి వరకు గ్రీకు, రోమన్ కాలాలనుంచి వస్తున్న ప్రపంచ పటాల్ని యూరప్ నావికులు ఉపయోగించేవాళ్ళు. ఇప్పుడు ఒక్కొక్క నౌక ఒక కొత్తదేశం వెళ్ళి తిరిగి రాగానే, నావికులు అందజేసిన సరికొత్త సమాచారంతో భూగోళ శాస్త్రజ్ఞులు ప్రపంచ పటాల్ని సరిదిద్దారు. రెండు- అనేక కొత్త పరికరాల్ని ఉపయోగించారు; కొత్త సాంకేతిక పద్ధతుల మీద ప్రయోగాలు జరిపారు. తద్వారా నౌకాయాన విజ్ఞానం మెరుగు పడింది. యూరోపియన్లు అరబ్బులనుంచి సేకరించిన రెండు పరికరాల మీద అదే పనిగా పరీక్షలు, ఎదురు పరీక్షలు జరిపి వాటిని నిర్దుష్టంగా తీర్చిదిద్దారు. ఎస్ట్రోలాబ్, క్వాడ్రంట్ అని పిలవబడే ఆ రెండు పరికరాలు ఒక స్థలం యొక్క అక్షాంశాన్ని (నిరక్ష రేఖ నుంచి ఒక ప్రదేశానికి గల కోణీయ దూరం) కొలవటానికి ఉపయోగపడ్డాయి. ఒక మహా సముద్రం మధ్యలో ప్రయాణం చేస్తున్న ఓడ సముద్రంలో తప్పిపోతుందనే భయం లేదు. ఎంచేతనంటే అది భూమికి ఎంత దూరంలోవున్నదీ, ఏ అక్షాంశ రేఖమీద ఉన్నదీ సులువుగా తెలుస్తుంది. ఈ రెండు పరికరాల్ని ఉపయోగించక పూర్వం నావికులు చుక్కలకేసి చూపులు నిగిడ్చి తాము ప్రయాణం చేసే దిశని తెలుసుకునే వాళ్ళు. నౌకా దిక్సూచిని కనిపెట్టటంతో సముద్రంలో తప్పిపోతామనే భయం యింకా తగ్గిపోయింది. తీర రేఖని అంటిపెట్టుకుని రవ్వంత దూరంలో ప్రయాణం చేసే దురవస్థ ఇప్పుడు లేదు. మహాసముద్ర మధ్యంలో కూడా నిర్భయంగా నౌకాయానం చేసే పరిస్థితి సానుకూలమయింది. తద్వారా ఒక చోటు నుంచి మరొక చోటుకి వేగం చేరగలిగే వీలు చిక్కింది. వర్తకులకు రవాణా ఖర్చు తగ్గింది. పోర్చుగీసులు రకరకాల తెరచాపలమీద ప్రయోగాలు జరిపారు. చివరికి, గాలి వాలుకి అనుకూలంగా ఒక వేపు నుంచి మరో వేపుకి తేలికగా మార్చుకో వీలున్న తెరచాపల్ని కనిపెట్టారు. అంటే, మహాసముద్రం మీద వీచే గాలుల్ని తమకు అనుకూలమైన దిశలో తిప్పుకోటానికి ఆ తెరచాపల

ద్వారా వీలయిందని అర్థం. ఆ విధంగా, ఓడ వేగం కూడా పెరిగింది. ఓడలమీద మేలు రకపు తుపాకుల్ని అమర్చుకున్నది కూడా పోర్చుగీసులే. దాంతో పోర్చుగీసుల యుద్ధ పటిమ పెంపొందింది భారతదేశంలో స్థానిక కోస్తా ప్రజలకు వ్యతిరేకంగా పోర్చుగీసులు విజయవంతంగా యుద్ధాలు నడపగలగడానికిది కొంత వరకు కారణం. వాళ్ళు ఒక్కొక్క ఓడ రేవుమీద మొదట గుండ్ల వర్షం కురిపించి, సముద్రం లోపలికి తప్పుకుపోయేవాళ్ళు. రేవు పట్టణంలో స్థానిక సైన్యం చిన్నా భిన్నం కాగానే, వాళ్ళు తీరం చేరుకుని చితికి పోయిన స్థానిక సేనని చిత్తుగా ఓడించి వేసే వాళ్ళు.

పండితులు, శాస్త్రవేత్తల్నూ తమ ప్రయోగాలతో గాని, కొత్తవి కనిపెట్టటంలో గాని విజయం సాధించారంటే, అది కేవలం పుస్తకాల్లో నిక్షిప్తమైన విజ్ఞానాన్ని వినియోగించుకుని కాదు; వాళ్ళు యంత్రాల్ని, పరికరాల్ని ప్రత్యక్షంగా పరిశీలించి వాటిని తయారుచేసిన వృత్తి పనివారిని సంప్రదించి వాళ్ళతో కలిసి సంయుక్తంగా కృషిచెయ్యడం ద్వారా తమ ప్రయత్నంలో కృతకృత్యులయ్యారు.

పోర్చుగల్, స్పెయిన్ దేశాలు ఆ విధంగా ఆసియాకు కొత్తవర్తక మార్గాలు కనిపెట్టటానికి, ప్రపంచంలో తదితర దేశాలతో వ్యాపార సంబంధాలు పెట్టుకోటానికి, సముద్రాంతర రాజ్యాలు నెలకొల్పు కోటానికి వేట ప్రారంభించాయి. వాటితో పాటు యూరప్‌లో హాలెండ్, బెల్జియం, ఫ్రాన్సు, ఇంగ్లండు, డెన్మార్కు వంటి దేశాలు కూడా ఈ కార్యక్రమంలో పోటీకి దిగాయి. అయితే ఈ దేశాలు పోర్చుగల్, స్పెయిన్‌ల కన్నా కొంత ఆలస్యంగా రంగంలో దిగాయి. పోర్చుగల్, స్పెయిన్ దేశాల ప్రాముఖ్యం కొంత తగ్గుముఖం పట్టటంతో హాలెండ్, ఇంగ్లండ్ వగైరా దేశాల ప్రాధాన్యం బాగా పెరిగిపోయింది. ఇది 17-18 శతాబ్దాలలో సంభవించింది.

*మత సంస్కరణ - సంస్కరణ వ్యతిరేక ఉద్యమాలు :* అపూర్వమైన నూతన విషయాలనేకం కనిపెట్టబడ్డ ఈ యుగంలో పోర్చుగల్, స్పెయిన్ దేశాల క్షీణదశ, తదితర యూరప్ దేశాల ప్రగతి సంభవించటానికి యూరప్ మత విషయకమైన నేపథ్యంలో చోటు చేసుకున్న మార్పులు కొంతవరకు కారణం అంధ యుగం ఆరంభమై, తిరిగి పునరుజ్జీవన ఉద్యమం వికసించేదాకా యూరప్‌ని క్రైస్తవ మతం ఏలింది. అప్పటి దాకా క్రైస్తవ మతంలో రెండు శాఖలు మాత్రమే ఉండేవి. ఒకటి- రోమన్ కాథలిక్ చర్చి; రెండవది- సనాతన గ్రీకు చర్చి సనాతన గ్రీకు చర్చికి కాన్‌స్టాంటినోపిల్ కేంద్రం. తాము ఇచ్చిందే సనాతన, సంప్రదాయబద్ధ క్రైస్తవ మత వివరణం అని గ్రీకు చర్చి వాదించింది. రోమన్ కాథలిక్కులకు రోమ్ కేంద్రం. వీరి క్రైస్తవం సనాతన గ్రీకు చర్చి తరువాత చాలా కాలానికి వచ్చినటు వంటిది అయితే ఉత్తర, పశ్చిమ ఐరోపా అంతటా రోమన్ కాథలిక్ క్రైస్తవమే ఆమోదనీయమైంది. రోమన్ కాథలిక్ చర్చికి పెద్ద "పోప్" (పోప్ అంటే తండ్రి అని అర్థం). మధ్య యుగంలో మత, రాజకీయ వ్యవహారాలలో పోప్‌కి ఎదురు లేదు. ఆయన అధికారాన్ని సవాల్‌చేసే శక్తి ఎవ్వరికీ లేదు. పునరుజ్జీవన ఉద్యమం ప్రజల ఆలోచనా విధానాన్ని ప్రభావితం చేసే నాటికి ఉన్న పరిస్థితి ఇదీ.

ఆనాడు కాథలిక్ చర్చి ఆమోదించని అనేక భావాల్ని పునరుజ్జీవన ఉద్యమానికి చెందిన మేధావులు దృఢంగా ప్రచారం చేశారు ఉదాహరణకి- జ్ఞానమన్నది కేవలం పుస్తకాలలో రాసి పెట్టిన దాంట్లోనూ, లేదా మతాధిపతులు చెప్పే ఆలోచనల్లోనూ లేదు, సామాన్య మానవుల పరిశీలనలు, ఆలోచనల్లో కూడా

జ్ఞాన వికాసం కలుగుతుంది అని మేధావులు వాదించారు. మనిషి కేవలం ఒక్క భగవంతుణ్ణి గురించి మాత్రమే కాకుండా సాటి మనుషుల్ని గురించి కూడా విచారించాలని వాళ్ళు చాటారు. దీనికి తోడు కొత్త కొత్త విషయాలనేకం కనిపెట్టబడ్డాయి— కొత్త విజ్ఞానం అబ్బింది. పునరుజ్జీవన ఉద్యమ మేధావులకు తమ స్వంత ఆలోచనలమీద, ఆచరణ మీద గురి కుదిరింది. క్రమేణా చర్చి అధికారాన్ని, పోప్ పెత్తనాన్ని ధిక్కరించటం ప్రారంభమైంది. మతంతో బొత్తిగా ప్రమేయం లేని రాజకీయాలు లాంటి లౌకిక విషయాల్లో చర్చి జోక్యానికి ప్రజలు అభ్యంతరం చెప్పారు. ప్రజల నుంచి చర్చి నానా రకాల పన్నుల్ని వసూలు చేసుకోవటం పట్ల వ్యతిరేకత ప్రబలింది. ఒకవేపు, ప్రజల నుంచి పన్నులు వసూలవుతున్నాయి. మరోవేపు, ప్రభుత్వం భూములు మంజూరుచేసింది కాబట్టి, మతాధికారులు విలాసవంతమైన జీవితం గడిపారు. ఏసుక్రీస్తు బోధించిన నియమాలకిది విరుద్ధం. దీంతో రోమన్ కాథలిక్ చర్చిపట్ల వ్యతిరేకత మరింత బలపడింది. అనేక మంది క్రైస్తవులు కాథలిక్ చర్చితో తెగతెంపులు చేసుకున్నారు. మార్టిన్ లూథర్, ఇరాస్మస్, జాన్ కాల్విన్ మొదలైన క్రైస్తవమత ధర్మజ్ఞులు రోమన్ కాథలిక్ చర్చిని నిరసించారు. 16 వ శతాబ్ది ప్రారంభంలో కాథలిక్ చర్చిలో వచ్చిన ఈ చీలిక ఒక కొత్త క్రైస్తవ సంఘం అవతరణకు దారి తీసింది. ఈ అసమ్మతి వర్గమే ప్రొటెస్టంటులు; అంటే రోమన్ కాథలిక్ చర్చిని ప్రతిఘటించే వారని అర్థం. ఉభయ పక్షాలమధ్య ఘోర యుద్ధాలు సాగిన కారణంగా ఈ చీలిక నెత్తురు పేర్లు పారించింది.

ఉత్తర ఐరోపా నగరాల్లోని వ్యాపార వర్గాలు ఈ ప్రతిఘటనోద్యమాన్ని అభిమానించి బల పర్చారు. ప్రొటెస్టంటులు చర్చి అధికారాన్ని సవాలు వెయ్యటం చేత, జిజ్ఞాసకు అనుకూలమైన చైతన్యాన్ని ప్రోత్సహించటం చేత, మనిషి వ్యక్తిగత ప్రాధాన్యాన్ని నొక్కి చెప్పటం చేత సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమ భావాలకు వాళ్ళు ప్రతికూలురు కాదు. ఉత్తర ఐరోపా దేశాల్లో ఇంగ్లండు, హాలెండు, నార్వే, స్వీడన్ మొదలైనవి కాథలిక్ చర్చినుంచి విడిపోయి ప్రొటెస్టంటు మతాన్ని స్వీకరించాయి. ఫ్రాన్సు రెండు శిబిరాలుగా చీలిపోయింది వ్యాపార వర్గాలు శాస్త్రజ్ఞుల పరిశోధనా ఫలితాలను వినియోగించుకున్నది ఈ ఈ దేశాలలోనే; నూతన చింతన మునుముందుకు సాగింది ఈ దేశాలలోనే.

ఒక వేపు, ఉత్తర ఐరోపాలో మతసంస్కరణోద్యమం వికసిస్తే మరోవేపు దక్షిణ ఐరోపా కాథలిక్ దేశాలలో సంస్కరణ వ్యతిరేకోద్యమం వీచింది. ఈ ఉద్యమానికి స్పెయిన్ దేశపు కాథలిక్కులు నాయకత్వం వహించారు. కాథలిక్ మతాన్ని సంస్కరించే ప్రయత్నాలు సాగాయి. ఉదాహరణకు సొసైటీ ఆఫ్ జీసస్ (జీసస్ సంఘం) స్థాపించబడింది ఈ సంఘ సభ్యుల్ని జెసూట్లు అంటారు. ఈ సంఘంలో సుప్రసిద్ధుడు ఫ్రాన్సిస్ జేవియర్. ఈయన అనేక సంవత్సరాలు భారతదేశంలో పనిచేసి, చివరికి ఇక్కడే చనిపోయాడు. కాని, కాథలిక్ క్రైస్తవ చర్చి సంస్కరణని వ్యతిరేకించింది. పైగా, మరింత సాంప్రదాయకంగా తయారయింది. చర్చికి వ్యతిరేకంగా పల్లెత్తు విమర్శ చేసిన వాళ్ళని విచారణకి నిలబెట్టి శిక్షలు వడ్డించారు; చర్చిని విమర్శించే సాహసానికి పూనుకున్నవాళ్ళని ఎక్కువగా సజీవదహనం చేసేశారు. ఈ విచారణలని "ఇంక్విజిషన్" అన్నారు; అంటే మత నియమ భంగం చేసిన వాళ్ళని విచారించే క్రైస్తవ న్యాయసభ అని అర్థం. నూతనఆలోచనలకి తావు లేకుండాపోయింది. మేధోవికాసానికి క్షీణదశ ప్రాప్తించింది.

దీనికి విరుద్ధంగా ఉత్తర ఐరోపా దేశాల్లో వేరే దృశ్యం గోచరించింది. కాథలిక్ చర్చి ఆస్తి

పాస్తుల్ని ప్రభుత్వం వశపర్చుకుంది. ప్రజలనుండి వసూలైన పన్నులు రాజుగారి ఖజానా చేరాయి. వర్తకుల వ్యాపార కార్యకలాపాలకు ప్రోత్సాహం లభించింది. వ్యాపార వాణిజ్యాల మూలంగా బోలెడు ఆదాయం వచ్చింది. అవసరం కలిగిన సందర్భాల్లో వర్తకులకు ప్రభుత్వ మద్ధతు లభించింది. ఆ విధంగా ఐరోప్లా - ఆసియాల నడుమ వర్తకం ద్వారా సంబంధాలు ప్రారంభమయ్యాయి. క్రమేణా ఆయా దేశాల ప్రభుత్వాలు సైతం ఈ రంగంలో తలదూర్చాయి. చిట్ట చివరికి, ఐరోపా దేశాలకు ఆసియా ఆఫ్రికా ఖండాల్లో వలసలు ఏర్పడ్డాయి.

*భారతదేశంలో పోర్చుగీసులు :* వ్యాపారం కోసం పోర్చుగీసులు ఈ దేశం వచ్చారు. అప్పటికే ఇక్కడ కాలూనిన అరబ్బు వర్తకుల మీద దాడి జరిపి, వాళ్ళ చేతుల్లోంచి సుగంధ ద్రవ్యాల వ్యాపారాన్ని గుంజుకోవటం పోర్చుగీసుల మొట్టమొదటి లక్ష్యం. దొంగతనానికి, దోపిడికి పాల్పడి వాళ్ళు తమ లక్ష్యం సాధించారు. సుగంధ ద్రవ్యాల వ్యాపారం నిలబెట్టుకోటానికి వాళ్ళకి పశ్చిమాసియాలో, భారత దేశంలో, ఇంకా పోను పోను ఆగ్నేయ ఆసియాలో సైతం నెలవులు (సెటిల్మెంట్స్) స్థాపించుకోవలసి వచ్చింది. తీరా ఆసియా దేశాల్లోకి కాలు పెట్టాక సుగంధ ద్రవ్యాల్లోనే కాకుండా నూలు బట్టలు వగైరా తదితర వస్తువుల వ్యాపారానికి కూడా ఎగబడ్డారు. అయితే, పోర్చుగీసులకు భారతదేశంలో స్థిరపడి పోవాలని లేదు. తాత్కాలిక నివాసం కోసం ఏర్పాటు చేసుకున్న నెలవుల్లో కొద్ది కాలం ఉండి తిరిగి స్వదేశం వెళ్ళిపోయేవాళ్ళు. భారీ లాభాలు ఆర్జించి పెట్టే వ్యాపార కేంద్రంగా మాత్రమే భారత దేశం మీద వాళ్ళకి ఆసక్తి ఉండేది.

వాళ్ళు ఆసక్తి ప్రదర్శించిన అంశం మరొకటి కూడా ఉంది. అది మతం మార్పిడి. వీలైనంత పెద్ద సంఖ్యలో భారతీయుల్ని రోమన్ కాథలిక్ మతంలోకి మార్చటానికి వాళ్ళు పూనుకున్నారు. ఆనాడు భారత దేశంలో ఉన్న మతాల పట్ల వాళ్ళకి ఏవగింపు. కాబట్టి, ఈ దేశ ప్రజల్ని క్రైస్తవ మతంలోకి మార్చటానికి బలప్రయోగానికి కూడా వెనుదియ్యలేదు. ఆఖరికి, ఐరోపాలో సాగిన "ఇంక్విజిషన్"ని సైతం ఈ దేశంలోకి దించారు. క్రైస్తవం భారతదేశానికి కొత్తకాదు. ఐరోపాలో పోర్చుగీసులు క్రైస్తవ మతం స్వీకరించటానికి వందల యేళ్ళ ముందే ఈ దేశంలో సిరియన్ క్రైస్తవులున్నారు. వాళ్ళు ఈ దేశంలో ప్రప్రథమ క్రైస్తవులు. అనేక శతాబ్దాల పాటు వాళ్ళు ఈ దేశంలో శాంతియుతంగా జీవించారు. అయినా పోర్చుగీసులకి తృప్తి కలగలేదు. ఇంకా అనేక మందిని క్రైస్తవ మతంలోకి మార్చటానికి తమకు చేతనైనదంతా చేశారు.

*భారతదేశంలో మొఘలులు :* ఈ పరిణామానికి విరుద్ధంగా భారతదేశానికి మొఘలుల రాక పూర్తిగా తద్భిన్నమైన ఫలితాలను తెచ్చిపెట్టింది. మొఘలులు వ్యాపారం కోసం భారతదేశానికి రాలేదు. రాజ్యస్థాపన కోసం వాళ్ళు ఈ దేశంలో ప్రవేశించారు. వాళ్ళ లక్ష్యం నెరవేర్చుకున్నారు. పైగా, భారత దేశాన్ని స్వదేశంగా చేసుకున్నారు పోర్చుగీసులకు - మొఘలులకు మధ్య గల ముఖ్యమైన తేడా ఇది. వాళ్ళీ దేశంలో స్థిరపడిపోయారు, ఈ దేశ ప్రజల్లో కలగలిసి పోయారు. ఈ దేశ ప్రయోజనాల కోసం ఆర్తి చెందారు. భారతీయుల్ని అధిక సంఖ్యలో తమ మతంలోకి మార్చటానికి వాళ్ళు అట్టే ఆసక్తి చూపలేదు. అప్పటికే భారతదేశంలో అనేకమంది ముస్లిములున్నారు. ఒక్క ఔరంగజేబును మినహాయిస్తే మిగిలిన మొఘల్ పాదుషాలందరూ మత సహనం ప్రదర్శించారు. దాదాపు యావత్ భారత దేశంతో కలిపి ఒక మహాశక్తివంతమైన సామ్రాజ్య నిర్మాణాన్ని మొఘల్ పరిపాలన పరిపూర్తి చేసింది. భారత దేశం మరొక సారి నాగరికతా ప్రాభవాన్ని చవి చూసింది ఆ నాగరికతా యుగానికి అక్బర్ సామ్రాట్టు ప్రతీక.

# 7
# అక్బర్

1556లో తండ్రి హుమాయూన్ మరణించడం వల్ల, తను రాజుగా ప్రకటింపబడే నాటికి అక్బర్ వయస్సు 13 సంవత్సరాలు! ఆ చిరుత వయస్సులో అతని భుజాల మీద ఒక గురుతరమైన బాధ్యత పడింది అతనికింకా పావురాళ్ళు ఎగరవేయటమన్నా, చిరుతల్ని వేటాడ్డమన్నా సరదా తీరని ప్రాయం. పుస్తకాలతో కుస్తీపట్టే చదువు మీద అతనికి మనస్సు కుదరలేదు అయితే, అతని జ్ఞాపకశక్తి అమోఘం ఎవరైనా చదువుతూ ఉంటే వింటూ మనస్సుకు పట్టించుకోవటమంటే అతని కిష్టం. అతడు చాలా చిన్నవాడు కావటం చేత బైరాంఖాన్ సంరక్షకుడయ్యాడు; రాజ్య వ్యవహారాలు చక్కబెట్టే బాధ్యత స్వీకరించాడు. అక్బర్ పెద్దవాడై స్వయంగా పాలనా భారం వహించేదాకా ప్రభుత్వం, పరిపాలన, యుద్ధాలు వగైరా వ్యవహారాలన్నీ బైరాంఖాన్ చేతుల మీదుగా సాగాయి

ఉత్తర భారత దేశంలో మొఘలుల అధికారాన్ని గట్టిపరిచే చర్యలు తీసుకునే అవకాశం లేకుండానే హుమాయూన్ అకాల మరణం చెందాడు ఆ కర్తవ్యం అక్బర్ పరిపూర్తి చేయాల్సి వచ్చింది బీహార్‌ని పరిపాలించే ఆదిల్‌షా సూర్‌కు ప్రధాన మంత్రిగా వున్న హేమూతో మొట్టమొదటి సంఘర్షణ ప్రారంభమైంది. బైరాంఖాన్-హేమూల మధ్య మరో పానిపట్టు యుద్ధం ప్రజ్వరిల్లింది. హేమూ ఓడిపోయి, బందీగా పట్టుబడి ప్రాణాలు కోల్పోయాడు మునుపు మొఘలులు కోల్పోయిన ఢిల్లీ, ఆగ్రాల్ని అక్బర్ పునరాక్రమించుకున్నాడు. తిరిగి మరొక సారి మొఘల్ అధికారం ఉత్తర భారత దేశంలో పునః స్థాపితమైంది. యుక్త వయస్సు వచ్చాక అక్బర్ తన సంరక్షకుడైన బైరాంఖాన్ రాజ ప్రాతినిధ్యాన్ని తొలగించి తానే రాజ్యాధికారాన్ని చేతుల్లోకి తెచ్చుకున్నాడు ఢిల్లీ, ఆగ్రాలలో తన అధికారాన్ని దృఢపర్చుకున్న అక్బర్ మొఘల్ అధికారాన్ని దేశంలోని ఇతర ప్రాంతాలకు విస్తరింపజెయ్యటానికి సంకల్పించాడు. గ్వాలియర్, అజ్మీర్, జాన్‌పూర్ మొదలైన ప్రముఖ పట్టణాల్ని, కోటల్ని జయించాడు. మాళవ రాజ్యాన్ని వశపర్చుకున్నాడు మాళవను జయించటంతో అక్బర్ రాజపుత్ర రాజ్యాల దరిదాపులకు చేరాడు.

అక్బర్ రాజపుత్రులతో మైత్రి పెంపొందించుకోవాలని తహతహ లాడాడు. వివిధ రాజపుత్ర రాచకుటుంబాలతో వైవాహిక సంబంధాలు కుదుర్చుకోవటం ద్వారా ఆయన ప్రయత్నం కొంతవరకు నెరవేరింది. తను స్వయంగా పలువురు రజపుత్ర కన్యల్ని పెళ్లాడాడు. రాజపుత్రులతో వియ్యము, నెయ్యము

ఆయన స్థానాన్ని మరింత పటిష్టం చేశాయి. పరిపాలనా యంత్రాంగంలో రాజపుత్రులకు ఉన్నత పదవు లిచ్చాడు. అక్బర్‌కు అతి ముఖ్యులు, విశ్వాస పాత్రులు అయిన అధికార్లలో, సలహాదార్లలో రాజామాన్‌సింగ్ వంటి రాజపుత్రులున్నారు. అయితే, తనని ప్రతిఘటించిన రాణాప్రతాప్ వంటి రసపుత్ర రాజులతో యుద్ధాలు చెయ్యక తప్పలేదు. రాజస్థాన్‌లో అత్యంత బలమైన గిరి దుర్గాలుగా ప్రసిద్ధి పొందిన రణతంబోర్, చితోడ్ కోటలు మొఘల్ సైన్యాల దాటికి బీటలు వారాయి.

యావద్భారత దేశాన్ని ఒక్కటిగా భావించిన అక్బర్ దేశం మొత్తాన్ని తన ఏలుబడి కిందికి తేవాలని సంకల్పించాడు. నల్దిక్కులకు తన సైన్యాన్ని నడిపించాడు మొదట గుజరాత్ స్వాధీనమైంది. సముద్రాంతర వ్యాపార వాణిజ్యాల ద్వారా గుజరాత్‌కు ఒనగూడే అపారమైన ఆదాయం ఇప్పుడు మొఘల్ సామ్రాజ్యానికి సంక్రమించింది. తరువాత బెంగాల్ స్వాధీనమైంది. ఈ విజయం కూడా చాలా విలువైంది. సస్యశ్యామలమైన భూముల మీద వచ్చే రెవెన్యూ, సముద్రాంతర వాణిజ్యం మొఘల్ సామ్రాజ్యానికి దక్కాయి. ఆగ్నేయ ఆసియా, చైనా వర్తకులు బెంగాల్‌ని తరచు సందర్శించేవాళ్ళు బెంగాల్ వర్తకులు నేత వస్త్రాలిచ్చి సుగంధద్రవ్యాలు తీసుకునేవారు.

1595 నాటికి అక్బర్ సైన్యాలు కాశ్మీర్, సింధ్, ఒరిస్సా, మధ్యభారతం, కాందహార్‌లను జయించాయి. ఉత్తరభారతదేశం యావత్తు మొఘలుల వశమైంది. భారతదేశానికి మధ్యాసియా, పర్షియాలతో సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి. ఈ దేశాలతో మైత్రీ సంబంధాలు నెలకొల్పటం ద్వారా అక్బర్ తన సామ్రాజ్య ఉత్తర సరిహద్దుని సురక్షితం చేసుకున్నాడు. ఇంకా, భారతదేశం- మధ్యాసియా, పర్షియాల మధ్య వ్యాపారం ముమ్మరించింది. ఈశాన్య దిక్కున అస్సాం, దక్షిణాన దక్కన్ పీఠభూమి మిగిలాయి. దక్కనుని జయించాలని అక్బర్‌కు మొట్టమొదట పెద్దగా కోరిక లేదు. కాని, దక్కనుని జయిస్తేనే గాని ద్వీపకల్పం మొత్తాన్ని అదుపు చెయ్యటం సాధ్యంకాదని గ్రహించాక అక్బర్ తన సైన్యాల్ని అహ్మదనగర్ మీదికి నడిపించాడు. దక్కన్ ప్రభువులు మొఘల్ అధికారాన్ని తమ యావచ్ఛక్తీ ఒడ్డి తీవ్రంగా, ప్రతిఘటించటంతో యుద్ధం ఎనిమిది సంవత్సరాలపాటు సాగింది. చిట్ట చివరికి, మొఘలులు ఖాందేష్, బీరార్‌లని, అహమ్మద్ రాజ్యంలో కొంత భాగాన్ని తమ సామ్రాజ్యంలో కలుపుకున్నారు. ఇప్పుడు మొఘల్ సామ్రాజ్యం దక్కనులో గోదావరి తీరం దాకా విస్తరించింది. భారతదేశంలో విశాల భూభాగానికి అక్బర్ చక్రవర్తి అయ్యాడు

*పరిపాలన :* మొఘల్ పరిపాలనా పద్ధతి అప్పటికి అమల్లో ఉన్న భారతీయ వ్యవస్థా, మధ్యాసియా, పర్షియాలనుంచి ఎరువు తెచ్చుకున్న కొన్ని భావాలు కలగలిసిన ఒక కలగూరగంప. గ్రామాలకు, చిన్న చిన్న పట్టణాలకు సంబంధించిన పరిపాలనా వ్యవస్థలో మార్పులంటూ యేమీ సంభవించలేదు. వెనకటి విధానమే కొనసాగింది. స్థానిక అధికార్లలో ఎక్కువమంది హిందువులే. దూరంగా విసిరివేయబడ్డట్టు ఉండే మారుమూల గ్రామసీమల్లో వారికి ఢిల్లీలో ఒక కొత్త వంశస్థులు అధికారంలోకి వచ్చారనే సంగతే తెలియదు. అయితే, క్రమేణా మొఘల్ అధికార ప్రభావం కనిపించసాగింది.

మొఘల్ పరిపాలనా వ్యవస్థలో అతి ముఖ్యమైన సంస్కరణల్లో మన్‌సబ్‌దారీ విధానం ఒకటి. సైన్యంలో ఒక భాగమైన అశ్విక దళాన్ని సమకూర్చటానికి అక్బర్ ఈ కొత్త విధానాన్ని ప్రవేశపెట్టాడు.

ప్రతి సర్దారుకు, ప్రభుత్వాధికారికి మన్సబ్ అనే హోదా ఇవ్వబడింది. ఈ హోదాని పొందిన అధికారిని మన్సబ్దార్ అని వ్యవహరించారు. మన్సబ్దార్లకింద ఉండే అశ్వికుల సంఖ్య 10 మొదలు 5,000 వరకు పోవచ్చు సంఖ్యా బలాన్నిబట్టి మన్సబ్దార్లలో తరతమ భేదాలున్నాయి. ఒక అధికారి మన్సబ్ హోదాని తన జీవిత కాలంలో మాత్రమే అనుభవిస్తాడు. అంతే తప్ప అతని కుమారుడు చక్రవర్తి సేవలో చేరాలని కోరినంత మాత్రాన ఆ హోదా అతనికి సంక్రమించదు. అతనికి కూడా చక్రవర్తి ఆ హోదాని ప్రసాదిస్తేనే తప్ప మన్సబ్దార్ కాలేడు ఆ విధంగా, చక్రవర్తి అధికారుల్ని తన చెప్పుచేతల్లో పెట్టుకున్నాడు. మన్సబ్దార్ పోషణలో ఉండే సైనికుల్ని చక్రవర్తి తన ఇష్ట మొచ్చినప్పుడు వినియోగించుకోవచ్చు. అక్బర్ తన ప్రత్యక్షాధికారం కింద ప్రత్యేకంగా ఎంపిక చేసుకున్న ఒక అధికార మండలిని, బలమైన ఫిరంగి దళాన్ని నిలుపు న్నాడు. తద్వారా, మన్సబ్దార్లు తమ పోషణలో బతికే సైనికుల్ని చక్రవర్తికి వ్యతిరేకంగా చర్యకు పురికొల్పే ప్రమాదం లేకుండా పోయింది.

చక్రవర్తి వివిధ అధికార్ల సహాయంతో పరిపాలన నిర్వహించాడు. వీరిలో వజీర్, బక్షీ అనే అధికార్లు అతి ముఖ్యులు. వజీర్ రెవెన్యూ శాఖని, బక్షీ సైనిక శాఖనీ నిర్వహించేవారు. ఆ ఇద్దరూ చాలా ముఖ్యమైన అధికారులే అయినా, వారికి తమ శాఖలమీద పరిపూర్ణాధికారం లేదు. చక్రవర్తే సర్వాధికారి. రాచనగరులో పరివారానికి సంబంధించిన పనులు నిర్వహించటానికి ఖాన్-ఇ-సమన్ అనే ప్రత్యేకాధికారికూడా ఉండేవాడు ఖాజీ అనే ఉన్నతోద్యోగి న్యాయాధికారులందరిమీద పెద్ద. చక్రవర్తిగానీ, ఆయన కుటుంబ సభ్యులుగానీ మతసంస్థలు మొదలైన వాటికిచ్చిన దానధర్మాల రికార్డును నిర్వహించటానికి సైతం ఒక ప్రత్యేకాధికారి ఉండేవాడు.

వజీర్, బక్షీల కింద అనేకమంది ఉద్యోగులు పనిచేసే వాళ్ళు. సామ్రాజ్యంలో యేం జరుగుతుందో కేంద్రప్రభుత్వానికి ఎప్పటికప్పుడు సమాచారం సిద్ధంగా ఉండేది. చక్రవర్తి ఇంకా ఇతర అధికారుల సలహాలు కూడా తీసుకునే వాడు. ఆయన సాధారణంగా దివాన్-ఇ-ఖాన్కుగానీ (విదేశరాయబారుల్ని, ఉన్నతోద్యోగుల్ని చక్రవర్తి పరామర్శించే భవనం) లేదా తన ఆంతరంగిక మందిరానికి గానీ ఉద్యోగుల్ని పిలిపించుకుని సంప్రతించేవాడు. దివాన్-ఇ-ఆమ్ అనే భవనంలో ఆయన ప్రజలకు దర్శనమిచ్చేవాడు; లేదా ఝరోఖ అని పిలవబడే ఆగ్రాకోట తూర్పు వైపు బాల్కనీలో ప్రతిరోజూ ఉదయం ప్రజలకు దర్శనమిచ్చేవాడు.

మొఘల్ సామ్రాజ్యం అనేక సుబాలుగా (రాష్ట్రాలు) విభజించబడింది. రాజధానీ నగరంలో అమల్లో వున్న పరిపాలన నమూనాయే రాష్ట్రాలలో కూడా అమలయ్యింది. అక్బర్ కాలంలో మొత్తం 15 సుబాలుండేవి. ప్రతి సుబా సర్కార్లుగా, ప్రతి సర్కారూ పరగణాలుగా విభజించబడ్డాయి. కొన్ని గ్రామాల సముదాయం పరగణా. సుబాని పరిపాలించే గవర్నరు సుబేదారు; రాష్ట్రంలో అత్యంత ముఖ్యమైన వ్యక్తి. తనకింద పని చేసే అనేకమంది ఉద్యోగుల తోడ్పాటుతో సుబేదారు రాష్ట్రపరిపాలన నిర్వహించేవాడు. దివాన్ భూమిశిస్తు రికార్డుల్ని చూసేవాడు. బక్షీ ప్రతిరోజూ రాజధానికి సమాచార నివేదికలు పంపేవాడు; రాష్ట్రంలో పనిచేసే సైనికుల అవసరాల్ని గమనించేవాడు. ఉత్తరభారతదేశంలో గ్రామాల్లో, చిన్న చిన్న పట్టణాల్లో ప్రజలందరికీ ఈనాడు కూడా ఒక అధికారి పేరు చిరపరిచితమే. అతడే కొత్వాలు. ప్రతి

పట్టణంలో కొత్వాలు సర్వాధికారి. ఇప్పటికీ అక్కడక్కడా పోలీసు స్టేషన్లని కొత్వాలీ అని వ్యవహరిస్తుంటారు నేరస్థుల్ని పట్టి బంధించటం, వర్తకులు ప్రజల్ని మోసం చెయ్యకుండా కొలతలు, తూనికల్ని తనిఖీ జరపటం, నగరంలో విదేశ సందర్శకుల వివరాలతో సహా జనాభా లెక్కల్ని తయారు చేయించటం అతని విధులు.

ఏ అధికారి గానీ ఒకే పదవిలో లేదా ఒకే చోట ఎక్కువ కాలం తిష్ట వెయ్యటం వల్ల స్థానికంగా బలపడి ప్రజల్ని వేధించే ప్రమాదముందని అక్బర్ పసిగట్టాడు. అంచేత, ఒకేచోట దీర్ఘకాలం పదవిలో కొనసాగిన అధికార్లను వేరే చోటికి బదిలీ చేసే పద్ధతిని ఆయన గట్టిగా అమలు జరిపించాడు. గతంలో వజీర్లు, మంత్రులు తమ అధికార బలంతో ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించారు ఇప్పుడు వారి ప్రాభవం అంత రించి పోయింది. చక్రవర్తి సర్వాధిపత్యం పెరిగింది

*రాజ్య ఆదాయ వనర్లు :* మొఘల్ ప్రభుత్వానికి ప్రధానంగా రెండు రకాల వనర్ల నుంచి ఆదాయం పోగుబడింది. ఒకటి-భూమి శిస్తు, రెండు- వాణిజ్య పన్నులు. పన్నుల ద్వారా వసూలయిన ఆదాయంలో ఎక్కువ భాగం అధికారుల జీతభత్యాల కిందే ఖర్చయ్యేది. ఉన్నత రాజోద్యోగులకు చాలా పెద్ద జీతాలు ముట్టటం చేత వాళ్ళు విలాసవంతమైన జీవితం గడపటానికి వీలయింది.

వేతనాల్ని నగదు రూపంలో చెల్లించాలనేది అక్బర్ ఆశయమైనా, వాస్తవంలో అలా జరగలేదు. అధికారులకి జాగీర్లు ప్రసాదించి వేతనానికి సరిపడా భూమి శిస్తు వసూలు చేసుకునే హక్కు కట్టబెట్టవలసి వచ్చింది. వాళ్ళు వసూలు చేసుకునే భూమి శిస్తు వేతనానికి సరి సమానంగా ఉండేటట్లు చూడాలంటే, ప్రతి గ్రామం నుంచి భూమి శిస్తు ద్వారా ఎంత ఆదాయం వస్తుందో ఖచ్చితమైన లెక్కలు తయారు చేయించటం తప్పని సరయింది. భూమి శిస్తు ద్వారా వచ్చే రాబడి నిర్దిష్టంగా తెలియటం వల్ల ఏయే అధికారులకు ఎంత మేరకు భూమి శిస్తు వసూలు చేసుకునే హక్కు ఇవ్వవచ్చో సులువుగా తెలిసిపోయింది.

ప్రాంతాన్ని బట్టి పండించే పంట మారుతుంది. అన్ని ప్రాంతాలలో ఒకే రకం పంట పండదు. ఒక ప్రాంతంలో తిండి గింజలు విశేషంగా పండితే, ఇంకొక ప్రాంతంలో ప్రత్తి విరివిగా సాగవుతుంది. ఏ యేటి కాయేడు మార్పులు కూడా చోటు చేసుకుంటాయి. కాబట్టి, ఎప్పటికప్పుడు పంటను బట్టి ఒక్కొక్క రకం పంటకు ఒక్కొక్క రకంగా శిస్తు నిర్ణయించి, తద్వారా వచ్చే ఆదాయాన్ని మదింపు వెయ్యటమే ప్రభుత్వానికెప్పుడూ లాభదాయకంగా ఉంటుంది. అక్బర్ ఆ పని చేయించాడు. తన సామ్రాజ్యంలో సాగుబడి కింద ఉన్న మొత్తం భూమిని, ఫలసాయం మొత్తాన్నీ అంచనా వేసి సమగ్ర నివేదిక సమర్పించవలసిందిగా ఆయన అధికారుల్ని ఆదేశించాడు. శిస్తు రూపంలో ప్రభుత్వానికి ఎంత ఆదాయం లభ్యమయ్యేదీ తనిఖీ చెయ్యటానికి కూడా ఇది అవసరం. పండిన పంటలో మూడవ వంతు ప్రభుత్వానికి ముట్టేది. ధాన్య రూపంలో కన్నా ధన రూపంలో పన్ను చెల్లింపుని ప్రభుత్వం ప్రోత్సహించింది. భూమిశిస్తు అంచనాల్ని తయారు చెయ్యటానికి అక్బర్ రాజా తోడర్‌మల్‌ని నియమించాడు. ఆ పని పూర్తి కాగానే రెవెన్యూ రికార్డులు తయారయ్యాయి. వాటిని ఎప్పటికప్పుడు మార్పులు, చేర్పులతో ఖచ్చితంగా ఉంచవలసిన అవసరాన్ని ఆయన ఆచరణలో పాటింపజేశాడు. ఈ సంస్కరణల వల్ల రైతుకు మేలు జరిగింది. పండిన పంటలో ఎంత భాగం తాను ఉంచుకోవచ్చో, ప్రభుత్వానికి ఎంత చెల్లించాలో రైతుకు నికరంగా తెలిసింది.

భూమి శిస్తు ద్వారా వచ్చినంత ఆదాయం వ్యాపార రంగంలో రాలేదు. అయితే, వర్తక వ్యాపారాలు ముమ్మరంగా సాగే గుజరాత్, బెంగాల్ వంటి రాష్ట్రాలలో వాణిజ్య పన్నుల ద్వారా లభ్యమైన అపార ఆ ం ఆ సుబాలను సుసంపన్నం చేసింది. దేశంలో ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి సరుకుల రవాణా గుంటెల బిడార్లు, ఎద్దుబండ్ల ద్వారా సాగింది. కొంత మంది పెద్ద పెద్ద వర్తకులు దేశ సరిహద్దులు దాటి మధ్యాసియా, పర్షియా, ఆఖరికి రష్యాకి సైతం తమ సరుకు రవాణా చేశారు. మొఘలుల కాలంలో విదేశ వ్యాపారం విశేషంగా అభివృద్ధి చెందింది. మన కోస్తా పొడవునా లెక్కలేనన్ని రేవులు సరుకుల ఎగుమతి దిగుమతుల్తో కిటకిటలాడాయి. భారతీయ వర్తకులు నేత బట్టలు, నీలిమందు, సురేకారం, సుగంధ ద్రవ్యాలు వగైరాల్ని ఇతర దేశాలకు ఎగుమతి చేశారు.

ఈ విదేశ వాణిజ్యం గురించే అనేక మంది ఐరోపా వర్తకులు అక్బర్ దర్బారుని సందర్శించారు. అప్పటికే పోర్చుగీసులు వ్యాపార స్థావరాలు స్థాపించుకొని, భారత పశ్చిమ కోస్తా వర్తకులతో వ్యాపార కార్యకలాపాలు సాగిస్తున్నారు. పోర్చుగీసుల అపార లాభాలను చూసి ఇంగ్లీషు వర్తకులకు కన్ను కుట్టింది. కొంత మంది ఇంగ్లీషు వర్తకులు అక్బర్‌ని దర్శించి, పోర్చుగీసులు వ్యాపారం చేసుకునే ప్రాంతాలలోనే తామూ వ్యాపారం చేసుకోడానికి అనుమతి ఇప్పించమని వేడుకున్నారు. అంత మంది ఐరోపా వర్తకులకి ఇక్కడ వ్యాపారానుమతి ఇవ్వటానికి ఆయనకి మనస్కరించలేదు.

సాహిత్యం, లలిత కళలు . అక్బర్‌కు అక్షర జ్ఞానం లేదు. అయినా అనేక అత్యుత్తమ గ్రంథాలతో పరిచయం ఉంది. విద్యా సముపార్జనలో ఆయన రోజూ అనేక గంటలు గడిపేవాడు. అక్షర జ్ఞానం లేకపోయినా ఆయనకి అమోఘమైన జ్ఞాపకశక్తి ఉంది. ఇతర్లు చదువుతూవుంటే తను శ్రద్ధగా ఆలకించి విషయం ఆకళించుకునే వాడు. అనేక మంది తత్వవేత్తలతో, పండితులతో, రచయితలతో చర్చా సంవాదాలు చేసేవాడు. ఆ విధంగా ఆయన ఎంతో విజ్ఞానం ఒంట పట్టించుకున్నాడు. కవిత్వమంటే ఆయనకి చాలా అభిమానం. అనేక సందర్భాల్లో ఆయన అనేక పద్యాల్ని అనర్గళంగా ఉటంకించేవాడు.

ప్రకృతి విజ్ఞాన శాస్త్రాల మీద ఆయనకి అట్టే ఆసక్తిలేదు. ఇది ఒక విధంగా దురదృష్టకరమైన విషయం. ఆయన గనుక సాంస్కృతిక పునరుజ్జీవనం పట్ల గానీ, పోర్చుగీసుల నూతన సాంకేతిక శాస్త్ర విజ్ఞానం పట్లగానీ ఆసక్తి ప్రదర్శించి వుంటే భారత దేశంలో విజ్ఞానశాస్త్ర ప్రగతి చాలా శీఘ్రగతిని సాగి వుండేది.

అక్బర్‌కు ఇద్దరు సన్నిహిత మిత్రులుండేవాళ్ళు. ఆ ఇద్దరూ అన్నదమ్ములే. ఆ ఇద్దరితోనే ఆయన సుదీర్ఘ చర్చలు జరిపేవాడు. ఆ ఇద్దర్లో ఒకరు- అబుల్‌ఫజల్; రెండవ వారు ఫైజీ. అబుల్ ఫజల్ అక్బర్-నామా (అక్బర్ జీవిత చరిత్ర) రచించాడు. అందులో ఐనీ అక్బరీ అనే ప్రకరణం చాలా ప్రసిద్ధమైంది. మొఘల్ సామ్రాజ్య కాలం నాటి రెవెన్యూ విధానం, చట్టాలు, దేశ పరిస్థితులకు ఆ ప్రకరణం అద్దం పట్టింది. ఫైజీ కవి. పారశీకంలో కవిత్వం రాశాడు. మొఘల్ సామ్రాజ్యంలో అధికార భాష పారశీకం. కాబట్టి దేశంలో విద్యావంతులందరికీ ముఖ్యంగా ప్రభుత్వ సేవలో ఉండే ఉద్యోగులందరికీ పారశీకం కొట్టిన పిండి. అక్బర్, ఆయన మిత్రులు కలిసి ముఖ్యమైన సంస్కృత కావ్యాల్ని పారశీక భాషలోకి అనువదింపజేసే కృషికి గొప్ప ప్రోత్సాహం ఇచ్చారు. మహాభారతం, రామాయణాలు మొత్తం అక్షరం పొల్లుపోకుండా

పారశీక భాషలోకి తర్జుమా అయ్యాయి. పర్షియన్ అనువాద ప్రతికి అబుల్ ఫజల్ పీఠిక రాశాడు. అనేక మంది సుల్తాన్ల, రాజుల జీవితాల్ని సంస్కృతంలో రచించిన పండితులకు భూరి పారితోషికాలు ముట్టాయి.

అనేక మంది కవులు హిందీలో పద్య రచన సాగించటం ప్రారంభించిన కాలం కూడా ఇదే. వల్లభాచార్య, కేశవదాస, రహీమ్ ప్రభృతులు ఆనాటి ప్రముఖ హిందీ కవులు. రహీమ్ ద్విపదలు (దోహాలు) ఈ నాటికీ ప్రజల నాలుకమీద ఆడుతున్నాయ్. అన్నింటి కంటే ముఖ్యమైంది తులసీదాస్ రచించిన రామాయణం. తులసీదాస్ రామాయణాన్ని "రామచరిత మానస్" అంటాం. హిందీ తెలిసిన వారందరికీ తులసీదాస్ రామాయణం పారాయణ గ్రంథమైంది

అబుల్ ఫజల్, ఫైజీలే కాకుండా, అక్బర్ అభిమానించిన మరొక వ్యక్తి కూడా ఉన్నాడు. ఆయనే సుప్రసిద్ధ గాయకుడైన తాన్‌సేన్. రాగాలాపనలో నూతన బాణీలు సృష్టించటం ద్వారా తాన్‌సేన్ హిందుస్థానీ సంగీత సంప్రదాయాన్ని సుసంపన్నం చేశాడు. ఈ రాగాలలో అత్యంత ప్రసిద్ధమైంది "దర్బారీ" రాగమని సంగీతజ్ఞులంటారు. అక్బర్ పాదుషా కోసం తాన్‌సేన్ ప్రత్యేకంగా ఈ రాగాన్ని స్వరబద్ధం చేశాడట. ఇదే కాలంలో హిందుస్థానీ సంగీతం పారశీక సంగీత సంప్రదాయం నుంచి అనేక అంశాల్ని స్వీకరించింది.

అక్బర్ దర్బారులో చిత్రకారులు కోకొల్లలు. పాదుషా గ్రంథాలయంలోని అనేక పుస్తకాలకు వాళ్ళు అందమైన చిన్న సైజు చిత్తరువులు చిత్రించారు. వాళ్ళు వేసిన చిత్తరువులు భారతీయ, పారశీక చిత్ర కళా ధోరణులు రెంటినీ ప్రతిబింబిస్తాయి. వాళ్ళు వాడిన రంగుల్లో విలక్షణ భారతీయ ముద్ర, చిత్రలేఖన సౌకుమార్యంలో విలక్షణ పారశీక సంప్రదాయం గోచరిస్తాయి. చిత్రలేఖకుల్లో ఎక్కువ మంది హిందువుల్లో తక్కువ కులాలకు చెందినవాళ్ళు. దీన్ని గురించి అక్బర్ పట్టించుకోలేదు తాము చిత్రించిన చిత్తరువుల కింద వాళ్ళు తమ పేర్లు కూడా రాసుకున్నారు. ఈనాటికీ మనకు వాళ్ళ పేర్లు తెలుసు చిత్రలేఖకులు జట్టుగా కూడి ఒక్కొక్క చిత్రాన్ని రూపొందించారు. దాన్ని బృంద చిత్రణ అనవచ్చు. ఆ చిత్రకారులంతా గుజరాత్, కాశ్మీర్, దక్కన్ వగైరా విభిన్న ప్రాంతాల నుంచి వచ్చినా వాళ్ళు. అంచేత ఆయా ప్రాంతాల భిన్న స్థానిక కళా ధోరణులు వారి చిత్రలేఖనాన్ని ప్రభావితం చేశాయి. పుస్తకాలకు చిత్తరువులు గీసే పని లేనప్పుడు, వాళ్ళు భారతీయ, పారశీక పురాణ గాథల్లో వస్తువుని స్వీకరించి చిత్తరువులు గీశారు. గోవులుకాసే బాలగోపాల కృష్ణుని లీలలు లైలా-మజ్నూల ప్రేమగాథ వంటి రమణీయ కథల్ని కమనీయంగా చిత్తరువుల్లో చిత్రించారు. అయితే, అక్బర్ దర్బారులోని చిత్తరువుల్లో ఎక్కువ భాగం ఆయన జీవిత ఘట్టాల్ని, దర్బారు విశేషాల్ని చిత్రించినవే.

తాటాకు మీద, కొండరావి చెట్టు మందపు పట్టల మీద పుస్తక రచన చేసే కాలం చెల్లిపోయింది. పుస్తక రచనకు కాగితాన్ని ఉపయోగించే కాలం అప్పటికి చాలా ముందే ప్రారంభమైంది. చైనీయులు కాగితాన్ని తయారు చెయ్యటం కనిపెట్టారు. చైనాలో తయారైన కాగితం పశ్చిమాసియాకు దిగుమతయింది. 18వ శతాబ్దంలో భారతీయ వర్తకులు కాగితం దిగుమతి చేసుకున్నారు. ఆ తరువాత ఇక్కడే కాగితం తయారీ మొదలయింది. చేతిరాతతో పుస్తక రచన సాగిన కాలం అది. అదే కాలంలో చైనాలో, ఐరోపాలో అచ్చు యంత్రాలు వాడుకలోకి వచ్చాయి. పుస్తకాలకి పుస్తకాలు చేత్తో రాయటమంటే చాలా కాలం పట్టే

పని. కనుక, అచ్చు యంత్రాల మీద తయారైనన్ని పుస్తకాలు చేతిరాత ద్వారా తయారుకావు. పర్షియన్ గ్రంథాలు రకరకాల అందమైన లిపులలో రాయబడ్డాయి. సంస్కృత, హిందీ గ్రంథాలకు సర్వసాధారణంగా దేవనాగరి లిపి వాడుకలో ఉంది.

వాస్తు శిల్పం : అక్బర్ దర్బారు ఢిల్లీ, ఆగ్రాలు రెండు చోట్లా వెలిగింది. అయితే, ఆయన ఒక నూతన రాజధానీ నగరాన్ని నిర్మించాలని నిర్ణయించాడు. అదే ఫతేపూర్ సిక్రీ; ఆగ్రాకు సమీపంలో ఉంది. సూఫీ యోగి సలీంచిష్టీ పట్ల గల భక్తి గౌరవాలు పురస్కరించుకొని, ఆయన నివసించిన ఫతేపూర్‌ని నూతన రాజధానీ నగర నిర్మాణానికి అక్బర్ ఎంచుకున్నాడు. అక్కడే ఆయన ఎరుపు ఇసుక రాయితో అద్భుత రాజ ప్రాసాదాలు, మంటపాలు నిర్మింపజేశాడు ఫతేపూర్ సిక్రీలోని వాస్తు శిల్పం వివిధ భారతీయ, పారశీక, మధ్యాసియా కళాధోరణుల అపూర్వ సమ్మేళనం. తన తండ్రి హుమాయూన్ జ్ఞాపకార్థం ఢిల్లీలో ఆయన కట్టించిన సమాధి కూడా దేశ, విదేశ వాస్తుకళా సంప్రదాయాల మేలు కలయికకి ప్రతీక. ఢిల్లీ



1569-1572 సంవత్సరాల మధ్య అక్బర్ పాదుషా నిర్మాణం కావించిన పంచ్‌మహల్, ఫతేపూర్ సిక్రీ. హైందవ-ఇస్లాం కళారీతుల అపూర్వ సమ్మేళనానికిది ప్రతీక.

సుల్తానుల వెనక కట్టించిన సమాధి మందిరాలకిది భిన్నంగా గోచరిస్తుంది. పైగా, ఇది సుందరంగా తీర్చిదిద్దిన ఉద్యానవనంలో నిర్మించబడింది. ఒక బ్రహ్మాండమైన దర్వాజా గుండా ఆ ఆవరణలోకి ప్రవేశించాలి. అసలు ఆ దర్వాజాయే ఒక అపూర్వ నిర్మాణం. తోట, దర్వాజా - ఈ రెండూ అన్ని మొఘల్ తరహా సమాధి మందిరాల్లోనూ కనిపిస్తాయి.

ఆ కాలంలో మొఘల్ వాస్తు శిల్ప కళ అనేక పూర్వ భారతీయ కళా సంప్రదాయాల్ని అనుకరించింది ప్రవేశ ద్వారాలకు నల్చదరపు వంకీలు, గుహా విన్యాసం వగైరాలు ఒక ఉదాహరణ. అలాగే, మొఘల్ వాస్తు శిల్పం కూడా హిందూరాజుల రాజభవన నిర్మాణాన్నీ, దేవాలయ నిర్మాణాన్నీ ప్రభావితం చేసింది. రాజపుత్ర రాజుల రాజప్రాసాదాలలో ఈ ప్రభావం స్పష్టంగా గోచరిస్తుంది. ఎరుపు ఇసుక రాయిలో, హిందూ-మొఘల్ వాస్తు కళా సంప్రదాయాలు మేళవించి బృందావనంలో నిర్మించిన గోవిందదేవుని ఆలయాన్ని చూడగానే ఇట్టే పోల్చుకోవచ్చు.

అక్బర్ మత విధానం : ఫతేపూర్ సిక్రీలోని ఒక భవనాన్ని ఇబాదత్ ఖానా అంటారు. అక్బర్ పాదుషా వివిధ మతాల మీద విశేష తాత్విక చర్చలు జరిపిన మందిరం ఇది. మత విషయకమైన సమస్యల



మత గురువులతో సంప్రదిస్తున్న అక్బర్

పట్ల ఆయనకు అపారమైన శ్రద్ధాసక్తులుండేవి. ప్రతి మతమూ భగవంతుణ్ని చేరటానికి ఒక మార్గమని ఆయన భావించాడు. భిన్నమతాలు భగవంతుణ్ని చేరటానికి భిన్న మార్గాలయినప్పుడు, భిన్న మతాలను అనుసరించేవాళ్ళు పరస్పరం సామరస్యంతో జీవించటం ఎందుకు సాధ్యం కాదని ఆయన ఆశ్చర్య పోయాడు. సర్వమతసారం నిండి, సమస్త ప్రజల్ని సమైక్యం చెయ్యగలిగే ఒక మార్గం కనిపెట్టాలని ఆయన తపించాడు. కనుక, అన్ని మతాలకు చెందిన గురువుల్ని ఆహ్వానించి, వారితో ఆయా మతాల మీద చర్చలు జరిపాడు.

మొట్టమొదట ముస్లిం మత గురువులు ఇబాదత్ ఖానాకు విచ్చేశారు తరువాత, ఇతర మతాల వారు చక్రవర్తితో చర్చలు చేశారు. హిందువులు, పార్శీలు, జైనులు, క్రైస్తవులు ఇబాదత్ ఖానా సందర్శించారు పోర్చుగీసు గవర్నర్ చక్రవర్తిని క్రైస్తవమతంలోకి మార్చటానికి మిషనరీలను పంపాడు. వాళ్ళ ప్రయత్నం ఫలించలేదు. చక్రవర్తికి క్రీస్తు బోధలు తెలుసుకోవాలనే కోరిక ఉండబట్టి, క్రైస్తవ మిషనరీలను ఆహ్వానించాడే తప్ప మతం మార్చుకోవటానికి కాదు. ఇతర మతాలపట్ల అక్బర్ ప్రదర్శించే గౌరవ ప్రపత్తుల్ని చూసి ముస్లిం మతగురువులు ఆందోళన చెందారు

అన్ని మతాలవారినీ ఇబాదత్ ఖానాకు రావించి, చర్చలు జరిపాక అక్బర్‌కు తాను అన్వేషించే మార్గం దొరికింది. తన స్వంతమంటూ ఆయన ఒక దాన్ని సృష్టించలేదు. ఒక నూతన మతాదర్శాన్ని సూచించాడు. సర్వమతసారం దానికి ప్రాతిపదిక; వివిధ మతాల నుంచి కొన్ని నియమాలను జత పర్చాడు. ఈ సరికొత్త మతమే "దిన్-ఇ-ఇల్లాహి"—భగవంతుడొక్కడే అనే సిద్ధాంతం.

మొట్ట మొదట, అక్బర్ ప్రజల ఆధ్యాత్మిక మార్గదర్శిగా తన్నుతానే ప్రకటించుకున్నాడు. తరువాత ఆ మతనియమాలు వివరించాడు. శాంతి, సహనం ఆయన ఆదర్శాలు. జంతువధకి ఆయన విముఖత ప్రదర్శించాడు; సంవత్సరంలో కొన్ని రోజులైన మాంస భక్షణ మానివెయ్యాలని ప్రజలకు సూచించాడు. నేరస్థులకు క్రూరశిక్షలు విధించటం పట్ల ఆయన వ్యతిరేకత ప్రదర్శించాడు నేరస్థునికి కాలూ, చెయ్యీ తీసి వెయ్యటం కన్నా, తన తప్పుని తాను గ్రహించి పశ్చాత్తాప పడేటట్లు చెయ్యటమే మేలని ఆయన భావించాడు. భర్త చితిమీద స్త్రీ సహగమనం చెయ్యటాన్ని ఆయన తీవ్రంగా నిరసించాడు. ఆయన తన మతంలో సూర్యుణ్ణి, అగ్నిని, వెలుగుని ఆరాధించే సంప్రదాయాన్ని ప్రవేశపెట్టాడు. అక్బర్‌ని తమ ఆధ్యాత్మిక మార్గదర్శిగా స్వీకరించిన వాళ్ళు చక్రవర్తికోసం తమ ఆస్తి, మానం, మతం, ప్రాణం సమస్తం త్యాగం చెయ్యటానికి సంసిద్ధులమని ప్రమాణం చేశారు.

దర్బారులోని యావన్మంది అక్బర్ ఆధ్యాత్మిక మార్గాన్ని అంగీకరించలేదు. చక్రవర్తికి మహా అభిమాన పాత్రుడైన రాజా బీర్బల్ వంటి ప్రభువర్గీయులు అక్బర్ నూతన మతానుయాయులయ్యారు. చక్రవర్తి మెప్పుకోసం మరికొంతమంది ఆ మతాన్ని స్వీకరించారు. రాజామాన్‌సింగ్ లాంటి వాళ్ళు ఈ మతాన్ని బాహాటంగా వ్యతిరేకించారు. అక్బర్ వారందరి అభిప్రాయాల్ని గౌరవించాడు. తన మత బోధల్ని తప్పకుండా పాటించమని ఆయన ఎవ్వర్నీ ఒత్తిడి పెట్టలేదు అక్బర్ ఇస్లాం మతాన్ని నిలువునా పాతిపెడుతున్నాడే అని కొందరు ముస్లిం సర్దార్లు ఆందోళన చెందారు. కాని, అక్బర్ తన నూతన మతాదర్శాలను ప్రకటించటం ద్వారా ఏ మతాన్నీ ధ్వంసం చెయ్యాలని ప్రయత్నం చెయ్యలేదు దేశంలో ఐక్యత నెలకొల్పా

లని ఆయన చిత్తశుద్ధితో నమ్మాడు. భారతదేశ ప్రజలందర్నీ ఒక తాటిమీదికి తేవటానికి ఆయన చేసిన ప్రయత్నమే "దిన్-ఇ-ఇల్లాహి".

ఒక సువిశాల సామ్రాజ్యాన్ని పరిపాలించటంవల్ల అక్బర్ గొప్పవాడు కాలేదు; దేశంపట్ల, ప్రజల పట్ల ఆయన ప్రదర్శించిన ఆవేదనవల్ల ఆయన గొప్పవాడు అంటున్నాం. రాజంటే ప్రజల్ని రక్షించేవాడని ఆయన విశ్వాసం. రాజు తన ప్రజల సంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. పరిపాలనకు సంబంధించి అశోకుని కున్న భావాలే అక్బర్‌కూ ఉన్నాయి. అశోకుడు తన శాసనాల్లో ఒక దాన్లో "మనుషులంతా నా బిడ్డలు" అని ప్రకటించాడు. అక్బరుకు ఈ అశోక భాషితం తెలిసివుంటే, తప్పక ఏకీభవించివుండే వాడు సర్వసమైక్య భారతదేశం ఆయన స్వప్నం ప్రజలంతా తమ మత విభేదాలు మరచి, తాము భారత ప్రజలమని మాత్రమే ముఖ్యంగా భావించాలి. అక్బర్ తన పరిపాలనలో ఈ దశలో కొంత ప్రగతి సాధించాడు. కాని, ఆయన వారసులు సదా ఈ విధానాన్ని కొనసాగించకపోవటం దురదృష్టకరం. ప్రజలంతా తన నూతన మత బోధలు అనుసరించినట్లయితే దేశంలో శాంతి, సమైక్యతలు నెలకొంటాయని ఆయన భావించాడు. ఆయన చింతనలో ఇదొక బలహీనత. ప్రజల్లో ప్రతి ఒక్కరూ అది నమ్మి, దాని కోసం శ్రమిస్తే తప్ప శాంతి, సమైక్యతలు అవతరించవు. ఒక వ్యక్తి మహారాజయినా, అతణ్ణి అనుసరించినంత మాత్రాన దేశం శాంతి, సమైక్యతలతో తులతూగదు.

అక్బర్‌లో ఒక గొప్ప లక్షణం ఉంది. ఆయన నిర్భయుడు. మదపుటేనుగుల్ని మచ్చిక చేసుకోవటం, వరద హోరులో పరవళ్ళు తొక్కే భీషణ నదుల్ని ఈదటం వంటి శారీరక సాహస కృత్యాలలో ఆయన అద్భుతమైన ధైర్యం, తెగువ ప్రదర్శించాడు. అట్లాగే, భారతీయ సమాజంలోను, చింతనలోను మార్పులు చోటు చేసుకోనీకుండా తమ అధికారాన్నీ, ఛాందసత్వాన్ని ఉపయోగించి నూతన భావాలకు అడ్డుకట్టలు వెయ్యటానికి ప్రయత్నించిన పెద్దల్ని ప్రతిఘటించటంలో కూడా ఆయన గొప్ప ధైర్యం ప్రదర్శించాడు. నిజాయితీలో వేళ్ళు తన్నిన నిర్భీకత అది. అదే ఆయనలోని అరుదైన గుణం

అక్బర్ పాదుషా 1605లో మరణించినప్పుడు ఆగ్రా సమీపంలో సికాంద్రాలో ఆయన తన కోసం ప్రత్యేకంగా నిర్మాణం ప్రారంభించిన సమాధిలోనే ఆయన భౌతిక దేహాన్ని భూస్థాపితం చేశారు. అక్బర్ సమాధి మందిరం ఆయన వ్యక్తిత్వాన్ని చాటుతుంది. అది నిరాడంబరమైంది, నిరుపమాన గంభీరమైంది కూడా.

# 8
# వైభవోజ్వల శకం

సామ్రాజ్యాన్ని సుస్థిరపరచి, సమర్థవంతంగా నిర్వహించిన కారణంగా అక్బర్ రాజ్యపాలనా కాలం మొఘల్ వంశ చరిత్రలో చాలా ముఖ్యమైంది. అక్బర్ కుమారుడు, వారసుడు అయిన జహంగీర్, అతని తరువాత రాజ్యానికి వచ్చిన షాజహాన్, ఔరంగజేబ్‌లు నిలకడగా ముందుకు సాగటానికి ఇది నాంది పలికింది. ఈ ముగ్గురి పరిపాలనా కాలంలో మొఘల్ సామ్రాజ్యం ఇంకా విస్తరించింది; సామ్రాజ్య ఆదాయం మరింత పెరిగింది. దర్బారు జీవితం మహా వైభవోపేతమయింది. దర్బారు కొత్త నమూనాలకు బాటలు పరిచింది. సంఘంలో పెద్దరికం వహించిన వాళ్ళు కేవలం శ్రీమంతులేకాదు; సాంస్కృతిక సామాజిక విషయాలనేకంలో శ్రద్ధాసక్తులు కలవాళ్ళు కూడా. భారత చరిత్రలో 17 వ శతాబ్దం నిజంగా ఒక వైభవోజ్వల శకం.

*జహంగీర్:* రాచకుటుంబ సంప్రదాయం ప్రకారం, ప్రభుత్వ, పరిపాలనా విషయాల్లో అనుభవం గడించటానికి జహంగీర్ యువకుడుగా ఉండగానే అవధ్, బెంగాల్ సుబాలకు గవర్నరుగా నియమితుడయ్యాడు. 1605లో అక్బర్ చనిపోయాక, జహంగీర్ పాదుషా అయ్యాడు. వ్యక్తిగా జహంగీర్ తన తండ్రి కన్నా భిన్నమైనవాడు సామాజిక, మత సంస్కరణలలో అక్బర్ చూపిన బాటలో పయనించినా, జహంగీర్ తన తండ్రి మాదిరిగా మత సంబంధమైన సమస్యల్ని ఎన్నడూ క్షుణ్ణంగా అధ్యయనం చెయ్యలేదు. ఇంకా చెప్పాలంటే, అక్బర్‌కున్న నిశిత మేధస్సు జహంగీర్‌కు లేదు. కాని, సాహిత్యమంటే చాలా అభిమానం; పై పెచ్చు, బాగా చదువుకున్నవాడు కూడా. బహు సుందరమైన పారశీక శైలిలో రాసేవాడు. అతని స్వీయ చరిత్ర, తజుక్-ఇ-జహంగీరీ చదివిన వాళ్ళకు అతని సుందరశైలీ విన్యాసం అనుభవమవుతుంది. జహంగీర్ వ్యక్తిత్వానికి, పరిపాలనకు ఈ పుస్తకం అద్దం పట్టింది. అతడు చిత్రకళాభిజ్ఞుడు; తన దర్బారు మహోత్తమ చిత్రకారుల నిలయం అని గర్వంగా చాటుకున్నాడు.

జహంగీర్ 1611 లో నూర్జహాన్‌ని వివాహం చేసుకున్నాడు. నూర్జహాన్ అపురూప సౌందర్యవతి, అద్భుతమైన తెలివితేటలు గలది. వస్త్రాలంకరణలో, మంచీ-మర్యాదల్లో ఆమె వినూతన ధోరణులకు ప్రాణం పోయటమే కాకుండా, రాజ్య వ్యవహారాల్లో సైతం శ్రద్ధ తీసుకుంది. జహంగీర్ చాలా రోజులు అస్వస్థుడుగా ఉన్నప్పుడు స్వయంగా రాజకీయ వ్యవహారాలు చక్కబెట్టి సామ్రాజ్య పాలన నిర్వహించింది.

ముఖ్యమైన ప్రతి విషయంలో జహంగీర్ ఆమె సలహా తీసుకునేవాడు. చివరికి, ఆమె ప్రాభవం ఎంత పెరిగి పోయిందంటే, ప్రభుత్వ నాణాల మీద జహంగీర్‌తో పాటు ఆమె పేరు కూడా ముద్రితమైంది

మొత్తంమీద, జహంగీర్ పరిపాలన అతని తరువాత వచ్చిన మొఘల్ పాదుషాల కాలంలో కంటే ఏ ఒడిదుడుకులు లేకుండా ప్రశాంతంగా సాగిపోయింది దండయాత్రలు కూడా ఆట్టే లేవు. జహంగీర్ బెంగాల్‌లో మొఘల్ అధికారాన్ని కట్టుదిట్టం చేశాడు. అక్బర్ కాలంలో మేవాడ్ రాణాతో ఏర్పడ్డ చిక్కులు జహంగీర్ కాలంలో తొలగిపోయాయి. అతడు స్వయంగా జోధబాయి, మన్‌బాయి వంటి రాజపుత్ర కన్యల్ని వివాహం చేసుకున్నాడు. రసపుత్ర రాజుల్తో తన తండ్రి నెరపిన వైవాహిక సంబంధాల పద్ధతిని ఇతడు కూడా కొనసాగించాడు. ఉత్తర పంజాబ్ పర్వత సానువుల్లో బలమైన కోటలతో పటిష్టంగా రూపొందిన కాంగ్రా మీదికి సైన్యాన్ని పంపి, వశ పర్చుకున్నాడు. అహ్మద్‌నగర్ రాజ్యంతో వెనకటి నుంచి ఇబ్బంది పెడుతున్న సరిహద్దు బెడద తీరిపోయింది. దేశంలోని వివిధ ప్రాంతాల పైకి జహంగీర్ నడిపిన దండయాత్రల ఫలితంగా మొఘల్ ఆధిపత్యాన్ని అప్పటిదాకా అంగీకరించని చిల్లర మల్లర ప్రభువులు, అఫ్ఘన్ సర్దార్లు తలలు వంచారు. మొఘల్ సామ్రాజ్యం ఇంకా బలపడింది.

కాని, జహంగీర్‌ని ఇంకా కొన్ని బెడదలు వెన్నాడాయి. అఫ్ఘనిస్థాన్‌లో కాందహార్‌ని పర్షియన్లు స్వాధీనం చేసుకున్నారు. ఇది మొఘల్ సామ్రాజ్యానికి వాటిల్లిన తీవ్ర నష్టం. ఎందుచేతనంటే, పశ్చిమాసియాతో భారతదేశ వర్తక వ్యాపారాలకు కాందహార్ నగరం చాలా కీలకమైంది. పైపెచ్చు; కాందహార్ మొఘలుల వశంలో ఉన్నంత కాలం మధ్య, పశ్చిమ ఆసియాల నుంచి విరుచుకుపడే విదేశ దండయాత్రల్ని తేలికగా తిప్పికొట్ట వచ్చు. ఆ విధంగా కాందహార్ పతనం మొఘల్ సామ్రాజ్యానికి తీరని నష్టంగా పరిణమించింది. ఇదిగాక, జహంగీర్‌కు తన కుమారుడు షాజహాన్‌తో చిక్కువచ్చి పడింది. షాజహాన్ తండ్రి మీద తిరుగుబాటు జరిపాడు. తండ్రి తనని కాకుండా, తన సోదరుల్లో ఒకరిని సామ్రాజ్యానికి వారసుడుగా నిర్ణయిస్తాడన్న భయంతో తన ప్రతాపం ప్రదర్శించటానికి షాజహాన్ తండ్రికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేశాడు. కొడుకుని అదుపు చెయ్యటం జహంగీర్‌కి సాధ్యం కాలేదు. ఇదిగాక, పోర్చుగీసులతో ప్రమాదం వచ్చి పడింది. వ్యాపారంలో ఆర్జించే అపార లాభాలతో తృప్తిపడక, పోర్చుగీసులు ఓడల దోపిడీకి తెగించి, భారతీయ నౌకల మీద దాడి ప్రారంభించారు. ఆఖరికి, మొఘల్ ప్రభుత్వ నౌక మీదనే దాడి చేశారు. జహంగీర్ పోర్చుగీసుల అఘాయిత్యానికి కోపగించి, వాళ్ళు తమ ప్రవర్తనని మార్చుకునే దాకా మొఘల్ సామ్రాజ్యంలోని వర్తకులతో వ్యాపారం చేసుకోడానికి వీల్లేకుండా చేశాడు.

ఇదే సమయంలో, భారతదేశంతో వ్యాపార సంబంధాలు పెట్టుకునే అవకాశాలు గురించి ఇంగ్లీషు వాళ్ళు ఆసక్తి ప్రదర్శించారు. ఇంగ్లీషు వాళ్ళని ఎలాగైనా వ్యాపార రంగంలోకి రానివ్వకుండా చెయ్యాలని పోర్చుగీసులు విపరీతంగా ప్రయత్నించారు. ఆ ఇద్దరి మధ్యా అసూయాద్వేషాలు పెచ్చు పెరిగిపోయిన రోజులవి. జహంగీర్ కాలంలో ఆనాటి ఇంగ్లీషు రాజు సర్ థామస్ రో అనే తన రాయబారిని ఆగ్రాకు పంపించాడు. జహంగీర్ చేత ఇంగ్లీషు వాళ్ళతో వ్యాపార ఒడంబడిక మీద సంతకం చేయించాలని సర్ థామస్ విఫల యత్నం చేశాడు. ఆగ్రా దర్బారులో దాదాపు మూడేళ్ళు గడిపాడు. జహంగీర్ ఆ ఒడంబడిక మీద ఆమోద ముద్ర వెయ్యటానికి నిరాకరించాడు. అయితే, మొఘల్ దర్బారు జీవితాన్ని గురించి సర్

థామస్ సజీవ వర్ణనలు మిగిల్చిపోయాడు.

జహంగీర్‌ని చరిత్రలో చిరస్మరణీయునిగా చేసిన కార్యాలలో "ధర్మగంట" స్థాపన ఒకటి ఆగ్రా కోటలో ఒక పెద్ద బంగారు గంట నిలిపి, దాన్ని పొడుగాటి బంగారు గొలుసుతో కోటబైట యమునా నది గట్టుపైన ఒక స్తంభానికి కట్టించాడు. ప్రభుత్వ అన్యాయానికి గురయినట్లుగా భావించే ఏ పౌరుడైనా గొలుసు లాగి గంట మోగించి తన ఫిర్యాదును అధికారికి నివేదించవచ్చునని ప్రకటించాడు. జహంగీర్ ఉద్దేశ్యం ఉదాత్తమైందే. ప్రభుత్వాధికారికి వ్యతిరేకంగా గొలుసు లాగి ఫిర్యాదు సమర్పించే గుండెలుండే వాళ్ళుఎంత మంది!

షాజహాన్ : షాజహాన్ పేరు వినగానే మనకు జ్ఞాపకం వచ్చేవి రెండు వస్తువులు— ఒకటి, తాజమహల్; రెండు, నెమలి సింహాసనం. షాజహాన్ ప్రియతమమైన భార్య ముంతాజ్ బేగం స్మృతి చిహ్నంగా నిర్మించిన సమాధి మందిరం తాజమహల్. ఇక నెమలి సింహాసనం మణి ఖచితమైన బంగారు గద్దె. పర్షియా అధిపతి నాదర్‌షా కడపటి మొఘలుల కాలంలో ఆగ్రామీద దండెత్తి, నగరాన్ని మొత్తం కొల్లగొట్టి నెమలి సింహాసనాన్ని ఇరాన్‌కు తరలించుకుపోయాడు

షాజహాన్ కాలంలో సంభవించిన ఇతర పరిణామాలు మొఘల్ సామ్రాజ్యానికి గొప్ప ప్రాముఖ్యాన్ని సంతరించి పెట్టాయి.

1628 లో జహంగీర్ మరణానంతరం షాజహాన్ మొఘల్ సింహాసనానికి వారసుడయ్యాడు. రాజ్యానికి రాగానే ఎదుర్కోవలసి వచ్చినవి- బుందేల్ ఖండ్, దక్కన్ తిరుగుబాట్లు షాజహాన్ బుందేల్‌ఖండ్ తిరుగుబాటుని సునాయాసంగా అణచివేశాడు, కాని, దక్కను తిరుగుబాటే ప్రమాదకరంగా పరిణమించింది. చివరకి, అహమ్మద్‌నగర్ రాజ్యం మొఘలుల స్వాధీనమైంది. బిజాపూర్, గోల్కొండ రాజ్యాలు లొంగిపోయి శాంతి సంధి చేసుకున్నాయి షాజహాన్ తన కుమారుడు ఔరంగజేబ్‌ని దక్కను వైస్రాయిగా నియమించాడు. ఔరంగ్‌జేబ్ ఈ రెండు రాజ్యాల్ని మొఘల్ సామ్రాజ్యంలో కలుపుకోవాలని శత ప్రయత్నించాడు. కాని, అతని ప్రయత్నాలు ఫలించలేదు. వీళ్ళుకాక, మొఘల్ అధికారాన్ని ధిక్కరించటం మొదలు పెట్టిన వేరొకళ్ళు మరాఠాలు.

దక్కన్ వ్యవహారాలు పరిష్కారమయ్యాక, షాజహాన్ దృష్టి వాయువ్య దిశకు మళ్ళింది. వాయువ్య భారతదేశ రక్షణకోసం షాజహాన్ తన సైన్యాలను మధ్యాసియాలోని బాల్క్, బదక్షాన్‌ల మీదికి ఉరికించాడు ఇరాన్‌నుంచి కాందహార్‌ని తిరిగి వశపర్చుకున్న షాజహాన్ మళ్ళీ దాన్ని పోగొట్టుకున్నాడు. ఎలాగైనా దాన్ని తిరిగి సాధించటం కోసం ముమ్మారు ప్రయత్నం చేసినా, అవి వమ్మయిపోయాయి. చివరికి, ఆ ప్రయత్నం విరమించుకొన్నాడు

పోర్చుగీసుల్తో షాజహానుక్కూడా ఇబ్బంది వచ్చి పడింది పోర్చుగీసులు తమ హుగ్లీ స్థావరం నుంచి ఓడల దోపిడీ ఉధృతం చేశారు మొఘల్ సైన్యాలు వాళ్ళని హుగ్లీనుంచి తరిమివేసి, ఈశాన్య దిశగా పురోగమించి కామరూపని (అస్సాం) ఆక్రమించాయి

ఇంతలో షాజహాన్ నూతన రాజధానీ నగరాన్ని నిర్మించాడు అదే షాజహానాబాద్, ప్రస్తుతం ఢిల్లీలో ఒక భాగం. 1657లో షాజహాన్ జబ్బు పడ్డాడు అతని కుమారులు నలుగురూ సింహాసనం కోసం

పరస్పరం తలపడ్డారు ఆ వారసత్వ యుద్ధంలో ఔరంగ్‌జేబ్ గెలుపొందాడు. తండ్రిని ఆగ్రాకోటలో బందీగా ఉంచాడు. షాజహాన్ ఆగ్రా కోటలో కూర్చుని తాజమహల్‌ని వీక్షిస్తూ భార్య ముంతాజ్ బేగంని తలుచుకునేవాడు. 1666 లో మరణించినప్పుడు, ఆయన భౌతిక కాయాన్ని తాజమహల్‌లో భార్య సమాధి ప్రక్కనే భూస్థాపితం చేశారు.

*ఔరంగజేబ్* . ఔరంగజేబ్ తన సోదరులందర్నీ ఓడించి 1658లో సింహాసనం ఎక్కాడు. 50 సంవత్సరాల సుదీర్ఘ కాలం రాజ్యం చేశాడు. కాని, అతని పరిపాలనా కాలం యావత్తు కలతలతో నిండి పోయింది. సామ్రాజ్యమూ అతి సువిశాలమైంది; దాదాపు యావద్భారతం అతని ఏలుబడికిందికి వచ్చింది. కాని, పరిపాలనలో అనేక మార్పులు సంభవించాయి. మొఘల్ పరిపాలనా పద్ధతి అక్బర్ కాలం నాడు ఉన్నట్టుగా లేదు. సామ్రాజ్యంలో అనేక ప్రాంతాల్లో ప్రజలు తిరుగుబాట్లు జరిపారు. దాంతో, ఔరంగజేబ్ పాట్లు మొదలయ్యాయి. ఆ తిరుగుబాట్లని అణచివేసే ప్రయత్నంలోనే అతని సమయమంతా వ్యర్థమై పోయింది.

దక్కన్‌లోని బిజాపూర్, గోల్కొండ రాజ్యాలు నిజానికి మొఘల్ సామ్రాజ్యంలో కలిసిపోలేదు. అయితే, ఔరంగజేబ్ పరిపాలనా కాలం నాటికి అవి బాగా బలహీనమైపోయాయి ఇదిలా ఉండగా, మహా రాష్ట్రులు బలం పుంజుకున్నారు. ఈ దక్కన్ రాజ్యాల్ని మహారాష్ట్రులు చిత్తు చెయ్యకుండా ఆపాలంటే దక్కనుకు తన సైన్యాల్ని ఉరికించక తప్పదని ఔరంగజేబ్ భావించాడు మహారాష్ట్రుల విజృంభణ ప్రారంభం కావటంతో దక్కన్‌లో చిక్కులు మరింత ఎక్కువయ్యాయి.

*మహారాష్ట్రులు :* మహారాష్ట్రులు దక్కన్ సుల్తాన్లకు లోబడిన చిన్న సామంత ప్రభువులు దక్కన్ రాజ్యాలలోను, మొఘల్ సామ్రాజ్యంలోను చాలా మంది మహారాష్ట్రులు అధికార్లుగా పనిచేశారు. దక్కన్ రాజ్యాల మీద మొఘల్ దాడులు కొనసాగటంతో, మహారాష్ట్రులు దక్కన్ సుల్తాన్లకు దూరంగా జరిగిపోవటం మొదలయింది. చిన్న చిన్న నాయకులు సైనికుల్ని పోగుజేసి, బలం చూసుకుని దక్కన్ రాజ్యాల్ని ధిక్కరించటం ప్రారంభించారు. పూనా, కొంకణల చుట్టూ వాళ్ళు నివసించే గ్రామీణ ప్రాంతం పర్వతమయమై వుండటంతో, వాళ్ళు ధిక్కార చర్యలు సాగించటానికి వీలయింది. దక్కన్ రాజ్యాల సేనలు వాళ్ళని అణచి వెయ్యటానికి కదలి రాగానే, కొండల్లోకి పారిపోయేవాళ్ళు. గెరిల్లా యుద్ధపు ఎత్తుగడలు అను సరించటం ద్వారా వాళ్ళు మొఘల్ సైన్యాల్ని సైతం వేధించుకుతిన్నారు. క్రమేణా, మహారాష్ట్రులు ఎంతగా బలపడి పోయారంటే, స్థానిక ప్రభువుల్ని మాత్రమే కాకుండా మొఘలుల్ని సైతం ఖాతరు చెయ్యని స్థితికి ఎదిగారు.

ఈ మరాఠా నాయకులందర్లో అతి బలమైన వాడు శివాజీ. అతని తండ్రి బిజాపూర్ సుల్తానుకు సామంతుడు; బిజాపూర్ సైన్యంలో పని చేశాడు. కాని శివాజీకి పెద్ద పెద్ద కోరికలున్నాయి. బిజాపూర్ బలహీన స్థితి చూసి, ఇతడు స్వతంత్రం ప్రకటించాడు. బిజాపూర్ సుల్తాను అఫ్‌జల్ ఖాన్ అనే తన సేనానిని శివాజీ పైకి పంపాడు అతడు శివాజీ చేతుల్లో ప్రాణాలు కోల్పోయాడు తరువాత, ఔరంగజేబ్ జైసింగ్ అనే తన అధికారిని శివాజీతో మంతనాలకు పంపాడు. మహారాష్ట్రులు ఎంత బలపడిపోయారో తెలుసుకున్న జైసింగ్ మరాఠాలకు మొఘలులకు మధ్య సంధి కూర్చవలసిన అవసరాన్ని గుర్తించాడు.

శివాజీని ఔరంగజేబ్ దర్బారుకు విచ్చేయమని జైసింగ్ ఒత్తిడి చేశాడు. కాని శివాజీ స్వతంత్ర పూరితమైన సంస్కారం, ప్రవర్తన చక్రవర్తికి ఓ ంగుడు పడక, అతణ్ని కారాగారంలో వేయించాడు. శివాజీ యుక్తిగా కారాగారం నుంచి తప్పించుకుని పారిపోయాడు ఔరంగజేబ్ చేసిన అవమానంతో పగబట్టిన శివాజీ మొఘల్ సామ్రాజ్యాన్ని చీకాకు పర్చటానికి నిశ్చయించుకున్నాడు. మరాఠా ఛత్రపతిగా ప్రకటించుకొని, శివాజీ 1674లో పట్టాభిషేకం జరుపుకున్నాడు. ఆ తరువాత ఆరేళ్ళపాటు అంటే 1680లో మరణించే వరకు శివాజీ శక్తివంతమైన మహారాష్ట్ర రాజ్యాన్ని నిర్మించటంలో కృతకృత్యుడయ్యాడు.

శివాజీ తన కృషిలో విజయం సాధించగలగడానికి రెండు కారణాలున్నాయి. ఒకటి- దక్కను మీద మొఘల్ ఆధిపత్యం నిర్వీర్యమై పోయింది. దక్కనులో తిరుగుబాట్లు చెలరేగినా, సామంతులు విడిపోయి స్వతంత్రం ప్రకటించినా మొఘల్ ప్రభుత్వం యేమీ చెయ్యలేక పోయింది. రెండు- ఖారీ రెవెన్యూ సమకూరేలా మహారాష్ట్రులు రెవెన్యూ విధానాన్ని రూపొందించుకొని, సుశిక్షితమైన సైన్యాన్ని పోషించగలిగారు.

మరాఠా రాజ్యానికి రాజు సర్వాధికారి అష్టప్రధానులనే ఎనిమిది మంది మంత్రులతో కూడిన మండలి రాజుకు సలహాలిచ్చి సహాయ పడింది ఆదాయం ప్రధానంగా భూమి శిస్తు ద్వారా లభ్యమైంది. పండిన పంటలో అయిదింట రెండు వంతులు ప్రభుత్వానికి ముట్టవలసి వుండేది. కాని, యదార్థంగా రైతుల వద్ద ఎంత వసూలు చేశారో ఖచ్చితంగా తెలీదు. మరాఠా రాజ్యం లోపల జీవించే రైతులకు సంబంధించినంత వరకు భూమి శిస్తు రేటు అలా ఉంది. మహారాష్ట్ర వెలుపల జీవించే ప్రజల మీద (మొఘలుల లేదా దక్కన్ సుల్తానుల అధీనంలోని ప్రాంతాలు) రెండు రకాల పన్నులు విధించబడ్డాయి. ఒకటి - చౌత్ పన్ను; అంటే మొఘల్ ప్రభుత్వానికి చెల్లించే రెవెన్యూలో నాల్గవ వంతు. మహారాష్ట్ర రాజ్య పరిధికి బైటవున్న ప్రాంతాల మీద తాము దాడులు, దోపిడీలు చెయ్యబోమని ఇచ్చిన వాగ్దానానికి ప్రతిఫలంగా మహారాష్ట్ర ప్రభుత్వం చౌత్ పన్ను వసూలు చేసింది. రెండవది- సర్దేశ్ ముఖి పన్ను. అంటే, చౌత్ పన్నుకు అదనంగా ఇంకా పది శాతం చెల్లించే పన్ను. కాబట్టి, మరాఠా రాజ్యానికి వెలుపల నివసించే ప్రజలు ఈ అదనపు పన్నుల భారాన్ని మోయవలసి వచ్చింది. ఈ విధంగా వసూలైన ధనం యావత్తు మరాఠా రాజ్య నిర్మాణానికి వినియోగింపబడింది దీన్ని బట్టి, దక్కనులో మొఘలుల నిర్వీర్యత స్పష్టమవుతుంది.

శివాజీ తరువాత వచ్చిన వాళ్ళు చాలా బలహీనులు. ఆ వారసుల పరంపరలో ఒక్క తారాబాయి మాత్రం సమర్థురాలు. కుమారుడు పసివాడు కావటం చేత అతని తరఫున రాజ ప్రాతినిధ్యం వహించి రాజ్య పాలన చేసిన మహిళ, రాణి తారాబాయి. రాజులు అసమర్థులు, అశక్తులు కావటంతో ప్రభుత్వం క్రమేణా పీష్వాలనబడే బ్రాహ్మణ మంత్రుల చేతుల్లోకి జారిపోయింది. తరువాత తరువాత ఈ పీష్వాలు విపరీతంగా బలపడిపోయారు. ఔరంగజేబ్ జీవించి వున్నంత కాలం, మరాఠాల మీద మొఘలుల అదుపు ఎంతో కొంత ఉండేది. ఔరంగజేబ్ చనిపోయాక, మహారాష్ట్రులు అమోఘబలంతో విజృంభించి, భారతదేశంలో ప్రబల శక్తిగా రూపొందారు.

*మొఘల్ సామ్రాజ్యంలో ఇతరేతర తిరుగుబాట్లు :* ఔరంగజేబ్ పరిపాలనలో అనేక తిరుగుబాట్లు చెలరేగాయి. అవన్నీ సామంతులు, చిన్న చిన్న రాజులు జరిపిన తిరుగుబాట్లు కావు. రైతాంగం క్రియాశీలంగా పాల్గొన్న తిరుగుబాట్లు కూడా ఉన్నాయి. మథురా మండలంలో జాట్లు తిరుగుబాటు చేశారు.

అక్బర్ కాలంలో పండిన పంటలో మూడవ వంతుగా నిర్ణయించబడ్డ పన్ను క్రమేణా పెరిగి పంటలో సగం పన్ను కింద కట్టవలసి రావటంతో రైతులు ఆందోళన చేశారు. ఇది రైతులకు తలకి మించిన బరువు. అయినా, ఔరంగజేబ్ పన్నుని తగ్గించలేక పోయాడు. భారీ సైన్యాల్ని పోషించటానికి భారీగా డబ్బు అవసరం కాబట్టి అతడు పన్ను తగ్గింపునకు విముఖత ప్రదర్శించాడు.

దక్కనులో చిక్కులు ఎక్కువ కావటంతో ఇప్పుడు మొఘల్ సైన్యాలు పూర్తిగా దక్కనులో ఇరుక్కుపోయాయి బిజాపూర్, గోల్కొండ రాజ్యాలపైకి సాగిన దండయాత్రలు అంతిమ విజయం సాధించటానికి ఎన్నో యేళ్ళు పట్టింది. చిట్ట చివరకి, 1686, 1687లో బిజాపూర్, గోల్కొండ రాజ్యాలు మొఘల్ సామ్రాజ్యంలో కలిసిపోయాయి. ఇంతలో, ఔరంగజేబ్‌కు రాజపుత్రులతో బెడద వచ్చిపడింది రాజస్థాన్‌లో ప్రముఖ రాజ్యాలైన మేవాడ్, మార్వార్‌లు ఔరంగజేబుతో సంఘర్షణకు తలపడ్డాయి

ఒక వేపు ఇన్ని గొడవలతో సతమతమవుతూ, మరోవేపు సిక్కులకు వ్యతిరేకంగా మొఘలులు పరంపరగా దండ యాత్రలు ప్రారంభించారు. ఇది చాలా అవివేక చర్య. పంజాబ్ బహు సారవంతమైన ప్రాంతం; మొఘల్ సామ్రాజ్యానికి పంజాబు నుంచి పుష్కలంగా ఆదాయం అందుతోంది. పన్నుల సమస్య మత సమస్యలతో ముడిపడింది.

సిక్కులు : గురునానక్ అనుయాయులుగా ప్రారంభమైన సిక్కులు ఆయన బోధించిన నూతన మతానికి అంకితమై పోయారు. 17వ శతాబ్దం నాటికి సిక్కు ధర్మం మతంగా రూపెత్తింది. పంజాబ్‌లో అనేక ప్రాంతాల్లో సిక్కు మతం రైతాంగంలో వృత్తి పనివారిలో అల్లుకుపోయింది.

గురునానక్ తరువాత తొమ్మండుగురు గురు పరంపర సాగింది. వెనకటి గురువులు ప్రధానంగా సిక్కుమత ధర్మం మీదనే తమ దృష్టి కేంద్రీకరించారు. కాలక్రమేణా, ఈ గురువులు సిక్కు మతస్థుల సైనిక నేతలుగా రూపొందారు. ఏడవ గురువు నిర్యాణం చెందాక గురు పీఠానికి వారసుని నిర్ణయంలో ఏర్పడ్డ వివాదాల్ని ఔరంగజేబ్ తన కనుకూలంగా తిప్పుకోడానికి తిప్పలుపడ్డాడు. ఈలోగా సిక్కుల ప్రాబల్యం పెరిగిపోసాగింది. సిక్కుల ప్రాబల్యాన్ని అణచివేసే ప్రయత్నంలో భాగంగా మొఘల్ ప్రభుత్వం 1675లో గురుతేజ్ బహదుర్ తల తీయించింది. దీంతో సిక్కు ప్రజల్లో తీవ్ర వ్యతిరేకత పెచ్చరిల్లింది. సిక్కు గురు పరంపరలో పదవ, చిట్టచివరి గురువు గోవిందసింగ్ సిక్కులను సైనిక వీరులుగా సంఘటిత పర్చి మొఘల్ సైన్యాలకు వ్యతిరేకంగా యుద్ధ సన్నద్ధుల్ని చేశాడు. గురు గోవింద్ సింగ్ కాలంలో సిక్కులు "ఖాల్సా"లుగా మారారు. "ఖాల్సా" అంటే పరిశుద్ధులని అర్థం. ఆయన ఆధ్వర్యంలో సిక్కులు యోధ బృందాలుగా సంఘటితులయ్యారు. ఇంకా, ఆఫ్ఘనిస్థాన్‌లోని సైనికుల్ని కూడా సిక్కు సైన్యంలోకి చేర్చుకున్నారు. మహారాష్ట్రుల మాదిరిగా, సిక్కులు కూడా అనేక చోట్ల దాడులు నిర్వహించారు. కాని, మరాఠాల వలె సిక్కులు ఔరంగజేబ్ కాలంలో స్వతంత్ర సిక్కు రాజ్యాన్ని స్థాపించలేక పోయారు. అయితే, 18వ శతాబ్దంలో స్వతంత్ర సిక్కు రాజ్యం అవతరించింది.

ఆ విధంగా, ఒక మత ఉద్యమంగా ప్రారంభమైన సంస్థ రాజకీయ ఉద్యమంగా రూపొందింది. సిక్కుల తిరుగుబాటును అణచివెయ్యగల సత్తా మొఘల్ ప్రభుత్వం కోల్పోయింది. 18వ శతాబ్దంలో మొఘలులు ఇంకా నిర్వీర్యమై పోయారు. ఎవరికి వారు తమకు చిక్కిన భూభాగాన్ని చకచకా ఆక్రమించేసు

కున్నారు. సిక్కు నాయకులు ఈ అదను కనిపెట్టారు.

ఔరంగజేబ్‌కు పోర్చుగీసుల్తో, ఇంగ్లీషు వాళ్ళతో సైతం సమస్యలు తలెత్తాయి. పోర్చుగీసులు మళ్ళీ బంగాళాఖాతంలో ఓడల దోపిడీ కార్యక్రమం చేపట్టారు. ఈ సారి చిట్టగాంగుని స్థావరంగా చేసుకున్నారు. మళ్ళీ మొఘల్ సైన్యాలకు పనిపడింది. మొఘల్ సైన్యం పోర్చుగీసుల్ని చిట్టగాంగునుంచి తరిమివెయ్యటమే కాకుండా, తూర్పుబెంగాల్‌ని సైతం ఆక్రమించుకున్నారు. ఇక, భారత పశ్చిమతీరంలో ఇంగ్లీషు ఓడ దొంగలు భారతీయ నౌకలమీద దాడులు సాగిస్తున్నారు. మొఘల్ ప్రభుత్వం మండిపడిపోయింది. ఇంగ్లీషు వర్తకులకి ఆ రోజుల్లో సూరత్‌లో ఒక ఫ్యాక్టరీ ఉండేది. అక్కడనుంచి వాళ్ళు భారతదేశంతో వ్యాపారం సాగించేవాళ్ళు. భారతదేశపు ఓడలమీద దాడులు జరపటం మానుకొని, లోగడ జరిపిన నేరానికి లక్షన్నర రూపాయలు జరిమానా చెల్లిస్తేనే తప్ప ఇంగ్లీషు వాళ్ళకి ఈ దేశంతో వ్యాపారం జరుపుకునే అనుమతి ఇచ్చేది లేదని మొఘల్ ప్రభుత్వం తీవ్రంగా బెదిరించింది. ఇంగ్లీషు వర్తకులు జడిసిపోయి, జరిమానా చెల్లించి, దోపిడీ కార్యక్రమాన్ని విరమించుకున్నారు.

ఔరంగజేబ్ కడపటి పరిపాలనా కాలం నాటికి మొఘల్ సామ్రాజ్యానికి అక్బరు కాలం నాడున్న జవసత్వాలు హరించుకుపోయాయి. నిజానికి, సామ్రాజ్యం విచ్ఛిన్నం కాసాగింది. ఔరంగజేబ్‌కి తన సామ్రాజ్యంలో ఏం జరుగుతున్నదో నిజంగా తెలీదు. పరిస్థితులు అసలే అదుపు తప్పిపోతుంటే వాటిని ఇంకా అధ్వాన్నం చేసుకుందుకు, ఔరంగజేబ్ ఒక ఛాందస ముస్లిం కూటమి ప్రభావంలో పడిపోయి ఇస్లాం చట్టాల ప్రకారం మాత్రమే రాజ్యపాలన నిర్వహించాలని నిర్ణయించుకున్నాడు. అతనికి ముందు పరిపాలించిన చక్రవర్తుల ఔదార్యానికి, మత సహనానికి ఇది విరుద్ధమైంది అంతేకాకుండా, భిన్న జాతుల, మతాల ప్రజలు ఒకేచోట పోగుబడి జీవించే భారతదేశంలాంటి దేశానికి ఔరంగజేబ్ విధానం పనికిరాదు. ఏ రకమైన మత ఛాందసత్వం పనిచెయ్యలేని దేశానికిది తప్పుడు విధానం అక్బరు పాదుషా అవగాహన చేసుకున్నట్లు ఔరంగజేబ్ భారతదేశ సమస్యల్ని అర్థం చేసుకోలేదు.

*మొఘల్ దర్బారులో మతం* 17వ శతాబ్దంలో మొఘల్ దర్బారు రెండు వర్గాలుగా చీలిపోయింది. ఒక వర్గం మత సంప్రదాయకతని బలపరిస్తే, రెండవ వర్గం ఉదార వైఖరుల్ని బలపర్చింది. భారతదేశంలో ముస్లిములు తాము ఇస్లాం మతంలోకి మారకపూర్వం ఏ జీవన పద్ధతుల్ని, సంప్రదాయాల్ని అనుసరించే వారో వాటినే ఇంకా అంటిపెట్టుకున్నారు. వాళ్ళలో చాలామంది ఉదారభావాలతో ప్రభావితులయ్యారు. ఉదారవాదులైన ముస్లిములు వెనక అక్బర్, ఆయన మాదిరిగా ఆలోచించినవాళ్ళు నెలకొల్పిన సంప్రదాయంలో కొనసాగుతున్నారు. ఉదారవాదుల్లో సుప్రసిద్ధుడైనవాడు యువరాజు దారాషికో. అతడు గొప్ప మేధావి, విద్యాధికుడు. 19వ యేటనుంచీ దారాషికో మతం గురించి, వేదాంతం గురించి రాయసాగాడు. సూఫీ, వేదాంత చింతనలమీద అతడు రాసిన గ్రంథం చాలా ప్రసిద్ధమైంది. ఆ రెండు తాత్విక ధోరణుల మధ్యగల అనురూపతని అతడు తన గ్రంథంలో అద్భుతంగా చూపాడు. దారాషికో 1657 లో ఉపనిషత్తుల్ని పర్షియన్ భాషలోకి అనువదించాడు. (ఈ అనువాదమే 1801 లో లాటిన్ భాషలోకి తిరిగి తర్జుమా అయింది. అప్పుడే ఐరోపా తత్వవేత్తలకి మొట్టమొదటిసారిగా ఉపనిషత్తులతో పరిచయం కలిగింది) దురదృష్టవశాత్తు, సింహాసనం కోసం అతనికి-ఔరంగజేబ్‌కి మధ్య జరిగిన వారసత్వ యుద్ధంలో దారాషికో

మరణించాడు.

మత నిష్ఠాపరులకి నాయకత్వం వహించినవాడు, షేక్ అహ్మద్ సర్హింది. ఈయన అక్బరు జహంగీర్ల కాలంలో జీవించాడు. ఉజ్వల మేధా సంపన్నుడు, మనస్సుకు హత్తుకునేటటుబోధించిన మహోపాధ్యాయుడు. అంచేత, దర్బారులో అనేకమందిని ఆయన బోధలు ఆకర్షించాయి. ఆయన జీవించి వున్నప్పుడే కాకుండా, మరణించాక కూడా ఆయన బోధల చేత ప్రభావితులైన వాళ్ళు అనేక మంది. ఆయన నెలకొల్పిన విద్యాకేంద్రంలో ఆయన అనుయాయులు, శిష్యులు తమ గురువు చేసిన కృషిని కొనసాగించారు.

ఔరంగజేబ్ ముస్లిం నైష్ఠికుడైనా తన మత విశ్వాసాల్ని చిత్తశుద్ధితో నమ్మాడు. దర్బారు విలాస వైభోగాలు చూసి అసహ్యించుకున్నాడు. మతానికి అంకితమైపోయి బహు నిరాడంబర జీవితాన్ని గడపాలని కాంక్షించాడు. ముస్లిములు కాని ప్రజలమీద జిజియా పన్ను విధించినప్పుడు, దేవాలయాల్ని పడగొట్టించినప్పుడు ఔరంగజేబ్ ప్రజల్లో ఆదరణ కోల్పోయాడు. రాజుయొక్క ధర్మం పరిపాలించటం, అదీ సమర్ధవంతంగా పరిపాలించటమనీ, ప్రభుత్వ వ్యవహారాల్లో మత జోక్యాన్ని అనుమతించకూడదనీ ఔరంగజేబ్ గ్రహించలేదు.

ఆదాయం : జహంగీర్ పరిపాలనా కాలం మొదలుకుని 17వ శతాబ్దంలో విలాస జీవితం గడపటం, అందినంతమట్టుకు సంపద పోగేసుకోవటం ఫ్యాషన్‌గా మారిపోయింది. కులీనులు, ఉన్నతాధికార్లు గొప్ప గొప్ప భవనాల్లో జీవించారు; అతి నాజూకైన దుస్తులు ధరించారు; వజ్రవైఢూర్యాలు పొదిగిన ఆభరణాలు ధరించారు; సంగీత విద్వాంసులు, గాయకుల కచేరీలలో గాన సుధలు గ్రోలుతూ మైమరచిపోయారు. అతులిత వైభవ, విలాసాలకు మొఘల్ దర్బారు ఒక ప్రతీక అయింది. పాదుషా వేటకి బయలుదేరితే, దారి పొడుగునా భారీగా ఖరీదైన ఏర్పాట్లు జరిగాయి. ప్రభుత్వాదాయం పెచ్చు పెరిగిపోబట్టి, అంతటి వైభవోపేత జీవితం సాధ్యమైంది. రైతాంగం, కర్మకారులు కఠోర శ్రమ చేయబట్టి, ప్రభుత్వానికి అమితమైన ఆదాయం వచ్చిపడింది

రైతులకు ఏ విలాసాలూ లేవు. శతాబ్దాల తరబడి రైతులు రాత్రింబగళ్ళు పొలాల్లో రెక్కలు ముక్కలు చేసుకుంటున్నారు. సక్రమంగా శిస్తు కట్టగలిగేలాగు మంచిగా పంట పండితే చాలునన్నదే వాళ్ళ చింత. 17వ శతాబ్దంలో రైతు పంటలో సగం పన్నులకిందే కట్టేశాడు. పండిన పంటలో మూడవవంతు నుంచి సగభాగానికి పన్ను పెరగటంతో రైతు జీవితం దుర్భరమైంది. పన్నుల రూపేణా అదనంగా ఎంత మొత్తం వసూలయితేనేం అంతా హరించుకుపోయింది. సామ్రాజ్యం తెగ పెరిగిపోయిన కొద్దీ, పరిపాలనా నిర్వహణకు అధికార్ల నియామకాలు పెరిగిపోయాయి. వాళ్ళందరికీ జీతాలు పంచాలి ఇంకా సైన్యాన్ని పోషించాలి ఇవన్నీ కాక, మొఘల్ దర్బారు విలాస వైభోగాలకు ఇంకా చాలా డబ్బుకావాలి.

వ్యాపారరంగం నుంచీకూడా ప్రభుత్వానికి చాలా ఆదాయం వస్తుంది కాబట్టి వృత్తి పనుల వాళ్ళు కూడా ఒళ్ళొంచి పని చెయ్యాలి. ఆనాడు భారతదేశం పర్షియాతో, చైనాతో, తూర్పు ఆఫ్రికాతో, రష్యాతో, పశ్చిమ యూరప్‌తో వ్యాపారం సాగిస్తోంది. పోర్చుగల్, ఇంగ్లండ్ మొదలైన అనేక యూరోపా దేశాలనుంచి సరుకుల ఓడలు భారతదేశ రేవుల్లో ఆగి భారీగా సరుకులు నింపుకుని లంగరెత్తేవి భారతీయ

వర్తకులు తమ సరుకుని అధిక ధరలకు అమ్మేవాళ్ళు. అట్లా వచ్చిన సొమ్ముకూడా భారతదేశ సంపదని పెంచింది. వ్యాపారం ప్రధానంగా హిందూవర్తకుల చేతుల్లో ఉండేది. వ్యాపారం అభివృద్ధి అయినకొద్దీ, పట్టణాల్లో వృత్తిపని వాళ్ళకి ఉద్యోగావకాశాలు పెరిగాయి. నగరాలు వర్ధిల్లాయి. ఆనాటి యాత్రికులు లాహోర్, ఢిల్లీ, ఆగ్రా, బనారస్, సూరత్, మచిలీపట్నం వంటి నగరాల సౌభాగ్య సంపదలు గురించి విశేషంగా వర్ణించారు. ఐరోపా వర్తకులకు భారతీయ చేనేత వస్త్రాలమీద మహా మోజు. ఢాకా మఖ్మల్ వస్త్రాల్ని; బెనారస్ పట్టుబట్టల్ని; సూరత్, అహమ్మదాబాద్, మధురై నూలు బట్టల్ని వాళ్ళు ఎగబడి కొనుక్కుపోయేవాళ్ళు. మలబార్‌లో దొరికే మిరియాలకు విదేశీవర్తకుల నుంచి విపరీతమైన గిరాకీ ఉండేది.

భారతదేశంతో వ్యాపారం పట్ల ఇంగ్లీషు వాళ్ళకి ఆసక్తి మరీ ఎక్కువై పోయింది. ఇంగ్లీషు వర్తకులంతా కలిసి ఈస్టిండియా కంపెనీ అనే సమాఖ్యగా ఏర్పడ్డారు. వాళ్ళు మొట్టమొదట సూరత్‌లో ఒక ఫ్యాక్టరీ కట్టుకుని, తరువాత నెమ్మదిగా ఇతర కోస్తా ప్రాంతాలకి వ్యాప్తి చెందారు. బెంగాల్‌లో తమ యిష్టం వచ్చినచోట వ్యాపారం చేసుకొనేందుకు అనుమతి సంపాదించారు. ఆ హక్కు ప్రసాదించినందుకు గాను స్థానిక గవర్నరుకు ఇంగ్లీషు వర్తకులు స్వల్ప మొత్తం సమర్పించుకున్నారు. ఈస్టిండియా కంపెనీ ఆర్జించిన లాభాలతో పోలిస్తే, వాళ్ళు చెల్లించిన సొమ్ము సముద్రంలో కాకి రెట్ట.

*వాస్తుశిల్పం-కళలు :* మొఘల్ ప్రభుత్వ ఆదాయం పెరిగిపోయినకొద్దీ దర్బారులో విలాసాలు తారాస్థాయికి చేరుకోటమే కాకుండా చక్రవర్తులు నిర్మించే భవనాలు కళానైపుణ్యంలో, లాలిత్యంలో మరింత సుసంపన్నంగా రాజిల్లాయి. అక్బర్ కాలంలో భవనాలన్నీ ఎరుపు ఇసుకరాతితో నిర్మించబడితే, తరువాతి చక్రవర్తుల కాలంలో రాజస్థాన్ నుంచి తెప్పించిన ఖరీదైన పాలరాతితో భవన నిర్మాణం జరిగింది. ఢిల్లీ, ఆగ్రా, లాహోర్ కోటలలో కట్టిన రాజప్రాసాదాలు, మసీదులు, ఆగ్రాలో ఇత్‌మద్-ఉద్-దౌలా గోరీ పాలరాతి కట్టడాలు.

షాజహాన్ రూపకల్పన చేసి, కట్టించిన బ్రహ్మాండమైన సుందర భవనాలు ఆయన పరిపాలనా కాలాన్ని చరిత్రలో చిరస్మరణీయం చేశాయి. రెండు కారణాలవల్ల ఇవి మహా సుందరమైనవిగా కీర్తించ బడుతున్నాయి. ఒకటి— ఈ భవనాలు దేశ, విదేశ రమణీయ వాస్తు కళా విశేషాల అపూర్వ సమ్మేళనాన్ని ప్రతిబింబిస్తాయి గుమ్మటం ఆకారంలో రకరకాల గుండ్రటి పై కప్పులు, వివిధాలంకృతమైన ఆర్చీలు, మిన్నంటే స్తంభాకార గోపురాలు, బాల్కనీలు, విశాలమైన వాలు ముంజూర్లు, చిన్న మంటపాలు, ఇంకా భారతీయ వాస్తు శిల్పకళలో సర్వసాధారణంగా కనిపించే ఇతరేతర అలంకార శైలీ విశేషాలు-ఎన్నో అందంగా సాక్షాత్కరిస్తాయి. రెండు — భవన నిర్మాణంలో వివిధ భాగాలమధ్య చక్కని పొందిక, సమ తూకం సాధించబడింది. ఈ రెండు కారణాలవల్ల తాజమహల్ ప్రపంచ ప్రసిద్ధిపొందింది.

ఔరంగజేబ్ కాలంనాటికి, క్షీణ యుగం ఆరంభమైంది. మొఘల్ వాస్తుకళ పూర్వ వికాసాన్ని కోల్పోయింది. ఈ కాలంలో నిర్మాణం కాబడ్డ భవనాలు వెనుకటి భవనాలకు నకళ్ళుగా తయారయ్యాయి. గతకాలపు వస్తువులకు కేవలం నకళ్ళు తియ్యటం ప్రారంభమైందంటే మనుషులకు సంతంత్రమైన కల్పనా శక్తి, సృజనశీలత నశించాయని భావించాలి.

మొఘల్ చక్రవర్తులందర్లో, చిత్రలేఖనాన్ని విశేషంగా అభిమానించినవాడు జహంగీర్. ప్రతి



నుదుట నామాలు తీర్చిన వైష్ణవ బ్రాహ్మణుడు. దక్కన్ చిత్రకళా శైలిని ప్రతిబింబించే 18వ శతాబ్ది మధ్యకాలపు మహారాష్ట్ర మీనియేచర్ చిత్తరువు

చిత్రకారుణ్ణి అతని శైలినిబట్టి గుర్తించేవాడు. బిషన్‌దాస్, మురాద్, మన్సూర్, బహ్‌జాద్ మొదలైన ఆనాటి మహోత్తమ చిత్రకారులెందరో జహంగీర్ దర్బారుకు ఆకర్షితు లయ్యారు. ఇతర చిత్రకళా సంప్రదాయాల్ని కూడా ఆసక్తితో గమనించవలసిందిగా జహంగీర్ తన చిత్రకారుల్ని ప్రోత్సహించాడు. ఇంగ్లండ్ నుంచి మొదటి జేమ్స్‌రాయబారిగా వచ్చిన సర్ థామస్ రో కొన్ని యూరోపియన్ చిత్రాల్ని చూపించినప్పుడు, జహంగీర్ ఐరోపా చిత్ర కళా పద్ధతులు తెలుసుకోవాలని ఉవ్విళ్ళూరాడు. ఔరంగజేబ్ రాజ్యానికి రాగానే అంతా మారిపోయింది. చిత్రలేఖనం అతనికి గిట్టదు తన దర్బారులో చిత్రకారులు చిత్తరువులు గీయటం నిలుపుచేశాడు. వాళ్ళంతా వివిధ రాష్ట్ర రాజధానులకు తరలిపోయి, చిత్ర కళాభిరుచి ఉన్న స్థానిక గవర్నర్ల కొలువులో చేరారు. కొందరు పంజాబ్‌లో, కాంగ్రా, గఢ్‌వాల్ వంటి చిన్న చిన్న రాజ్యాలకు; రాజస్థాన్‌లో, మేవాడ్, బికనీర్, బుందీ, కోట, కిషన్‌గఢ్ వంటి స్థలాలకు తరలిపోయారు. ఇదే కాలంలో బిజాపూర్ సుల్తాన్ల ఆదరణలో దక్కన్ చిత్రకళా సంప్రదాయం వర్ధిల్లింది. మొఘల్ చిత్రకారులు తరలివెళ్ళిన ఆయా స్థలాల్లో చిత్రకళలో అభిరుచి పెంపొందింది. 18వ శతాబ్దపు అత్యుత్తమ చిత్రాలు కొన్ని ఆ విధంగా రూపొందాయి

*సంగీతం*. పూర్వపు రాజులు తమ ఆస్థానాల్లో నియమించుకున్న సంగీత విద్వాంసుల సంఖ్యని చూసి గర్వపడే వాళ్ళు. మొఘల్ దర్బారులో హిందుస్థానీ సంగీతానికి గొప్ప ఆదరణ ఉండేది. కాని ఔరంగజేబ్ తన కడపటి రోజుల్లో సంగీతం పట్ల అయిష్టత పెంచుకున్నాడు దర్బారులో ప్రోత్సాహం కరువై సంగీత విద్వాంసులు చాలామంది రాష్ట్రాలకు, చిన్న చిన్న రాజ్యాలకు వెళ్ళిపోయారు. నవాబుల కొందరికింకా సంగీతాభిమానం ఉండటంచేత, కొందరు విద్వాంసులు మాత్రం దర్బారులో మిగిలిపోయారు. మొఘల్ దర్బారులో వికసించిన ఖయాల్‌వంటి నూతన గాన ధోరణులు, ఠుమ్రీ సంగీత శైలి రాష్ట్రాలలో కొత్త కేంద్రాలలో జనాదరణ పొందాయి.

*సాహిత్యం* మొఘల్ చక్రవర్తులు సాహిత్య పాండిత్యా పోషకులు ఈ రెంటిలోనూ వాళు నిజమైన ఆసక్తి ప్రదర్శించారు. ఆ మాట కొస్తే - రాజకుటుంబంలోనే ఉత్తమ సాహితీ కర్తలు, పండితులు ప్రభవించారు. భారతీయ పండితుల శాస్త్రీయ విజ్ఞానాన్ని విప్పి చెప్పే ఒక పాఠ్యగ్రంథాన్ని ఔరంగజేబ్ తన మనుమని కోసం తయారు చేయించాడు. పారశీకం అధికార భాషగా కొనసాగింది. గ్రామాల్లో, చిన్న చిన్న పట్టణాల్లో ప్రజలు హిందీ, ఉర్దూ భాషల్ని వాడారు. కబీర్, తులసీదాస్‌లు మాత్రమే కాక, ఇంకా ఇతర కవుల కవితలు కూడా జనాదరణ పొందాయి. ఉదాహరణకు - ఆగ్రా అంధకవి భక్తసూరదాస్ పాటలు నేటికీ ప్రజలు పాడుకుంటున్నారు రాస్‌ఖాన్ అనే ముస్లిం కులీనుడు కృష్ణుని కథ వర్ణిస్తూ "ప్రేమ్ వాటికా" అనే కావ్యం రాశాడు. అనేకమంది కవులు ఉర్దూలో కవితా రచన ప్రారంభించారు 18వ శతాబ్దంలో ఢిల్లీ, లక్నో నగరాలు ఉర్దూ కవితా కేంద్రాలుగా వర్ధిల్లాయి.

17వ శతాబ్దం భారత చరిత్రలో ఒక వైభవోజ్వల శకం. మొఘల్ దర్బారు సుఖమయ జీవితానికి నమూనా సృష్టించింది 18వ శతాబ్దంలో సామ్రాజ్యానికి క్షీణదశ ప్రాప్తించినా, మొఘలులు సృష్టించిన సంస్కృతి బ్రతికేవుంది. సామ్రాజ్యం ముక్కలు చెక్కలు కావటంతో వివిధ ప్రాంతాలలో తలెత్తిన చిన్న చిన్న రాజ్యాలు మొఘలులు నెలకొల్పిన సంప్రదాయాన్నే కొనసాగించాయి.

# 9

# మొఘల్ సామ్రాజ్య పతనం

1707 లో ఔరంగజేబ్ మరణం యథావిధిగా అతని కుమారుల మధ్య వారసత్వ యుద్ధాన్ని రగిల్చింది. కొడుకులు ముగ్గురూ సింహాసనం కోసం హోరాహోరీ పోరాడుకున్నారు. చివరకి, ఆ పోరాటంలో గెలిచినవాడు బహదూర్ షా బిరుదు ధరించి 1707 లో రాజ్యపాలన ప్రారంభించాడు. పరిపాలన చేసింది నాలుగేళ్ళే అయినా పుట్టెడు కష్టాలు చుట్టుముట్టాయి బహదూర్ షా రాజపుత్రుల మీద తన ఆధిపత్యాన్ని రుద్దాలని ప్రయత్నించాడు గాని రాజపుత్రులు ఎదురు తిరిగారు. బహదూర్ షా యేమీ చెయ్యలేకపోయాడు. ఈ లోగా సిక్కులు తిరుగుబాటు చేశారు. మహారాష్ట్రులు అంతః కలహాలలో మునిగిపోయి ఉండడం చేత, వాళ్ళు మొఘల్ సామ్రాజ్యానికి తీవ్ర ఉపద్రవం తెచ్చిపెట్టే స్థితిలో లేరు. అయితే, అడప దడప మొఘల్ భూభాగం మీద దాడులు చెయ్యటం మాత్రం మానుకోలేదు. మరాఠా రాజు షాహూ మొఘలుల కింద మన్‌సబ్‌దార్ హోదాని అంగీకరించాడు.

1712 లో బహదూర్ షా మరణంతో అతని కుమారుల మధ్య మళ్ళీ వారసత్వ యుద్ధం జరిగింది. మొఘల్ సామ్రాజ్యాన్ని బలహీనులైన రాజులు చాలామంది కొద్దికాలం పాటు పరిపాలించి నిష్క్రమించారు. తరువాత బహదూర్ షా మనుమడు సామ్రాజ్యాన్ని కట్టుదిట్టం చెయ్యాలని ప్రయత్నించాడు. కాని, అప్పటికే సామ్రాజ్య విచ్ఛిత్తి ప్రారంభమైంది. సిక్కుల తిరుగుబాటుకు బందా బహదూర్ నాయకత్వం వహించాడు. పంజాబ్‌లో స్వతంత్ర సిక్కు రాజ్యాన్ని స్థాపించటానికి కంకణం కట్టుకున్నాడు. సిక్కు రాజ్యాన్ని స్థాపించలేకపోయినా, అతడు మొఘల్ ప్రభుత్వాన్ని ముప్పతిప్పలు పెట్టాడు. మహారాష్ట్రులు ఒక నూతన ప్రభుత్వ వ్యవస్థలో పునస్సంఘటితం అవుతున్నారు. అదే బ్రాహ్మణ మంత్రులైన పీష్వాల ప్రభుత్వం. పీష్వాలు క్రమేణా తమ అధికారాన్ని ఉత్తరభారత దేశంలోకి విస్తరింపజేస్తున్నారు. రోహిల్‌ఖండ్‌లో స్థిరపడ్డ అఫ్ఘన్లు సైతం మొఘల్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా కత్తి కట్టారు

స్వతంత్ర రాజ్యాల అవతరణ సామ్రాజ్యంలోని అన్ని ప్రాంతాలకు పాకిపోవటమన్నది మొఘల్ ప్రభుత్వానికి మునలం తెచ్చిపెట్టింది. ఉదాహరణకు, మూడు ముఖ్యమైన రాష్ట్రాల్లో గవర్నర్లు స్వతంత్ర రాజ్యాలు ఏర్పాటు చేసుకున్నారు. అవే హైదరాబాద్, బెంగాల్, అవధ్ రాజ్యాలు.

ఈ కష్టాలు చాలవన్నట్లు, మొఘల్ రాజులు వాయువ్య దిశనుంచి విదేశ దండయాత్రల్ని

ఎదుర్కోవలసి వచ్చింది. ఈ విదేశ దాడులు మొఘల్ శక్తిని హరించివేశాయి. మొట్టమొదటి దండయాత్ర 1739 లో జరిగింది ఇరాన్ సేనాని నాదర్ షా అప్పటికే మొఘలుల అధీనంలోని కాబూల్‌ని ఆక్రమించుకొని, వాయువ్య దిశనుంచి సుడిగాలిలా భారత మైదానాల్లోకి దూసుకువచ్చి ఢిల్లీ నగరాన్ని ముట్టడించాడు. అతనికి కావలసిన సంపదని పోగుజేసుకుని, వెనక్కి తిరిగి వెళ్ళిపోతాడనే ఆశతో మొఘలులు లొంగిపోయారు. నాదర్ షా సైన్యాలు నగరాన్ని ఇష్టమొచ్చినట్లు దోచుకుని, మరుభూమిగా వదిలి వెళ్లారు. షాజహాన్ నెమలి సింహాసనాన్ని, కోహినూర్ వజ్రాన్ని నాదర్ షా ఇరాన్‌కు తరలించుకుపోయాడు.

నాదర్ షా అడుగుజాడల్లో మరో ఆఫ్ఘన్ సాహసవీరుడు భారతదేశంమీద విరుచుకుపడ్డాడు. అతని పేరు అహ్మద్ షా అబ్దాలీ. అబ్దాలీ పంజాబ్‌ని జయించి ఆఫ్ఘనిస్థాన్‌లోని తన రాజ్యంలో కలుపుకున్నాడు. ఈలోగా పీష్వాల ఆధ్వర్యంలో మహారాష్ట్రుల బలం పుంజుకొని మొట్టమొదట పశ్చిమభారతంలో, తరువాత మధ్యభారతంలో, ఉత్తరభారతంలో పెద్ద భూభాగం ఆక్రమించుకున్నారు. మహారాష్ట్రులు మొఘల్ రాజ్యం మీద ప్రత్యక్ష దాడులు జరపలేదు. ఎందుచేతనంటే, అప్పటి మొఘల్ చక్రవర్తి బలహీనతని ఉపయోగించుకొని తమ అధికారాన్ని స్థాపించుకోవాలని వాళ్ళు భావించారు. ఆ సమయంలో, మహారాష్ట్రులకు అహ్మద్ షా అబ్దాలీతో యుద్ధానికి తలపడవలసి వచ్చింది. 1761 లో ఆఫ్ఘనులకు-మహారాష్ట్రులకు మధ్య మూడవ పానిపట్టు యుద్ధం జరిగింది. మహారాష్ట్రులు ఓడిపోయి, ఉత్తరభారతదేశం నుంచి ఉపసంహరించుకున్నారు. మొఘల్ సామ్రాజ్యం ఢిల్లీ చుట్టుపక్కల ప్రాంతానికి పరిమితమైపోయింది మొఘల్ చక్రవర్తులు కేవలం పేరుకుమాత్రం 1857 వరకు పరిపాలించారు కాని 18వ శతాబ్దంలో నిజమైన రాజకీయాధికారం కొత్తగా అవతరించిన రాజ్యాల చేతుల్లో ఉండిపోయింది.

*యూరప్ వర్తకులు* : 18వ శతాబ్దంలో మొఘల్‌సామ్రాజ్యం క్షీణించిపోయింది; కొత్తరాజ్యాలు అధికారంలోకి వచ్చాయి. అదే సమయంలో, భారతదేశంలో పట్టు చిక్కించుకోవాలని ప్రయత్నిస్తున్న మరికొందరు కూడా రంగంలో ప్రవేశించారు. వాళ్లే యూరోపియన్లు. వాళ్ళకిప్పుడు రెండు అనుకూలతలు కలిసి వచ్చాయి. ఒకటి-మొఘల్ సామ్రాజ్యం స్థానంలో మహారాష్ట్ర, హైదరాబాద్, అవధ్, బెంగాల్ వగైరా చిన్న చిన్న రాజ్యాలు అవతరించాయి. అక్బర్, ఔరంగజేబ్‌ల కాలంనాటి మొఘల్ సామ్రాజ్య సంఘటిత శక్తిని ఎదుర్కొనడం కన్నా ఈ చిన్న చిన్న రాజ్యాల్ని ఎదుర్కొని యుద్ధాలు సాగించటం ఐరోపా వాళ్ళకి సులువయింది. రెండు— వాళ్ళంతా సముద్ర మార్గాన వచ్చిన వాళ్ళు. కనుక సముద్రయుద్ధంలో ఆరితేరిన యోధులు. మొఘల్ చక్రవర్తులు ఎన్నడూ నౌకాబల ప్రాధాన్యాన్ని గురించి ఆలోచించలేదు. కాబట్టి వాళ్ళకు పటిష్టమైన నౌకాబలం లేదు. యూరోపియన్లు భారతకోస్తా పట్టణాల్ని పట్టుకొంటున్నప్పుడు, మొఘలులుగానీ ఇంకా తదితర రాజ్యాలవారుగానీ యూరోపియన్లని అడ్డుకోలేక పోయారు. పై పెచ్చు, ఐరోపా సాంకేతిక విజ్ఞానాధిక్యత వాళ్ళకు అనుకూలంగా వుంది.

భారతదేశంలో మొట్ట మొదట స్థిరపడ్డవాళ్ళు పోర్చుగీసులని మనకి తెలుసు. చాలా దశాబ్దాల పాటు భారతదేశంతో వ్యాపారం సాగించిన యూరోపియన్లు పోర్చుగీసులొక్కరే. తమ నౌకాబలాధిక్యతని అడ్డుపెట్టుకుని పోర్చుగీసులు భారత, ఆసియా వ్యాపార నౌకలకు వ్యాపారం చేసుకోటానికి అనుమతి యిచ్చే నెపం మీద బోలెడు డబ్బు గుంజారు. ఆ విధంగా వాళ్ళు భారతదేశం యొక్క సముద్రాంతర వాణిజ్యం

మీద పెత్తనం చెయ్యటం మొదలుపెట్టారు. 17వ శతాబ్దంలో యూరప్‌లో ఇతర దేశాల నుంచి అనేక మంది వర్తకులు భారతదేశానికి వచ్చారు. వాళ్ళంతా వ్యక్తులుగా రాలేదు. వాళ్ళు ఒక 'వ్యాపార సంస్థ'గా ఏర్పడి సంఘటితంగా వచ్చారు. భాగస్వాములంతా ఖర్చులు, లాభాలు సమానంగా పంచుకున్నారు. యూరోపియన్ వర్తకులు ఇంతదూరం రావటానికి గల కారణాలు చాలా ఉన్నాయి. ఒకటి-భారతీయ వస్తువులకు ముఖ్యంగా సుగంధ ద్రవ్యాలు, నూలు బట్టలకు ఐరోపాలో విపరీతమైన గిరాకీ ఉంది; సరుకుల రవాణా యావత్తు అరబ్బుల గుప్పెట్లో బిగిసిపోయి వుండటంవల్ల, అరబ్బు వర్తకులు సరుకుల వెలలు విపరీతంగా పెంచి, ఐరోపా వర్తకుల్ని వేధించారు. కాబట్టి, ఐరోపా వర్తకులు భారతదేశంతో నేరుగా వ్యాపారం చెయ్యాలని ఆలోచించారు. ఇంతకన్నా ముఖ్యమైన విషయం మరొకటున్నది. యూరప్‌లో వ్యాపార వర్గం ఆనాడు మహా ఉచ్ఛ స్థితిలో ఉంది. సరుకుల ఉత్పత్తి గణనీయంగా పెరిగింది. కాబట్టి, వాళ్ళకు కొత్త మార్కెట్లు కావలసి వచ్చాయి. ముడి పదార్థాలు చౌకగా దొరికే దేశాలు అవసరమయ్యాయి. భారత పశ్చిమ తీరానికి వచ్చిన ఓడలు నూలు బట్టలు, నీలిమందు నింపుకుని తిరిగివెళ్ళేవి. ఇంకా దక్షిణాన మలబారులో మిరియాలు, సుగంధ ద్రవ్యాలు సేకరించేవి. మద్రాసుకు చుట్టు పక్కలవున్న కేంద్రాలు చక్కెర సరఫరా చేశాయి. బెంగాల్ నుంచి ప్రధానంగా సిల్కు బట్టలు, సురేకారం ఎగుమతయ్యాయి.

*ఐరోపా వర్తక సంస్థలు :* యూరప్‌లో చాలా చిన్న రాజ్యమైన డెన్మార్క్ డేనిష్ ఈస్టిండియా కంపెనీ అనే వర్తక సంస్థను భారతదేశానికి పంపింది. ఆ సంస్థ తంజావూరులోని ట్రాంక్విబార్‌లో ఒక ఫ్యాక్టరీ కట్టింది. కాని డేనిష్ వర్తక సంస్థకి వ్యాపారంలో అనుకూలించలేదు. డచ్చి వర్తక సంస్థల పోటీని డేనిష్ సంస్థ తట్టుకోలేకపోయింది. హాలెండ్‌కు చెందిన డచ్చి సంస్థ సుగంధ ద్రవ్యాలు పుష్కలంగా లభించే ప్రాంతాల్ని గాలించటం కోసం ఆసియాలో అడుగుపెట్టింది. సుగంధ ద్రవ్యాలతో సుసంపన్నమైన జావా, సుమత్రాలతో డచ్చివారు వ్యాపారం ప్రారంభించారు యూరప్ నుంచి ఆగ్నేయ ఆసియాకు ప్రయాణించే డచ్చి నౌకలకు మార్గ మధ్యంలో మజిలీ చేసే స్థావరం కావలసివచ్చింది. భారతదేశంలో డచ్చి వారికున్న ముఖ్యమైన ఆసక్తి ఇదే. ఇంగ్లీషు వర్తకులు కూడా సుగంధ ద్రవ్యాల అన్వేషణలో బయలుదేరారు. డచ్చి వారు ఆగ్నేయ ఆసియాలో నిలదొక్కుకుంటే, ఇంగ్లీషు వర్తకులు భారతదేశం మీదికి దృష్టి మరల్చారు. ప్రధానంగా నేత వస్త్రాల వ్యాపారం మీద వాళ్ళకి కన్నుపడింది.

ఇంగ్లీషు వర్తకులు 1600లో ఒక సంస్థగా ఏర్పడి, అప్పటి నుంచి భారతదేశంలో వ్యాపార హక్కులు పొందటానికి సకల ప్రయత్నాలు చేస్తూ వచ్చారు. జహంగీర్ దర్బారుకు సర్ థామస్‌రో రావటం మనకు తెలుసు చిట్టచివరికి, ఇంగ్లీషు వర్తకుల ప్రయత్నం నెరవేరింది. మచిలీపట్నం, సూరత్, మద్రాసు కలకత్తాలలో ఇంగ్లీషు వాళ్ళ ఫ్యాక్టరీలు వెలిశాయి. మద్రాసులో సెయింట్ జార్జికోట, కలకత్తాలో ఫోర్ట్ విలియం తరువాతి కాలంలో చాలా ప్రసిద్ధిలోకి వచ్చాయి పోర్చుగీసు యువరాణి ఇంగ్లీషు రాజయిన రెండవ చార్లెస్‌ను వివాహం చేసుకున్నప్పుడు, ఆమె కట్నంగా తెచ్చిన బొంబాయి కూడా ఇంగ్లీషు వాళ్ళకి దక్కింది. వ్యాపారం, నౌకా రవాణా దృష్ట్యా ఈ పట్టణాలన్నీ చాలా అనుకూలమైనవి.

క్రమేణా, భారత వ్యాపార రంగంలో నుంచి డచ్చి వారిని, పోర్చుగీసుల్ని తరిమి వెయ్యటంలో ఇంగ్లీషు వాళ్ళు విజయం సాధించారు. పోర్చుగీసులు ఎలానూ భారతదేశంలో మహాచెడ్డ పేరు తెచ్చుకున్నారు.

పై పెచ్చు, ఇంగ్లీషు నౌకాబలం పోర్చుగీసు, డచ్చి నౌకా బలాలకన్నా గొప్ప ఆధిక్యత సంపాదించింది. నౌకా బలాధిక్యతతో ఇంగ్లీషు వాళ్ళు భారతదేశ వ్యాపారాన్ని చేజిక్కించుకోగలిగారు. ఆనాడు భారతదేశంతో వ్యాపారం సాగించే ఇంగ్లీషు సంస్థలు రెండు ఉండేవి అందువల్ల కొన్ని ఇబ్బందులు ఎదురయ్యాయి. 1708లో ఈ రెండు కంపెనీలు ఏకమై "సమైక్య ఆంగ్లేయ వర్తకుల ప్రాగ్దేశ వ్యాపార సంఘం" **(The United Company of Merchants of England trading to the East Indies)** అని కొత్తపేరు పెట్టుకున్నాయి

అయినా, ఇంగ్లీషు వాళ్ళు ఇంకొక పోటీ ఎదుర్కోవలసి వచ్చింది 1664లో ఫ్రెంచి వాళ్ళు కూడా భారతదేశంతో వ్యాపారం నిమిత్తం ఒక సంస్థ స్థాపించారు. ఫ్రెంచి వర్తక సంస్థ పాండిచేరిలో స్థావరం నెలకొల్పుకున్నారు విచిత్రమేమంటే-క్రీ.శ. మొదటి శతాబ్దంలో సరిగ్గా ఇదే స్థలం పురాతన రోమన్ వ్యాపార కేంద్రంగా అరికామేడు అనే పేరుతో ప్రసిద్ధి పొందింది. మిగతా ఏ ఐరోపా వర్తక సంస్థ కన్నా కూడా ఫ్రెంచి కంపెనీయే ఇంగ్లీషు వాళ్ళకి గట్టి పోటీ దారుగా సత్తా రుజువు చేసుకుంది 18వ శతాబ్దంలో ఈ ఉభయుల మధ్య పోటీ చాలా తీవ్రతరంగా పరిణమించింది ఈ రెండు కంపెనీలు భారతదేశ వ్యాపారాన్ని చేజిక్కించుకోవటమే కాకుండా, స్వదేశ రాజుల రాజకీయాల్లో సైతం వేలు పెట్టాయి.

*మొఘల్ సామ్రాజ్య పతనానికి కారణాలు :* 18వ శతాబ్దంలో మొఘల్ సామ్రాజ్యం విచ్ఛిన్నం కాసాగింది. ఈ క్షీణస్థితికి రావటానికి గల కొన్ని కారణాలు ఒక శతాబ్దం వెనక్కి వెళ్ళి చూస్తే గాని తెలియవు. కాని అసలు దౌర్బల్యం 18వ శతాబ్దంలోనే బైటపడింది

ఔరంగజేబ్ తరువాత వచ్చిన వాళ్ళు బలహీనులు సామ్రాజ్య విచ్ఛిత్తిని ఆపటం వాళ్ళ తరం కాలేదు. ప్రజల్లో వాళ్ళ పట్ల విశ్వాసం లేదు చక్రవర్తి చనిపోయినప్పుడల్లా వారసత్వ యుద్ధాలు తప్పని సరిగా సంభవించాయి. వాటివల్ల అపారంగా డబ్బు, శక్తి వృధా అయ్యాయి. చివరకి వారసుల కుమ్ములాటల్లో నెగ్గి గద్దె ఎక్కిన రాజుకి తన అధికార్ల మీదా, దర్బారులోని పరివారం మీదా విపరీతమైన అపనమ్మకం. చక్రవర్తులు అశక్తులై పోయినప్పుడు, రాష్ట్రాలలో గవర్నర్లు బలపడ్డారు. హైదరాబాద్, అవధ్, బెంగాల్ గవర్నర్లు ఆ విధంగా స్వతంత్రులైన వాళ్ళేనని మనం లోగడ చెప్పుకున్నాం.

సామ్రాజ్య క్షీణ స్థితికి మరొక ముఖ్య కారణం ఆర్థిక ఇబ్బందులు. కడపటి మొఘల్ చక్రవర్తుల కాలం నాటికి వివిధ రకాల అధికార్లకు పంచిపెట్టటానికి చాలినన్ని జాగీర్లు లేవు, చాలినంత డబ్బూ లేదు. ప్రభుత్వం చలాయించే పెత్తందారీ ధోరణితో జమీందార్లు అసంతృప్తి చెందారు. సర్దార్లతో వాళ్లు సంఘర్షణకు దిగారు. రాజ్యాదాయంలో మరీ ఎక్కువ భాగం సర్దార్లు కొట్టేస్తున్నారని జమీందార్లకు కడుపుమంట. జమీందార్ల నిరసన తిరుగుబాటుగా పరిణమించిన సందర్భం కూడా ఉంది. పన్నులు చెల్లించాక రైతుల దగ్గర మిగిలింది చాలా తక్కువ. రైతులు మరింత పేదవాళ్ళయ్యారు. ఒక్కోసారి, రైతులు జమీందార్ల పక్షం చేరారు. మొఘలులు అనేక యుద్ధాల్లో ఇరుక్కుపోయినందు వల్ల వాళ్ళకి సక్రమంగా డబ్బు అందుతూ ఉండాలి. ఉదాహరణకి, దక్కను మీద ఔరంగజేబ్ సుదీర్ఘ దండయాత్రలు మొఘల్ సామ్రాజ్య ఆదాయాన్ని చాలా మట్టుకి మింగివేశాయి. మహారాష్ట్రులు, సిక్కులు ప్రభుత్వానికి ప్రమాదకారులుగా తయారు కావటాన వాళ్ళని అదుపులో పెట్టటానికి ఆ రెండు ప్రాంతాలలోను భారీ సైన్యాల్ని కాపలా వుంచవలసి వచ్చింది.

ఆదాయంలో కొంత భాగం పరిపాలనా నిర్వహణ కింద ఖర్చయ్యేది. పరిపాలనా యంత్రాంగం అక్బర్ కాలంలోలాగా సమర్థవంతంగాలేదు. మన్‌సబ్‌దారీ వ్యవస్థ అనేక మార్పులకు లోనయింది. అక్బర్ కాలం నాటి కన్నా మన్‌సబ్‌దార్ల సంఖ్య ఇప్పుడు మూడురెట్లు పెరిగిపోయింది. వాళ్ళ శిస్తు వసూళ్ళలోను, చక్రవర్తి కోసం వాళ్ళు పోషించాల్సి వున్న సైనికుల, గుర్రాల లెక్కల్లోను వెనుకటి నిజాయితీ మటుమాయమైంది. వాళ్ళు ఎంత మోసానికి పాల్పడ్డారంటే, వాళ్ళ పోషణలో ఉండే గుర్రాలకు ఒకవైపు అంకెను ముద్ర వెయ్యవలసి వచ్చింది. పూర్వం ప్రతి గుర్రానికి ఒక వైపు రాజముద్రని, మరొక వైపు మనసబ్‌దార్ ముద్రని మాత్రమే అచ్చువేసే పద్ధతి అమల్లో వుండేది. అధికార్లని దీర్ఘకాలం ఒకే చోట ఉంచకుండా సామ్రాజ్యంలో ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి తరచు బదిలీ చేసే పద్ధతిని అక్బర్ కట్టుదిట్టంగా అమలు జరిపించాడు. 18వ శతాబ్దం నాటికి ఆ సంప్రదాయం అడుగంటి పోయింది. అధికార్లు తాము చాలా కాలంగా ఉంటున్న ప్రదేశాన్నే అంటిపెట్టుకొని స్థానిక ప్రభువుల్లాగా ప్రవర్తించటం మొదలుపెట్టారు.

మొఘలుల సైనిక వ్యవస్థ సైతం శక్తిహీనమై పోయింది. ఉన్నతాధికారుల సిప్పత్తి అలవి కాకుండా పెరిగింది ఒకప్పుడు మొఘల్ సైన్యానికి గర్వకారణంగాఉండే ఫిరంగిదళం తదితర సైన్యాలతో పోలిస్తే సాంకేతిక నైపుణ్యంలో వెనుకబడి పోయింది. ప్రపంచంలో తదితర దేశాల్లో అభివృద్ధి అవుతున్న అత్యాధునిక తుపాకుల నమూనాలపట్ల మొఘలులు ఆసక్తి ప్రదర్శించటం మానుకున్నారు. ఫిరంగి దళాన్ని నిర్వహించటానికి విదేశస్థుల్ని అధికార్లుగా నియమించి సంతృప్తిపడి పోయారేగాని ఆ బాధ్యత నిర్వహించటానికి భారతీయులకు శిక్షణ యిప్పించలేదు. నౌకాబలం గురించి వాళ్ళసలు బొత్తిగా శ్రద్ధ తీసుకోలేదు. ఐరోపాదేశాలనుంచి ప్రమాదం ముంచుకొస్తుందని వాళ్లు ఊహించలేదు. అంచేత, పటిష్టమైన నౌకాబలాన్ని పెంపొందించుకోవలసిన ఆవశ్యకతని గురించి వాళ్ళు ఆలోచించలేదు. ఆఖరికి పోర్చుగీసులు; ఇంగ్లీషువాళ్ళు ఉపయోగించే కొత్తతరహా నౌకల్ని చూసికూడా, మొఘల్ ప్రభువులకు కుతూహలం రేకెత్తలేదు.

ఐరోపా నూతన విజ్ఞాన శాస్త్రం యూరోపియన్లముందు ఎన్నో సరికొత్త విషయాల్ని ఆవిష్కరిస్తున్న సమాచారంగానీ, ఐరోపా- మేధావులు అభివృద్ధి చేసుకుంటున్న నూతన విజ్ఞానం తాలూకు భోగట్టాగానీ మొఘలుల కాలంనాటి భారతదేశం బొత్తిగా తెలుసుకోలేదు. కనీసం, యంత్రసహాయంతో పనిచేసే గడియారం కూడా భారతదేశ దృష్టిని ఆకర్షించలేకపోయింది. కులీనవర్గాలు, సంపన్న వర్తకులు విజ్ఞాన ప్రగతి తమకేమీ పట్టనట్లుగా తాము కూడబెట్టిన సంపదతోను, అనుభవించే సుఖమయ జీవితంతోను సంతృప్తి చెందినట్లుగా కనిపించారు

భూమిశిస్తుద్వారా, వ్యాపార పన్నులద్వారా వచ్చిన ఆదాయంలో చాలాభాగం భోగలాలస జీవితానికే హరించుకుపోయింది. ఒకవైపు-రైతులు, వృత్తిపనివాళ్ళు దుర్భరమైన బ్రతుకీడుస్తుంటే కులీనులు, సంపన్న వర్తకులు నగరాలలో కూర్చుని హాయిగా పొద్దు బుచ్చారు. అన్ని వేపులనుంచి డబ్బు వచ్చిపడుతోంటే, మొఘలులు వైభవోపేత జీవితానికి అలవాటు పడగలిగారు. విలాస నివాస భవనాల్లో, విలువైన వస్త్రధారణలో, మణిమయ ఆభరణాల్లో, వినోద కాలక్షేపాల్లో ఒకరినొకరు మించిపోవటానికి సంపన్నులు పోటీపడ్డారు. కవుల్ని, కళాకారుల్ని, గాయకుల్ని, ఇంకా తదితర వినోద బృందాల్ని చుట్టూ చేర్చుకుని పైలా పచ్చీసుగా కాలం వెళ్ళబుచ్చారు. ఇవన్నీ ఉన్నత హోదాకు ప్రతీకలుగా చెల్లుబడి అయ్యాయి. ఈ

రకమైన జరుగుబాటుకి మంచినీళ్ళ ప్రాయంగా డబ్బు ఖర్చయిపోయింది ఈ భోగ లాలస జీవితం సైతం 18వ శతాబ్దంలో సామాజిక, నైతిక భ్రష్టత తెచ్చిపెట్టింది. కులీన వర్గాల వాళ్ళు పనీ పాటూ లేకుండా సోమరితనంగానో; లేదా మధుసేవలో మైమరచిపోతూనో పొద్దుబుచ్చారు. చివరకి, సామ్రాజ్యం క్షీణించి పోతున్నప్పుడయినా, వాళ్ళు మేలుకోలేదు; సామ్రాజ్యాన్ని రక్షించటానికి లేదా కనీసం తమనితాము కాపాడుకోటానికైనా వాళ్ళు యేమీ చెయ్యలేని చేతగాని వాళ్ళయిపోయారు. అయితే, రాష్ట్రపాలకుల దర్బారుల్లో కులీనులు అందరూ అట్లా లేరు; అందరూ అంత సోమరులుగా, చేతగాని వాళ్ళుగా తయారు కాలేదు. స్థానిక గవర్నర్లు కొందరు భవిష్యత్తుమీద పెద్ద పెద్ద ఆశలు పెట్టుకున్న వాళ్ళుకాబట్టి, తమ కింది అధికారుల్ని కొంత క్రమశిక్షణలో ఉంచారు.

మొఘల్ సామ్రాజ్యం పతనమైపోయింది. ఒకనాడు ఉజ్వల సామ్రాజ్యవైభవం తిలకించిన ఢిల్లీ జవసత్వాలు కోల్పోయి దిక్కులేని నగరంగా మారిపోయింది. కాని, ఆ వైభవంలో ఒక భాగమైన సంస్కృతి, జీవన విధానం రూపుమాసి పోలేదు. ఆ సంస్కృతి, జీవన విధానం ఢిల్లీనుంచి పయనం కట్టి 18 వ శతాబ్దంలో కొత్తగా అవతరించిన చిన్న రాజ్యాలకు, రాష్ట్రరాజధానులకు తరలి వెళ్ళాయి. 18వ శతాబ్ది భారత చరిత్ర ప్రత్యక్షమయ్యేది ఈరాజ్యాలలోనే. అలనాటి మొఘల్ వైభవపు జాడలు అగుపించేది ఇక్కడే. భారత చరిత్రలో తరువాతి దశని నిర్ణయించింది ఈ రాజ్యాలలో సంభవించిన సంఘటనలే.

ప్రియ పాఠకులారా !

మేము.........

తెలుగు సాహిత్యంలో శాస్త్రీయ విలువలు పెంపొందించాలనే ధ్యేయం హైదరాబాద్ బుక్ ట్రస్ట్‌గా రూపుదిద్దుకొంది.

మా సంస్థ ప్రచురించే ప్రతి పుస్తకాన్ని ఆదరిస్తున్న సాహిత్యాభిమానులైన పాఠకులు 'బుక్ క్లబ్' స్కీము క్రింద ముందుగా వంద రూపాయలు చెల్లించండి. మీరు చెల్లించిన మొత్తానికిగాను 25% డిస్కౌంట్ ఇస్తూ మీకు నచ్చిన పుస్తకాలను మేము పంపుతాము. మీ వంద రూపాయలకు సరిపడు పుస్తకములు మీకు అందిన పిదప మరల మీరు వంద రూపాయలు జమచేయండి- పుస్తకాలను Rs. 1-2 వి.పి పి. ద్వారా మీకు అందజేస్తాము.

## మా పుస్తకాలు

| | | | |
|---|---|---|---|
| 1. వేమన్న వాదం | 5-00 | 21 ఆధునిక భారత చరిత్ర | 16-00 |
| 2. ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర-I | 12-00 | 22 చరిత్ర అంటే ఏమిటి ? | 7-00 |
| 3. ,, ,, ,, -II | 25-00 | 23. దళిత కథలు | 3-50 |
| 4. రాకెట్టు కథ | 9-00 | 24. సామాన్యుల సాహసం | 5-00 |
| 5. పిడుగు దేవర కథ | 8-00 | 25. ఆలోచించండి | 1-00 |
| 6 రక్తాశ్రువులు | 10-00 | 26. వేదాల్లో ఏమున్నది ? | 1-25 |
| 7 భూమి | 13-50 | 27. గణపతి | 1-25 |
| 8 మా కథ | 10-00 | 28 సూత్రాలు-ఆర్యులు | 1-50 |
| 9. కళ్యాణ మంజీరాలు | 10-00 | 29 మీ పేరేమిటి ? | 1-25 |
| 10 రాకాసి కోర | 6-00 | 30 అనామకుడు | 1-00 |
| 11 ఒక తల్లి | 5-00 | 31. టాల్‌స్టాయ్ కథలు | 1-25 |
| 12. భారతదేశంలో నా జైలు జీవితం | 10-00 | 32 దెయ్యాలున్నాయి జాగ్రత్త | 1-00 |
| 13. కార్టూన్లలో మార్క్స్ | 10-00 | 33. బాబాల మహిమ | 1-25 |
| 14. లెనిన్ | 10-00 | 34. స్త్రీ సమస్యలు | 0-75 |
| 15. మావో | 10-00 | 35. పెట్టుబడిదారి విధానం- | 3-00 |
| 16. క్యూబా | 6-00 | 36. ప్రపంచ కార్మికోద్యమ చరిత్ర | 2-00 |
| 17. వైద్యుడు లేని చోట | 40-00 | 37. ప్రకృతి-సమాజం-శాస్త్రం- | 1-75 |
| 18. ఏడుతరాలు | 12-00 | | |
| 19. ఉప్పెన | 5-00 | | |
| 20. జైత్రయాత్ర | 12-00 | | |

**బాలల సాహిత్యం**

| | | | |
|---|---|---|---|
| 1. నల్ల చేప పిల్ల కథ | 1-25 | 3. సాగర కన్య | 3-00 |
| 2. బుడుంగు ! | 2-50 | 4 గురువుకు ఎగనామం | 2-75 |

పుస్తకాల కొరకు MO/DD ద్వారా డబ్బు పంపవచ్చు
పుస్తకాలు Rs. 1-2 V.P.P. లో పంపుతాము.